# తెనుగు సాహితి

డా॥ దేవులపల్లి రామానుజరావు

ఆంధ్ర సారస్వత పరిషత్తు
తిలక్ రోడ్డు, హైదరాబాదు-500001

# ముందు మాట

డా॥ దేవులపల్లి రామానుజరావు గారి పేరు వినని వారు తెలుగు సాహిత్య లోకంలో ఉండరనే చెప్పవచ్చు. ఆం. ప్ర. సాహిత్య అకాడెమీకి కార్యదర్శిగా, ఆంధ్ర సారస్వత పరిషత్తుకు ఉపాధ్యక్షులుగా, అధ్యక్షులుగా, తెలుగు అకాడెమీ, అంతర్జాతీయ తెలుగు సంస్థ, కేంద్ర సాహిత్యఅకాడెమీ మొదలైన ఎన్నో సంస్థల పాలకమండలి సభ్యులుగా - సలహా సంఘ సభ్యులుగా వీరు తెలుగు భాషా సాహిత్యాలకు, తెలుగు సంస్కృతికి చేసిన సేవ గణనీయమైనది. ఉస్మానియా విశ్వ విద్యాలయం, ఆం. ప్ర. సార్వత్రిక విశ్వ విద్యాలయం, హైదరాబాదు కేంద్ర విశ్వవిద్యాలయం - ఇన్ని విశ్వ విద్యాలయాల్లో సిండికేట్ సభ్యులుగా ఉండి, విద్యారంగంలో ఎంతో కృషి చేసినారు. వీరి కృషిని గుర్తించి ఇటీవల ఆం. ప్ర. సార్వత్రిక విశ్వవిద్యాలయం వారు వీరిని గౌరవ డాక్టరేటు పట్టంతో సన్మానించడం అందరికీ హర్షదాయకమైన విషయం. గోలకొండ పత్రికా నిర్వాహకులుగా, సుజాత (సాహిత్య మాసపత్రిక) సంపాదకులుగా పత్రికారంగానికి కూడా తమ సేవలనందించినారు. రాజ్యసభా సభ్యత్వం కూడా వీరిని వరించింది. హైదరాబాదు గ్రంథాలయ సంస్థకు అధ్యక్షులుగా ఉండి విజ్ఞాన వ్యాప్తికి ఎంతో దోహదం చేసినారు. సురభారతీ సమితి, యువభారతి వంటి సంస్థలు వారి మార్గదర్శనంలో ఎంతో అభివృద్ధిని సాధించినాయి. ఇన్ని సంస్థలతో సంబంధం కలిగి ఇన్ని రంగాలలో శ్రీ రామానుజరావుగారు చేసిన సేవ అపారమైనదేకాక అమూల్యమైనది కూడా.

డా॥ రామానుజరావుగారికి ఎన్నో సాహిత్య సంస్థలతో సంబంధం ఉన్నా ఆంధ్ర సారస్వత పరిషత్తుతో ఉన్న సంబంధం విశిష్టమైనదని చెప్పవలసి ఉంటుంది. వీరు పరిషత్తుకు సభ్యులుగా, కార్యదర్శిగా, ఉపాధ్యక్షులుగా, అధ్యక్షులుగా ఉండి, పరిషత్తు సర్వతోముఖాభివృద్ధికి కృషి చేసినారు; చేస్తున్నారు. నిజాం నిరంకుశ పరిపాలనలో తెలంగాణంలో తెలుగుభాష బిక్కు బిక్కుమంటున్న కాలంలో డా॥ రామానుజరావుగారు ఆంధ్ర సారస్వత పరిషత్తు పక్షాన ఎన్నో ఉద్యమాలు నడిపి, తెలంగాణంలో తెలుగు దీపం ఆరిపోకుండా రక్షించడమే

కాక దానిని దీప్తిమంతం చేసినారు. ఉస్మానియా విశ్వవిద్యాలయంలో తెలుగను నిర్బంధ పఠనీయాంశంగా చేయడానికి వీరెంతో కృషి చేసినారు ఈనాడు సారస్వత పరిషత్తు స్వయం సమృద్ధమైన చక్కని సాహిత్య సంస్థగా రూపొం దిందంటే దీనికంతా డా॥ దేవులపల్లి రామానుజరావుగారి నిరంతర కృషే కారణమని చెప్పవలసి ఉంటుంది.

డా॥ రామానుజరావు గారు సాహిత్యోద్యమ నిర్వాహకులు, పరిపాలనా దక్షులు, సాహిత్య సంస్థా నిర్వహణ దక్షులు మాత్రమేకాదు, మంచి రచయితలు కూడా. వారు రచించిన పచ్చతోరణం, నా సాహిత్యోపన్యాసాలు, జ్ఞానపదులు-జానపదులు, తెలుగు సీమలో సాంస్కృతిక పునరుజ్జీవనం, యాభై యేళ్ళ జ్ఞాప కాలు, తెనుగు సాహితి మొదలైన గ్రంథాలు వారి రచనాశక్తికి నిదర్శనాలు, విషయపరిశీలనచేసి తమ అభిప్రాయాలను నిష్పక్షపాతంగా, సరసంగా. స్పష్టంగా, సంగ్రహంగా, సులభంగా, సమగ్రంగా చెప్పడం శ్రీరామానుజరావు గారి రచనల్లో కనిపించే లక్షణం.

గతయాభై సంవత్సరాలుగా డా॥ దేవులపల్లి రామానుజరావుగారు ఆంధ్ర సారస్వత పరిషత్తు అభివృద్ధికోసం కృషిచేస్తూ దానిని ఎంతో ఉన్నత స్థితికి తెచ్చినారు. ఈనాడు అఖిలాంధ్ర దేశంలో ఇంత గొప్ప తెలుగు సాహిత్య సంస్థ లేదంటే అతిశయోక్తికాదు పరిషత్తు త్వరలో యాభై సంవత్సరాల పండుగ కూడా జరుపుకోబోతుంది. ఈ సందర్భంలో సారస్వత పరిషత్తు అభివృద్ధికి మూలకారకులు, ప్రస్తుతం పరిషత్తుకు అధ్యక్షులు ఐన డా॥ దేవులపల్లి రామానుజ రావుగారి 'తెనుగు సాహితి' అనే వ్యాససంపుటిని ప్రకటించి వారిని గౌరవిం చడం సముచితంగా ఉంటుందని పరిషత్తు కార్యవర్గం భావించి, ఈ మేరకు ఒక నిర్ణయం తీసుకుంది పరిషత్తు పక్షాన ఈ గ్రంథాన్ని ముద్రించడానికి అనుమ తించిన శ్రీ రామానుజరావు గారికి కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.

శ్రీ రామానుజరావు గారు ఆయా సందర్భాలలో చేసిన ప్రసంగాలు, వివిధ సంచికలకు రాసిన వ్యాసాలు ఒక క్రమపద్ధతిలో ఈ సంపుటిలో కూర్చ బడ్డాయి. తెలుగు సాహిత్యం ఆరంభదశనుండి నేటివరకు పొందిన క్రమపరిణా మాన్ని ఈ వ్యాసాలు చక్కగా తెలియ జేస్తున్నాయి. విజ్ఞాన శాస్త్రం, రాజకీయ

శాస్త్రం, అర్థశాస్త్రం, న్యాయశాస్త్రం మొదలైన సాహిత్యేతర శాస్త్రాలను అధ్యయనంచేసి తెలుగు సాహిత్యం పైన అభిమానం పెంచుకొని తెలుగులో రచనా వ్యాసంగం చేసినవారు శ్రీ దేవులపల్లి రామానుజరావు గారు. అందువల్ల రస హృదయం కలిగిన ఒక సహృదయుడైన భావుకునికి వివిధ సాహిత్యాంశాలపై ఏర్పడిన అభిప్రాయాలకు, ప్రతిస్పందనలకు ఈ తెనుగు సాహితి ప్రతిబింబంగా కనిపిస్తుంది. కనుక ఇది పండితులను, సాహిత్యాభిరుచి కలిగిన సహృదయులను-ఉభయులనూ అలరిస్తుందనడంలో సందేహంలేదు.

ఈ వ్యాస సంపుటిని ఆంధ్రపాఠకలోకం ఆదరిస్తుందని ఆశిస్తూ పరిషత్తు పక్షాన దీనిని ముద్రించడానికి అనుమతించిన పరిషత్తు అధ్యక్షులు డా॥ దేవులపల్లి రామానుజరావు గారికి మరోసారి కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను

గ్రంథాన్ని అతిత్వరలో ముద్రించి మాకు సహకరించిన పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్ అధినేత శ్రీ శ్రీనివాస్‌కు మా కృతజ్ఞతలు.

**ఆర్. శ్రీహరి**

కార్యదర్శి

**ఆంధ్ర సారస్వత పరిషత్తు**

హైదరాబాదు

15-6-91

# సాహి సుగతుడు

డా॥ దేవులపల్లి రామానుజరావుగారు నిష్కళంక జీవనులు, అకుంఠిత సాహితీ వ్రతులు, ఆంధ్ర సారస్వత పరిషత్తు సంస్థాశిల్పులు, విశ్వవిద్యాలయ సాంస్కృతిక సంస్థల పాలనానుభవంలో రాశికెక్కిన రమణీయ స్వభావులు, తెలుగు సంస్కృతి ఉద్ధారకులు, తెలుగు సీమలోని వైతాళికుల సాహచర్య భాగ్యం సంపూర్ణంగా అనుభవించిన మేధావులు, అత్యున్నత సాహితీ ప్రమాణ చతురులు, ఎందరికో ప్రోత్సాహం ఇచ్చి తీర్చిదిద్దిన వాత్సల్యమూర్తులు, క్రమ శిక్షణలో నిష్ఠాగరిష్ఠులు, గుండె నిండా ఆర్ద్రత నిండిన అంతఃసౌమ్యులు, ప్రతిభామూర్తులకు సదవకాశాలు కల్పించిన ఉదారమూర్తులు, ప్రామాణిక పత్రికా సంపాదకులు, ఉదాత్త రచనా ధురీణులు, ఆంధ్ర దేశంలోని మేధావి వర్గంలో అగ్రశ్రేణిలోనివారు. వారితో పరిచయం కలగటం ఒక సుకృత విశేషం వారి రచనలు అధ్యయనం చేయడం ఒక మహదవకాశం.

డా॥ రామానుజరావుగారివి విశిష్టమైన అభిరుచులు. యౌవనంలోనే ఖండ కావ్యరచనలు వారి మనస్సును గుత్తగొన్నవి వ్యాసం వారి చేతిలో అపూర్వ వస్తు గౌరవాన్ని సంతరించుకొన్నది వారు ప్రాచీన సాహిత్య పరిమళాలు ఆఘ్రా ణించారు. ఆధునిక రచనల సురభిళ చందనాలు ఆత్మకు అలదుకున్నారు. కవితల కమనీయ తోరణాలు తీర్చి చూపారు విశ్వసాహితిలోని విశిష్ట రచనల వైఖరులు వారి రసనాంచలంపై రనరిస్తుంటాయి వారి అస్ఖలిత కంఠస్వరం సాహిత్య సాంస్కృతిక విశేషాలను గలగలమంటూ గంభీరంగా వెల్లడిస్తుంది. అంతకన్న మిన్నగా ప్రగతిశీలమైన అభ్యుదయ దృక్పథం వారి రచన లకు ఒక వర్చస్సును సంపాదించి పెట్టింది. దేవులపల్లివారు సమన్వయ దృక్పథాన్ని అలవర్చుకున్న సహనశీలురు. ఆంధ్ర సారస్వత పరిషత్తు వేదికను సకల సిద్ధాంత ప్రకటనకు ప్రాతిపదికగా భావించిన విశాల హృదయులు.

వారి అనేక రచనల్లో ఈ 'తెలుగు సాహితి' సంపుటికి ఒక ప్రత్యేకత ఉంది. ప్రముఖ కవులమీద, ప్రసిద్ధరచనల మీద, ప్రధాన ప్రక్రియల మీద

వారు వెలువరించిన అభిప్రాయాలు, విమర్శకులలో ఆలోచనల్ని రేకెత్తిస్తాయి. డా॥ రామానుజరావుగారి సారస్వత వ్యాసాలను కాలక్రమానుసారంగా అమర్చి చూస్తే సాహిత్య పరిణామగతులు సుస్పష్టంగా అవగతమవుతాయి. ఈ సంపుటిలో నన్నయ మొదలుకొని బెర్నార్డుషా వరకు వారు రచించిన వ్యాసాలు విషయ గౌరవంతో వినూత్నంగా విలక్షణంగా ఉన్నాయి. రామానుజరావుగారి రచనలో వేడి ఉంటుంది. తరుచుగా వారి భావాలు అనుభూతిలోనుంచి దూసుకొనివస్తాయి. వారు మౌలికమైన విషయాల మంచిచెడ్డలను ప్రస్తావించి, వాటి విలువలను గురించి సూటిగా ప్రశ్నిస్తారు. వ్యాకరణ, అలంకార, ఛందోవిశేషాల వంటి సాధారణ విషయాల మీమాంసల మీదికన్నా విషయం వెనుక భిత్తికగా నిలిచిన తత్త్వం మీద వారికి నిశితమైన చూపు ఉంది. భారతజాతీయనాయకుల అభిప్రాయాల్ని, ఆదర్శాలను వారు ప్రవచిస్తుంటే వినటం ఒక గొప్ప అనుభూతి.

దేవులపల్లి వారి ఈ రచనా ప్రవాహానికి నాలుగు జ్ఞానవేణికలున్నాయి. (1) ప్రాచీన సాహిత్యంలోని రసవత్తను గుర్తిస్తారు. (2) పదసాహితి-జానపద సాహితిలోని అందచందాలను గౌరవిస్తారు. (3) సాంస్కృతిక విశేషాలను సంభావిస్తారు. (4) సామాజిక బాధ్యతను ప్రబోధిస్తారు. ఈ సంపుటిలోని నలభైనాలుగు వ్యాసాలు దీనికి ప్రత్యక్ష సాక్ష్యం. పతితలను మేధావులుగా తీర్చి దిద్దడం మీది వారికి ప్రత్యేకమైన అభిరుచి ఉంది. భారతీయ సాహిత్యాన్ని గురించి తులనాత్మక - అధ్యయనం చేసేవారికి ఇందులో కావలసినంత విషయం ఉంది. వినియోగించుకోగలిగితే చక్కని ప్రణాళిక ఉంది.

ఈ సంపుటిని ఆంధ్ర సారస్వత పరిషత్తు పక్షాన ప్రకటించటానికి దేవులపల్లి వారు అనుమతించటం వారి సౌజన్యానికి నిదర్శనం. ఈ ఉత్తమ రచనాసంపుటికి నాలుగు మాటలు వ్రాయటానికి నాకు అవకాశం కల్పించటం వారి వాత్సల్యశేముషికి ఒక ఉదాహరణం.

—డా॥ ఎల్లూరి శివారెడ్డి

# తొలి పలుకు
## (తొలి కూర్పు)

సుమారు ఒక అర్ధ శతాబ్ది కాలంలో పలు సందర్భాలలో చేసిన వ్యాసంగం ఈ తెలుగు సాహితి. బోధన అధ్యయనం ఈ రెండింటితో సంబంధం లేక సారస్వతాభిరుచితో పరిశీలించిన సహృదయుని భావనలే ఇందులోని వ్యాసాలు. చదివినది విజ్ఞానశాస్త్రం, అర్థశాస్త్రం, రాజకీయ శాస్త్రములు; పిమ్మట న్యాయ శాస్త్రం. అభిరుచితో పఠించినది తెలుగు సాహితి. ఆ అభిరుచి ప్రతిబింబమే ఈ సంపుటం.

బహువేదికల నుండి చేసిన ప్రసంగాలు, ప్రత్యేక సంచికలకు వ్రాసిన వ్యాసాలు ఇందులో సంపుటీకరించనైనది. వీనిలో చాలమట్టుకు ఇంతకుముందు ప్రకటితమైనవి. ఐతే ఇందులో ఒక క్రమాన్ని పాటించనైనది. నా వ్యాసాలను ఇంతకుముందు గ్రంథ రూపంలో ప్రకటించినప్పటికిని వానిలో విషయాను క్రమణము పాటించలేదు. అందుచేత క్రమ పద్ధతిని నా వ్యాసాలనన్నింటిని కొన్ని సంపుటాలుగా ప్రకటించవలెనను సాహితీ మిత్రుల కోరిక ననుసరించి ఈ సంపుటం ఆంధ్ర పాఠక లోకానికి అందజేస్తున్నాను. ఇది ఆంధ్రావళికి మోదం కలిగించగలదని విశ్వసిస్తున్నాను.

కాగితం, అచ్చు ధరలు అధికంగా పెరిగిపోయిన నేటి పరిస్థితులలో ముద్రణ కష్టసాధ్యమైనది నాకు ఆత్మీయులు, అభిమాన పాత్రులైన మిత్రులు శ్రీ రాజా రామేశ్వరరావుగారి ఔదార్యము కష్టసాధ్యమైన యీ గ్రంథ ముద్రణను సులభసాధ్యము చేసినది. ఈ తోడ్పాటుకు వారికి నా హార్దిక ధన్యవాదాలు.

హైదరాబాదు.
తేది : 28-5-1986
వైశాఖపూర్ణిమ

దేవులపల్లి రామానుజరావు

# విషయసూచిక

# తెలుగు సాహిత్యం

తెలుగు సాహిత్యం ఎపుడు మొదలైనది? అను ప్రశ్నకు సమాధానము చెప్పుట శక్యముగాని పని. తెలుగు సాహిత్యం విషయంలోనే కాదు; ఏ భాషా సాహిత్యం విషయంలోనైనా ఈ ప్రశ్నకు తగు సమాధానము రాజాలదు. మాటాడ నేర్చిన తొలి మానవుడు తన అంతర్గత భావాలను రమణీయముగ వెలువరింప గలిగినపుడే సాహిత్యం మొదలైనది. తన సుఖాన్ని, దుఃఖాన్ని ఆత్మప్రత్యయంతో భాషద్వారా వెలువరించుటకు తొలి మానవుడు చేసిన యత్నమే సాహిత్యముగ పరిణమించినది. సాహిత్యం మాత్రమే కాదు చిత్ర లేఖన, సంగీతాది తదితర లలిత కళలును ఆదిమానవుని భావ వ్యక్తీకరణ కృషికి ఫలితములుగనే తొలుత ప్రాదుర్భావం పొందినవి.

తెలుగు ద్రావిడభాషా కుటుంబానికి చెందినదని పండితుల నిర్ణయము. కాని అది మూలద్రావిడ భాష నుండి ఎపుడు ఏ తీరున విడివడి పరిణతి చెందినదో సవివరముగ తెలియవచ్చుటలేదు. ఇది ఎటులున్నను శాతవాహనుల కాలముననే, తెలుగు గడ్డపై తెలుగుభాష తన ప్రాతిపదిక రూపంలో వ్యాప్తి చెందినదని మాత్రము స్పష్టమగుచున్నది. ప్రభువులు ప్రాకృతాన్ని అభిమానించిన ఫలితముగ కావ్యములు ఆనాడు ఆ భాషలోనే వ్రాయబడినా తెలుగు భాషా ప్రభావం ప్రాకృతం మీదకూడా కొంత పడినదనే విషయాన్ని గాథాసప్తశతిలో అటనట కన్పడెడు తెలుగు పదాలు రుజువు చేస్తున్నవి. ఆ విధముగనే తెలుగు భాషను కూడ ప్రాకృతం ఎంతయో ప్రభావితం చేసినది. సాలంకాయనుల కాలమునను పరిస్థితులు ఇటులనే ఉండినవి. ఆ కాలమున రాజాదరణ కలది సంస్కృతము. కావున తెనుగు భాషలో సంస్కృత పదములు విరివిగ ప్రవేశింప గలిగినవి. ప్రభువు ఆదరణ లేకపోయినను సామాన్య ప్రజానీకమున తెలుగు చక్కగ ఆదరణను ఆర్జించి క్రీ.శ. ౬ వ శతాబ్ది ప్రాంతమున ప్రభువుల దృష్టిని ఆకర్షింప గలిగినవి. రేనాటి చోళుల శాసనములు ఈ విషయమును రుజువు చేస్తున్నవి.

క్రీ. శ. 7 వ శతాబ్దమున దక్షిణాపథమున తొలుత కర్ణాట ప్రాంతమును, తరువాత తెలుగు దేశమును చాళుక్యుల వశమైనవి. ఈ చాళుక్యులు దేశీయులతో కలిసిమెలసి దేశీయులుగనే వ్యవహరించవారికి భాష.ను ప్రోత్సహించి, పరి పోషించిరి. వారి కృపివలన తొలుత లాభపడిన భాష కన్నడము. అందువలన ఆంధ్రభూమిని పాలించిన చాళుక్యులు సైతము మొదట కన్నడమునే ప్రోత్స హించిరి. కావుననే పంపడు, పొన్నడు మొదలగువారు జన్మతః తెలుగు దేశపు వారే అయినను కన్నడమున రచనలను సాగించి, ప్రభువుల ఆదరణను ఆర్జించిరి కాని క్రమముగ తెలుగు ప్రజలలో ఆదివరకే వ్యాప్తిలోనున్న దేశీయ చ్ఛందములు ప్రభువుల దృష్టిని పండితుల దృష్టిని ఆకర్షింప గలిగినవి. సంస్కృత చ్ఛందస్సు ప్రభావము కన్నడము ద్వారా వీనిపైని కొంతపడినను ఇవి రమ తెలుగుదనమును కోల్పోక ప్రభువుల శాసనాలలో తొలుతగ తావు కల్పించుకొన్నవి. గుణగ విజయాదిత్యుని నాటి (848-891) అద్దంకి, కందుకూరు శాసనములును, మొదటి చాళుక్య భీముని కాలపు ధర్మవరం శాసనమును, రెండవ యుద్ధమల్లుని బెజవాడ శాసనములును తెలుగు పద్యములలో రూపొందింపబడినవి. వీనిలో మొదటి వానియందు తరువోజ, నడుమనున్న రెంటిందియందు సీసములును, కడపటిదాని యందు మధ్యాక్కరలును కలవు. దరిదాపుగ ఆ కాలముననే కంద పద్యము కూడ కొంత స్థిరరూపమును ఆర్జించిన దనడం పశ్చిమాంధ్రమున కరీంనగరు జిల్లాలో గంగాధరమున లభ్యమైన శిలాశాసనమువలన రూఢమగు చున్నది. ఇది క్రీ. శ. 945 నాటిది. కర్ణాటక కవిరత్న త్రయమున ఆద్యుడైన పంపని తమ్ముడగు జినవల్లభుని ప్రశస్తి ఇందు కలదు. శాసనమున ముఖ్య భాగమంతయు కన్నడముననే ఉన్నను కడపటి భాగమున మూడు కంద పద్య ములు తెలుగున కలవు. కందము తెలుగున పరిపుష్టతను ఆర్జించినదనుట ఈ పద్య ములు రుజువు చేయుచున్నవి. ఉదాహరణకు అందొకటి :

జిన భవనము లెత్తించుట
జిన పూజల్సేయుచున్కి జినమునులకు ద
త్తిన యన్న దాన మీవుట
జినవల్లభు బోలగలరె జనధర్మ పరులే.

ఈ విధముగ 10 వ శతాబ్దినాటికే తెలుగు ఛందోరీతి పరిపుష్టతను ఆర్జించి ఆ భాషలో కావ్యస్థాయిని అందుకొనగలిగిన పద్యములు రచింపబడినటుల స్పష్టమగుచున్నది. కాని ఆనాడు యేపైన కావ్యములు రచింపబడియుండెనో యిపుడు మనకు తెలియని విషయము. రచింపబడియుండినను అవి తగిన ప్రచారభాగ్యమును పొందియుండవు. కడకు క్రీ. శ. 11 వ శతాబ్ది మధ్యభాగమున తూర్పు చాళుక్య ప్రభుడగు రాజరాజనరేంద్రుని ఆదరణ ప్రోత్సాహము వలన నన్నయభట్టు ఆంధ్రమహాభారతమున తొలుతటి పర్వము అను ప్రసన్నకథాకలితార్థ యుక్తితో రచించుటవలన తెలుగున ఒక మహాకావ్యము రూపొందినది, నన్నయ ఆదికవి.

నన్నయ తరువాతి రెండు శతాబ్దములందు తెలుగు సాహిత్యమున ఎన్నియో ప్రక్రియలను అనుసరించిన ప్రయోగములు జరిగినవి. ఈ ప్రయోగము లందు ఎక్కువ కృషిచేసినవారు శైవకవులు. సాహిత్యమును సామాన్య ప్రజానీకపు దరికి తీసుకొనిపోయి తద్వారా మత ప్రచారమును కొనసాగించుట వారి సంకల్పము. ఇక ప్రాచీన విజ్ఞానాన్ని ప్రజలకు అందించుటకు సంస్కృతభాష తప్పనిసరియని వారు గుర్తించిరి. అందువలన సంస్కృత పదములను తెలుగున మేళవింపు చేయుటలో వారు పలు ప్రయోగాలను నిర్వహింపవలసి వచ్చినది. అయితే ఛందోరీతులలో గానమునకు అనువుగా నుండు ద్విపదాది రీతులను అనుసరించియు వారు కొన్ని ప్రయోగములను కొనసాగించిరి. బహుశః మణి ప్రవాళరీతిలో అనగా సంస్కృతవిభక్తులతో సంస్కృత పదములను తెలుగు విభక్తులతో తెలుగు పదములను కలగాపులగముగ చేసి రూపొందించిన వాక్యములు కల రచనారీతిలో కూడ పద్యములు రచింపబడెననుట వృషాధిప శతకము నందలి ఒక పద్యము వలన తెలియవచ్చుచున్నది. ఈ వివిధ సమస్యలకు తగు పరిష్కార మార్గమును చూపినవాడు 13 వ శతాబ్దినాటి తిక్కన సోమయాజి.

తిక్కన కవితను ఒక శిల్పముగ పరిగణించి అందు పారంగతత్వమును ఆర్జించినవాడు. ఆయన ద్రష్ట. అంతియేకాదు, ధార్మికనిష్ఠ కలవాడు; లౌకిక వృత్తియందు ఆరితేరినవాడు. ఆనాటి ఆంధ్రదేశపు పరిస్థితిని చక్కగ

గుర్తింప గలిగినవాడు. ఆంధ్రావళి మోదింబొరయునట్లుగ చేయుట ఆయన సంకల్పము. ఆ కాలమున తమిళనాడునుండి వచ్చిన వైష్ణవము, కర్ణాటము నుండి వచ్చిన శైవము ఆంధ్రులందు ధార్మికముగ చీలికలను కలిగించి కల్లోలమునకు కారణములైనవి. ఈ పరిస్థితులనుండి దేశమును వెలికితీయు తన కృషిని ఆయన హరిహరమూర్తికి అంకితము చేసి ధార్మికముగ ఒక వెలుగు బాటను చూపించగలిగినాడు. ఇక సాహిత్యరంగమున నన్నయ విరమించిన చోటున నుండియే తాను మొదలిడుట సముచితమని ఆయన భావించినాడు. మధ్యకాలపు కవుల ప్రయోగాలను ఆయన అర్థము చేసుకోగలిగెను. సాహిత్యమును ప్రజలకడకు కొనిపోవుటకై వీరు చేసిన కృషియందలి ఔచిత్యమును ఆయన ఆదరించెను. అందువలననే నన్నయ చేసినటుల సంస్కృతమునకు తెలుగును జతపరచక, తెనుగునకు సంస్కృతమును అనుసంధింపజేయుట తన కవిత్వమున ముఖ్య లక్షణముగ ఆయన గ్రహించెను. అనగా సాహిత్యమునకు తెలుగుదనమును నిండార కల్పించెననుట. ఇంక సంస్కృత పదములను తెలుగున వాడునపుడును జాత్యము కానివాటిని వాడుటకు నిరాకరించెను. ఇటుల సంస్కృత భాషాపదములనే కాదు, ఇతర భాషా పదములను వేనినైనను తెలుగుభాష గ్రహించుటకు అనువగు చక్కని మార్గమును ఆయన రూపొందించెను.

ఇక తెలుగు క్రియారూపములను నన్నయ వాడినవానినే ఆయన అనుసరించెను. ఆయన కాలమునాటికే వస్తాడు, చేస్తాడు ఇట్టి క్రియారూపాలు తీరాంధ్రమున గ్రామీణులందు వ్యాప్తిలో ఉండినటుల తిక్కనగారి శిష్యుడగు కేతన రచించిన 'ఆంధ్రభాషాభూషణము' వలన తెలియుచున్నది. కాని తిక్కన ఇట్టి వానిని పరిత్యజించి నన్నయ నాటి క్రియారూపములనే గ్రహించుటలో ఒక మహోద్దేశము కలదు. మాండలిక రూపాలకు అతీతముగా సాహిత్య భాష ఉండినపుడే అది ఆంధ్రదేశపు వివిధ ప్రాంతముల మధ్య సాంస్కృతికమగు ఐక్యమును నెలకొల్పగలుగునని ఆ మహాకవి అభిప్రాయము. రాకపోకల సదుపాయములు చాల తక్కువ ఉండిన ఆ కాలమున అట్టి ప్రామాణిక భాషయే ఆంధ్రుల సాంస్కృతిక ఐక్యమును కాపాడినదనుటలో ఆవంతయును సందియము లేదు. 14 వ శతాబ్దము తరువాత ఆంధ్రభూమి బహుధాశకలితమై వేర్వేరు రాచరికములలో చీలియున్నపుడును, తమిళనాడు మొదలగు పర

భాషా ప్రాంతములకు తెలుగువారు వలసపోయి, ఇతర భాషలవారి మధ్య తమ సంస్కృతిని కాపాడుకొని పరిపోషించుకోవలసి ఉన్నప్పుడు ఈ ప్రామాణిక భాషయే నాలుగు చెరగుల తెలుగువారి సంస్కృతిలోని ఏకతను పరిపోషించినది. ఆ విధముగ అది ఆ వర్గాలకు ఆంధ్రుల చారిత్రకావసరములకు సరికుదిరినది. కాని ఈనాడది అటులనే ఉండవలయునను నియమములేదు. నేటి చారిత్రకావసరములను అనుసరించి అది మార్పొందితీరవలెను.

తిక్కన కృషివలన భారతమున కడపటి 15 పర్వములు రచింపబడగా, మధ్యగత శేషమును యెఱ్ఱన పూరించుట వలన 14 వ శతాబ్ది పూర్వార్థమున ఆంధ్రమహాభారతము సంపూర్ణ రూపమును పొందినది. ఆంధ్రసాహిత్య వికసనమునకు అది మార్గదర్శియైనది. ఆ తరువాత 19 వ శతాబ్ది చరమపాదము వరకు ఆంధ్రసాహిత్య సాగరమున పయనించిన నావికులందరు ఆ దీపగృహపు పరిధిలోనే తమ అభిరుచులకు అనువుగ విహరించిరి.

## 3

క్రీ.శ. 1400 తర్వాత తెలుగు సాహిత్యము పలు ప్రక్రియలలో పలు రీతులలో కవిత్రయపు వారి ఒరవడిని దాదాపుగా అనుసరించుచునే వికసనము పొందినది.

ఆనాటి తక్కిన భారతీయ సాహిత్యముల ప్రగతితో పోల్చిచూచినపుడు తెలుగు సాహిత్యపు ప్రగతి ఎవరికైనను అబ్బురము కల్పింపక మానదు. ఇంతే కాక, ఆనాడు తెలుగు జాతి ఎదుర్కొనిన పలు రాజకీయ విపర్యయముల దృష్టిలో ఈ ప్రగతి మరింతగ విభ్రాంతి కలిగించును. 14 వ శతాబ్దిలో కృష్ణకు ఎగువనున్న దక్షిణాపథమంతయు ముస్లిముల హస్తగతమైనది. ఆంధ్రుల సామ్రాజ్య వైభవము తెలుగు దేశపు నడిగర్భమునుండి వైదొలగినది. ఇక తెలుగు దేశపు పొలిమేరలో ఏర్పడిన విజయనగర సామ్రాజ్యములో తెలుగు వారికే మేలి భాగమున్నను, ఆ రాజ్యమున ఆంధ్రదేశమంతయు ఏనాడును చేరియుండలేదు. కృష్ణరాయని కాలమున తీరాంధ్రమును, రాయలసీమయు ఆ సామ్రాజ్యమున అంతర్భాగములైనను పశ్చిమాంధ్రము ఆంధ్రేతర పాలనలోనే ఉండినది. ఇక తళ్ళికోట యుద్ధానంతరమున నామమాత్రముగ దక్షిణాంధ్రమున అత్యల్ప

భాగము మాత్రమే చంద్రగిరి పాలకుల అధీనమున మిగిలినది. 18వ శతాబ్దమున ఆంధ్ర దేశమంతయు పరాక్రాంతమైనది. ఇక తెలుగు దేశపు నాయకులతో పాటుగ తెలుగు కళాకారులలో అత్యంత భాగము తమిళ దేశమును తమ కార్యరంగముగ చేసికొనిరి. పై రాజకీయ భూమికలో కృష్ణరాయని దిగ్విజయకాలము మొదలుగ రాక్షసితంగడి యుద్ధకాలమువరకు (1520-1585) మాత్రమే ఆంధ్ర దేశమున అత్యధిక భాగము తెలుగు రాజుల ఏలుబడిలో ఉండినది. తక్కిన కాలమున తెలుగు కవులు తెలుగుసీమ పొలిమేరలందును, తమిళనాడునను నివసించియు తెలుగు సాహిత్యమునకు ప్రశస్తిని కల్పించిరి. ఇట్టిది అనగ స్వకీయ భూమిని వదలి అతి దీర్ఘకాలమున ఇతర ప్రాంతములందు తరతరములు వసించియు, స్వీయభాషకు ప్రశస్తి కల్పించిన ఉదంతము ప్రపంచమున ఏ ఇతర సాహిత్య చరిత్రలోను కన్పించలేదు. ఇది తెలుగువారు గర్వింపదగిన విషయము.

ఇట్టి ప్రశస్తిని అట్టి విషమ కాలమున తెలుగు సాహిత్యము ఆర్జించుటకు కారణభూతములైన విశిష్ట లక్షణములు ఎట్టివి అనుట విచారణీయము. విజయనగర సమ్రాట్టులు ఆ భాషా సాహిత్యములకు కల్పించిన తొలుతటి రాజకీయ ప్రతిపత్తియే అందులకు కారణ భూతమైనదని కొందరనవచ్చును. కాని యిది అర్ధసత్యము మాత్రమే. తెలుగునాయకుల రాజ్యమంతరించిన పిదప తంజావూరును ఏలిన మహారాష్ట్రులు తమ మాతృ భాషయగు మరాఠీని, దేశ ప్రజల భాషయగు తమిళమును కాదని, తెలుగు సాహిత్యమునే పోషించి, అంతటితో ఊరుకొనలేక తెలుగున యక్షగానాదులను కూడ రచించుట చూడగా రాజకీయ కారణముల కన్న ఇతరములే అందుకలవని స్పష్టమగుచున్నది. ఆ తక్కిన కారణములలో బలవత్తరమైనది తెలుగు భాషయందలి మధురిమ. కృష్ణరాయని అనంతరమున ప్రబంధ నిర్మాణ చాతుర్యమున పస సన్నగిల్లి కొంత జడత అలముకొనినను భాష యందలి మధురిమ దానిని కప్పిపుచ్చగలిగినది. అందువలననే, రాజకీయ విపర్యయములతో నిమిత్తము లేకుండ కటకము మొదలుగ కన్యాకుమారి వరకు వివిధ మాతృ భాషలు కలవారికి అందరికిని తెలుగుసాహిత్యము ఆదరణీయమైనది. తెలుగున పరిచయము విద్యావంతుల ముఖ్యలక్షణమైనది. గోల్కొండ యందలి ముస్లిం పాలకులును, ఆ మధురిమకు వశులై తెలుగు కవులను పోషించిరి. ఈ విధముగా

తెలుగుభాష ఆనాడు దక్షిణదేశమున ఒక సామాన్య భాషగా పరిణమించినది. యూరప్ ఖండమున 16వ శతాబ్దము మొదలుగా 19వ శతాబ్ది వరకు ఫ్రెంచి భాషకు సాహిత్యమున ఉండిన స్థానము 16వ శతాబ్ది మొదలుగ 19వ శతాబ్ది వరకు తెలుగు భాషా సాహిత్యములకు దక్షిణ భారతమున మహేంద్ర గిరి మొదలు మన్నారు జలసంధివరకు ఉన్నటుల చెప్పవచ్చును. ఇట్టి పరిస్థితు లలో భారతదేశమున వర్తక వ్యాపారముకొరకు చేరిన పాశ్చాత్యులలో తొలుతటి వారగు పోర్చుగీసువారికి, కళ్ళికోట మొదలుగ కోరంగివరకు గల దక్షిణ భారతపు రేవులందును, ప్రముఖ వర్తక కేంద్రములందును, రాజాస్థానములందును తెలుగుననే వ్యవహారములు జరుగుట అనుభవవేద్యమైనది. అంతట వారు దానికి 'జెంటూ' అని పేరిడి వ్యవహరించిరి. జెంటు అనగా దేశీయుల భాష అని అర్థము. ఆ తర్వాత వచ్చిన ఆంగ్లేయులలో ఒకరు తెలుగు సాహిత్యపు బలిమిని అర్థము చేసుకొని అది గ్రీసు భాషవలె పలుకుబడి కలదని అనెను; వేరొకరు ఇటాలియన్ భాషవలె మధురమనెను. అంతయేల, తమిళుడును సంస్కృత భాషా పారంగతుడును అగు అప్పయ్య దీక్షితుడు ఆంధ్రత్వమును ఆంధ్రభాషయు బహుకృత తపఃఫలములని ఆ కాలమున నుడివినాడు.

తెలుగు భాషయందలి మధురిమయే కర్ణాటక సంగీతమున సాహిత్య రచన యందు ఆ భాషకు అగ్రస్థానమును కల్పించినది. కాలగతియందలి పై అవరోధములను ఎదుర్కొని ఆ యగ్రస్థానము ఈనాడును ఆ భాష నిలబెట్టుకొని యున్నది.

1775 మొదలుగ 1875 వరకు నడచిన నూరేండ్లను తెలుగు సాహిత్య చరిత్రలో క్షీణయుగముగ కొందరు పేర్కొనిరి. కాని దానిని సుషుప్తి యుగమని అనుట సమంజసమనిపించును. ఆధునికయుగమునకు అనుగుణ మగు నూత్నరీతిని సంతరించుకొనుటకనువుగా తనకు తెలియకుండగనే సమర్థతను తెలుగు సాహిత్యము ఆ సుషుప్తికాలమున ఆర్జించుకొనినది. తెలుగువారికి ఆ కాలమున పాశ్చాత్య వాఙ్మయముతో గాఢ పరిచయము కలిగినది. పాశ్చాత్య సహాయకులు కొందరు తెలుగును పఠించి తెలుగున నూతన రీతిలో నిఘంటువుల రచనకు ప్రోత్సాహమిచ్చుటయేకాక భాషా చరిత్రాదుల పరిశోధనలో

ఉత్సాహమును కల్పించి తెలుగువారి దృష్టిని క్రొంగ్రొత్త దృశ్యముల వైపుకు మరలించిరి. వీని అన్నింటి ఫలితముగ 1875 మొదలులో తెలుగుజాతియందు ఒక నూతన చైతన్యము పనిచేయసాగినది. తెలుగు సాహిత్యమున నూతన ప్రక్రియలను ఎన్నింటినో తెలుగు రచయితలు సమకూర్చిరి, సమకూర్చు చున్నారు. భాషయందును వారు నూత్నరీతులలో ప్రయోగాలను పెక్కింటిని చేయుచున్నారు. క్రొంగ్రొత్తరూపముల సంతరించుకొని, ఆధునిక యుగమున తక్కిన ప్రపంచపు ప్రముఖ భాషలతోపాటుగా సమానస్థాయిలో తెలుగుభాషను నిలుపవలెనను ఉదాత్త సంకల్పముతో ఈ ప్రయోగము నిర్వహింపబడు చున్నది. భాషయందొక కుదురుబాటు, సాహిత్యమున నొక నూత్న స్ఫూర్తి కలుగుటకు పూర్వరంగముగా ఈ ప్రయోగములు ఉపకరించగలవు. ఈనాడు జరుగుచున్న ఈ కృషి ఫలితముగ ఒక నూత్న ప్రామాణిక భాషయు, వినూత్న సాహిత్య ప్రక్రియలును రూపొందగలవని ఆశించుటకు అవకాశము గలదు.

చారిత్రకముగ సహితము తెలుగు భాషా సాహిత్యములు క్రొంగ్రొత్త రూపమును ధరించవలసిన ఆవశ్యకత యేర్పడినది. భాషా ప్రయుక్తముగ ఆంధ్రప్రదేశ్ రూపొందిన తర్వాత తెలుగును క్రమరీతిలో అన్ని శాఖలందును పరిపాలనా వ్యవహారభాషగా చేయవలెనని ప్రభుత్వము నిర్ణయించి, అందులకై ప్రాతిపదిక చర్యలను కొన్నిటిని తీసికొనినది. ఇందులకు తోడుగా అన్ని దశలలో విద్యాబోధనకు తెలుగును మాధ్యమముగా చేయుటకును నిర్ణయము జరిగి అమలుజరుపబడుచున్నది. ఈ కార్యక్రమములను సమర్థతతో నిర్వహించు టకు తగు మార్పులు తెలుగు భాషలో రావలసియున్నవి. ఇతర భాషా పదములకు తెలుగుదనము కలుగచేసి తనలో ఇముడ్చుకొనుటలో తెలుగు భాషకు గల సమర్థత అద్వితీయము. ఈ శక్తిని చక్కగా వినియోగించుకొని శాస్త్ర విషయకములు పరిపాలనా వ్యవహారసంబంధములునగు పదములను విరివిగా సృజించుకొనుటయేగాక సంక్లిష్ట భావములను తగు పారిభాషిక రీతిలో వివరించు సమర్థతను పెంపొందించుకొనుచు 'దేశ భాషలందు తెలుగు లెస్స' అను ప్రఖ్యాతిని ఈ ఆధునిక యుగమున సహితము సార్థకము చేయగలదని ఆశించవచ్చును.

(తెలుగు సంస్కృతి - నల ఉగాది సాంస్కృతిక ఉత్సవాల ప్రత్యేక సంచిక)
(1974)

# మన కళా సంపద – సాహిత్యము

భారతదేశానికి మహోజ్జ్వలమైన కళాసంపద కలదు. ఈ కళాసంపద యీనాటిది కాదు. దానికి అనేక సహస్రాబ్దాల వయస్సు కలదు. ప్రపంచము లోని అనేక దేశాలు, అత్యధికభాగము విజ్ఞాన జగతిలో అడుగు పెట్టకముందు ప్రపంచ నాగరికత శైశవదశలో నున్నప్పుడే భారతదేశమున కళలు, శిల్పము, విజ్ఞానము, సాహిత్యము జగిజ్జేగీయ మానముగా అభివృద్ధి చెంది, మానవ సభ్యతకు, సంస్కృతికి శాశ్వతమైన పెన్నిధిగా ప్రకాశించినవి. ఈ కళా సంపదలో సాహిత్యమునకు విశిష్టస్థానము కలదు. భారతీయ సాహిత్యము ప్రపంచ వాఙ్మయమునకు తలమానికమై, సత్యమై, శివమై, సుందరమై ప్రకాశించు చున్నది.

భారతదేశము బహు భాషలకు పుట్టినిల్లు. ఈ భాష లన్నింటికిని ఉదాత్తమైన వాఙ్మయము కలదు. భారతదేశములోని భాషలు ఒక మహా వృక్షము యొక్క శాఖోపశాఖలని చెప్పవచ్చును. సనాతనమైన యీ వృక్షపు కొమ్మలు నేటికిని, పూలతో, పండ్లతో, కనుల పండువు గావించుచున్నవి. "జనని సమస్త భాషలకు సంస్కృత భాష" యని ఆర్యోక్తి. స్థూల దృష్టికి, విభిన్నముగా కన్పట్టు యీ భాషలయందు, ఈ వాఙ్మయములందు కొంచెము పరిశీలించినచో యేకత్వము స్పష్టముగా గోచరించు చున్నది. భారత జాతీయతతోపాటు సంస్కృత భాష ఈ భిన్న వాఙ్మయముల యేకత్వమునకు మూల ప్రాతిపదిక; అదియే మన సాహిత్యసంపద ప్రత్యేకత, ఉత్కృష్టత. మన దేశములోని వివిధ సారస్వతములు ఒకచోట కూర్చినచో అది యొక మంచి ముత్యాలహారమును కూర్చు సూత్రమే. భారత జాతీయత, భారతీయ సంస్కృతి సంస్కృత భాష. సంస్కృత మహాసముద్రమునుండి మన దేశ భాషలలో ప్రతియొక భాషయు, కొద్దియో గొప్పయో జలమును కొని తెచ్చుకొనుట జరిగినది. మన దేశీయ భాషల సాహిత్య వికాసము ఈ సత్యమును ఋజువు చేయుచున్నది.

సంస్కృత, ప్రాకృత, దేశీయ భాషావాఙ్మయముల సంపదను గూర్చి ప్రస్తావించుటకు ముందు మన భిన్న భాషా వాఙ్మయాల ఆదర్శమును గూర్చి రెండు మాటలు చెప్పుట అత్యావసరము. ఈ ఆదర్శము దేశములోని అన్ని భాషలకును సమానమైనదని నిస్సందేహముగా చెప్పవచ్చును. ఈ ఆదర్శమును గూర్చి మన దేశములో చర్చలు బహుళముగా జరిగినవి. అలంకారికులు వివిధ సిద్ధాంతములను ప్రతిపాదించి యున్నారు. భరత, భామహ, దండి, వామన, ఆనందవర్ధన, అభినవగుప్త, కుంతక, లొల్లట, మమ్మట, శంకుక, మహిమభట్ట, హేమచంద్ర, భోగనాథ, విద్యానాథ, సర్వజ్ఞ సింగన, అప్పయదీక్షిత, జగన్నాథాదులు సాహిత్య శాస్త్రమును మథించి, ఉద్గ్రంథములను రచించి, సిద్ధాంత ప్రతిపాదనము గావించి యున్నారు. ఈ గ్రంథాలను, ఈ సిద్ధాంతాలను, యీ చర్చలను పరిశీలించినప్పుడు, విశ్వశ్రేయస్సు మన వాఙ్మయము పరమలక్ష్యమని స్పష్టము కాగలదు. జగత్కల్యాణమను మహోన్నతాదర్శముచే ప్రభావితులైన మహనీయులు మన వాఙ్మయ స్రష్టలు. ఋషి కానివాడు కావ్యము వ్రాయజాలడని మనవారు ఉద్ఘాటించినారు. మన సాహిత్యసంపద ఉదాత్తతకు ఈ ఉద్ఘాటన మంచి నిదర్శనము.

సకల భాషలకు జననియైన సంస్కృత భాషా మహాసముద్రము మిక్కిలి అగాధమైనది. అందలి వాఙ్మయము మహోన్నతమైనది. మన వేదములు పురాణములు విజ్ఞాన భాండారములు సాహిత్యనిక్షేపములు. వ్యాస వాల్మీకులు ఆచంద్రతారార్కము ప్రపంచ వాఙ్మయమునకు నాయకమణులైన కవీంద్రులు, ఋషీంద్రులు. కాళిదాసాదుల రచనల చేత విశ్వ సాహిత్యమునందు సంస్కృతము అగ్రస్థానము నలంకరించు చున్నది. సంస్కృతములో లేని వాఙ్మయ విశేషము లేదు. మన దేశీయ వాఙ్మయము లన్నింటి మీద సంస్కృతము తన ముద్ర వేసినది.

భారత వాఙ్మయరంగమున ప్రాకృతభాష మహావీర గౌతమబుద్ధుల కాలమున ప్రవేశించినది. మొట్టమొదట ఈ భాషకు అర్ధమాగధి యని పేరు. ఈ భాషయే మానవుల మూల భాషయని బౌద్ధులు అభిప్రాయ పడుచున్నారు. బౌద్ధ వాఙ్మయానికి ఈ ప్రాకృత భాష ఆలవాలమైనది. బుద్ధుని వచనాల రచన ఈ భాషలోనే జరిగినది. ధమ్మపదము ప్రాకృతభాషా గ్రంథము. గౌతమ బుద్ధుని వచనాలను క్రోడీకరించిన గ్రంథ జాలము భాషకు పాలీ యను పేరు

తరువాత కలిగినదని కొందరి అభిప్రాయమై యున్నది. పాలీ ప్రత్యేక భాష కాదని కొందరి అభిప్రాయము. ఈ పాలీ భాషయను పేరు పదవ శతాబ్దము తరువాత కలిగినట్లు చెప్పబడుచున్నది. పాలీ సాహిత్యము మన దేశ సాహిత్య సంపదలో ప్రత్యేకముగా పేర్కొనదగినది.

మన దేశీయ భాషలు కూడ అనేక శతాబ్దాల వయసు కలిగి, అపారమైన ఉత్తమ వాఙ్మయమునకు ఆటపట్టులుగా నున్నవి ఉత్తర దేశమున హిందీ, మైథిలీ, బీహారీ భాషలు ముఖ్యమైనవి. ఈ భాషలలో వాఙ్మయము పన్నెండవ శతాబ్దములో ప్రారంభమైనది. అనగా కొన్ని దక్షిణదేశ భాషలు వీని కన్న ప్రాచీనమైనవన్నమాట. మహమ్మదీయ పరిపాలన వలన ఈ భాషల వాఙ్మయములకు ఫార్సీభాషతో సంబంధము కలిగి తత్ప్రభావము వీనిపైన కనపడుచున్నది. ఇటువంటి ప్రభావము కొంచెము ముందుగనో, వెనుకగనో మన దేశీయ భాషల యందన్నింటిమీద కనపడుచున్నది. ఫార్సీ, అరబ్బీ శబ్దజాలము కొంత ఈ భాషలలో ప్రవేశించినది.

ఉత్తర దేశమున పై భాషలకు ఫార్సీ సంపర్కము వలన, హిందీ భాష ఉద్భవించినది. ఈనాడు మనదేశములో అత్యధిక సంఖ్యాకులు అర్థము చేసికొనగలిగిన భాష హిందీ భాషయే. ఇందుకు చారిత్రక కారణాలు కలవు. హిందీ భాషలో మంచి వాఙ్మయము కలదు నానక్, కబీర్, తులసీదాసుల నామములు యావద్భారతానికి పరిచితమైనవి. ఈ కవీశ్వరుల రచనలు హిందీ భాషకు అమూల్యాలంకారమైన సాహిత్య సంపద. హిందీ భాషలో మహమ్మద్ జైసీ అను విద్వాంసుడు వ్రాసిన పద్మావతి యను కావ్యము సుప్రసిద్ధమైనది. హిందీకి ఉర్దూభాష తోడబుట్టువు. 17 మరియు 18 శతాబ్దాలలో బహమనీ రాజుల ఆదరణతో ఈ ఉర్దూ భాష అభివృద్ధి పొందినది. తరువాత ఈ భాష మన దేశములో వ్యాప్తి చెందినది. ఢిల్లీ, లక్నో, లాహోర్, హైద్రాబాదు నగరాలు ఉర్దూ భాషాభివృద్ధికి ముఖ్య కేంద్రములైనవి.

మన దేశ సాహిత్యమున వంగవాఙ్మయము ప్రత్యేకమైనది. ఈ వాఙ్మయము పదునొకండవ శతాబ్దమున బౌద్ధులనుండి ప్రారంభమైనట్లు కొందరి ఊహ. వంగ భాషలో పదునొకండు నుండి పదునెనిమిదవ శతాబ్దము వరకు అనగా ఏడునూర్ల సంవత్సరాల కాలమున, బౌద్ధ, శాక్తేయ, వైష్ణవ మత

గ్రంథాలు కొన్ని వచ్చినవి. ఈ కాలమున మన దేశమందలి వాఙ్మయ సంపద మీద మత ప్రభావము సర్వసాధారణముగా కన్పట్టుచున్నది. పదునెనిమిదవ శతాబ్దము తరువాత వంగ వాఙ్మయమున నవీన యుగము ప్రారంభమైనది. రామమోహనరాయ్, బంకించంద్రఛటర్జీ, ద్విజేంద్రలాల్ రాయ్, మైకేల్ మధుసూదనదత్తు, రవీంద్రనాథటాగోర్, శరచ్చంద్రఛటర్జీ మొదలైన రచయితలు వంగ సాహిత్యమున క్రొత్త రీతులను ప్రవేశపెట్టి, ఆధునిక యుగమునకు మార్గదర్శకులైనారు.

గుజరాతీ భాషలో మనకు గ్రంథరచన పదునైదవ శతాబ్దము నుండి కనుపించుచున్నది. వల్లభాచార్యుల వైష్ణవ ప్రభావము గుజరాతీ వాఙ్మయము మీద కలదు. కీర్తన సాహిత్యముమీద ఈ విధమైన ప్రభావము స్పష్టముగా కనుపించుచున్నది. గుజరాతీ సాహిత్యమును అభివృద్ధి గావించిన వారిలో జైనులకు, పారసీకులకు ముఖ్యస్థానము కలదు. కె. యం. మున్షీ ప్రభృతులు నవీన గుజరాతీ వాఙ్మయమున పేర్కొనదగినవారు.

అస్సామీ భాషలో మొట్టమొదటి గ్రంథము బురాంజీ. ఇది చారిత్రక గ్రంథము. అస్సామీలో శాక్తేయ, వైష్ణవ, బౌద్ధమతస్థులు వాఙ్మయ నిర్మాణము కావించిరి. ఆధునిక అస్సామీ వాఙ్మయము మీద వంగ వాఙ్మయ ప్రభావము కనుపించుచున్నది.

మహారాష్ట్రభాషలో వాఙ్మయము పన్నెండవ శతాబ్దము నుండి కనుపించుచున్నది. విజ్ఞానేశ్వరీయ గ్రంథకర్తయైన విజ్ఞానేశ్వరాది మహానుభావ పంథా అనుయాయులు మహారాష్ట్రములో తొలిగ్రంథ రచన గావించిరి. ఈ భాషలో మోడీ లిపిని వాడుకలోనికి తీసికొని వచ్చిన విద్వాంసుడు హేమాద్రి పండితుడు. ఈ భాషలో భక్తి పంథా అనుయాయులైన నామదేవ్, తుకారామ్, రామదాసుల రచనలు తరువాత వెలిసినవి. ఈ ముగ్గురి నామములు సకల భారతమునకు పరిచితములు. మహారాష్ట్ర సామ్రాజ్య విస్తరణ మహారాష్ట్ర వాఙ్మయములో నూతన మార్గాలను ప్రోత్సహించినది. ఈ నూతన మార్గాలలో బఖేదులు, చరిత్రలు పేర్కొనదగినవి. ఈ వాఙ్మయమున ఆధునిక యుగము 19 వ శతాబ్దమున ఆరంభమైనది. బాలగంగాధర్ తిలక్, కేల్కార్, సవర్కార్ మొదలైన విజ్ఞానులు ఆధునిక వాఙ్మయమును అభివృద్ధి గావించి మహారాష్ట్ర సరస్వతిని నూతన ఆభరణాలతో అలంకరించిరి.

దాక్షిణాత్య భాషలలో తమిళము చాలా ప్రాచీనమైనది. ఈ భాషలో వాఙ్మయము రెండవ శతాబ్దముననే ప్రారంభమైనది. ఈ భాషలో పేర్కొన దగిన ఆదిగ్రంథాలు మణిమేఖల, శిలప్పధికారము మొదలైనవి. ఈ గ్రంథ నామములు సంస్కృత భాషా ప్రభావమును సూచించుచున్నవి. తొల్కాప్పి యమ్ (తొలి కావ్యము) తమిళ భాషలో ప్రసిద్ధమైన ఆది గ్రంథాలలో నొకటి. తమిళ వాఙ్మయమునందు ఆరవ శతాబ్దమున శైవ వైష్ణవ భక్తుల రచనలు విరివిగా కనిపించుచున్నవి. పన్నెండవ శతాబ్దమున కంబరామాయణ రచన జరిగినది. ఇది సకల భారత ప్రసిద్ధిపొందిన గ్రంథము పదునారవ శతాబ్ద మున జెసూట్ ఫాదరీలు క్రైస్తవమత ప్రచార గ్రంథాలను రచించిరి. భారత దేశమునందలి ఇతర వాఙ్మయములలోవలె తమిళ సారస్వతమునగూడ నూతన యుగము ప్రారంభమైనది. ఈ యుగమున తమిళ సాహిత్య రంగమున దేదీప్య మానముగా ప్రకాశించు తార సుబ్రహ్మణ్య భారతి.

క్రీ. శ. అయిదు, ఆరు శతాబ్దాలలో శాసనాలయందు ప్రాచీన కన్నడము మొట్టమొదటిసారి కనపడుచున్నది. కన్నడములోని మొట్టమొదటి గ్రంథము 9వ శతాబ్దమునందలి కవిరాజమార్గము. ఇది లక్షణ గ్రంథము. అందుచేత కర్ణాటక భాషలో ఇంతకుముందు లక్షణ గ్రంథాలు రచింపబడెనని నిస్సందేహ ముగా చెప్పవచ్చును. ఈ వాఙ్మయాభివృద్ధికి పనిచేసిన వారిలో జైనులు ప్రథములు. నృపతుంగుడు జైనుడు. కర్ణాటక సాహిత్యమున రత్నత్రయమని ప్రసిద్ధిగాంచిన పంప, పొన్న, రన్నలు జైన వాఙ్మయ నిర్మాతలు. 11వ శతాబ్ద మున రుద్రాభట్, దేవకవి మొదలైన బ్రాహ్మణ కవులు, పన్నెండవ శతాబ్ద మున బసవేశ్వరుడు, చెన్నబసవడు, అక్కమహాదేవి మొదలైన వీరశైవ కవులు రచనలను గావించిరి. పదమూడవ శతాబ్దమున వైష్ణవమత ప్రభావము ఈ సాహిత్యాభివృద్ధి మీద కనుపించుచున్నది. విజయనగర రాజుల కాలమున కర్ణాటక సాహిత్యమునకు గొప్ప పోషణ లభించినది. కన్నడ భారతమున యుద్ధపంచకము తరువాత భాగాలు, తిమ్మణ్ణ కవి పూర్తి గావించి, శ్రీకృష్ణ రాయలకు అంకితము గావించినాడు. ఇతర దేశీయ భాషలవలె ఆధునిక యుగ మున కర్ణాటక భాషలో వివిధ వాఙ్మయ వీథులందు నవ్య రచనలు జరిగినవి. ఈ యుగారంభకుడు కన్నడ పితామహుడు ఆలూరు వెంకట్రాయుడు.

తెలుగు భాష అతి తీయనిది; పాశ్చాత్యులచేత ప్రాచ్య ఇటాలియన్ అని ప్రశంసించబడి ప్రసిద్ధి చెందినది. దేశ భాషలందు తెలుగులెస్స అని కృష్ణ రాయలు ప్రశంసించినాడు. ఆంధ్ర భాషలో ఏడవ శతాబ్దమునందలి మాలెపాడు, విప్పర్ల శాసనాదుల యందు పూర్తి తెలుగురచన కనుపించుచున్నది. రేనాటి చోళుల శాసనాలలోని తెలుగు వచనము విశిష్టమైనది. తరువాత వేంగిచాళుక్యులు ఆంధ్ర భాషాభివృద్ధికి కృషిచేసిరి.

పదునొకండవ శతాబ్దమున నన్నయార్యుడు భారత రచనకు శ్రీకారము చుట్టి మూడు పర్వాలు ముగించెను. పన్నెండవ శతాబ్దమున శైవ వైష్ణవ వాఙ్మయములు వ్యాప్తి నొందినవి. బసవపురాణ, రంగనాథ రామాయణాదులు ఈ తరగతిలో చేరినవి. పదమూడవ శతాబ్దమున కవి బ్రహ్మయైన తిక్కన శైవ వైష్ణవాలను సమన్వయము గావించి అద్వైతము ప్రతిపాదించి తెలుగు భారతమును పూర్తిచేసెను. తరువాత నాచన సోముని హరివంశము వచ్చినది. ఇమ్మడి దేవరాయల, మరియు రెడ్డిరాజుల కాలమున ఎఱ్ఱన శ్రీనాథ బమ్మెర పోతనలు ఆంధ్ర సరస్వతికి అమూల్యాలంకారాలను సమకూర్చిరి. తరువాత వీరేశలింగం పంతులు ఆంధ్ర సాహితీ పునరుద్ధరణ ప్రభావులైనారు.

మళయాళ వాఙ్మయమునకు 16 వ శతాబ్దము తరువాత రూపు రేఖలు దిద్దబడినవి. అనగా కొంచెము ఆలస్యముగా ఈ భాషలో వాఙ్మయ నిర్మాణము ప్రారంభమైనదన్న మాట. ఆధునిక మళయాళ సారస్వతమును ప్రకాశింప జేసిన మహాకవి వల్లత్తోల్ సకల భారతమునందు కీర్తిగావించిన సారస్వతవేత్త.

ఈ విధముగా మన దేశమునందు వివిధ భాషలలో వాఙ్మయము వ్యాప్తి నొందినది. ఈ వాఙ్మయమంతయును సకల భారతదేశ సాహిత్య సంపద.

(రేడియో ప్రసంగము 1964)

# మార్గదర్శి నన్నయభట్టు

## భారతీయ సాహిత్యం - జీవనది

భారతీయ సాహిత్యం ఆసేతుహిమాచలము ప్రవహించే ఒక మహానది; ఒక జీవనది. ఏ దేశ భాషల సాహిత్యాలు దీనికి ఉపనదులు. ఏమాత్రము స్థూలదృష్టితో పరిశీలించినప్పటికిని భారతీయ సాహిత్యము యొక్క ఆత్మ ఒక్కటేనని స్పష్టము కాగలదు. భారతదేశానికి స్వాతంత్ర్యము వచ్చిన తర్వాత స్థాపితమైన కేంద్ర సాహిత్య అకాదమికి ప్రారంభోత్సవం చేస్తూ, డాక్టర్ రాధాకృష్ణ పండితుడు "భిన్నలిపులలో వ్రాసినప్పటికిని భారతీయ సాహిత్యమంతా ఒక్కటే" అని ఉద్ఘాటించినారు. ఈ ఉద్ఘాటన సర్వవిధాల సమంజసమైనది. దేశ భాషలలోని సాహిత్య వికాసాన్ని పరిణామాన్ని పరిశీలించినప్పుడు ఈ ఏకత్వాన్ని స్పష్టంగా గమనించవచ్చును. వైదిక, బౌద్ధ, జైనమతాల ప్రభావం, రామాయణ, మహాభారతాల ప్రభావం, సంస్కృత భాషా ప్రభావం, పారసీ భాషాప్రభావం, ఇంగ్లీషు భాషా ప్రభావం, ఇటీవల ఫ్రెంచి, రష్యన్ మొదలైన విదేశ సాహిత్యాల ప్రభావం మన దేశభాషల సాహిత్యాల మీద స్పష్టంగా గోచరిస్తున్నవి. ప్రాంతీయ భాషలన్నిటిలోను ఒకే కాలంలో సాహిత్యం ద్వారా అనేక భక్తి ఉద్యమాలు ప్రచారంలోకి రావటం గమనించవచ్చును. వీని మీద భిన్నకాలాలలో వచ్చిన ఇతర ఉద్యమాల ప్రభావాన్ని కూడా మనం పోల్చుకో వచ్చును. పాలీ - ప్రాకృత భాషల భూమికను కూడా మనం గుర్తింపవచ్చును.

## దేశభాషా సారస్వతాలు

భారతదేశంలో అనేక భాషలు (వీటిలో లిపిలేని భాషలు కూడా) ఉన్నవి. లిపిలేని భాషలలో కూడా సాహిత్యం మనకు కనిపిస్తున్నది. ఈ దేశభాషల సారస్వతాలను అవలోకించినప్పుడు వీని వికాసాలు రెండు విధాలుగా జరిగినట్లు వెల్లడి కాగలదు. మొదటిది - జానపద సారస్వతము, రెండవది - పండిత

సారస్వతము జానపద సారస్వతమే ప్రజా సారస్వతము. పండిత సారస్వతానికి రాజుల ఆదరణ పోషణ లభించినవి. తెలుగులో పండిత సారస్వతానికి రూపురేఖలు దిద్దిన మహాకవి నన్నయభట్టు. నన్నయభట్టు కాలంనాటి రాజకీయ మత, సాంఘిక పరిస్థితులను తెలుసుకొన్నప్పుడే తెలుగు సాహిత్యానికి ఆయన మార్గదర్శకత్వం మనకు విశదం కాగలదు.

## తెలుగు - తెనుగు, ఆంధ్రం

అనేక శతాబ్దాల నుండి తెలుగు భాషను - తెలుగు, తెనుగు, ఆంధ్రము అని వ్యవహరించడం జరుగుతున్నది. తెలుగు భాషను మాట్లాడే ప్రజల సంఖ్య ఆంధ్రప్రదేశ్‌లో సుమారు అయిదుకోట్లు; ఆంధ్రప్రదేశ్ వెలుపల ఒక కోటి; మొత్తం ఆరుకోట్ల వరకు కలదు. హిందీ భాష తర్వాత రెండవ స్థానం మన దేశంలో జనాభా దృష్ట్యా తెలుగుకు లభిస్తున్నది. భారతదేశ జనాభాలో తెలుగు మాట్లాడే ప్రజల జనాభా పదవ వంతుకాగా, వారు ఎనిమిదవ వంతు భూభాగంలో నివసిస్తున్నారు. పరదేశాలన్నా, పరభాషలన్నా తెలుగువాడు ఎన్నడూ ఉలికి పడలేదు. పొడుగైన సముద్రతీరం ఉన్నందువలన అనేక శతాబ్దాల నుండి తెలుగువారికి విదేశాలతో వ్యాపార సంబంధాలతోపాటు సాంస్కృతిక సంబంధాలు కూడా కలిగినవి. తెలుగు లిపి సమగ్రమైనది, సుందరమైనది. తెలుగుభాష తీయదనము విదేశీయులను ఆకర్షించినది. కర్ణాటక సంగీతంలో సాహిత్య రచన కొరకు తెలుగుకు అగ్రస్థానం లభించినది. ఆంగ్లేయ విద్వాంసులొకరు - తెలుగు గ్రీకుభాషవలె పలుకుబడికల భాష అని అన్నారు. మరొకరు - ఇటాలియన్ భాషవలె తీయనైనదని అన్నారు. శక్తివంతంగా, సొగసుగా, సరళంగా అభిప్రాయాలను వ్యక్తీకరించడంలో దక్షిణదేశ భాషలలో తెలుగు శక్తివంత మైనదని పాశ్చాత్య విద్వాంసులు మరికొందరు తెలిపినారు.

"Telugu can be looked upon as the Northern most member of the Southern languages or the Southern most member of the Northern languages; and it has the advantages of both groups with few, if any, of the defects. It is adaptable, absorptive, grammatically simple and euphonically exceptionally beautiful even

when using foreign words. It has never suffered from narrow provincialism"

–G. HOMEFIELD MCLEOD

జె. బి. హాల్డేన్ అన్న మాటలు కూడా గమనించండి.

"You cannot keepout foreign words as you keep-out foreign manufactured goods; perhaps Telugu accepts them mor easily than any other Indian language."

–J.B.S. HALDANE

మన దేశంలో తమిళాన్ని, కర్ణాటకాన్ని వదిలితే తెలుగు భాషా సాహిత్యాలు ఇతర ప్రాంతీయ భాషా సాహిత్యాలకన్నా ప్రాచీనమైనవి. తెలుగులో పండిత సాహిత్య రచనకు మార్గదర్శకుడైన మహా కవి నన్నయభట్టు. ఆయన సారస్వతమూర్తిని పరిచయం చేయడానికి ముందు ఆనాడు దేశంలో నెలకొని ఉండిన రాజకీయ, మత, సాంఘిక పరిస్థితులను అవగాహన చేసుకోవలసి ఉంటుంది.

## నన్నయభట్టు - దేశ కాల పరిస్థితులు

నన్నయభట్టు పదకొండవ శతాబ్దమున జీవించి, వేంగీ రాజధానిగా మన దేశాన్ని పాలించిన చాళుక్య వంశీయుడైన రాజనరేంద్రుని ఆస్థానంలో ఆదరణ పొందిన విద్యాదయితుడు, మహితాత్ముడు, ఆంధ్రకవితా విశారదుడు. రాజనరేంద్రుని పట్టాభిషేకము క్రీ.శ. 1022 లో జరిగింది. ఆయన నలుబై సంవత్సరాలు పరిపాలించినాడు; అనగా క్రీ.శ. 1062 వరకు పరిపాలించినట్లు చరిత్ర తెల్పుతున్నది రాజరాజనరేంద్రుని కోరికమీద తెలుగులో నన్నయ మహాభారత రచనను ప్రారంభించి ఆది, సభా పర్వాలను, అరణ్యపర్వంలో కొంత భాగాన్ని వ్రాసినాడు అంతటితో మహాభారత రచన రెండునూర్ల సంవత్సరాలు ఆగిపోయింది.

నన్నయ భారత రచన జరిగినప్పటి మన దేశ పరిస్థితులను మనం గమనించవలసి ఉన్నది.

భారతీయ నాగరికత మిక్కిలి ప్రాచీనమైనది. క్రీ.శ. అయిదువేల సంవత్సరాలకు పూర్వమే వెలసిన హరప్ప, మొహంజోదారో అనే రెండు ప్రాచీన నగరాలను మన చరిత్ర పరిశోధకులు కనుగొన్నారు. ఈ నగరాలలోని కట్టడాలు సమస్త ప్రపంచానికి ఆశ్చర్యము కలిగించేవిగా, నాటి నాగరికతా స్వరూపాన్ని వివరించేవిగా ఉన్నవి. అయితే నాటి నుండి నేటి వరకు దేశ చరిత్ర సమగ్రంగా ఒక కథవలె చెప్పడానికి వీలైన ఆధార సామగ్రి మన ముందు లేదు. భారత దేశాన్ని అనేక రాజవంశాలు పరిపాలించినవి. పారసీకులు గ్రీకులు విదేశాల నుండి వచ్చి భారతదేశ పరిపాలకులను జయించిన సంఘటనలు కూడా మనకు కనుపిస్తున్నవి. రాజకీయంగా ఈ దండయాత్రలప్రభావం ఏమైనప్పటికిని విదేశాలతో భారతదేశానికి అనేక శతాబ్దాలనుండి వ్యాపార సంబంధాలు ఏర్పడి సాంస్కృతికంగా పరస్పరం ప్రభావితమైనవి. భారత దేశాన్ని పరిపాలించిన రాజ్యాలలో మగధ, మౌర్య, గుప్త సామ్రాజ్యాలు మనకు తెలిసినంతవరకు ప్రాచీనమైనవి. మగధరాజుల పరిపాలనలో జైన, బౌద్ధాలు వ్యాప్తి చెందినవి. కౌటిల్యుడు, కామందుడు, పతంజలివంటి శాస్త్రవేత్తలు జన్మించి విజ్ఞానాభివృద్ధికి తోడ్పడిరి. నలంద, విక్రమశిల వంటి విద్యాలయాలు నెలకొని కళలు విజ్ఞానం ప్రగతి పొందుటకు కారణభూతమైనవి. మగధరాజుల పరిపాలనా కాలంలోనే అలెగ్జాండర్ భారత దేశంపైన దండయాత్ర చేసినాడు. మగధరాజ్య పతనం తర్వాత మౌర్య చంద్రగుప్తుడు హిమాలయాల నుండి వింధ్య పర్వతాల వరకు గల దేశాన్ని తన ఏలుబడిలోనికి తీసుకొని వచ్చినాడు. ఆఫ్గనిస్తాన్ గుజరాత్‌లు కూడా మౌర్య చంద్రగుప్తుని ఏలుబడిలో ఉండెను. మౌర్యులు సమస్త భారతీయ దృక్పథంతో పరిపాలన నిర్వహించిరి. వీరి తర్వాత మరికొన్ని రాజవంశాలు మన దేశాన్ని పరిపాలించినవి. మౌర్య సామ్రాజ్యము పతనమైన తర్వాత వైదిక జైన మతములు ముందడుగు వేసినవి. వైదిక మతముతోపాటు సంస్కృత భాషకు ప్రాధాన్యం హెచ్చినది. పాణిని ప్రారంభించిన వ్యాకరణాన్ని పూర్తి చేసిన పతంజలి ఈ కాలంవాడే. అశ్వఘోషుడు మొదలైన విద్వాంసులు, గౌతమ బుద్ధుని చరిత్రవంటి గ్రంథాలను కూడా సంస్కృత భాషలోనే రచించిరి. మను ధర్మశాస్త్రం యీ కాలంలోనే వ్యాప్తికి వచ్చినది. తరువాత క్రీ.శ. నాల్గవ శతాబ్దంలో గుప్తసామ్రాజ్యం అవతరించినది. గుప్తసామ్రాజ్యం హిమాలయాలనుండి నర్మదానది వరకు, భాగీరథినుండి చెంబర్ నది వరకు వ్యాపించినది.

## రాజులు-సామ్రాజ్యాలు-మతాలు

గుప్తసామ్రాజ్యం ఇంచుమించుగా సమస్త భారతీయ దృక్పథం కలిగిన సామ్రాజ్యము. గుప్తసామ్రాజ్య పాలనలో కూడా విదేశాలతో భారతదేశానికి వ్యాపార సాంస్కృతిక సంబంధాలు యేర్పడినవి. చీనానుండి ఫాహియాన్ ఈ కాలంలోనే బౌద్ధమత తత్త్వాన్ని అవగాహన చేసుకోడానికి భారతదేశానికి వచ్చి నాడు. ఆ తరువాత హర్షసామ్రాజ్యం మన దేశాన్ని పరిపాలించినది. హర్షుడు పాలించిన రాజ్యానికి నర్మదానది దక్షిణ సరిహద్దుగా ఉండినది. హర్షుని కాల మున హ్యూయన్‌త్సాంగ్ చైనానుండి భారతదేశానికి వచ్చి పదిహేనేండ్లు భారత దేశంలో నివసించి బౌద్ధ విహారాలను, నలంద మొదలైన విశ్వవిద్యాలయాలను సందర్శించి నాటి భారతీయ సమాజాన్ని గూర్చి అనేక విషయాలు వ్రాసిపెట్టి నాడు. బౌద్ధాన్ని దేశవిదేశాలలో వ్యాప్తిగావించిన అశోకునివలె హర్షుడు కూడా బౌద్ధుడే. అయితే ఆయన వైదిక, బౌద్ధమతాలను సమానంగా ఆదరించినాడు. హర్షుడు స్వయంగా కవి. బాణభట్టు మొదలైన సంస్కృత మహాకవులను ఆయన ఆదరించినాడు. గుప్తచక్రవర్తులవలెనే హర్షుడు సంస్కృత భాషను ప్రోత్స హించినాడు. కాళిదాసు, అమరసింహుడు, ధన్వంతరి, వరాహమిహిరుడు, ఆర్య భట్టు మొదలైన కవులు, విద్వాంసులు గుప్తచక్రవర్తుల కాలంలో రాజాదరణ పొందినారు. కుమారిల భట్టు ఈకాలంవాడే. కుమారిలభట్టు అవసానదశలో శంకరాచార్యుడు వేదాంతగ్రంథాలను వ్రాసి సకల భారతంలో వైదికమత వ్యాప్తికి కృషి చేసినాడు ప్రారంభదశలో వైదికమతము, దానిపైన తిరుగు బాటు చేసిన బౌద్ధ, జైనాల ప్రాబల్యం, ఆ పిమ్మట వాని క్షీణదశ, అనంతరం వైదికమత పునరుజ్జీవనం, తత్ఫలితంగా యజ్ఞయాగాదులు! బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు అనే నాలుగు తెగలుగా రూపొందిన వర్ణాశ్రమ వ్యవస్థ భారత దేశంలో వెలసినది. హర్షుని తర్వాత స్వతంత్ర రాజ్యాలు దేశంలో అవత రించినవి. గుజరాత్, నేపాల్, కన్యాకుబ్జములు స్వతంత్ర రాజ్యాలుగా స్థిరపడి నవి. కాబూల్, పంజాబు, సింధుదేశాలు విదేశీయుల వశమైనవి. బీహార్, బంగాళ ప్రాంతాలను స్వతంత్రంగా పాలించిన రాజవంశాలు అవతరించినవి క్రమ క్రమంగా దేశంలో వివిధ రాజవంశాల పరిపాలన ప్రారంభమైనది. తత్ఫలితంగా పదకొండవ శతాబ్దంలో దేశాన్ని పరిపాలించిన అఖిల భారత సామ్రాజ్యం ఏదీ

లేకపోయినట్టి. క్రీ. శ. 7-12 శతాబ్దాల మధ్య దేశాన్ని పరిపాలించిన సామ్రాజ్యాలు విచ్ఛిన్నమై చిన్న చిన్న రాజ్యాలుగా రూపొందినవి. దక్షిణ భారతాన్ని కూడ తన ఏలుబడిలోనికి తీసుకురావలెనని అభిలషించిన హర్ష చక్రవర్తి పశ్చిమ చాళుక్యరాజైన పులకేశుని చేతిలో ఓడిపోయినాడు. భారతదేశంలో ఎక్కువ భాగాన్ని పరిపాలించిన రాజులలో హర్షుడే చివరివాడు. హర్షుని తర్వాత ఆయన సామ్రాజ్యం చిన్నచిన్న రాజ్యాలుగా విడిపోయినది. జైన బౌద్ధమతాలు సకల దేశాన్ని ఆవరించినవి. విశేషించి బౌద్ధమతం పరదేశాలకుకూడా విస్తరించి, క్రమక్రమంగా పదకొండవ శతాబ్ది వరకు తన ప్రాధాన్యాన్ని అనేక కారణాల వల్ల కోల్పోయినది. మొదట-జైన, బౌద్ధాల తాకిడికి తట్టుకోలేక క్షీణించిన వైదిక మతం తిరిగి ప్రాధాన్యం పొంది శంకర, రామానుజ, మధ్వాఆచార్యుల కృషిచేత యావత్ భారతస్థాయిలో పునరుజ్జీవనం పొందినది. శంకరాచార్యుడు నన్నయకు పూర్వుడు. క్రీ. శ. ఏడవ శతాబ్ది రెండవ సగములో జీవించిన శంకరాచార్యుడు బౌద్ధమతానికి వ్యతిరేకంగా అద్వైతాన్ని ప్రతిపాదించి యావద్భారతంలో ప్రచారం చేసినాడు. రామానుజాచార్యుడు క్రీ.శ. 1017 లో తమిళ ప్రాంతంలో జన్మించి నూట యిరవై సంవత్సరాలు జీవించి భక్తి ప్రధానమైన వైష్ణవమతాన్ని ప్రతిపాదించి ప్రచారం చేసినాడు. వైష్ణవంకూడా వైదిక ధర్మానికి అనుగుణమై అఖిల భారతస్థాయిలో వ్యాప్తి చెందినది. రామానుజుడు నన్నయకు కొంచెము పూర్వుడో లేక సమకాలికుడో కావచ్చును. రామానుజునికి కొన్ని శతాబ్దాలకు పూర్వము ఆళ్వారులు అవతరించి తమిళ ప్రాంతంలో క్రీ. శ. 300 నుండి 800 మధ్యకాలంలో కీర్తనలు రచించి, భక్తిని ప్రబోధించి నారు. రామానుజునిపైన యీ ఆళ్వారుల రచన ప్రభావం కొంత పడియుండ వచ్చును. రాజకీయమైన ఒడుదుడుకులు ఏ విధంగా ఉన్నప్పటికిని రాజ్యాలు, సామ్రాజ్యాలు అంతరించినప్పటికిని సకల భారతస్థాయిలో సాంస్కృతిక సమైక్యత విచ్ఛిన్నంకాలేదు. ఐరోపా ఖండంలోని పరిస్థితి భారతదేశంలో రాలేదు అని మనం గమనించవలసి ఉంటుంది. భారతీయ సాహిత్యం, భారతీయ కళలు, భిన్నమత ఉద్యమాలు, ఆ ఉద్యమాలకు అనుగుణంగా రచితమైన సారస్వతము పైన పేర్కొన్న సమైక్యతను రుజువు చేస్తున్నవి.

## దక్షిణ భారతంలో రాజ్యాలు

హిమాలయంనుండి వింధ్య పర్వతాల వరకు మౌర్య, గుప్త సామ్రాజ్యాలు పరిపాలిస్తుండగా నామమాత్రమైన సార్వభౌమాధికారం యెట్లున్నప్పటికిని, వింధ్యకు దక్షిణంలో ఉన్న ప్రాంతాలను అనేక రాజవంశాలు పరిపాలించినవి. ఈ వింధ్య పర్వతానికి దక్షిణముగా ఆంధ్ర, కర్ణాటక, మహారాష్ట్ర, ద్రవిడ, కేరళ ప్రాంతాలు ఉన్నవి. అనేక రాజవంశాలు ప్రాచీనకాలం నుండి ఈ ప్రాంతాలను పరిపాలించినవి. వీటిలో ఆంధ్రజాతి చాలా ప్రాచీనమైనది. మౌర్యచంద్రగుప్తుని ఆస్థానంలో ఉండిన గ్రీకురాయబారి "మెగస్తనీస్" ఆంధ్రులనుగూర్చి ప్రస్తావించినాడు. ఆంధ్రదేశాన్ని స్వతంత్రంగా పరిపాలించిన రాజవంశాలలో మొట్టమొదటిది శాతవాహన రాజవంశం. వారికి శాలివాహనులనికూడా పేరు. రెండువేల సంవత్సరాలకు పూర్వం మొత్తం తెలుగు దేశం అనగా తెలంగాణ, ఆంధ్ర, రాయలసీమ ప్రాంతాలు వారి ఏలుబడిలో ఉండినవి. వారు పాలించిన ప్రాంతమే ఆంధ్రరాజ్యం. ముప్పై మంది శాతవాహనరాజులు సుమారు నాలుగునూర్ల యాభై సంవత్సరాలు ఆంధ్ర దేశాన్ని పరిపాలించిరి. వారి పరిపాలన క్రీ. శ. మూడవ శతాబ్ది మొదటి అర్ధ భాగంలో ముగిసింది. శాతవాహనులు ప్రాకృతభాషలో కవిత్వాన్ని ప్రోత్సహించినారు. రాజభాష ప్రాకృతభాష. అందుచేత శాసనాలన్ని ప్రాకృత భాషలోనే వ్రాసినారు. హాల శాతవాహనుడు సంకలనం చేసిన "గాథాసప్తశతి" ప్రాకృతభాషలో రచితమై శృంగారగాథలకు ఆలవాలమై నాటి సామాజిక జీవనాన్ని ప్రతిబింబిస్తున్న సుప్రసిద్ధ కావ్యము. ఆనాటి సాహిత్యంలో తెలుగుపదాలు దొరలినవి. గాథ అంటే ప్రాకృత ఛందస్సు. శాతవాహనులు వేదమతాన్ని అనుసరించినారు. అయితే వారు బౌద్ధాన్నికూడా ప్రోత్సహించినారు. శాతవాహనుల కాలంలో కళలు, విద్య ఆభివృద్ధి చెందినవి. క్రీ. శ. మూడవ శతాబ్ది అర్ధభాగంలో శాతవాహనరాజ్యం అంతమొందింది. తరువాత ఇక్ష్వాకులు తెలుగు దేశాన్ని పరిపాలించినారు. ఇక్ష్వాకుల కాలంలోకూడా అధికారభాష ప్రాకృతమే. ప్రాకృత వాఙ్మయాన్ని రాజులు ఆదరించగా విద్వాంసులు వికసింపజేసినారు. దానపత్రాలు వ్రాసినా, మరేపత్రం వ్రాసినా అందుకు ప్రాకృతభాషనే ఉపయోగించిరి. స్త్రీలు కూడా ప్రాకృతంలో విదుషీమణులై కవిత్వాన్ని వ్రాసినారు.

యాభై రెండు సంవత్సరాలు దేశాన్ని పరిపాలించిన ఇక్ష్వాకు రాజుల పరిపాలన క్రీ. శ. నాల్గవ శతాబ్దంలో సమాప్తమైనది. శాతవాహనుల కాలంలోనే విదేశాల నుండి శకులు వచ్చినారు. వీరు శైవ, వైష్ణవ, బౌద్ధ మతాలను అవలంబించి ఈ ప్రాంతాలలోనే స్థిరపడి యీ ప్రాంతీయులతోనే వివాహ సంబంధాలు చేసుకున్నారు. వర్తకవ్యాపారాలు అభివృద్ధి చెందడానికి శకులు తోడ్పడినారు. శకులు ఉజ్జయినీ పట్టణాన్ని రాజధానిగా చేసుకొని దేశాన్ని పరిపాలించి సంస్కృత విద్వాంసులను ఆదరించినారు. ఈవిధంగా వారు దేశంలో పలుకుబడి సంపాదించుకొని తమ రాజ్యాన్ని సుస్థిరం చేసుకున్నారు. సంస్కృత విద్యలకు ఆలవాలమైన ఉజ్జయినీ నగరంలో శకరాజుల ప్రోత్సాహంతో జ్యోతిష్యం మొదలైన శాస్త్రాలు బాగా అభివృద్ధి పొందినవి. ఈనాడు మనం ఉపయోగించే పంచాంగం శకరాజుల కాలంలోనే గుణితమై క్రమక్రమంగా వ్యాప్తిచెందినది. ఇక్ష్వాకుమహారాజులు యజ్ఞయాగాదులు చేసినారు. వేదమతాన్ని అవలంబించినారు. కాని స్త్రీలు మాత్రం బౌద్ధమతాన్ని అనుసరించినారు. ఈ విధంగా స్త్రీ, పురుషులు భిన్నమతాలను అవలంబించినప్పటికిని వారి సాంసారిక జీవనంలో కల్లోలం కలుగలేదు. ఇక్ష్వాకుల తర్వాత విష్ణుకుండినులు, బృహత్ఫలాయనులు, శాలంకాయనులు దేశాన్ని పరిపాలించినారు. వీరి పరిపాలనలో యజ్ఞయాగాదులకు ప్రాధాన్యం హెచ్చినది. వీనిని నిర్వహించే బ్రాహ్మణులకు పలుకుబడి కూడా పెరిగినది. ఇతర ప్రాంతాల నుండి వేద వేదాంగాలు చదివిన బ్రాహ్మణులు అనేకులు తెలుగుదేశంలో స్థిరపడినారు. ఈరాజులందరూ వేదమతానుయాయులే. కొందరు శైవులైతే మరికొందరు వైష్ణవులు. బౌద్ధమతం క్రమంగా క్షీణించినది. ప్రస్తుత శ్రీశైలం ఆనాడే శైవక్షేత్రంగా కీర్తిగాంచినది. ప్రాకృత కవులకు, ప్రాకృత గ్రంథాలకు క్రమక్రమంగా ఆదరణ తగ్గినది. సంస్కృత భాషకు, సంస్కృత కవులకు, వేద విద్యలకు ప్రాధాన్యం హెచ్చినది. తెలుగు భాష రేఖ ఈ కాలంలోనే క్రమంగా బలపడినదని మల్లంపల్లి సోమశేఖరశర్మ గారు గ్రంథస్థం గావించిరి. విష్ణుకుండినులు, బృహత్ఫలాయనులు, శాలంకాయనులు పరిపాలించినవి శాతవాహనుల రాజ్యాలవలె పెద్ద రాజ్యాలు కావు. శాతవాహనుల కాలంనుంచి వేంగీ చాళుక్యులవరకు, అనగా సుమారు తొమ్మిది నూర్ల సంవత్సరాల కాలం ఈ విధంగా గడిచినది.

# తెలుగుదేశం - చాళుక్యులు

తొమ్మిది, పది, పదకొండు శతాబ్దాల మధ్య రెండునూర్ల సంవత్సరాలకు పైగా పరిపాలించిన రాజవంశాలు పల్లవులు, రాష్ట్రకూటులు, చాళుక్యులు. చాళుక్యుల యేలుబడిలో యించుమించుగా పూర్వాంధ్ర దేశమంతా వచ్చినదని చెప్పవచ్చును. వారి ప్రక్కనే పల్లవరాజులు పశ్చిమాంధ్ర దేశంలో కొంతభాగం ఆక్రమించుకొని పరిపాలించినారు; బాదామి నగరాన్ని సత్యాశ్రయ మహారాజ సంతతివారు ఎనిమిదవ శతాబ్ది మధ్యవరకు పరిపాలించిరి. మాల్ఖేడ్ (మాల్యంఖేటం) రాజధానిగా రాజ్యం చేసిన రాష్ట్రకూట వంశపురాజులు వీరిని జయించి రెండునూర్ల సంవత్సరాల కాలం, అనగా పదవ శతాబ్ది మధ్యవరకు యీ ప్రాంతాన్ని పరిపాలించినారు. ఈ విధంగా వేంగి చాళుక్యులు, బాదామీ చాళుక్యులు, రాష్ట్రకూట రాజులు వింధ్యకు దక్షిణముగా ఉన్న ప్రాంతాలను పరిపాలించినారు. రాష్ట్ర కూటరాజులకు, వేంగిచాళుక్య రాజులకు మధ్య అప్పుడప్పుడు రాజ్య విస్తరణ కాంక్షతో యుద్ధాలు కూడా జరుగుతుండేవి. వేంగి చాళుక్యరాజులలో కొందరు పరాక్రమవంతులై శత్రువులను యుద్ధాలలో ఓడించినారు. ఇటువంటి వారిలో విజయాదిత్యుడు ప్రత్యేకంగా పేర్కొనదగినవాడు. విజయాదిత్యుని కొడుకు అమ్మరాజ రాజమహేంద్రుడు. తనపేరుతో నేటి రాజమహేంద్రవరాన్ని నిర్మించినాడు. చాళుక్యరాజులకు చోళులతోకూడా రాజ్య విస్తరణ కాంక్షతో యుద్ధాలు జరుగుతుండేవి. తరువాత యీ ఉభయ వంశాల మధ్య బాంధవ్యము ఏర్పడి పరస్పర సహాయం చేసుకొన్నారు. చోళ మహారాజులు తమ ఆడుబిడ్డలను చాళుక్య మహారాజులకిచ్చి పెండ్లిండ్లు చేసినారు. రాజరాజు చోళమహారాజు తన సోదరి కుందవాంబను చాళుక్యరాజైన విమలాదిత్యునకిచ్చి పెండ్లి చేసినాడు. ఆ దంపతుల కుమారుడైన రాజనరేంద్రుడు తిరిగి రాజేంద్రచోళుని కూతురు అమ్మంగదేవిని మేనరికంగా వివాహం చేసుకొన్నాడు. తత్ఫలితంగా ఈ ఉభయవంశాలు సన్నిహితమై దేశంలో కొంత శాంతి ఏర్పడినది. క్రీ.శ. 1022లో రాజనరేంద్రుని పట్టాభిషేకము జరిగినది. ఆయన నలభై సంవత్సరాలు, అనగా 1062 వరకు పరిపాలించినాడు. నన్నయభట్టు రాజనరేంద్రుని ఆస్థానకవి.

పదకొండవ శతాబ్దంలో చిన్నచిన్న రాజ్యాలు అన్నీ అంతరించి చోళ, చాళుక్య, కళింగ రాజ్యాలలో అంతర్లీనమైనవి. ఆ పిమ్మట కొంతకాలం దేశంలో శాంతి నెలకొన్నందువలన భాషాభివృద్ధికి సాహిత్య ప్రగతికి అవసరమైన పరిస్థితులు ఏర్పడినవి. మతద్వేషాలు కూడా చాలామట్టుకు తొలగిపోయినవి. రాజులు ప్రజల అభ్యుదయాన్ని గురించి ఆలోచించడానికి కావలసిన వాతావరణం ఏర్పడినది. పండితులు, విద్వాంసులు రచనా వ్యాసంగాన్ని చేపట్టిరి. తెలుగుదేశానికి పొరుగుననే ఉన్న కన్నడదేశంలో కర్ణాటక వాఙ్మయం పెంపొందినది. పంప, పొన్న, రన్న అను ముగ్గురు కవులు జైనమతానుసారముగా రచనలు గావించిరి. పంపడు భారతం, విక్రమార్క విజయం అనే పేరుతో రచించగా అది జనాదరణ పొందినది. విక్రమార్క విజయంలో అర్జునుడే కథానాయకుడు. తన రాజును దృష్టిలో ఉంచుకొని పంపడు అర్జునుని కథానాయకునిగా చేసినాడు.

## రాజనరేంద్రుడు - తెలుగుభారతం

రాజనరేంద్రునికి వైదికమతముపైన అభిమానం. ఆయనకు సమకాలిక దేశపరిస్థితులు, ముఖ్యంగా కన్నడ దేశ పరిస్థితులు బాగా తెలిసి ఉండవచ్చును. బహుళ ఆ పరిస్థితులను గమనించియే కాబోలు అందుకు పూర్తిగా వ్యతిరేకమైన ఉద్దేశంతో వైదిక మతానుసారంగా వ్యాసరచిత మహాభారతాన్ని తెనిగించవలసినదని రాజనరేంద్రుడు నన్నయభట్టును అభ్యర్థించినాడు. నన్నయభట్టు కొంతభాగం వ్రాసిన తర్వాత, అనగా రాజరాజు మరణానంతరం భారత రచన ఆగిపోయినది. తర్వాత కొంతకాలం వరకు కొనసాగలేదు. అందుకు కారణం అప్పటి రాజకీయ, మత పరిస్థితులేనని చెప్పవచ్చును. రాజరాజు కుమారుడు కులోత్తుంగ చోళదేవుడు, తన పితామహుల రాజ్యమైన చోళ రాజ్యానికి పరిపాలకుడైనాడు. చోళరాజ్యంలో తమిళభాషకే ప్రాబల్యం. కావున ఆంధ్రభాషా వ్యాప్తికి అనుకూలమైన వాతావరణం లేకుండెను. క్రీ.శ. పన్నెండవ శతాబ్దం ఆరంభంలో కన్నడదేశమున బసవేశ్వరుడు ఉద్భవించి వీరశైవాన్ని స్థాపించెను. వీరశైవం భక్తి ప్రధానమైన మతం. వర్ణాశ్రమ వ్యవస్థకు వేదప్రామాణ్యానికి పూర్తిగా వ్యతిరేకమైనది. రామానుజుడు స్థాపించిన వైష్ణవం ఆంధ్రదేశంలో వ్యాప్తి చెందడం జరిగినది. వైష్ణవం కూడా భక్తి ప్రధానమైనది. కావున భారత రచన

కొనసాగడానికి కొంతకాలం ఆటంకం కలిగినది. నన్నయ ఆది, సభా పర్వాలు పూర్తిగాను, అరణ్యంలో మూడు ఆశ్వాసాలపైన 142 పద్యాలు రచించి ఆగినాడు.

నన్నయభట్టు సారస్వతమూర్తిని సమగ్రంగా సందర్శించడానికి ఆ కాలంలో యితర భాషాసాహిత్యాలు ఏ విధంగా ప్రగతి చెందినవో స్థూలంగా నైనప్పటికిని తెలుసుకోవడం అవసరం. అప్పటివరకు భారతదేశంలో ప్రాకృత భాషలో రమ్యమైన సారస్వతం పుష్కలంగా ఉండెను. సంస్కృత సారస్వతముకన్న గుణములో ప్రాకృత సారస్వతము గొప్పదనికూడా ఒక అభిప్రాయ మున్నది. ప్రాకృతము, మహారాష్ట్రి, శౌరసేని, పైశాచి, మాగధి అని అయిదు పేర్లతో వ్యాప్తి చెందినది. ఈ భాషలన్నింటి పైన సంస్కృత ప్రభావంకూడా స్పష్టంగా కనిపిస్తున్నది. జైన, బౌద్ధ సంప్రదాయాలకు చెందిన వాఙ్మయం వీనిలో విశేషంగా కనిపిస్తున్నది. పాళిభాష కూడా మనదేశంలో అభివృద్ధి చెంది బౌద్ధ ధర్మాన్ని ప్రతిపాదించే వాఙ్మయానికి ఆటపట్టైనది. ఇది ఇట్లుండగా దేశభాషలలో సారస్వతము ఏ విధంగా ముందుకు పోయినదో మనం తెలుసుకోవలసి ఉంటుంది.

## భారతీయ భాషలు - ప్రారంభ వికాసాలు

క్రీ. శ. ఏడవ శతాబ్దంనాటికే అస్సామి భాషలో సాహిత్యం ఉండినట్లు తెలుస్తున్నది. జానపద సాహిత్యమే కాక పండిత సాహిత్యం కూడా రచితమైనట్లు నిదర్శనాలు ఉన్నవి. పదమూడవ శతాబ్దంనుండి ప్రాచీన అస్సామి సాహిత్యం బాగా వర్ధిల్లినది. పదహారవ శతాబ్దంలో భక్తకవులు అస్సామిలో రచనలు కావించినారు. ఆ పిమ్మట భారత భాగవత పురాణాలు అస్సామి భాషలోనికి వచ్చినవి. తర్వాత అస్సామి భాషకు రాజపోషణకూడా లభించినది. ఒరియా భాషలో పదిహేనవ శతాబ్దంనుండి సాహిత్యం ముందడుగు వేసినది; భారత. రామాయణ, భాగవతాలు రచితమైనవి. కాశ్మీరి భాషలో కూడా ప్రాచీన వాఙ్మయం పద్నాల్గవ శతాబ్దంనుండి ఆరంభమైనట్లు చరిత్ర తెలుపుతున్నది. గుజరాతి భాషలో ప్రాచీన వాఙ్మయం క్రీ. శ. 1150 నుండి క్రీ. శ. 1450 వరకు క్రమవికాసం పొందినది. గుజరాతి భాషలో ఆది కావ్యాలను జైన సన్యా

సులు రచించినారు. జైనేతరుల రచనలు పదిహేనవ శతాబ్దం తరువాతనే ప్రాధాన్యం వహించినవి. పంజాబీ భాషలో కూడా సాహిత్యం పదిహేనవ శతాబ్దంలోనే వికసించడం ప్రారంభమైనదని, భారతీయ సాహిత్య చరిత్ర చెప్పుతున్నది. వంగభాషకు సుమారు వేయి సంవత్సరాల చరిత్ర ఉన్నది. బెంగాలీభాషలో ప్రాచీనవాఙ్మయం భక్తి సాహిత్యంగా ప్రారంభమైనది. పదిహేనవ శతాబ్దంలో రామాయణ రచన జరిగినది. తర్వాత భారత, భాగవత రచనలు కూడా జరిగినవి. మరాఠీభాష ఏడవ శతాబ్దంనుండి ప్రచారంతో ఉన్నప్పటికిని పన్నెండవ శతాబ్దంలోనే అందులో సారస్వత రచన జరిగినది. క్రీ.శ. 1189లో రచితమైన "వివేక సింధు" మరాఠి సాహిత్యంలో మొదటి గ్రంథం. పన్నెండు, పదమూడవ శతాబ్దాలలో మహారాష్ట్రములో ధార్మిక విప్లవాలు చెలరేగి వైదిక మతముపైన వర్ణాశ్రమ వ్యవస్థపైన తిరుగుబాటు జరిగి కొత్త ఉద్యమాలు బయలుదేరినవి. వైదిక సమ్మతములైన రచనలను పదమూడవ శతాబ్దంలో జ్ఞానేశ్వరుడు చేసినాడు. పద్నాల్గవ శతాబ్దంనుండి పదహారవ శతాబ్దం వరకు పేర్కొనదగిన రచనలేవీ మహారాష్ట్రంలో జరుగలేదు. భాగవతం, భగవద్గీత మొదలైన గ్రంథాలు పదహారవ శతాబ్దం నుండియే మహారాష్ట్రంలో వచ్చినవి. హిందీ సాహిత్యం పదకొండవ శతాబ్దంనుండి పద్నాల్గవ శతాబ్దం మధ్య ప్రారంభమై అభివృద్ధి చెందినది. భక్తి సాహిత్యం హిందీలో గుణములోను, పరిమాణములోను పుష్కలంగా వచ్చినది. ఈ విధంగా భారతదేశ భాషలలో రామాయణ, భారత, భాగవతాలు తెలుగు భారతం తర్వాతనే రచితమైనట్లు స్పష్టమౌతున్నవి.

అయితే తెలుగు భారతానికి ముందే కన్నడంలోను, తమిళంలోను భారత రచన జరిగినది. ఈ రెండు తెలుగుకన్న ప్రాచీన భాషలని అంగీకరించవలసి ఉంటుంది. కన్నడంలో భారతం రచించిన పంపడు పదవ శతాబ్దానికి చెందినవాడు. అయన తన భారతానికి అర్జునుని నాయకునిగావించి తన రాజుకు అర్జునునికి అభేద భావం కల్పించినాడు. పంపని భారతం వ్యాస భారతానికి అనువాదము. కాదు; స్వతంత్రమైన అనుసరణ. తమిళంలో సాహిత్యం ఏడవ శతాబ్దముననే ప్రారంభమైనది. తమిళంలోని తొలి కావ్యమైన "తొల్కాప్పియము" ఉత్తమశ్రేణికి చెందిన రచన. ఆనాటి తమిళప్రాంత ప్రజల మతాన్ని, విశ్వాసాన్ని, అక్కడి పరిపాలనా సంస్థలను, వివాహ విధానాలను మొదలైన

వానిని ఈ కావ్యంతో చిత్రించడం జరిగి తమిళ సాంఘిక జీవనానికి యీ కావ్యం దర్పణముగా ఉన్నది అనంతరము వచ్చిన "సిలప్పదికారము" "మణిమేఖలై" మొదలైన గ్రంథాలు కూడా సాంఘిక జీవనానికి ప్రతిబింబాలే. ఆ పిమ్మట వచ్చిన భక్తివాఙ్మయం కూడా రామాయణం మహాభారతాల ఇతివృత్తాన్ని స్వీకరించినదికాదు. తొమ్మిదవ శతాబ్దంలో ప్రారంభమైన చోళయుగంలో "కంబ రామాయణ" రచన జరిగినది. మళయాళంలో పన్నెండు, పదమూడు శతాబ్దాలలో సాహిత్యరచన జరిగినది. క్రీ. శ. 1195 నుండి 1208వరకు జీవించిన కవి కేరళ పాలకుకుడు రామవర్మమహారాజు "రామ చరితము"ను రచించినాడు. ఇది మళయాళంలో చాలా ప్రసిద్ధమైన రచన ఈ విధంగా మనదేశభాషా సారస్వతాలపైన ఒక దృష్టిని ప్రసరించినప్పుడు తమిళ, కన్నడ భారతాలను వదిలితే తెలుగు భారతమే భారతదేశ భాషల సాహిత్యంలో మొదటిదని చెప్పవలెను. సంస్కృతభాషలో వైదిక వాఙ్మయంతోపాటు లౌకిక వాఙ్మయంకూడా అపారంగా ఉన్నది. కొన్ని శతాబ్దాలకు పూర్వమే సంస్కృత భాషఆరంభవికాసాలు జరిగినవి. ప్రాకృతము, పాలి, పైశాచిభాషలుకూడా భారత దేశంలోని ప్రాచీన భాషలు. ఈ మూడుభాషల ప్రభావం భారతీయ సాహిత్యము మీద, భారతీయ సంస్కృతి మీద స్పష్టంగా కనిపిస్తున్నది. ఈ భాషలలోని రచ నలు భారతీయ సాహిత్యాన్ని ప్రభావితం చేసినవి దేశభాషలలో సాహిత్యం క్రీ. శ. నాలుగు, అయిదు శతాబ్దాలనుండే ప్రారంభమై అభివృద్ధి చెందినట్లు మనకు స్పష్టమౌతున్నది. తెలుగు సంస్కృత జన్యమా లేక ద్రావిడభాషల కుటుంబానికి చెందినదా అన్న వాదమొకటి కొంత కాలం జరిగినది; భిన్నాభి ప్రాయాలు ప్రకటితమైనవి. తుట్ట తుదకు ద్రావిడ భాషల కుటుంబానికి చెందిన దన్న వాదము బలపడి స్థిరపడినది.

## తెలుగుభాష-పరిణామం

తెలుగుభాష క్రీ. శ. ఒకటవ శతాబ్దమునుండియే ప్రచారంలో ఉండినట్లు ఉదాహరణలు ఉన్నవి. క్రీ. శ. మొదటి అయిదు, ఆరు శతాబ్దాలలో తెలుగు భాష ఒక పరిణామాన్ని పొందినది. ఏడు, ఎనిమిది, తొమ్మిది, పది శతాబ్దా లలో ఆంధ్రభాషావికాసానికి ఒక స్పష్టమైన స్వరూపం ఏర్పడినది. పదకొండవ

శతాబ్దంలో నన్నయభట్టు భారతరచన చేయడానికి పూర్వమే తెలుగులో తగినంత సాహిత్యము ఉన్నట్లు పరిశోధకులందరూ అంగీకరించినారు. ఆరవ శతాబ్దంలో తెలుగు వ్యవహారంలో ఉండెనని చెప్పడానికి అవకాశం ఉన్నది. అంతేకాదు, హాలుని "గాథాసప్తశతి"లో కూడా తెలుగుపదాలు కనిపిస్తున్నవి. పాల్కురికి సోమనాథుడు వ్రాసిన పండితారాధ్య చరిత్రలో తెలుగులో తుమ్మెద పదాలు, వెన్నెలపదాలు, ప్రభాతపదాలు మొదలైనవి ప్రజలు పాడుతుండినట్లు తెల్పినాడు. అందుచేత నన్నయకు పూర్వమే తెలుగులో కవిత్వం ఉండెనని నిస్సందేహంగా చెప్పవచ్చును. ఆ కవిత్వాన్ని జనసముదాయం ఆదరించినది.

## తూర్పు చాళుక్యులు - తెలుగుకు ప్రోత్సాహం

తెలుగు భాషా, సాహిత్యాలు తూర్పు చాళుక్యుల కాలమున బాగుగా వికసించినవి. క్రీ.శ. 615లో కుబ్జ విష్ణువర్ధనునితో ప్రారంభమై 11వ శతాబ్దంలో రాజరాజనరేంద్రుని వరకు తూర్పు చాళుక్యులు పూర్వాంధ్రమును అవిచ్ఛిన్నముగా పరిపాలించినారు. క్రీ. శ. 848 నుండి క్రీ. శ. 892 వరకు ఆంధ్రదేశమును పరిపాలించిన తూర్పు చాళుక్యరాజు గుణగ విజయాదిత్యుని కాలమున మనకు మొదటిసారిగా శాసనాలలో తెలుగు పద్యము లభించినది. తరువాత నన్నయకాలము వరకు శాసనాలలో తరువోజ, సీసము, ఆటవెలది, తేటగీతి, మధ్యాక్కర, కందము మొదలైన దేశీయ ఛందాలు లభించినవి. ఇవి ఆ రోజులలో ప్రజలలో ప్రచారములో నుండిన ఛందములు కావచ్చును. క్రమక్రమంగా అవి లిఖిత సాహిత్యములో ప్రవేశించి పండితాదరమును పొందినవి. అందుచేత నన్నయ నాటికే సంస్కృత వృత్తాలలో తెలుగుకవిత్వము వ్రాయడం ప్రారంభమైనదని చెప్పవచ్చును. మొదట శాసనాలు దేశ్యపదములతో నిండి దేశీయముగా నుండెడివి. క్రమక్రమంగా తత్సమ పదాలు అనేకము పండితభాషలో చేరినవి. గద్య, పద్యములను కలిపి రచన చేయు పద్ధతికూడా ఈకాలముననే రూపొందినది. దీనినిబట్టి నన్నయ భారత రచనా కాలము నాటికే అందులో కనిపించే రచనారీతులు పరిణామము పొంది ఉన్నవని చెప్పవచ్చును. సంస్కృత పదములతో నిండిన భాష, గద్యపద్య మయమైన చంపూ పద్ధతి, సంస్కృత అలంకార

శాస్త్రము ననుసరించిన విధానము సంస్కృత దేశీయ ఛందో విధానాల మిశ్రణం-వీటితోపాటు, వైదిక మార్గవర్తన కనుకూలమైన పురాణ రచనారీతి నన్నయ కాలము నాటికే రూపుదిద్దుకొన్నవి. తెలుగులో ఇటువంటి శిష్టకవిత ప్రారంభము కాకపూర్వము దేశీయ భాషలో, పద్ధతులలో రచన జరిగిఉండవచ్చును. నన్నయ్య కాలమునాటికి సంస్కృత, ప్రాకృత భాషా సంబంధముతో శిష్టభాషా స్వరూపము మారిపోయినట్లే సంస్కృత సాహితీ రీతులలో శిష్టసాహిత్య స్వరూపమొకటి రూపొందినది. ఇది దేశీయ మార్గమునకు భిన్నమైనది. ఈ మార్గములో మొదట సమగ్ర రచన చేసినవాడు నన్నయ. అనఘమై, శిష్టాగ్రహార భూయిష్టమై, ధరణీ సురోత్తమాధ్వర పుణ్య సమృద్ధమైన వేంగిదేశమును రాజమహేంద్రవరము రాజధానిగా పరమధర్మవిదుడై, మనుమార్గవర్తనుడై, వైదిక నిష్ఠమైన మార్గమును నిలబెట్టడానికి పూనుకున్న రాజరాజ నరేంద్రునకు భారత శ్రవణాసక్తి ప్రీతియై ఉండడం సహజము. అమల సువర్ణ శృంగ ఖురమై కపిలంబగుగోశతాన్ని బహువేద విప్రులకు దానము చేసిన ఫలము భారత శ్రవణము వలన సమకూరును. సంస్కృత భారతమును చదివి, దేశీయ భాషలో అర్థము వివరించి వినిపించు పద్ధతి ఆ రోజులలో ఉండినదనుటకు అవకాశము కలదు. పల్లవుల కాలములోను, ఆ తరువాతను దక్షిణ దేశపు దేవాలయాలలో భారత పఠనము చేయు ఉద్యోగిని ఒకనిని నియమించే ఆచారము కలదని తెలియుచున్నది. అట్టిదానిని పూర్తిగా తెలుగులోనికి తీసుకురావలసిన అవశ్యకతను పాలకులు, పండితులు గుర్తించినారు. ఈ మహాకావ్యమును ప్రతిభావంతంగా రచించి నిర్వహించినవాడు నన్నయ.

తెలుగులో మహాకావ్య రచన గావించిన మొదటికవి నన్నయ భట్టారకుడను సత్యం నిర్వివాదాస్పదమైనది. నన్నయ తర్వాత కావ్యరచన గావించిన కవులందరును నన్నయను ప్రథమాంధ్ర కవిగా ప్రస్తుతించినారు. విరాటపర్వం నుండి భారతాన్ని తుదివరకు, అనగా పదిహేను పర్వాలు పూర్తి చేసిన తిక్కన నన్నయను ఆంధ్రకవితా విశారదుడు, మహితాత్ముడు, విద్యాదయితుడు అని కీర్తించినాడు. తిక్కన తర్వాత కొంతకాలానికి అరణ్యపర్వ శేషాన్ని పూరించిన ఎర్రాప్రెగడ నన్నయనుగూర్చి ప్రస్తావించే సందర్భములో-

ఉ॥ భాసుర భారతార్థముల భంగుల నిక్కమెరుంగ నేరమిన్
గాసట బీసటే చదివి గాథలు త్రవ్వ తెనుంగు వారికిన్
వ్యాసముని ప్రణీత పరమార్థము తెల్లము జేసినట్టి య
జ్ఞాసన కల్పులందలంతు నాద్యుల నన్నయ తిక్కనార్యులన్

(నృ. పు-1 ఎర్రాప్రెగడ)

నన్నయకు ముందు తెలుగువారు గాసట బీసటగా చదివి గాథలు త్రవ్వే వారని ఇందులో స్పష్టముగా ఎర్రాప్రెగడ చెప్పినాడు. అనగా నన్నయకు ముందు తెలుగులో విద్వాంసులు మెచ్చే మహాకావ్యము ఏమియూ లేదన్నమాట. శ్రీనాథ, పోతనవంటి మహాకవులు నన్నయను మొదటి మహాకవిగా పేర్కొన్నారు. వసుచరిత్రను రచించిన రామరాజభూషణుడు—

"మహిమున్ వాగనుశాసనుండు సృజియింపన్
కుండలీంద్రుండు తన్మహనీయ స్థితి మూలమై నిలువ"

అని చెప్పి నన్నయను ఆదికవి యని వర్ణించాడు.

నన్నయకు పూర్వం కవిత్వం ఉన్నప్పటికిని ఏ మహాగ్రంథం తెలుగులో రాలేదు. జైన, బౌద్ధ వాఙ్మయాలకు సంబంధించిన గ్రంథాలుకూడా ఏవీ తెలుగులో రాలేదు. నన్నయకు పూర్వం కవిత్వం దేశీమార్గంలో నడిచినది; సాధారణ ప్రజలను రంజింప జేసినది. విద్వాంసుల మెప్పును పొందలేదు; ఒక గ్రంథ రూపం దాల్చలేదు. నన్నయకు పూర్వం శాసనాలలో సులక్షణమైన భాష దేశి, మార్గ పద్ధతులను రెండింటిని అనుసరించిన కవిత్వం మనకు కనిపిస్తున్నది. అయితే ఉదాత్త వస్తువులను తీసుకొని మహా కావ్యాన్ని రచించిన గౌరవము నన్నయకు చెందుతున్నది. నన్నయ తన కాలంలో ప్రజల వ్యవహారంలో ఉన్న భాషను బాగా పరిశీలించినాడు ఆపదజాలాన్ని గ్రంథస్థం గావించడానికి ఒక పద్ధతిని నిర్ణయించుకొని దానిని అనుసరించినాడు. సంస్కృత పదాలను సర సంగా పొందుపరచినాడు. ఎక్కడా కుంటుపడని పద్ధతిలో సంస్కృత వృత్తాలను తీసుకొని వాటిని తన రచనలో ఉపయోగించినాడు. ఈ పనిలో కన్నడ వాఙ్మ

యంలో అప్పటివరకు రచితమైన కన్నడ భారతంతోపాటు ఇతర సారస్వతం కొంతవరకు ఉపయోగపడినదని చెప్పవచ్చును. అందుకు అనుగుణముగా భారత రచనను నన్నయ కొనసాగించినాడు. పద్యాలలోనేకాదు వచన రచనలో కూడా నన్నయ తన ప్రతిభను, వైదుష్యాన్ని నిపుణంగా ప్రదర్శించినాడు. అందుచేతనే పద్యవిద్యనేకాదు వచన రచనకుకూడా నన్నయ సరియైన మార్గదర్శి అని తెలుగు సాహిత్య విమర్శకుల నిశ్చితాభిప్రాయం. నన్నయ శైలి మనోహరమై, లలితమై, ధారాళమై అలరారుచుండును. చంపకమాల, ఉత్పలమాల మొదలైన సంస్కృత వృత్తాలనేకాక తరువోజ, మధ్యాక్కర మున్నగు దేశి ఛందస్సులను కూడా నన్నయ చక్కగా తీర్చిదిద్దినాడు తరువాత కవులందరు నన్నయను అనుసరించినారు.

## తమిళ కన్నడ భాషలలో భారతాలు

అప్పటివరకు కన్నడ, తమిళ భాషలలో భారతం రచితమైనది. పంప కవి కన్నడ భారతం నన్నయ బాగా చదివి ఉంటాడని ఆయన రచనలవల్ల విశదమౌతున్నది. తమిళ భారతంకూడా నన్నయకు పరిచితమై ఉండవచ్చును. కాని యీ రెండు భాషల భారతాలవలెకాక తెలుగుభారతం విస్తృతమైనదిగా ఉన్నది. కన్నడ భారతంలో మొత్తము గద్యపద్యముల సంఖ్య 1609. తమిళ భారతంలో పది పర్వాలు మాత్రమే అప్పటివరకు వచ్చినవి. తెలుగు భారతంలో ఒక్క నన్నయ రచించిన భాగంలోనే 4011 పద్య, గద్యాలు ఉన్నవి. అందు చేత తెలుగు భారతం-తమిళ, కన్నడ భారతాలకన్నా ఆదర్శంలోను, ఆకృతి లోను విశాలమైనదని స్పష్టమగుచున్నది. వ్యాసుని భారతాన్ని సమగ్రంగా తెలుగులో వివరించవలెననే సంకల్పం నన్నయకు కలిగినది. సహాధ్యాయియైన నారాయణభట్టు సంకల్పంకూడా ఇదియే కావచ్చును. ఈ ఉభయులు బాగా చర్చించుకొని తెలుగులో భారత రచనకు సమగ్రమైన ప్రణాళికను ఒకటి రూపొందించుకొని ఉండవచ్చును. కన్నడంలో వ్రాసిన పంపని భారతశైలికి ప్రసన్న కవితాగుణం, లలితపద ప్రయోగం ప్రత్యేకతలు. ఈ రెండు గుణాలను నన్నయ ఆదరించి పాటించినట్లు ఆయన రచన స్పష్టం చేస్తున్నది. ఇతర భాషలలో రామాయణ, భాగవతాలకు ప్రశస్తి, ప్రాచుర్యం ఉండగా తెలుగులో భారతానికి అధిక ప్రశస్తి, ప్రాచుర్యం ఉన్నవి. వింటే భారతమే వినవలెను.

తింటే గారెలే తినవలెను అన్న సామెత సుప్రసిద్ధమైనది. దీనికి భారత కవుల రచనా పాటవమే ప్రధానకారణం.

తెలుగులో భారత రచనను, ముఖ్యంగా నన్నయ రచనను పరిచయం చేసే సందర్భంలో భారతం దాని ప్రత్యేకత, దానిని ఆంధ్రీకరించవలసిన ఆవశ్యకత, అందుకు రాజరాజు ప్రోత్సాహం, ఆ రాజరాజు చిత్తవృత్తి, ఆయన సభలోని పండిత మండలి, ముఖ్యంగా నన్నయకు సహాధ్యాయుడైన నారాయణ భట్టు తోడ్పాటు, ఆ తోడ్పాటు విశిష్టత మొదలైన అంశాలను గురించి ప్రస్తావించవలసిన అవసరం ఉన్నది.

భారతాన్నిగూర్చి నన్నయ చెప్పిన మాటలు ప్రత్యేకంగా మనం గమనించవలసి ఉంటుంది. భారతం ధర్మతత్త్వజ్ఞులకు ధర్మశాస్త్రం; అధ్యాత్మ విదులకు వేదాంతం; నీతి విచక్షణులకు నీతిశాస్త్రం; కవులకు మహాకావ్యం; లాక్షణికులకు సర్వలక్షణ సంగ్రహం; ఐతిహాసికులకు ఇతిహాసం: పౌరాణికులకు బహుపురాణ సముచ్చయం. నన్నయ సందర్శించిన మహాభారత స్వరూపమిది. దీనిని వ్రాసినవాడు వేదవ్యాసుడు. ఆయన ఆదిముని, వివిధ వేద తత్త్వవేది. విష్ణు సన్నిభుడు, భారతాన్ని విశ్వజనీనంగా వెలయింపజేసిన మహానుభావుడు. ఈ మాటలు మనం చదివినప్పుడు నన్నయకు భారతంపట్ల, భారతాన్ని రచించిన వేదవ్యాసునిపట్ల ఉన్న గౌరవాభిమానాలు స్పష్టంగా తెలుస్తున్నవి. భారతం ఆయనను ఎంతగా ఉత్తేజపరిచినదో ఇందువలన వెల్లడియౌతున్నది.

## రాజనరేంద్రుని సభ

రాజనరేంద్రుని కాలంలో ఆయన కొలువు సరస్వతీ దేవికి నిలయమైనది. రాజమహేంద్రవరము రాజధానిగా, వేంగీ దేశమును పాలించిన రాజరాజు శత్రురాజులను ఓడించి దేశంలో శాంతిని స్థాపించెను. కాని ఆయనకు మాత్రము చిత్తశాంతి కలుగలేదు. ఎందుకనగా తెలుగుభాషలో శాశ్వతంగా నిలిచే మహారచన ఒకటి చేయించవలెనని ఆయన ఉద్దేశం ఆయన మాట్లాడేభాష, ఆయన ప్రజలు మాట్లాడేభాష తెలుగు భాష. ఆ తెలుగులో శాశ్వతంగా నిలిచే మహారచన ఒకటి చేయించవలెనని ఆయన ఉద్దేశం. ఆయన మాట్లాడే భాష, ఆయన ప్రజలు మాట్లాడే భాష, ఆ తెలుగులో సరస్వతీదేవిని సాక్షాత్కారింపవలెనని ఆయన

మనోరథం. ఆ రోజులలో సాహిత్యము మతము, సంస్కృతి అంతయు సంస్కృత భాషనే ఆశ్రయించి యుండెను. ప్రజల భాషయైన తెలుగువైపు ఆయన దృష్టి మరలినది. తెలుగులో సాహిత్య రచన చేయఁగల కవులు చాలామంది ఆయన ఆస్థానంలో ఉండిరి. వారిలో భీమనభట్టు, నన్నయ, నారాయణభట్టు ప్రముఖులుగా ఉండిరి. వీరు అనేక భాషలలో నిష్ణాతులై తెలుగులోను, సంస్కృతంలోను రసవంతమైన కవిత్వం అల్లగలిగిన శక్తిమంతులై యుండిరి. రాజరాజు ఆస్థానాన్ని ఒకమారు తిలకించినప్పుడు మన ఒడలు పులకరిస్తుంది. మంత్రులు, పురోహితులు, సేనాపతులు, దండనాయకులు, దౌవారికులు, మహాప్రధానులు, సామంతులతోపాటు శబ్దశాస్త్ర పారంగతులైన వైయాకరణులు; భారతం, రామాయణం మొదలైన పురాణాలతో ప్రవీణులైన పౌరాణికులు: మృదుమధురంగా రస, భావ, భాసుర, సవార్థభరితమైన వచనరచనలో విశారదులైన మహాకవులు. వివిధ తర్కవిగాహిత సమస్త శాస్త్రసాగర గరీయః ప్రతిభులైన తార్కికులు మొదలైన విద్వాంసులు పరివేష్టించి ఉండిరి. వీరిమధ్య రాజరాజు విద్వత్ విలాసగోష్ఠులతో కాలక్షేపం చేస్తుండేవారు. ఆ రోజులలో దేశంలోని విద్వాంసులు, శాస్త్రపారంగతులు, కవులు మొదలైనవారు రాజరాజును ఆశ్రయించి ఉండేవారని ఇందువల్ల తెలుస్తున్నది. బహుశ ఇటువంటి విద్వజ్జనం పరివేష్టించిన యీ సభను దృష్టిలో ఉంచుకొనియే కాబోలు నన్నయ తన భారత అవతారికలో సభను కొనియాడినాడు. ఆ కొనియాడేపద్ధతి బహురమ్యంగా ఉన్నది. ఈ సభ ఎటువంటిదో ఆయన ఈ విధంగా వర్ణించినాడు.

చ॥ "పరమ వివేక సౌరభ విభాసిత సద్గుణ పుంజవారిజో
త్కర రుచిరంబులై సకల గమ్యసుతీర్థములై మహామనో
హర సుచరిత్ర పావనపయః పరిపూర్ణములైన సత్సభాం
తర సరసీపవనంబుల ముదంబొనరం గొనియాడి వేడుకన్."

రాజరాజ నరేంద్రుని సభ వివేకమనే సౌరభంతో ప్రకాశించే సద్గుణ పుంజమనే కమలాలవలన సుందరంగా శోభిల్లుతున్నది; అందరూ సేవింపదగిన తీర్థాలు కలిగిఉన్నది. మిక్కిలి మనోహరములైన మంచి చరిత్రలనెడు పావనజలాలతో నిండిన సత్‌సభలు అనే పద్మాకరాలను సంతోషంతో కొనియాడుతున్నానని

యీ పద్యములో నన్నయ రాజరాజు సభను సంస్తుతించి సభ అనగా యిట్లుండ వలెనని ధ్వనింపజేసినాడు. ఇటువంటి విద్వత్సభలు నన్నయకు పూర్వము, నన్నయ కాలంలోను ఉండేవని విజ్ఞుల అభిప్రాయం. ఈ విద్వత్సభలు సాహిత్యానికి, కళలకు, విజ్ఞానానికి విలువకట్టేవిగా ఉండేవని మనము అనుకోవచ్చును.

తమిళ సాహిత్యంలో సంగవాఙ్మయ యుగంలో కవితా తారతమ్య పరీక్ష చేసే కవి, పండిత సంఘాలవంటిదే రాజరాజు సభ కావచ్చును. అంతకుముందు మనదేశం అంతా వ్యాపించి ఉన్న బౌద్ధ సంఘాలు ఏర్పడటానికి కారణము కావచ్చును.

## నన్నయభట్టు-రాజరాజు-నారాయణభట్టు

నన్నయభట్టు రాజరాజును వర్ణించిన విధంకూడా విశిష్టంగా ఉన్నది. రాజరాజు రాజులలో ఉత్తమోత్తముడు. తల్లిదండ్రులపై భక్తిగౌరవాలు కలిగి పూజించేవాడు. ఏ వ్యసనములో తగులుకొనక వంశగౌరవాన్ని పాటించి ధర్మ మతియై బ్రాహ్మణ ఆశీర్వాదాలు పొందుతూ శిష్టపరిపాలనాసక్తుడై ఉండెను. ఆయన శివపూజా దురంధరుడు, కృపారసబంధురుడు; దయగలిగి బ్రాహ్మణు లకు దానాలు చేసే దయార్ద్ర హృదయుడు, రాజవిద్యలో పారంగతుడు; ఏను గులను, గుర్రాలను స్వారీ చేయడంలో కౌశలంగలవాడు. ధనుర్విద్యలో అస మానుడు. అనేక యుద్ధాలు చేసి సామంతరాజులనుండి కప్పాలను తీసుకొనుచు, కవులను, బ్రాహ్మణులను ఆదరిస్తూ సత్యాశ్రయుడై సర్వలోకాశ్రయుడై వన్నె కెక్కినాడు. నన్నయకు రాజరాజుపై గల ఆదరాభిమానాలకు యీ వర్ణన మంచి ఉదాహరణ. రాజరాజును ఇంకా అనేక సందర్భాలలో నన్నయ పై వర్ణన కను గుణంగా ప్రశంసించినాడు. వర్ణాశ్రమ ధర్మ రక్షణముతో పాటు శరణన్న వారికి ఆశ్రయము; అగ్రజులకు అగ్రహార ప్రదానము మొదలైన ఉదార గుణాలు కలిగిన అకలంక చరిత్రుడని రాజరాజును నన్నయ వర్ణించినాడు. రాజరాజును నన్నయ వర్ణించిన పద్యాలలో మచ్చునకొక్కటి:

ఉ॥ "రాజకులైక భూషణుఁడు రాజమనోహరుఁ డన్యరాజతే ।
జోజయశాలి శౌర్యుఁడువిశుద్ధయశశ్శరదిందు చంద్రికా ।

రాజిత సర్వలోకుడు పరాజిత భూరి భుజాకృపాణుడు
రాజుల కాంత శాత్రవ పరాగుడు రాజమహేంద్రుడున్నతిన్ "

ఇటువంటిరాజు పైన వర్ణించిన మహాసభలో నన్నయను ఉద్దేశించి భారత రచన తెలుగులో చేయుమని అర్థించినాడు. ఇంత మంది సభలో ఉండగా ఈ కార్యానికి నన్నయనే ఎన్నుకొన్నాడు.

## భారతం - విశిష్టత

"నేను అనేక పురాణాలు విన్నాను, అర్థధర్మశాస్త్రాల క్రమాన్ని తెలుసుకొన్నాను. ఉదాత్త రసాన్వితమైన కావ్యాలను, నాటకాలను ఎన్నో చూచినాను. జగత్పరిపూజ్యములైన ఈశ్వరాగమాలను భక్తితో హృదయంలో నిలుపుకొన్నాను. అయినప్పటికి నాకు మహాభారతంలోని అభిప్రాయాన్ని వినవలెనని కోరిక హెచ్చుగా ఉన్నది." స్వయంగా తన గుణగణాలను కూడా రాజరాజు సభలో చెప్పుకొన్నాడు, అంతేకాదు, చంద్రునితో ప్రారంభమై పూరు, భరతేశ, కురుప్రభు, పాండు భూపతులు తనకు వంశకర్తలని ఈ సందర్భంలో రాజరాజు మరొక మాట కూడా చెప్పినాడు. ఈ పాండవుల చరిత్ర వినడానికి తనకు గాఢమైన కోరిక ఉన్నదని. ఉద్ఘాటించినాడు. ఈ విధంగా రాజరాజుకు, నన్నయకు ఉభయులకు భారత మహాత్మ్యం మీద ప్రగాఢమైన అభిమానం. భారతం అప్పటి వరకు బహుభాషలలో, బహువిధముల, బహుజనుల వలన రాజరాజు విన్నాడు. దానిని తెలుగులో కూడా వినవలెనని తనకు గాఢమైన కోరిక ఉన్నట్లు ఆయన నన్నయను సభలో విద్వాంసుల సమక్షమున కోరినాడు.

## నన్నయ యోగ్యతలు

ఇక నన్నయ యోగ్యతలను కూడా మనం తెలుసుకోవడం అవసరం. నన్నయ అపస్తంభ సూత్రుడు, ముద్గలగోత్రుడు. రాజరాజుకు కులబ్రాహ్మణుడు, అభిమానపాత్రుడు, నిరంతరం జపహోమపరాయణుడు, విపుల శబ్దశాసనుడు, వేదసంహితలను అభ్యసించినవాడు, బ్రహ్మాండపురాణం మొదలైన అనేక పురాణాలను పఠించి అందులోని విజ్ఞానాన్ని తెలుసుకొన్నవాడు, పాత్రుడు;

సజ్జనులు ప్రశంసించవలసిన నిష్కళంకమైన చరిత్ర కలిగినవాడు; లోకజ్ఞుడు, సంస్కృతాంధ్రభాషల రెండింటిలో కావ్యరచన చేయగలిగినవాడు; నిత్య సత్య వచనుడు, సుజనుడు, బుద్ధిలో బృహస్పతి, ఆస్థానంలో సర్వజనులకు గౌరవార్హమైన రాజోద్యోగంలో ఉన్నవాడు. అంతేకాదు, శాసనాలను వ్రాయించే లేఖనాధికారం కలిగినవాడు. నారాయణభట్టు మొదలైన కవులకు యిచ్చిన అగ్రహారాల దానశాసనాలను నన్నయయే వ్రాసినాడు. అందుచేత భారత రచనకు నన్నయయే సర్వవిధాల అర్హుడని రాజరాజు అభిప్రాయపడినాడు. కర్ణాటకంలోను భారత రచన జరిగినందువలన తన మాతృభాష, తన ప్రజల మాతృభాషయైన తెలుగులోకూడా ఈ గ్రంథరచన జరుగవలెనని, అది తన ఆశయాలకు అనుగుణముగా ఉండవలెనని ఆయన హృదయాభిలాష. భారతం హృద్యం. అపూర్వం. సమస్త విజ్ఞానానికి ఆటపట్టు: విశ్వజనీతనకు తావలము. రాజరాజు వైదిక మతాభిమాని. ఈ వైదిక మత ప్రచారానికి కూడా భారతం సర్వవిధాల అర్హమైనది. ఇటువంటి ఉత్తేజకరమైన సన్నివేశంలో రాజరాజు భారతమును రచించమని కోరగా అందుకు ఆయన వినయభూషణుడై అంగీకరించినాడు. అయితే భారత సముద్రం ఈదడానికి బ్రహ్మకైనా శక్యముకానప్పుడు తన కెంతవరకు శక్యము అని నన్నయ ప్రశ్నించుకున్నాడు. అందుకు తోడుగా తెలుగు బాషకు సరియైన సౌష్ఠవముకూడా అప్పటివరకు కలుగలేదని ఆయనకు తోచి ఉండవచ్చును. అందుచే ఈ పని చేయవలసిన బాధ్యత ఉన్నదనినన్నయ భావించినాడు. వ్యవహారంలో ఉన్న తెలుగు భాషకు కావ్యరచనకు కావలసిన రూపాన్ని ఈయడానికి నన్నయ పూనుకున్నాడు. ప్రారంభదశలో ఈ విధమైన సమస్యలు ఆయనను కొంచెం వెనుకముందాడ జేసినప్పటికిని రాజరాజు కోరికను ఆయన అంగీకరించినాడు.

## నారాయణభట్టు తోడ్పాటు

నన్నయ సహాధ్యాయుడు నారాయణభట్టు, ఆయన కూడా రాజరాజు ఆస్థానాన్ని అలంకరించిన విద్వాంసుడే; ప్రత్యేకంగా నారాయణభట్టును నన్నయార్యుడు తన అవతారికలో ప్రశంసించినాడు. ఈ ప్రశంస చాలావిశిష్టమైనది. ఆనాడు భారత యుద్ధంలో అర్జునునికి సారథ్యమొనరించి సహాయపడిన నారా

యణునివలె తనకు యీ నారాయణుడు తోడ్పడినాడని నన్నయ వ్రాసినాడు. నారాయణభట్టు తనకు సహాధ్యాయుడే కాదు. వాఙ్మయ ధురంధరుడు, ధరామర వంశ విభూషణుడు, సంస్కృత, కర్ణాటక, ప్రాకృత, పైశాచి, ఆంధ్రభాషలందు కవిరాజ శేఖరుడని కీర్తిగాంచినవాడు. మనీషాలవదుర్విదగ్ధులైన కవులకు మనోహరములైన కవిభవజ్రాంకుశుడని బిరుదు పొందినవాడు. నందమపూడి దానశాసనంలో నారాయణభట్టునుగూర్చి నన్నయ అనేక వివరాలు తెల్పినాడు. నారాయణభట్టు సకలజగదభినుతగుణశాలి, సరస్వతీకరుణావతంసుడు, కేవలం పండితుడు మాత్రమేకాదు, రాజనీతి దురంధరుడు. అందుచేతనే రాజనరేంద్రు డాతనికి 'నందమపూడి'ని అగ్రహారముగా ఇచ్చి గౌరవించినాడు. రాజనరేంద్రుని పరిపాలన స్థిరపడడానికి నారాయణభట్టు రాజనీతిజ్ఞత తోడ్పడినట్లు కూడా తెలుస్తున్నది.

అప్పటివరకు తెలుగులో కావ్యాలు లేవు. భారతం వంటి మహాకావ్యాన్ని తొలిసారిగా రచించినప్పుడు ఆ కావ్యం రాజుకు, పండితులకు సంతృప్తికరముగా వ్రాయవలసి వచ్చినప్పుడు మరొక విద్వాంసుని సహాయ సహకారాలు కొంత నిస్సందేహంగా అవసరమే. అటువంటి సహాయాన్ని, సూచనలను సకాలంలో ఆత్మీయుడైన నారాయణభట్టు నన్నయకు చేసినాడని చెప్పవచ్చును. భాష, శైలి, మూలగ్రంథములోని అర్థం మొదలయినవి నిర్ణయించినప్పుడు, ఇతరులు వీనిపై అభిప్రాయభేదాలు వెల్లడి చేసినప్పుడు నారాయణభట్టు నన్నయకు తోడుగా ఉండి రచనా విధానానికి కావలసిన సూచనలు చేసినట్లు మనం ఊహించవచ్చును. ఈ విధంగా ఒక ఉత్తేజకరమైన సన్నివేశంలో భారత రచనకు అంకురార్పణ జరిగింది. భారతం సకల భారతీయ సంస్కృతికి దర్పణమైన విజ్ఞానకోశం. అందుచేతనే ఇది ఒక మహత్తరమైన కర్తవ్యంగా పండితులు భావించినారు

తనకు ఇంతగా ఇష్టుడు, అభిమాన పాత్రుడైన రాజరాజుకు తన భారతాన్ని నన్నయ అంకితము చేయలేదు. ఆశ్వాస ప్రారంభంలోను, ఆశ్వాస అంతంలోను రాజరాజును ప్రశంసించుతూ నన్నయ పద్యాలు వ్రాసినాడు. ఈ పద్యాలలో రాజరాజు గుణగణాలను అత్యంతంగా వర్ణించినాడు అయితే యీ పద్యాలు కేవలం సంబోధనలుగానే ఉన్నవి. తాను చెప్పడం, రాజరాజు వినడం ఆనేరీతిలో నన్నయ భారత రచన సాగినది.

## అనువాద విధానం

భారతాన్ని అనువాదం చేసే విధానంలో నన్నయ అవలంబించిన పద్ధతు లను కూడా గమనించవలసి ఉంటుంది.

రాజరాజు, నన్నయ, నారాయణభట్టు ఈ ముగ్గురి ఆశయాలకు, అభీష్టా లకు అనుగుణంగా తెలుగులో మహాభారత రచన ప్రారంభమైనది. ఈ ఆశయా లలో ఒక ఏకత్వం స్పష్టంగా కనిపిస్తున్నది బౌద్ధము, జైనము, వేదమతము పైన తిరుగుబాటు ఉద్యమాలు; ఆ ఉద్యమాలు క్రమక్రమంగా క్షీణించిన తర్వాత భక్తి ఉద్యమాలైన శైవ వైష్ణవాలు పరస్పరం సంఘర్షణ పడినవి కూడ. ఇటువంటి పరిస్థితులలో మహాభారతబద్ధ నిరూపితార్థం ఏర్పడగా తెనుగున రచియింపుమని రాజనరేంద్రుడు కోరిన కోరిక ఆనాడు విద్వత్ జను లలో, పరిపాలకులలోను వైదిక మతముపట్ల ఏర్పడిన ఆదరాభిమానాలకు నిదర్శనం. కాని ఈ వైదిక మతాభిమానం వలన నన్నయ రచనలో సాహిత్య శిల్పం ఏమీ కొరవడలేదని నిస్సందేహంగా చెప్పవచ్చును. సాహిత్య దృక్ప థంతో పరిశీలించినప్పుడు మహాభారతం ఉత్తమ శ్రేణికి చెందిన కావ్యమని స్పష్టం కాగలదు. అందుచేతనే ఈ రచనలోని ప్రసన్న కథా కలితార్థయుక్తిని ఆరసి కవీంద్రులు మేలుమేలని అన్నారట; ఇతరులు అక్షర రమ్యతను ఆద రించినారట. తన్నుతాను నానారుచిరార్థ సూక్తినిధినని నన్నయ చెప్పుకొన్నాడు. భారత రచనను జగత్ హితము అనె ఆశయంతో చేపట్టినానని కూడ ఆయన చెప్పుకొన్నాడు. నన్నయ భారతాన్ని స్వేచ్ఛగా అనువదించినాడు. ఇది స్వతంత్ర కావ్యమని పాఠకులు అనుకోగలిగినంత నిపుణంగా ఈ అనువాద కార్యాన్ని నన్నయ నెరవేర్చినాడు. నన్నయ కాలంలో భారత రామాయణాదులు సకల భారతంలోని పండితులలోను, ప్రజలలోను వ్యాప్తియందుండెను. భారతము యొక్క భిన్న ప్రతులు ఉత్తరంలోను దక్షిణంలోను ప్రచారంలో ఉండెను. ఈ ప్రతులలో కొన్ని విభేదాలు కూడా ఉండినట్లు పరిశోధకుల అభిప్రాయం. ఉత్తర, దక్షిణదేశ ప్రతుల శ్లోక సంఖ్యలో కూడా కొంత వ్యత్యాసం ఉన్నట్లు పండితులు అభిప్రాయపడుతున్నారు. నన్నయ ఏ ప్రతిని అనుసరించెనో స్పష్టంగా యీనాడు చెప్పడం సాధ్యంకాని పని. ప్రస్తుతం ప్రచారంలో ఉన్న ప్రతుల కన్న నన్నయ అనుసరించిన ప్రతి భిన్నమైనదని డాక్టర్ దివాకర్ల

వేంకటావధానిగారివంటి పండితులు అభిప్రాయపడుతున్నారు. నన్నయ అనేక ప్రతులు చూచి సందర్భానికి అనుగుణంగా తనకు సముచితంగా తోచిన భాగములను వానినుండి గ్రహించి యుండవచ్చునని డాక్టర్ దివాకర్ల వేంకటావధానిగారి అభిప్రాయం. పూనాలో "భండార్కర్" పరిశోధన సంస్థ భారతాన్ని ఒక ప్రమాణ ప్రతిగా ముద్రించినది. (Critical edition of Maha Bharata). దేశంలోని భిన్న ప్రాంతాలలో లభించిన తాళపత్ర గ్రంథాలను పరిశీలించి ఈ ప్రామాణిక ప్రతిని భండార్కర్ పరిశోధనా సంస్థ సిద్ధము చేయించినది. ఈ సందర్భంలో భండార్కర్ సంస్థ తెలుగు భారతాన్ని కూడ పరిశీలించినట్లు తెలుస్తున్నది. తెలుగు భారతం కడమ దక్షిణ దేశ భారతాలకన్న భండార్కర్ సంస్థకు ఎక్కువగా ఉపయోగపడినట్లు ఒక అభిప్రాయం. ఇది ఏమైనప్పటికిని దక్షిణదేశ భారతాలన్నింటి కంటె తెలుగు భారతం మూలానికి సన్నిహితంగా ఉన్నదని పండితుల అభిప్రాయం.

## వ్యాసుడు - నన్నయ

వ్యాసునికి, నన్నయకు మధ్య సుమారు రెండువేల సంవత్సరాల కాలం గడిచినది ఈ రెండువేల సంవత్సరాలలో సాంఘికంగా, రాజకీయంగా, మత పరంగా దేశంలో ఎన్నో మార్పులు వచ్చినవి. ఈ మార్పులను తెలుగులో భారతం వ్రాసిన కవిత్రయం గమనించినదని చెప్పవచ్చును. ఇందువలననే కాబోలు మూలంలోని కథకు కొన్ని సందర్భాలతో తగ్గింపులను మరికొన్ని సందర్భాలలో పొడిగింపులను కవిత్రయం చేసినది. చాలాచోట్ల మూలంలోని భాగాలను నన్నయ సంగ్రహించినాడు. అయితే ముఖ్యభావాలకు ఎక్కడా లోపం రానీయలేదని అని పండితుల అభిప్రాయం. మూలంలో కొన్ని కథలు రెండుసార్లు చెప్పబడినవి. కాని నన్నయ ఆ కథను ఒకేసారి సరియైన సందర్భంలో చెప్పినాడు. కొన్ని సందర్భాలలో నన్నయ మూలంలోని భావాలను పూర్తిగా విడిచివేసినాడు. మూలంలోని భావాలను వివరించినప్పుడు కొన్ని సందర్భాలలో స్వతంత్రంగా పద్యాలు వ్రాసిన నిదర్శనాలు ఉన్నవి.

## నన్నయ - సంస్కృత కర్ణాటక కవులు

భారతాన్ని అనువదించే సందర్భంలో నన్నయ ఇతర సంస్కృత మహా కవుల రచనల నుండి సందర్భోచితమైన భావాలను గ్రహించినట్లు పరిశోధకులు అభిప్రాయపడుతున్నారు. నన్నయ, నారాయణభట్టు ఉభయులు తెలుగు, సంస్కృతము, ప్రాకృత భాషలలోనేకాక కర్ణాటకంలో కూడా విద్వాంసులు. అప్పటివరకే కర్ణాటక భారతం వచ్చినందున పంపని శైలికి, నన్నయభట్టు శైలికి తగినన్ని పోలికలు ఉన్నందువలన రచనలో కర్ణాటక భారతాన్ని కూడా నన్నయ దృష్టిలో ఉంచుకొన్నాడని నిస్సందేహంగా చెప్పవచ్చును. నన్నయ భారతం కావ్యదృష్టితో పరిశీలించినప్పుడు అది ఒక స్వతంత్ర రచనగా శోభిల్లు తున్నదని అందరు అంగీకరించిన అభిప్రాయం.

## నన్నయ కథాకథనం

కథను చెప్పడంలో నన్నయకు ప్రత్యేక నైపుణ్యం ఉన్నది. మూలంలోని కథను తీసుకొని దానిని సందర్భోచితంగా తగుమార్పులతో నన్నయ వివరించు చుండును. మూలంలోని భారతం ఇతిహాసం; తెలుగులోని భారతం కావ్యము అని చెప్పవచ్చును. దీనికి కావ్యరూపం ఈయడానికి కావలసిన విధంగా నన్నయ రసపోషణం, పాత్రపోషణం గావించినాడు.

## నన్నయ శైలి

నన్నయకు ముందు తెలుగులో కావ్యాలు ఏవీ లేనందువలన కావ్యాలలో ఉపయోగించవలసిన శైలిని నన్నయయే రూపొందించుకున్నాడు. సంస్కృత భాషాప్రధానమైన శైలి నన్నయ రచనకు వన్నె పెట్టినది. కవిత్వమునకు కావలసిన సంక్షిప్తత దీనివలన చేకూరినది. ఆయన రచనలో సంస్కృత దీర్ఘ సమాసాలు ఎక్కువగా కనిపించినను అందులో క్లిష్టత కనిపించదు. అన్వయ కాఠిన్యముగాని, అర్థకాఠిన్యముగాని ఆయన రచనలో గోచరించవు. ఆపాత మధురము, ఆలోచనామృతము అయినది నన్నయ రచన. కవీంద్రుల కొరకు "ప్రసన్న కథాకలితార్థయుక్తి"తో రచన చేసినాడు; సాధారణ పాఠకుల కొరకు

"అక్షర రమ్యత"ను అనుసరించినాడు; సామాన్యుల కొరకు "రుచిరార్థసూక్తు" లను చేర్చినాడు నన్నయ. నన్నయ కవిత్వానికి గాంభీర్యము ప్రాణమని విమర్శ కుల అభిప్రాయము. శబ్ద గాంభీర్యము, అర్థగాంభీర్యము - రెండును నన్నయ కవితలో గోచరించును. సంయమనం నన్నయ రచనలో ప్రధానంగా గోచరించును. కథను చక్కగా, ప్రసన్నముగా చెప్పడం పైననే నన్నయకు దృష్టి ఎక్కువ. కథాగమనానికి భంగం కలిగించే రసావేశము, వర్ణనాబాహుళ్యము నన్నయలో ఉండవు. అందువలన రచనారీతి, కథా కథన పద్ధతి సరళముగా ఉండి అర్థము కావడంలో క్లిష్టత ఉండదు. ఆయన సంభాషణలు సరళముగా, సహజముగా నుండును. ఆయన పాత్రలు రసావేశముతో మాట్లాడవు. ఆయన పాత్రలు సహజంగా నిరాడంబరంగా ఉండును.

నన్నయ సంస్కృత పదభూయిష్ఠమైన పద్ధతిలోనే ఎక్కువగా రచన చేసి నప్పటికిని ఆయన భాషలో తెలుగు నుడికారము కూడా కనిపించును. ఆయన సంస్కృత సమాసభూయిష్ఠ రచనను చేయడంలో ఎంత చెయ్యి తిరిగినవాడో, ప్రసన్న పద్ధతిలో అలతి అలతి తెలుగు మాటలలో రచన చేయడంలో కూడా అంతటి సామర్థ్యము కలవాడు.

## దీర్ఘ సంస్కృత సమాలోచనకు ఒక ఉదాహరణ :

మ॥ వివిధోత్తుంగ తరంగఘట్టన చలద్వేలావనైలావలీ
లవలీలుంగలవంగ సంగతలతాలాస్యంబు లీక్షించుచున్
ధవళాక్షుల్ సనికాంచిరంత నెదురందత్తీర దేశంబునం
దవదాతాంబుజ ఫేనపుంజ నిభునయ్యోశ్వోత్తమున్ దవ్వులన్॥

## సరళము, ప్రసన్నము అయిన నన్నయ శైలికి ఒక ఉదాహరణ :

ఉ॥ నిండుమనంబు నవ్యనవనీత సమానము, పల్కుదారుణా
ఖండల శస్త్రతుల్యము జగన్నుత విప్రులయందు నిక్కమీ
రెండును రాజులందు విపరీతము గావున విప్రుఁడోపునో
పండటి శాంతుఁడయ్యు నరపాలుడు శాపము గ్రమ్మరింపగన్.

తెలుగు సాహిత్యంలో ప్రధానంగా రెండు మార్గాలు, రీతులు కనిపించునని విమర్శకుల అభిప్రాయము. సంస్కృత పదజాలముతో నిండి, అక్షరరమ్యమై, కథా-ధన ప్రధానమైన మార్గమొకటి; దేశీయ పదములతో నిండి, భావావేశముతో కూడిన రసప్రధానమైన మార్గము మరియొకటి. మొదటిది నన్నయ రీతికాగా రెండవది తిక్కన మార్గము. తరువాత ఆంధ్రకవులు చాలామంది నన్నయ మార్గమునే అనుసరించినారు నన్నయ రచనలోని ధారాశుద్ధి, పద్య రచనా శిల్పము చాలామంది కవులను ఆకర్షించింది. అందుకే నన్నయ వాల్మీకిని గురించి వ్రాసిన "గురు పద్యవిద్యకు ఆద్యుడు" అనుమాట తెలుగు కవులలో నన్నయకు సరిపోవునన్న విశ్వనాథ సత్యనారాయణగారి అభిప్రాయము - సరియైనదేనని చెప్పవచ్చును. కాలము రీత్యానే కాదు, గుణమురీత్యా కూడా నన్నయ ఆదికవి; తిక్కనపైకూడా నన్నయ ప్రభావము కలదు; ఎర్రనపై చెప్పవలసిన పనిలేదు. దేశిమార్గము ననుసరించిన శైవకవులైన పాల్కురికి సోమనాథాదులపైననే నన్నయ ప్రభావము గోచరించును. శ్రీనాథుడు నన్నయ మార్గమునే అవలంబించి, ప్రబంధకవులకు శైలీభిక్ష పెట్టినాడు. లిఖిత సాహిత్యము లేని జాతి నాగరికత లేని జాతిగా భావించబడుతుంది. ఈ లోపముకు పూరించి, జాతి ఔన్నత్యమును నిలిపి, ఆంధ్రులకు ప్రాచీన సాహిత్యము కలదన్న గౌరవమును నిలిపినాడు నన్నయ ఆంధ్ర కవిత్వమును సంస్కృత ధోరణిలో రూపొందించి పండితాదరణను కూర్చినాడు. సమగ్రమైన ఆంధ్రమయీవాక్కులకు ఆచార్యుడైనాడు. ఆయన భాష, ప్రయోగములు, రచనారీతులు ప్రామాణికములై, అనంతర కవులకు మార్గదర్శి అయినాడు.

## తిక్కన - భారత రచన పూర్తి

ఆది, సభాపర్వాలను - అరణ్యపర్వంలోని కొంతభాగాన్ని రచించిన తర్వాత నన్నయ భారత రచన ఆగిపోయినది. తిరిగి భారత రచన ప్రారంభం కావడానికి కొంతకాలము పట్టినది. నూటయాభై సంవత్సరాలవరకు పూర్తిగావించే ప్రయత్నాలు జరుగలేదు. అప్పటి దేశకాల పరిస్థితులు ఇందుకు కారణమై ఉండవచ్చును. పదమూడవ శతాబ్దం అనగా క్రీ. శ. 1210-1290 మధ్యన జీవించి

నెల్లూరును పరిపాలించిన మనుమసిద్ధి రాజుకు మంత్రిగా, ఆస్థానకవిగా ఉండిన తిక్కన భారతాంధ్రీకరణ చేపట్టినాడు. కాని ఆయన అరణ్యపర్వంలో మిగిలిన భాగాన్ని పూర్తిచేయక విరాటపర్వం నుండి ప్రారంభించి పదిహేను పర్వాలు ప్రతిభావంతంగా ఆంధ్రీకరించినాడు. తిక్కనది సంభాషణాత్మక శైలి, నాటకీయ రచన. ఆయన యుద్ధవర్ణనలు అప్రతిమానమైనవి. తెలుగుపదాలను తిక్కన ఎక్కువగా వాడినాడు. తెలుగులో ఆధ్యాత్మిక రాజకీయాది అనేక విషయాలు కూడా గంభీరంగా హృదయంగమంగా వ్యక్తం చేసినాడు. రసానికి అనుకూలమైన వృత్తాలను ఆయన ఉపయోగించినాడు అన్నిరసాలను మనోరంజకంగా పోషించినాడు. పాత్రపోషణలో సాటిలేని నేర్పు చూపినాడు జన వ్యవహారంలో ఉన్న తెలుగు పదజాలానికి కావ్యగౌరవం ఆపాదించినాడు. తిక్కన రచన తెలుగుదనానికి ప్రతిబింబమై, సరసమై, సుందరమై, గంభీరమై అలరారుచుండునని విద్వాంసుల అభిప్రాయం.

ఆంధ్రావళికి మోదము కలుగవలెననే మహోన్నతమైన లక్ష్యంతో తిక్కన భారత రచన గావించినాడు. ఒక మహాకవిత్వ దీక్షానిధిని పొంది పద్యములను గద్యములను రచించెదనని ఆయన చెప్పుకొన్నాడు. తిక్కన తన కావ్యాన్ని హరిహరనాథునికి అంకితము గావించినాడు. పన్నెండవ శతాబ్దమున తెలుగు దేశంలో శైవ, వైష్ణవ మతాలు వ్యాపించి పరస్పరం సంఘర్షణ కూడా పడినవి. అందుచేత ఈ సంఘర్షణ సరికాదని భావించి శివకేశవుల అభేదాన్ని ఉద్ఘాటించి ధర్మాద్వైతాన్ని స్థాపించే ఉద్దేశంతో తిక్కన భారత రచన గావించినాడు.

## నన్నయ - ఎఱ్ఱనలు

పూర్తిగాక మిగిలిన అరణ్యపర్వాన్ని పద్నాల్గవ శతాబ్దంలో నివసించిన ఎఱ్ఱన పూర్తిగావించినాడు. ఎఱ్ఱన అరణ్యపర్వశేషంతో పాటు నృసింహ పురాణాన్ని, హరివంశాన్ని కూడా వ్రాసినాడు. ఆయన రామాయణం కూడా వ్రాసినాడు. కాని అది యీనాడు దొరుకలేదు ఎఱ్ఱన అరణ్యపర్వశేషాన్ని నన్నయ పేరుతోనే ఆంధ్రీకరించి రాజరాజునే సంబోధించినాడు. నన్నయపైన ఎఱ్ఱనకున్న భక్తి గౌరవాలకు ఇది తార్కాణం అరణ్యపర్వశేషాన్ని నన్నయశైలిలో

మొదలు పెట్టి తిక్కన శైలితో ఎర్రన ముగించినాడనీ; ఆయన కవిత్వం నన్నయ, తిక్కన లను రెండు మహాసముద్రాలను కలిపే జలసంధివలె ఉన్న దని పండితుల అభిప్రాయం. ఈ విధముగా మహాభారత రచన పదకొండవ శతాబ్దంలో ప్రారంభమై పధ్నాల్గవ శతాబ్దంలో ముగిసినది.

తెలుగులో మహాభారతం ఉత్తమోత్తమమైన గ్రంథం. గ్రంథానికి యిటువంటి గౌరవం కలగడానికి కారణం కవిత్రయం యొక్క ప్రతిభాసంపదయే. తర్వాత ఎవ్వరు ఎన్ని కావ్యాలు వ్రాసినప్పటికిని అందరికి భారతమే మార్గదర్శకం. పండితులు, పామరులు అందరు సమానంగా ఆదరించే మహారచన తెలుగుభారతం. ఇతర భాషలలో భారతానికి లేని మహోన్నత స్థానం తెలుగు భాషలో ఉన్నది.

(అంతర్జాతీయ తెలుగుసంస్థ పక్షాన పూనాలో చేసిన ఉపన్యాసం,
డిసెంబరు-1982)

# నేను గుర్తించిన తిక్కన

నెల్లూరులో మీరు నిర్వహిస్తున్న తిరునాళ్ళలో పాల్గొనమని ఆహ్వానించి నప్పుడు కొంచెం వెనుక ముందాడక తప్పినదికాదు. కాని మిత్రులు శ్రీ మరుపూరి కోదండ రామిరెడ్డిగారి ఒత్తిడి, శ్రీ రామచంద్రరావు ప్రభృతుల పట్టుదల నన్ను నిరుత్తరుని చేసినవి. నా శక్తి సామర్థ్యాలను, పరిమితులను గుర్తించియే, మిత్రుల మాట కాదనలేక మీ ముందు నిలిచినాను. తిరునాళ్ళ అనగా మా తెలంగాణాలోని ముఖ్యంగా వరంగల్ ప్రాంతంలోని వాడుక భాషలో తీర్థం లేక జాతర అని అర్థము. కాని నెల్లూరు ప్రాంతంములో తిరునాళ్ళ అనగా దేవోత్సవము లేక శుభదినము - అను అర్థము ఉన్నట్లు వినికిడి. జాతరలోను, ఉత్సవములోను పాల్గొనడం ఆహ్లాదకరమైన అనుభవం. కాని సాహిత్యోపన్యాసం గావించడం, అందులోను తిక్కన వంటి బహుముఖ ప్రజ్ఞాశాలిని, కవి బ్రహ్మను గురించి మాట్లాడడం అంత సులభమైన పనికాదు. ఏమైనప్పటికిని నెల్లూరు మిత్రులమాట కాదనలేక సాహసించినాను. ఎప్పుడో నలభై సంవత్సరాలక్రిందట, నేను కవిత్వం వ్రాసే రోజుల్లో, మా వూరైన 'వరంగల్'కు తిక్కన్న వచ్చిన సందర్భాన్ని సంస్మరిస్తూ—

"తిక్కనామాత్యుండు తెలుగు దేశపు రాజు
కలసి మాటాడిన కొలువిదేమో"
"అల్లని స్వేచ్ఛకై నెల్లూరి నెరజాణ
పఠియించె నిచటనే భారతంబు"

అని వ్రాసుకొన్న మాటలు యీ సందర్భాన జ్ఞప్తికి వస్తున్నవి. మా వూరు ఓరుగల్లు కోటకు కొన్నిమైళ్ళ దూరంలోనే ఉన్నదన్న సత్యము యీ సభ వారికి తెలుపవలెను. నన్ను యీ సమావేశంలో పాల్గొనమని మీరు కోరడానికి యీ సత్యము కూడ ఒక కారణము గావచ్చును.

తెలుగు కవులలో తిక్కన వంటి మనిషి మరొకరు లేరు; ఇంతెందుకు భారతీయ సాహిత్య చరిత్రలోనే యీయన ప్రక్కన నిలువగలిగిన సాహిత్య

మూర్తులు లేరేమో! ఉన్నప్పటికిని వ్రేళ్ళమీద లెక్కించదగిన వారే! తిక్కనను గూర్చి మనం మాట్లాడుకున్నప్పుడు ఆనాటి రాజకీయ, సాంఘిక, మత పరిస్థితు లనేగాక అంతకు పూర్వం ఒకటి రెండు శతాబ్దాలలోని భారతదేశ పరిస్థితులను కూడ గమనించవలసి ఉంటుంది: అప్పుడే ఆయన మహనీయ వ్యక్తిత్వాన్ని సరిగా అర్థం చేసుకోగలమని నా విధేయ విజ్ఞప్తి.

తిక్కన కాలం క్రీ.శ. 1205 నుండి 1288 అని చారిత్రకారులు నిర్ణ యించినారు. పది సంవత్సరాలు ఇటు అటు అయినను ఫరవాలేదు, మొత్తము మీద ఆయన పదమూడవ శతాబ్దము వాడు; అందుచేత 11, 12 శతాబ్దాల పరి స్థితులను అవగాహన చేసుకొన్నవాడు: సమకాలిక పరిస్థితులను చక్కగా పరిశీ లించినవాడు.

భారతదేశాన్ని యించుమించుగా ఏక ఖండంగా పరిపాలించడానికి ప్రయ త్నించిన మన దేశ చక్రవర్తులలో హర్షవర్ధనుడు చివరి వాడని చెప్పవచ్చును. అయితే ఆయన దక్షిణ దేశదండయాత్రను పులకేశుడు విజయవంతంగా తరిమి వేసినాడు. హర్షవర్ధనుడు ఏడవ శతాబ్దానికి చెందినవాడు. మూడువేల సంవత్స రాలకు పైగా సమస్త ప్రపంచంలో సర్వ విద్యలకు, సర్వ కళలకు ఆటపట్టై ఈజిప్టు, మెసపొటెనియా దేశాల నాగరికత కన్న ఉజ్జ్వలమైన నాగరికత కలిగిన దేశమని పాశ్చాత్య పరిశోధకుల మెప్పులను పొందిన భారతదేశం ఎనిమిదవ శతాబ్దం తరువాత ఉత్తరంలోనూ, దక్షిణంలోనూ చిన్న చిన్న రాజ్యాలుగా చీలిపోయినది. 11 వ శతాబ్దంలో భారతదేశం మీద ముస్లింల దండయాత్ర తమ రాజ్యస్థాపనోద్దేశంతో ప్రారంభమైనది. 12 శతాబ్దం చివరలో ముస్లింలు భారత దేశంలో చాల భాగం ఆక్రమించినందున నూతన పరిస్థితులు నెలకొన్నవి. ఉత్తర భారతంలో రాజపుత్రులు, స్వతంత్ర రాజ్యాలు స్థాపించి స్వాతంత్ర్య పోరాటాలు జరుపుతుండిరి. దక్షిణంలో చోళులు, చాళుక్యులతోపాటు కాకతీయులు తమ రాజ్యాలను స్థాపించుకొని పరిపాలిస్తుండిరి తెలుగు దేశాన్నంతా ఒకే పరిపాలన క్రింద మొట్ట మొదటిసారి తీసుకువచ్చినవారు కాకతీయులు. కాకతీయ గణపతి దేవుని కాలంలో సకలాంధ్రము ఏక ఖండముగా పరిపాలితమైనది. తెనుగు వానిలో తాను తెనుగు వాడనను జాతీయ భావము అంకురించి అభివృద్ధి చెందింది. తత్ఫలితంగా అఖిల భారతీయ నాయకత్వం అంతరించింది; ప్రాంతీయ నాయకత్వం బలపడినది. ఈ ప్రాంతీయ నాయకత్వానికి, పరిపాలనకు భాషయే

పరిపోషకమైన ప్రాతిపదికయైనది. వేంగి చాళుక్యులు సంగీతము, నృత్యములతో పాటు తెలుగు భాషను కూడ ఆదరించి పోషించిరి.

వేంగీ చాళుక్యులు తెలుగు రాజులు; వీరి కాలంలో తెలుగు దేశంలో వేద మతం బాగా బలపడింది. శైవ సంప్రదాయానికి ఆదరణ ఎక్కువైనది. జైన మతము కూడా కొంత వ్యాప్తిలో ఉండినది. విదేశాలతో వర్తక వ్యాపారాలు అభివృద్ధి పొందినవి. జనుల సంస్కృతికి దేవాలయాలు ముఖ్య కేంద్రాలయినవి. యజ్ఞాలు, యాగాలు ప్రాధాన్యం వహించినవి. ఒక వైపున శైవ మతం బాగా వ్యాపిస్తూ ఉండగా మరొక వైపున రామానుజుడు శ్రీవైష్ణవ మతాన్ని ప్రచారం చేసినాడు. ఆంధ్ర దేశంలో కూడ వైష్ణవము అడుగు పెట్టినది. ప్రాంతీయ భాష యైన తెలుగు భాషలో రచనలు కొనసాగినవి. పరిపాలనా వ్యవహారాలు కూడా తెలుగులో సాగుతుండినట్లు శాసనాల వలన తెలుస్తున్నది. వీరశైవ మతం కూడా తలయెత్తి వ్యాపించినది. మల్లికార్జున పండితారాధ్యుడు "శివతత్త్వ సారాన్ని" రచించినాడు. పాల్కురికి సోమనాథుడు 'బసవ పురాణా'న్ని వ్రాసినాడు. నన్నె చోడుడు 'కుమార సంభవా'న్ని వ్రాసినాడు. ఈ విధంగా శైవ వాఙ్మయం రచితమై వ్యాప్తిలోనికి వచ్చినది.

చాళుక్య రాజరాజనరేంద్రుని ప్రోత్సాహంతో నన్నయ పదకొండవ శతాబ్దంలో ప్రారంభించిన 'ఆంధ్ర మహాభారత' రచన ఆయన తరువాత ఆగిపోయినది. తదుపరి శైవ వాఙ్మయానికి సంబంధించిన రచనలు కొన్ని వచ్చినవి. నన్నయకు-తిక్కనకు మధ్యన సుమారు నూటయాభై నుండి రెండునూర్ల సంవత్సరాలు గడిచిపోయినవి. ఈ రెండునూర్ల సంవత్సరాలలో శైవ వైష్ణవాలు రెండూ దేశంలో వ్యాప్తిపొందినవి. శివకవుల రచనలు చదివినప్పుడు వారు వీర విహారమొనర్చినారనే చెప్పవలెను. కుల ప్రాతిపదికను శివకవులు వ్యతిరేకించి, సమాన సమాజ స్థాపన కావలెనని యెలుగెత్తి చాటిరి; వైదిక కర్మలను నిరసించిరి. జనులలో ప్రచారం కొరకు శివకవులు ద్విపద ఛందస్సులో జాను తెనుగున రచనలు గావించిరి. అయితే జానుతెనుగు జనుల నాలుకలపై నున్న పలుకుబడి కాకపోవడం వల్ల పేరు ఏమైనప్పటికిని ప్రజలను యెక్కువగా ఆకర్షించలేదు.

పదకొండు, పన్నెండు, పదమూడవ శతాబ్దాలలో రాజకీయంగా ప్రాంతీయ రాజ్యాలు అవతరించి బలపడగా, దేశ భాషలలో రచనలు కొనసాగి సారస్వతము వికసించగా మతరంగంలో కూడ ముఖ్యమైన మార్పులు వచ్చినవి ప్రాచీన వైదికమతముపైన తిరుగుబాటుగా తలయెత్తి దేశంలోనే కాక దేశం వెలుపల గూడ వ్యాపించిన జైన, బౌద్ధ మతాల ప్రభావము క్రమ క్రమంగా తగ్గిపోగా, శంకర, రామానుజ, మధ్వాచార్యుల వంటి మతాచార్యులు అవతరించి, అద్వైత, విశిష్టాద్వైత మతాలను ప్రజలలో ప్రచారం గావించిరి. ఈ మూడు మతాలు దక్షిణంలో ప్రారంభమై అఖిల భారత స్థాయిలో వ్యాప్తిపొందినవి. ఇంచుమించుగా సకల భారతాన్ని పరిపాలించడానికి ప్రయత్నించిన తుది చక్రవర్తి ఐన హర్షవర్ధనుని కాలంలో దక్షిణాన ఆయన అధికారాన్ని ధిక్కరించిన చాళుక్యపులకేశిని గూర్చి యింతకు ముందు ప్రస్తావించినాను. హర్షవర్ధన, పులకేశుల కాలంలోనే దక్షిణంలో శంకరాచార్యుడు జన్మించి అద్వైత మత ప్రచారం గావించినాడు. శంకరాచార్యులు 788 నుండి 820 వరకు జీవించియుండినట్లు చరిత్ర తెలుపుతున్నది. ఈయన దక్షిణ దేశీయుడు. శంకరుడు తాను ప్రతిపాదించిన అద్వైత మతాన్ని ఆసేతు హిమాచలము వ్యాప్తి గావించెను. అంతేకాదు - జైన, బౌద్ధ విద్వాంసులతో వాదించి తన మతాన్ని స్థాపించిన మహా మేధావి శంకరుడు. శంకరుని తరువాత పదకొండవ శతాబ్దంలో రామానుజుడు అవతరించి విశిష్టాద్వైతాన్ని ప్రతిపాదించి వ్యాప్తి చేసెను. శంకరాచార్యుని సిద్ధాంతాలను ఖండించిన రామానుజుడు వైష్ణవాన్ని సామాన్య జనులలో ప్రచారం గావించెను. విజ్ఞులకు మాత్రమే పరిమితమైన శంకర అద్వైతమునకు బదులుగా రామానుజుడు భక్తివాదాన్ని ప్రచారం చేసి జనప్రియము గావించెను. హరిజనులను కూడా తన మతములోనికి ఆకర్షించిన మొట్టమొదటి సంస్కర్త రామానుజుడని చెప్పవలెను. 12 వ శతాబ్దం తుది భాగంలో మధ్వాచార్యుడు జన్మించి, ద్వైత మతాన్ని స్థాపించెను. శంకర, రామానుజ, మధ్వాచార్యులు ముగ్గురు భగవద్గీతను, బ్రహ్మ సూత్రాలను ఆధారం చేసుకొని తమ సిద్ధాంతాలను రూపొందించినారు. ఈ ముగ్గురును దక్షిణ దేశంలో జన్మించి తమ మతాలను సకల భారతంలో వ్యాప్తి చేసినారు. అనగా రాజకీయంగా భారత జాతీయ భావం సన్నగిల్లిన తరువాత మత పరంగా దేశ సమైక్యతను యీ ముగ్గురు

నారని చెప్పవచ్చును. వీరికి తోడుగా సంస్కృత భాష ఆనాడు సమస్త భారత విద్వాంసులకు సుపరిచితమైన భాషగా, భారతీయులతో పరస్పర సాంస్కృతిక సంబంధాలు పెంపొందించే భాషగా వ్యవహారంలో ఉండెను. ఇదే కాలంలో బసవేశ్వరుడు మత రంగంలో ప్రవేశించి వర్ణాశ్రమధర్మాన్ని వ్యతిరేకించి కులము అనే విచక్షణ ఉండరాదని బోధించి మానవులలో సమానత్వాన్ని ప్రచారం చేసినాడు. ఈయన ప్రచారం చేసిన మతం వీరశైవం. ఈ విధంగా శైవ, వైష్ణవ సంప్రదాయాలతో పాటు వీరశైవం ప్రాధాన్యం వహించింది. తిక్కన కాలం నాటి రాజకీయ, మత, సాంఘిక పరిస్థితులకు క్లుప్తమైన సమీక్ష యిది.

ఈ సందర్భంలో మరొక సంఘటన జరిగినది. పన్నెండవ శతాబ్దం యొక్క తుది భాగంలో తెలుగుదేశ చరిత్రలో సుప్రసిద్ధమైన పల్నాటి యుద్ధము జరిగినది. ఈ యుద్ధము జ్ఞాతుల మధ్య జరిగినది. జ్ఞాతి వైరంతో పాటు మత సంఘర్షణ కూడా యిందుకు కారణమైనది. బ్రహ్మనాయుడు వైష్ణవ మతాభిమాని. ఈ అభిమానంతో ఆయన ఉద్దేశించిన సంఘ సంస్కారం ఆయన ప్రతిస్పర్థులకు ఇష్టము కాలేదు. అప్పుడు వైష్ణవమతాన్నే కాక అద్వైతాన్ని కూడా వ్యతిరేకించి వీరశైవం ముందుకు వచ్చినది ఈ వీరశైవం సమాజంలో ఉద్రేకం కలిగించినది. వర్ణాశ్రమ ధర్మంపై తిరుగుబాటు, వైదిక కర్మల ధిక్కారము, అద్వైత మత ఖండన వీరశైవులు తమ ముఖ్య ప్రచార సాధనాలు గావించుకున్నారు. వీరి భాషలో ఉద్రేకం గూడా ఎక్కువగా గోచరించినది. ఇంతకు ముందు నేను చెప్పినట్లుగా తమ మతాన్ని జనప్రియం గావించడానికి వీరు ద్విపద ఛందస్సును ఉపయోగించి శైలిలో జానుతెనుగు కావలెనని ఉద్ఘాటించినారు. ఈ సంఘర్షణ కొంత జాతిని నీరసింపజేసినది. బహుశా యిటువంటి తీవ్రమైన వాతావరణం ప్రజలలో కొంత అశాంతిని కూడా కలిగించి ఉండవచ్చును. ఈ పరిస్థితులను తిక్కన బాగా గమనించినాడని చెప్పవలెను.

వేంగీదేశమును క్రీ.శ. వెయ్యి అరువై ఒక్కటి వరకు పరిపాలించిన రాజనరేంద్రుని ఆస్థానంలోని మహాకవి నన్నయ, ఆయన ప్రేరణచేత భారత రచన ప్రారంభించెను. సుమారు రెండున్నర పర్వాలు వ్రాసి ఆయన గతించెను. తరువాత తెలుగులో కొన్ని రచనలు వచ్చినవి. అయినప్పటికీ భారత రచన

పూ ర్తిచేయడానికి ఎవ్వరూ ముందుకు రాలేదు. ఈ బాధ్యతను తీసికొని విజయ వంతంగా నిర్వహించిన కవిబ్రహ్మ తిక్కనామాత్యుడు.

తిక్కన నెల్లూరు ప్రాంతాన్ని పరిపాలించిన మనుమసిద్ధికి ముఖ్య మంత్రిగా ఉండెను. మంత్రియేకాదు, ఆయనకు అంతరంగికుడు; ఆప్తుడు కూడా. మనుమసిద్ధిరాజు తిక్కనను 'మామా' అని పిలిచెడివాడు అన్నమాట సుప్రసి ద్ధము. తిక్కన తన నిర్వచనోత్తర రామాయణమును మనుమసిద్ధికి అంకితం గావించెను. అప్పటివరకు కాకతీయరాజులు యించుమించుగా తెలుగుదేశాన్నంతా తమ ఏలుబడి క్రిందికి తీసికొని వచ్చిరి. కాకతీయ గణపతి దేవుని పరిపాలన తెలుగు వారిలో జాతీయాభిమానం బాగా ప్రబలునట్లు చేసినది. గణపతి దేవ మహారాజు ఆంధ్ర చక్రవర్తి. ఆయన రాజధాని ఏకశిలా నగరం - ఆంధ్ర నగరంగా ప్రసిద్ధి పొందింది. ఈ పరిస్థితులలో నెల్లూరుపైన తిక్కన-బయ్యనలు దండయాత్ర గావించి మనుమసిద్ధిని పదవీచ్యుతిని గావించిరి. తిరిగి మనుమసిద్ధి రాజ్యం ఆయనకు యిప్పించడానికి తిక్కన ఓరుగల్లుకు వచ్చి గణపతి దేవుని సహాయాన్ని అర్థించినాడు. ఓరుగల్లులో ఆయనకు గణపతిదేవుడు బ్రహ్మాండ మైన స్వాగతం యిచ్చినట్లు సిద్ధేశ్వరచరిత్ర తెలుపుతున్నది. తిక్కనసోమయాజి ఓరుగంటిలో బౌద్ధ పండితులతో చర్చలు గావించి వారిని ఓడించి గణపతిదేవుని ప్రశంసలు పొంది ఆయన సహాయంతో తిరిగి నెల్లూరుకు వచ్చి మనుమసిద్ధిని పట్టాభిషిక్తుని కావించినాడు. గణపతి దేవుని ఆస్థానంలో తిక్కన భారతాన్ని చదివినట్లు కూడా మనకు తెలుస్తున్నది. ఆ భారతం సంస్కృత భారతమో, తెలుగు భారతమో ఏదైనా కావచ్చును. కాకతీయరాజులు మొదట్లో జైనమతాన్ని అవలంబించినప్పటికిని క్రమక్రమంగా వారు తిక్కన కాలం వరకు శైవంవైపు అభిముఖులైనారు. అయితే వారు జైన, బౌద్ధులను ద్వేషించలేదు; సహనంతోనే పరిపాలించిరి. వైష్ణవ దేవాలయాలు కొన్ని వారి కాలంలో నిర్మితమయ్యెను. ఆనాడు కింది తరగతులలో కొంత వీరశైవం కూడా ప్రచారంలో ఉండెను. ఏమైనప్పటికిని మతసహనానికి అనుకూలమైన పరిస్థితులు తెలుగు దేశంలో ఏర్పడవలసిన అక్కర కలిగినది. ఇటువంటి పరిస్థితులలో తిక్కన భారత రచనకు ఉపక్రమించి పూర్తికావించి, "విష్ణురూపాయ నమశ్శివాయ" అని ప్రబోధించి, హరిహర అద్వైతాన్ని ప్రతిపాదించినాడు.

ఆ కాలంలో రాజ్యతంత్రము, రణతంత్రము సమానంగా నిర్వహించిన కుటుంబాలు తెలుగుదేశంలో ఉండెను. తిక్కన ఇటువంటి కుటుంబానికి చెందిన వాడే. అయన తాతగారు మంత్రి భాస్కరుడు, గుంటూరు విభుడు; విశేషించి 'సారకవితాభిరాముడు' - అనగా సాహిత్యము, సంస్కృతికికూడా ఆటపట్టయిన కుటుంబము తిక్కనది. ఆయన తండ్రి కొమ్మన దండనాథుడు. ఆయనకు సోదరుని వరుసవాడు ఖడ్గతిక్కన ఇటువంటి ఉదాత్త సంస్కృతికి అలవాల మైన వాతావరణంలో పుట్టి పెరిగిన ప్రజ్ఞాశాలి తిక్కన. ఒక సామంతరాజుకు ముఖ్యమంత్రిగా ఉండడంవలన భారతదేశ పరిస్థితులు, ఇరుగుపొరుగు ప్రాంతాల పరిస్థితులు, తెలుగుసీమ పరిస్థితులు; నాటి సమాజము, ఆ సమాజంలో ఉన్నటు వంటి గుణదోషాలు, ఆ సమాజం త్రొక్కవలసిన సరియైన మార్గము - ఇవన్నీ తిక్కనకు బాగా తెలిసిన సంగతులు. ఇందుకు సంబంధించిన సమస్యలన్నింటిని గూర్చి బాగా ఆలోచించి నిర్దుష్టమైన అభిప్రాయాలు తిక్కన కలిగియుండెనని చెప్పడంలో అతిశయోక్తి ఏమీలేదు పరిపక్వమైన అనుభవంతో, పరిపూర్ణమైన విద్యాబలంతో, సామాజిక అవగాహనతో తిక్కన కవితారంగంలో అడుగు పెట్టినాడు. ఈనాటికి మహాకవిగా అయన ఆయనయే సాటి. తిక్కన సోమయాజి వ్యక్తిత్వాన్ని తలచుకొన్నప్పుడు ఆయన వినయ భూషణుడని మనకు స్పష్టంగా గోచరిస్తున్నది. ఎందుకనగా, మహాభారతం ప్రతి పర్వం చివరలో వ్రాసుకున్న గద్యంలో ఆయన తననుగూర్చి ఒకేమాట చెప్పుకున్నాడు! ఆ మాటయే, "బుధా రాధన విరాజి తిక్కన సోమయాజి" - నిర్వచనోత్తర రామాయణంలో "శిల్ప మున పారగుడను, కళావిదుడను" అన్న తిక్కన చిత్తవృత్తిలో భారత రచన నాటికి వచ్చిన మార్పు గమనించదగినది.

ఆనాడు సమాజంలో తిక్కన సోమయాజి స్థానం చాలా గొప్పది. అయి నప్పటికిని ఇంతకన్న తనను గూర్చి భారతంలో ఆయన యేమి చెప్పుకోలేదు. మహాకవిత్వ దీక్షా విధి నొంది రచిస్తున్నానన్నాడు. అంతే. తనకు ముందు భారత రచన ప్రారంభించిన నన్నయను గూర్చి ఆయన ప్రశంసించిన విధానం కూడా తిక్కన మహనీయ స్వభావాన్ని వెల్లడి చేస్తున్నది. తిక్కన మాటలో నన్నయభట్టు మహితాత్ముడు. విద్యాదయితుడు, ఆంధ్ర కవితా విశారదుడు, మూడు పర్వాలు దక్షతతో తెనిగించిన మహానుభావుడు. ఈ మాటల వలన తిక్కనకు నన్నయ పట్లగల భక్తి గౌరవాలు స్పష్టమౌతున్నవి. ఇంక తాను

మహాభారతాన్ని తెనిగించడంలో గల ఉద్దేశాన్ని గూర్చి అవతారికలో తిక్కన చెప్పిన మాటలు ప్రత్యేకంగా గమనించదగినవి. భారతం పంచమ వేదంగా ప్రసిద్ధి పొందినది. అది జనులందరికి ఆరాధ్యమైన గ్రంథం. దానిని తెలుగు భాషలో వ్రాయవలెను; అందువలన భవపురుషార్థ ఫలము లభించును. ఆంధ్రావళికి మోదము కలుగునట్లుగా యీ కార్యము నెరవేర్చవలెను. ఇటువంటి ఉదాత్త ఆశయముతో తిక్కన భారత రచనను ప్రారంభించెను. ఇందులో రాజుల ప్రశంస లేదు. తనను గురించి గొప్పగా చెప్పుకొన్నదేదియూలేదు. తెనుగు దేశంలో నివసించే ప్రజల శ్రేయస్సే ఆయన ఉద్దేశం. తెలుగు భాషను అభివృద్ధి చేయడమే ఆయన సంకల్పం. ఇటువంటి ఆలోచనలు చేస్తూ ఒకనాడు నిద్రపోయిన తిక్కనకు ఒక స్వప్నం కలిగింది. ఆ స్వప్నంలో తండ్రి కొమ్మనామాత్యుడు కనిపించి భక్తవత్సలుడైన హరిహరనాథుని 'అదిగో' అని తిక్కనకు చూపించినాడు. ఆ ఉభయులు తిక్కనను ఆశీర్వదించి భారత రచనకు ప్రోత్సాహించినారు. ఇటువంటి ఉత్తేజపూరితమైన వాతావరణంలో తిక్కనామాత్యుడు భారతానువాదాన్ని ప్రారంభించి, ముగించినాడు.

తిక్కన తనను గూర్చి ఎంత వినయపూర్వకంగా చెప్పుకున్నప్పటికి ఆనాటి సమాజంలో ఆయన స్థానం సర్వోన్నతమైనది; సాటిలేనిది. సమకాలికులైన విద్వాంసులు ఆయనపట్ల అత్యంత గౌరవాభిమానాలు కలిగియుండిరి. వివిధ ప్రాంతాలనుండి కవులు, విద్వాంసులు ఆయన సందర్శనమునకై వచ్చి తమ రచనలను ఆయనకు వినిపిస్తుండేవారని తెలుస్తున్నది. తిక్కన మెప్పు పొందడమే ఆ రోజులలో ఒక గొప్ప. కవిత్వాన్ని చెప్పి తిక్కనను మెప్పించడం అరుదు అని ఆ రోజులలో అందరూ అనుకొనేవారు.

మన కవులెవరికీ చిత్రపటాలు లేవు. ఆ రోజులలో ఫోటోగ్రఫీ లేదు. చిత్తరువులు వేసే కళ ఉన్నప్పటికి యెవరైన వ్రాసినారో లేరో కాని మనకు మాత్రం తిక్కన చిత్తరువు లభించలేదు. అయితే తిక్కన చిత్తరువు అక్షర రూపంలో మనకు లభిస్తున్నది అది తెలుగు భాష ఉన్నంతకాలం చెరగిపోక నిలిచి ఉండగలదు. అది ఎండకు గాని, వానకు గాని శిథిలమైపోవునది కాదు. ఆ చిత్తరువును వ్రాసినవాడు కేతన. అది అక్షరరూపమైన చిత్రం. తిక్కన తండ్రి బుధలోక వత్సలుడు. భోగంలో, రూపంలో, ధైర్యంలో, శౌర్యంలో అద్వితీయుడు. ఆయన తల్లి సౌభాగ్యమహిమతో అరుంధతి వంటిది. భాగ్యంలో

లక్ష్మి వంటిది. తాలిమిలో భూదేవి వంటిది. ఇన్ని గుణాలు కలిగినటువంటి ఆ దంపతుల నోముల పంట తిక్కన. తిక్కన సుకవీంద్ర బృంద రక్షకుడు, చిత్తనిత్యస్థిత శివుడు. దశదిశా విశ్రాంతయశుడు, సకల విద్యా కళాచణుడు. మనుమసిద్ధిరాజు రాజ్యభారధౌరేయుడు, అభిరూప భావభవుడు. అన్నిటికన్న మిన్నగా దీనజనతా నిధానము, తెలుగులోను సంస్కృతంలోను చతురుడు. ఉభయ భాషల కవులకు మిత్రుడు, అందుచేతనే కవీంద్రులు ఆయనకు కృతు లిచ్చినారు. ఆయన అనేక కావ్యాలను వ్రాసినాడు. పెక్కు ఊళ్ళు అగ్రహారాలుగా ఇచ్చినాడు. యాగాలు చేసినాడు, ఎన్ని యోగ్యతలు కలిగినవాడు మన తిక్కనామాత్యుడు! ఇంకా చూడండి - వేదాది విద్యలన్నియు ఆయనకు కరతలామలకము. ఆయనిది విశుద్ధమైన ఆత్మ. ఆయన ధీమంతుడు. సామాది ఉపాయాలు తెలిసినవాడు. చతురాసన సన్నిభుడు. నీతిలో చాణక్యుడు. పరహితార్థి, మంత్రిమాణిక్యుడు, పుణ్యమూర్తి, కావ్యపారీణుడు, సౌజన్యము ఆచరణగా గలిగినవాడు, దేవేంద్ర నిభుడు, ఇంతటి మహోజ్జ్వల చరిత్ర కలిగిన మరొక కవీశ్వరుడెవరు.— ఈ వర్ణనను గమనించినప్పుడు నిపుణుడైన ఆధునిక చిత్రకారుడు యెవరైన ఆయన పటాన్ని గీయవచ్చునని చెప్పవచ్చును. తిక్కన హృదయం అనుకంపకు ఆటపట్టు. నేటి పరిపాలకులకు యిందులో నూరోవంతు గుణసంపద ఉన్నప్పటికిని దేశమెంతో బాగుపడును కదా! అది యట్లుండనిండు.

మరొకరు ప్రారంభించి విడిచిన గ్రంథాన్ని తానేల పూర్తిచేయవలెనని తిక్కన వెనుక ముందాడలేదు. ఈ భారతానువాదంలో మరొకరి ప్రస్తావన ఎందుకని, తనకే పూర్తి గౌరవము కావలెనని అనుకోలేదు. ద్వేషరహితమైన విశాల హృదయం తిక్కనది గదా! ఆయన ఆలోచించినది ఒక్కటే- తనజాతి, తన భాష, వాని అభివృద్ధి, తన యెదుటనున్న సమాజం, ఆ సమాజంలో వ్యాపించియున్న చీకటి. ఆ చీకటిని తొలగించి వెలుగును చూపించవలసిన అక్కర. అందుకు భారతమొక్కటే ప్రయోజనకరమైన గ్రంథము. ఎందుకనగా, అది భారతీయ విజ్ఞానకోశం. అందులో ధర్మశాస్త్రం ఉన్నది; వేదాంతమున్నది; నీతి శాస్త్రమున్నది; ఇతిహాసమున్నది; పురాణ సంపద ఉన్నది: మహాకావ్య గౌరవమున్నది. కావుననే అది విశ్వజనీనము. అందుచేత తెలుగు జాతికి సరియైన దారి చూపించగలిగిన మహాగ్రంథం.

ఆంధ్రావళికి మోదము కలుగునట్లుగా తెనుగు భాషలో భారతానువాదాన్ని మొదలుపెట్టినప్పుడు, తెనుగు భాష అంటే ఏమిటి? అన్న ప్రశ్న తిక్కనకు సహజంగా కలిగి ఉంటుంది. ముఖ్యంగా శివకవులు "జానుతెనుగు జానుతెనుగు" అని నొక్కి చెప్పినందున జానుతెనుగు అంటే ఏమిటి అని కూడా ఆయన ఆలోచించుకుంటాడు నిజానికి శివకవులు తెనుగూ, తెనుగూ అని ఎంత నొక్కి చెప్పినప్పటికిని వారి భాష జనులు నిత్య వ్యవహారంలో ఉపయోగించిన తెనుగు భాషకాదు; ప్రజలకు సులభంగా అవగాహనయైన భాష కాదు. అందుచేతనే వారి భాష ప్రజాదరణ పొందలేక పోయినది. జానుతెనుగునకు విద్వాంసులు యేమి అర్థము చెప్పినప్పటికిని తిక్కన తెలుగు మాత్రం ఆనాడు వ్యవహారంలో ఉన్న భాష అని నిస్సందేహంగా చెప్పవచ్చును. అటువంటి భాష ఉపయోగించినప్పుడే పంచమ వేదమైన భారతం ఆంధ్రావళికి మోదం కలిగించగలదని తిక్కన నిశ్చయించడంలో ఆశ్చర్యమేమున్నది? తిక్కన తన ప్రాంతమైన నెల్లూరు భాషను బాగా పరిశీలించి ఉండవచ్చును. నెల్లూరునుండి ఓరుగల్లు వరకు చేసిన పర్యటన సందర్భంలో ఆయన పలుచోట్ల విడిదిచేసి ఉండవచ్చును. అప్పుడు అక్కడక్కడ జన వ్యవహారంలో ఉన్న భాషను కూడా ఆయన బాగా పరిశీలించి ఉండవచ్చును. బహుశః తిక్కన రాయలసీమ మీదుగా ఓరుగల్లు చేరి ఉంటాడని అనుకుంటాను. పరిశోధకులు తిక్కన ప్రయాణ మార్గాన్ని నిర్దేశించవలసి ఉంటుంది. నెల్లూరు, రాయలసీమ, తెలంగాణా ప్రాంతాల ప్రజల నాలుకలమీద నాట్యమాడిన నుడికారాన్ని తిక్కన గ్రహించినాడని ఆయన రచన స్పష్టంగా తెలుపుతున్నది. తెలుగు భాషలో ఉన్న జీవం, చక్కదనం, చిక్కదనం అన్నీ తిక్కన శైలిలో మనకు కనిపిస్తున్నవి. ఎటువంటి అభిప్రాయమునైనా వేదాంతము నుండి నిత్య వ్యవహారం వరకు తెలుగులో వెల్లడిచేయవచ్చునని తిక్కన రుజువు చేసినాడు. జనుల వ్యవహారంలో ఉన్న శబ్దసంపద, నుడికారం, తెలుగు సమాసాలు అన్నీ తిక్కన రచనలలో మనకు కనిపిస్తున్నవి. తిక్కన ఈ శైలిలో భారతం వ్రాయకపోతే తెనుగు శబ్దజాలమే కొరవడి ఉండేది. భాషపైన ఆయనకు గల అధికారం అనన్య సామాన్యమైనది. తెలుగు భాషకు నిండుదనాన్ని కలిగించిన మహాకవి, లోకజ్ఞుడు తిక్కన. ఆయన భాష ఒక తరగనిగని.

తిక్కన తీసుకున్న మహాభారతం చాలా విశాలమైన పరిధి గల గ్రంథం. ఆయనయే చెప్పినట్లు అది 'నానా రసాభ్యుదయోల్లాసి.' మానవ సమాజానికి

సంబంధించిన ప్రతి సమస్య సుమారు అందులో కనుపిస్తుంది. ఈనాటి సమాజంలో కూడ మనకు కనిపించే క్లిష్ట పరిస్థితులను మనం భారతంలో చూడవచ్చును. సమస్త దేశాలలోని సకల మానవజాతిని చిత్రించగలిగిన గ్రంథం మహాభారతం. ఈ సత్యాన్ని గమనించి కాబోలు తిక్కన తన అనువాదానికి మహాభారతాన్నే ఎన్నుకొన్నాడు. విరాటపర్వం నుండి తుదిపర్వం వరకు చూస్తే తిక్కన ఎన్ని రసాలు పోషించినాడో మనకు స్పష్టం కాగలదు. శృంగారము, వీరము, కరుణ, బీభత్సము, రౌద్రము, శాంతము - ఏ రసము పోషించినప్పటికిని ఆయనకలం ఇందుకే పూర్తిగా తగినట్టుంటుందని చదువరులకు అనిపిస్తుంది. ఈ విధంగా గ్రంథ రచన చేసినవారు తెలుగులో మరొకరు లేరు. ఇందుకు సంబంధించిన సమస్త విషయాలను పండితులు బహుగ్రంథాలలోను, అనేక పత్రికలలోను, వివిధ వేదికల మీదను విపులంగా తెలిపినారు; సిద్ధాంత వ్యాసాలను వ్రాసినారు; పరిశోధన గ్రంథాలను ప్రకటించినారు.

వివిధ రసాలను పోషించడంలోను, వివిధమైన చిత్తవృత్తులను వెల్లడించడంలోను, భిన్న స్వభావాలు గల పాత్రలను చిత్రించడంలోను తిక్కనకు తిక్కనయే సాటి. నాటకీయ శిల్పం, సన్నివేశాలను కల్పించేనేర్పు, వర్ణనా నైపుణ్యం తిక్కనకు వెన్నతో బెట్టిన విద్య. రమ్యమైన నాటకానికి, రమణీయార్థ ప్రతిపాదకమైన కవిత్వానికి ఉండవలసిన లక్షణాలన్నీ తిక్కన భారతంలో మనకు కనిపిస్తవి. అన్నిటికంటే మించి తిక్కన మానవ కారుణ్యవాదిగా కనిపిస్తాడు. భారతం అవతారికలో కరుణ అనే పదాన్ని ప్రతి సందర్భంలో వాడడం, కరుణ రసపోషణకు సంబంధించిన ఘట్టాలలో ఆయన కవిత పరాకాష్ఠను పొందడం యిందుకు నిదర్శనాలు. దీనినిబట్టి కవిగా, పండితుడుగా, రాజకీయ చతురుడుగా, తాత్వికుడుగా గానే కాక అత్యుత్తమ మానవునిగా కూడా తిక్కన సమగ్ర స్వరూపం మనకు సాక్షాత్కరిస్తుంది. మన భాషలోనే కాదు, భారతీయ వాఙ్మయంలోనే కాదు, ప్రపంచ సాహిత్యంలో కూడా తిక్కన వంటి మహాకవులు మిక్కిలి తక్కువని చెప్పితే సత్యానికి తలవంపులు కలుగజాలవు.

తిక్కన చేసినది అనువాదము కాదు; స్వతంత్ర రచన అని భావించి, సోపపత్తికముగా నిరూపించిన పండితులు ఉన్నారు. అనేక సందర్భాలలో తిక్కన మూలాన్ని తగ్గించిన ఘట్టాలు ఉన్నవి; స్వతంత్రించిన దృష్టాంతాలున్నవి. తిక్కన గొప్ప శిల్పి. అందుచేత శిల్పదృష్ట్యా కూడ భారతాను

వాదాన్ని కొనసాగించినాడు. ఆనాటి తెనుగుదేశాన్ని, తెలుగు జనుల ఆచార వ్యవహారాలను తిక్కన తన గ్రంథంలో యిమిడించినట్లు మరుపూరి కోదండ రామరెడ్డిగారి వంటి పరిశోధకులు పలువేదికల నుండి వెల్లడి చేసినారు. ఉదా హరణకు - తిక్కన ద్రౌపది. తెలుగు దేశంలోని ఆనాటి శూర కుటుంబాలకు చెందిన అభిమానవతియైన వీరనారీమణి. ఈ విధంగా చెప్పబోతే తిక్కన పాత్ర లను మరికొన్నింటిని గూర్చి కూడ వివరించవలసి ఉంటుంది.

తుదకొక్కమాట. తిక్కనది ప్రజల దృష్టి - ప్రజల భాష. ప్రజల అభ్యుదయం ఆయన కాంక్షించినాడు. తన సమకాలీన పరిస్థితులను దృష్టిలో ఉంచుకొని మహాభారతాన్ని స్వేచ్ఛగా స్వతంత్ర గ్రంథంగా తెనిగించినాడు. ఆంధ్ర మహాజనుల పాలిటి అమృతమూర్తి తిక్కన, కవిగా, లోకజ్ఞుడైన దేశ నాయకుడుగా ఆంధ్రదేశ అభ్యుదయాన్ని, భారతీయ సమైక్యతను, లోక కల్యా ణాన్ని కాంక్షించిన ఉదారచరితుడుగా ఆయన మన ముందు ప్రత్యక్ష మౌతు న్నాడు. తిక్కన అభిప్రాయంలో వ్యాసుడు లోకహితనిష్ఠ కొరకు భారతాన్ని వ్రాసినాడు. అది పంచమ వేదం. జనులకు ఆరాధ్యం - అందుకొరకే దానిని జనాభ్యర్చితమని ఆయన వర్ణించినాడు. ఈ మాటలన్నీ తిక్కన దృక్పథాన్ని వివరిస్తున్నవి.

ఉదార చరితానాంతు వసుధైవ కుటుంబం — అన్న సూక్తి సుప్రసిద్ధ మైనది. తిక్కన ఇటువంటి ఉదారచరితుడు.

పూజాతిసాంద్ర కర్పూరమ్ములందు
ప్రాజ్ఞదీపాథోలవమ్ముల యందు
మడుగు సన్నని పాట
పొడుచు వెన్నెల తేట
కలవు తిక్కన పల్కు తెలుగు పల్కులకు!
లోలమృద్వీకా గుళుచ్ఛ మాధురియు
నవ పుష్యరాగ సుందర పటిష్ఠతయు
అలరు మల్లియ పువ్వు
నందు పిన్నని నవ్వు
కలవు తిక్కన పల్కు తెలుగు పల్కులకు!

ప్రకృతిమాత స్తన్యపానమును మైమరచి యాలపించిన భావ గేయములీ పాటలు. ఇదిగూడ వాని కమ్మందనమున కొక కారణమని చెప్పవచ్చును. ఈ విశాల విశ్వమునందు ఏ యజ్ఞాత ప్రదేశముననో, అట్టి దోహదక్రియలు లేక, పెరిగి, పుష్పించి, ఫలించు వచ్చని యడవి తోటలే ఈ గేయములని చెప్ప వచ్చును. ఈ గేయములు మన పూర్వలాక్షణికులెవరిని ఆకర్షించలేదు. జాన పదుల హృదయగత భావములు లోపల అణగి యుండనేరక ఉబికివచ్చి కవితా స్వరూపమును దాల్చిన యీ గేయములు నిస్సంశయముగా సాహిత్య ఖండ ములు.

ఇంటిలో స్త్రీలు వేడుకగా పాడుకొను పాటలు, సంతోష సమయములందు అందరును కలిసి ఆలపించుటలో; లేక పరిశ్రమ జేయునప్పుడు అలసట దీర్చు కొనుటకో ఉపకరించు చున్నవి. ఈ నాటి నాగరిక సంఘమునుండి యీ పాటలు క్రమక్రమముగా నిష్క్రమించు చున్నవి. ఆధునిక యుగమున ఆంధ్ర భాష పునర్వికాసారంభమును పునరుద్ధరించ వలసిన యీ పాటలు ఎన్నియో తెగలుగా నున్నవి.

ఇందులో మొదటి వర్గము గృహములో శిశూదయము కలిగినప్పుడు పట్టరాని ఆనందముచే ప్రబోధితములు. ఈ విధములగు పాటలలో నిండుచూలాలి ప్రసవవేదన, ఆ సందర్భమున కుటుంబమున రక్త సంబంధము కలవారి హృద యములందలి ఉద్వేగము, మంత్రసాని కౌశల్యము. శిశూదయము తరువాత జరుగు ముద్దు ముచ్చటలు, వినువారిని ముగ్ధులను జేయుచున్నవి.

కడుపారగన్న చిన్నారి శిశువును ఊయెలలో నుంచి యూపునపుడు మాతృహృదయమునందు గలుగు మధుర భావములను వ్యక్తీకరించు పాటలు మరికొన్ని. అవి చక్కగా పాడినచో ఎట్టివారైనను నిద్దురచే తూగక మానరు. వానినే మనవారు లాలిపాటలందురు.

తన హృదయములో దాగియున్న భావములను బయలు పెట్టజాలక అమ్మయమ్మాయని యేడ్చుచు నినాదాలు చేయు శిశువును తల్లి యెంత ఊర డించదలచినను అంత ఎక్కువ యేడ్చునప్పుడు, తొట్టిలోనుంచి శిశువును దీసి, యెత్తుకొని, చందమామను జూపించి, ఆ సుందరమూర్తి, "చందమామ

రావె, జాబిల్లి రావె, వచ్చి బాబుకు ముద్దిచ్చిపోవె" అని యుపలాలించు తరుణ మెంత మధురమైనది! బాల్యక్రీడా విశేషములను వర్ణించు పాటలు మరికొన్ని గలవు. ఈ పాటలు శైశవదశ యందలి ఆనందమును అనుసంధించుచుండును. చూడుడు:

కాళ్ళాగజ్జ, కంకాళమ్మ
కమ్మనితోట, నిమ్మలబావి
పచ్చని అడుగు, కుచ్చులపోదలు
తెల్లనిపూలూ, తియ్యనిపాలూ.

అని బాలికలు పాడుచున్నప్పటి దృశ్యమెంత మనోహరమైనది. ఈ పాటలలో కొన్ని పండుగనాటి వేడుకలకు సంబంధించినవి. ఈ పండుగలలో ప్రముఖ మైనది సంక్రాంతి. సంక్రాంతి ముగ్గులు దీర్చుట మున్నగు క్రీడా విశేషములు ఆంధ్ర బాలికలకు అత్యంత ప్రేమ పాత్రములు. చక్కగా అలంకరించుకొని వస్త్రాభరణ విభూషితలై బాలికలు మంగళగౌరిని పూజించుచు పాడు పాటలు మనకు బాగుగా పరిచితములైనవి. శ్రావణ మంగళ వారము పాటలు గూడ యిట్టివేయని చెప్పవచ్చును.

వివాహాది శుభ సందర్భములు వేదోక్త విధానములకేగాక ఆట పాటల కును ఆటపట్టులు. వధువు మంగళస్నాన మాచరించునప్పుడు, తిలకమును నొసటి పైన బుగ్గలమీద దిద్దునప్పుడు అగ్నిహోత్రము ముందు తీసికొని వచ్చు నప్పుడు రమణీమణులు పాటలుపాడు ఆచారము కలదు వివాహ సందర్భమున వధూవరులకు మధ్యనున్న పరదా తొలగింపగా ప్రప్రథమమున వధూవరులొం డొరులను జూచుకొనునప్పుడు పాడుపాటలు మధురభావోపేతములు. శోభనపు గదిలోనికి వధూవరుల పంపునపుడు సుందరాంగులు మందహాసముతో పాడు పాటలు రసోన్మత్తత కలిగించునవిగా నుండి ఆ పడుచు స్త్రీల మధ్య నొంటరిగా నున్న ఆ వరుని పరిస్థితిని వ్యక్తీకరించుచున్నవి.

"ఓ నల్లని కాకి! ఈ మంచి ముత్యమును నీవెట్లు సాధించితివి?" అని అన్యాపదేశముగా వరుని పరిహసించి నవ్వించు నీ పాటలకు, తలుపు దగ్గరి చుట్టరికము కలదు. శోభనము రెండవనాడో, మూడవనాడో వధువు గదిలో

ప్రవేశించి తలుపు దగ్గరవైదకొనగా వరుతువచ్చు సన్నివేశము యీ పాటలకు మూలాధారము.

తలుపుతీయవె భామా-నే ద్వారక ధాముడనే భామా
జాజిపువ్వుల సరసములు తెచ్చితి-గొజ్జగి పువ్వుల గుత్తులు దెచ్చితి
జాజిపువ్వులవి సత్యకు కావలె-గొజ్జగి పూలవి కోదును రుక్మిణి
ద్వారక కీమొడ దారులు లేవోయీ...

అనునది ఒక మచ్చుతునక.

"నిలువజాలని జాళిని తూలుచు కిలికిరో నిను కలియ వచ్చితిని, పలుకులను పన్నీరు చుక్కలు చిలుక పలుకగదవే, పచ్చితేనెలు పొంగి, వరదలుపారు నీ చిగురాకువాతెఱ, వెచ్చవెచ్చగ ద్రాగనిది నా విరహదాహము తీరుటెటులో?" అనునది మరొక యుదాహరణము. ఇందులో కొన్ని ప్రకృతి పురుషుల లీలా విలాస పరముగా వేదాంత తత్వమును వివరించునవి. కాని వీనిలో యెక్కువ ప్రణయ సాగరమున నీదు పడుచుజంటల శృంగార విలాసమునకు సంబంధించినవే. ఈ శృంగార సంబంధములగు పాటలు వివిధములుగా నున్నవి. "ఓరోరి బండివాడ, ఒంటెద్దు బండివాడ, నిలుపు నీబండి, ఆపు నీబండి."

"చిన్ని గన్నేరు పువ్వు చీరగట్టినదాన, చిలుక రెక్కల రైక బిగియదొడిగినదాన, కుదురుపాపటతీసి కురులు దువ్వినదాన, నుదుట కస్తురి కాయ దిదురు పెట్టినదాన" అను పాటలు శృంగారోద్రేకమును ప్రకటించుచుండును. సాయంకాలమున పశువుల మందను తోలుకొని వచ్చు బాలకుడో లేక ఎద్దుల బండిని తోలుకొనిపోవు యువకుడో వీనిని మైమరచి పాడుచుండుట మనము బహుపర్యాయములు చూచియే యున్నాము. జానపదులను మైమరిపించు నీపాటలు విద్యాధికులను గూడ సుందర భావోపేతములై ఆకర్షించుచున్నవి ఈ పాటలు సహృదయులను భావడోలికలందు ఊయెలలూగించుచుండును. ప్రొద్దు పొడవక ముందు, పాడు మరికొన్ని పాటలును కలవు. ఇవి రాత్రి చాలాసేపు విలాసములందు నిమగ్నులై నిద్రించియున్నవారిని లేపుటకుద్దేశింపబడినవి. కొన్ని నిదర్శనాలను పరిశీలించుడు :

"మేలుకొనరా ధూర్తకృష్ణుడ, మేలుకొనరా ధీర చోరుడ, మేలు మేలెపు దొచ్చి నా పడికిల్లు సొచ్చితి, రాతిరీ, తూర్పు రేఖ౩౦ తెల్లవారెను. శ్రోవలను వినబడే సందడి, అత్తమామలు మెసలుచున్నా రల్లరుల పాల్సేయకుము నను, మందకేగిన నా మగడు వచ్చే వేళ ఆయెను, మంది లేచిన పరువు నిలువదు. మసలకుర ఈ దొంగనిద్రను, తమ్మ ఉమిసితి నిచ్చటిచ్చట, తగని బిడ్డల తోడికోడలు! సొమ్మసిల్లినయట్లు కదలవు; చోరుడా ఇక మేలుకో; మరియొక్క మారురా."

"తెల్లవారెనమ్మ చెల్లే నేనేమందు, నల్లని నాస్వామిలేరా
మరల రెప్పలుమూసి మసలుచున్నావు, మర్యాద నిలటింకపోరా
తెల తెలవారెను దిశలెల్లచూడరా, తిరిగి రావచ్చును పోరా
"తరుణులెల్లరు లేచి, పెరుగు చిల్కుచున్నారు తడయరాదిక మీదపోరా;
అరకన్ను లరవాల్చి అటునిటు చూచేవు, కరుణించి, నను వీడి పోరా;"
"గుసగుస మాటాడా కూడదంటే నీవు గుఱుకొట్టుచున్నావు లేరా.
చిన్నదానట్లు నాసిగ్గెల్ల చెరిపితి శీఘ్రమే యిక లేచిపోరా;
పొమ్మంటినంచు నీ బుద్ధిలోనుంచాకు ప్రొద్దులేదని యంటిపోరా."

ఈ ప్రొద్దుపొడుపు పాటలలో పైన వివరించిన శృంగార క్రీడలకు సంబంధించినవే కాక వేదాంతార్థ ప్రతిపాదకము లగునవికూడ కలవు.

పొలములలో కాయకష్టము జేయువారు పాడు పాటలు కొన్ని కలవు. ఈ పాటలకు ఇతివృత్తము వ్యవసాయ సంబంధ కార్యకలాపాలో లేక తమ కుటుంబ విషయాలో అయి యున్నవి. చిత్తములు నాటునప్పుడు, వరులు కోయు నప్పుడు, ఈ పాటలను కలిసి పాడుట ఆచారము.

"తొలకర్లు తొంగిమాచె సిరిసిరిమువ్వా, మొలకలు మొలకెత్తె సిరిసిరి, చాళ్ళ సాగినపైరు సరిపొట్టలీనాలె, పండినా పంటలు పాతళ్ళు నిండాలె, మిడత పోటడకుండ మేడాలు నడపాలె, సామమేసిన కోడె నేవళంగొస్తాది. ఆ కోడె తొక్కితే అరచిపండును భూమి."

ఒక పెద్ద బరువును మోయునపుడు, ఒక కష్టమును చేయునప్పుడు గాని పాడు పాటలు మరికొన్ని కలవు.

"సముద్రమే ఈదాడు చలిలేక సిరిస్వామి
విసమునే మింగాడు వెరవకా విస్సన్న,
వరదనే ఆపాడు కదములా రావణుడు.
కొట్టరా ఆ చెట్టు నెట్టరా ఆ గుండు"
పిండి విసరునప్పుడు పాడు తీయని పాట నొకమారు తిలకింపుడు:

"తిరగావే మాయింట తిరగలీ ఈ ప్రొద్దు, తియ్యనీ కుడుములు నెయ్యితో వుడుకంగ, కుండలో కవ్వము కులికి తిరిగిబయట్లు. బొమ్మతో సారె దిమ్మ తిరిగినయట్లు. గుండాన బాపండు కుడిచే తిరిగినయట్లు."

"సువ్విసువ్వి రామచంద్ర, సువ్విసువ్వి రామచంద్ర
సువ్వి సీతమ్మ మాకు శుభములిమ్మా
పసిడి రోకళ్ళు పట్టిభామలపుడు సువ్విదంప
కనుల పండువాయె కౌసల్య కపుడు."

ఈ పాటలలో పెద్దవికూడ కలవు. ఇవి యెక్కువగా పురాణ కథలకు సంబంధించినవి. చక్కని జాతీయములతో మిక్కిలి శ్రావ్యములై యొప్పు చున్న వీ పాటలు. ఇవి ముఖ్యముగా స్త్రీలు తీరిక సమయములందు పాడుకొను నవి. ఈ పాటలు పాడుట స్త్రీలకొక క్రీడా విశేషము; అభిమానస్పదమగు కళ. ఈ పాటలు చక్కని భాష, జాతీయోక్తులు, సాంసారిక సౌందర్యము ప్రకటించుచు రమణీయముగా నుండును-చూడుడు!

"కస్తూరి రంగరంగా, నాయన్న, కావేటి రంగరంగా
దేవకీ గర్భమందు కృష్ణావతారుడై జన్మించెనూ,
నేలపై బడ్డయపుడె, ఆ చిన్న బాల, కావుకావనుచు
ప్రోలెల్ల మేలుకొనగా, కిలకిలా కేరింతలాడసాగె.
రేపల్లె చంద్రుడమ్మా, ఈ బిడ్డ మా పిన్ని మదనుడమ్మా,
నవనీత చోరుడమ్మా, ఈ బిడ్డ నందగోపాలుడమ్మా."

"రామలాలీ, మేఘ శ్యామలాలీ,
తామరసనయనా, దశరథాతనయలాలీ,
చిన్నముద్దుల నాన్నా, సిరులముద్దుల నాన్నా,
వెచ్చ వెచ్చని పాలు, ఇచ్చమీరగ త్రాగి
కుచ్చుల్ల పొత్తికల ముచ్చటగ పవళించి."

ఈ పాటయందలి చక్కని తెనుగు నుడికారమునకు మెరుగులు దిద్దవల సిన బాధ్యత ఆధునిక సారస్వతోపాసకులపై కలదు. సీత సమర్త, చిలుక రాయబారము, కుశలవ కథ, బొబ్బిలి కథ. బాలనాగమ్మ కథ, లక్ష్మమ్మ కథ, దేశింగురాజు కథ మున్నగునవి యీ పెద్ద పాటలలో పేర్కొనదగినవి.

సీతమ్మ సమర్త, నోరూర పాడని పల్లెపడుచులు మిక్కిలి యరుదని చెప్పవచ్చును. ఈ పాటలయందు కల్పనా చమత్కారమునకన్న భాషా సౌంద ర్యము, భావ సౌకుమార్యము, నుడికారమునందలి శ్రావ్యత మిక్కిలి మెచ్చదగి యున్నవి.

శ్రీరాముల పట్టపుదేవి, సీత సమర్తాడింది
వేగజూచి చెప్పుడీ, ఇక వేడుక చేయవలె రామచంద్రా
అప్పుడు పంచాంగంబులు విప్పిచూచి మునులెల్లా
మంచిది హస్తానక్షత్రము పంచమి సోమవారమ్మూ
మించగలేదిపు డభిజితు, మంచి ముహూర్తమె రామచంద్రా
పరమ పతివ్రతయై యుండును, పలువురు పుత్రుల గనునూ
పట్టమహిషియై, అఖండ రాజ్యము పాలించును, రామచంద్రా
కడువేడుకతో కౌసల్యాసతి, వడివడిచెలులను పిలిచీ,
పేరంటాండ్రను పిలిపించె, కడువేడుక, చేయవలె రామచంద్రా
పచ్చిపసుపూ నలిచి, సీతకు పట్టుచీర కట్టించిరి
జిలుగువన్నెల తళుకుల రవికా, తొడిగించిరి రామచంద్రా
నలుదిక్కులనూ, రతనాల సెమ్మెలలో
వలపు నూనెలతో, పెట్టిరి, దీపమ్ములూ రామచంద్రా
మూడవదినము తొలిసమర్తకూ వేడుకలన్నీ చేసి
చేడెను నాల్గవనాడు, జలకములాడించిరి రామచంద్రా

ఈ విధముగా సుమారు రెండుమూర్లు పంక్తులలో యీ పాట వ్యాపించి యున్నది. సీతాదేవి శోభనపు ముచ్చట యెంత ముద్దుగా కర్ణింపబడినదో తిలకింపుడు:

"ఉల్లాసముతో గృహమున రఘువల్లభుని యుంచి
చల్ల చల్లగా జారిరి, సఖులెల్లరు, రామచంద్రా
నెంతయుంతుమా నీవనిచెప్పుచు, తలుపు తటాలునజేర్చి
పలపల నడవగ, జానకి వణకసాగెను, రామచంద్రా
తలుపు దగ్గర, సీతగుండెలు, తటతట సుడిదిరుగా
సిగ్గు చెందాడగా, స్రుగ్గిముగ్గిపలయి-భయపడె, రామచంద్రా
అంగుళిగల, రత్న పుటుంగరమటు, దొరలించి
అంగనవో, నాయుంగరమదే, అందింతువెయనె రామచంద్రా."

సరళములు, సభ్యములు, స్వభావ సుందరములునగు నీపంక్తులు విను వారిని పులకాంకిత గాత్రులను గావించి మరల నొక్కమారు శోభనపు పెండ్లి కొడుకులనుగా జేసితీరును. కళా సౌందర్యము ప్రతిఫలించు నీ ఘట్టమును ప్రబంధకవుల శోభన వర్ణనతో పోల్చినప్పుడు లాక్షణికుల యాజ్ఞా ప్రకారము చిత్రించిన ఆ పటముకన్న యీ చిత్రము యెంత మనోజ్ఞతరము, సభ్యతరమై యున్నదో గోచరించితీరును. ప్రబంధముల యందలి వర్ణనలు కృత్రిమములై, పాడినదే పాటగా, కొంతవరకు అసభ్యములుగా, కూడ నుండును. కాని యీ పాటల యందలి నాజూకు వర్ణనలు మనల నానంద డోలికలయందు ఉయ్యాల లూగించుచున్నవి.

ధర్మరాజు జూదము, ఈ పెద్ద పాటలలో పేర్కొనదగినది. జూదము నొక కళగా మన పూర్వులు భావించిరి. ఈ ధర్మరాజు జూదమునందు జ్యేష్ఠా దేవికిని లక్ష్మీదేవికినీమధ్య జరిగిన సంభాషణ కొంత వింతగాను అస్వాభావికము గాను కానుపించుచున్నది. కొన్నిపనులు జేయుటవలన ప్రజలను లక్ష్మీదేవి వదలి పెట్టి తన అక్కగారి యేలుబడి కప్పగించవలెనని జ్యేష్ఠాదేవి తన చెల్లెలిని అర్థించి సమ్మతింపజేయుట కొంత వింతగానే యున్నది.

ఈ పనులు జేయుటవలనే ధర్మరాజుకూడ ఓడిపోయినట్లు తెలియు చున్నది.

''చేటిలోపలి పండ్లు చెరిపిస్తినాడు, మంచంబు ఓరగా పెట్టినా, నాడు,
అరికాలు నిండుగా తడుపసినాడు, నాడు నిను కొలువనని పలికితి నేను"

''అలికివిడిచిన గడప దాటడే రాజు, దివ్వెలేని గృహాన తిరుగడే అతడు
సిరాడలేనింట నిలువడే తల్లి, ఆడి మిగిలిన జలము లాపడేరాజు
కట్టి విడిచినగుడ్డ కట్టడేరాజు, జంటగా పెండ్లిండ్లు కాయడేరాజు
ఒడిలోన పువ్వులు కోయడే అతడు."

అని దారిద్ర్య కారణములు వివరింపబడినవి.

(1950 - గోల్కొండ పత్రికలలో ప్రచురితమైన వ్యాసం)

# తెలుగులో తొలి సమాజ కవులు

'తెలుగు సాహిత్యంపై మరో చూపు' ప్రసరించిన తర్వాత 'సారస్వత వేదిక' నిర్వాహకుల మనస్సులలో కొన్ని ఆలోచనలు తల ఎత్తినవి. తెలుగు సాహిత్య చరిత్రలో స్థానం పొందని సాహిత్యాన్ని గూర్చి, విశేషించి కవితను గూర్చి మాట్లాడుకుంటే బాగుంటుందని ఆలోచన సహజంగా కలిగింది. ఆ ఆలోచనకు అనుగుణంగానే [illegible] [illegible] కార్యక్రమాన్ని రూపొందించడం జరిగింది. తెలుగులో తొలి సమాజ కవుల రచనలను యీ సంవత్సరం స్మరించుకోవడం సముచితం అని అనుకున్నాము. భక్తి, తత్త్వము యీ సమాజ కవుల రచనలలో ప్రముఖంగా కనిపిస్తున్నవి. ఈ రచనలను గురించి పండితులు అంతగా పట్టించుకున్నట్లు లేదు. కవులుగా వారికి సాహిత్యచరిత్రలో తగు స్థానం లభించినట్లు లేదు. అందుచేత వీరిని యీ వేదికమీద సంస్మరించుకోవడం గడిచిన రెండు సంవత్సరాల వేదిక కార్యక్రమాల సహజ పరిణామమేనని చెప్పవచ్చును. నిస్సందేహంగా వీరందరిని 'సమాజ కవులు'గా పేర్కొనవచ్చును. సమకాలీన పరిస్థితులు, సమాజం వీరి రచనలలో ప్రతిబింబిస్తున్నవి.

'నిరుపహతిస్థలంబు, రమణీప్రియదూతిక తెచ్చి యిచ్చు క
ప్పురవిడె, మాత్మ కింపయిన భోజన, మయ్యెలమంచ మొప్పత
ప్పరయు రసజ్ఞు, లూహ తెలియంగలలేఖక పాఠకోత్తముల్
దొరికినంగాక యూర కృతుల్ రచియింపు మటన్న శక్యమే'

అన్న వేవియు కాంక్షించని కవులు వీరు.

ఈ సంవత్సర కార్యక్రమంలో నేటిది మొదటి ఉపన్యాసం. 'భక్తి తత్త్వ కవులు-సామాజిక భూమిక,' అన్నది యీనాటి ప్రసంగంయొక్క శీర్షిక. రాబోవు నె-లో జరుగబోయే ఉపన్యాస పరంపరకు నేటి ప్రసంగ మొక తొలి పలుకు వంటిది. ఈ తొలిపలుకు రచించమని మిత్రులు రంగనాథాచారిగారు కోరినారు. కష్టపడి చదువుకొని డాక్టరేటు పట్టంపొందిన విద్వాంసులు రంగానాథాచారిగారు. బహు గ్రంథావలోకనం, అనేక విషయాలను గూర్చిన పరిజ్ఞానం, స్వతంత్రమైన ఆలోచన, నిరంతర పరిశోధనా వ్యాసంగం, వక్తృత్వ శక్తి,

రచనాశక్తి కలిగిన రంగనాథాచారిగారు కవిత్వము అల్లినట్లు కానరాదు. భావు కత ఉన్నా భావోద్రేకం ఆయనలో లేదనుకుంటాను. అయితే ఉపన్యాసం నన్ను చేయమని కోరినప్పుడు ఆయన కొంత భావోద్రేకానికి లోనయినారని తోచినది. మిత్రులు చెప్పిన మాటను కాదనలేకపోవడం నాకున్న దౌర్బల్యాలలో ఒకటి. అందుచేత నా సామర్థ్యాన్ని గురించి ఆలోచించక యీ భారాన్ని నెత్తిన పెట్టు కోవడం జరిగింది. అయితే ఆధారాంశాలను సేకరించడంలో రంగనాథాచారిగారి తోడ్పాటు పూర్తిగా లభించినది. అందుచేత బరువు మోసినది ఆయన, గౌరవము దక్కినది నాకు అన్న రహస్యం మీకు చెప్పవలసి ఉంటుంది.

మన ఆధునికాంధ్ర కవివర్యుడు ఎన్నడో రాసిన ఒక పద్యంలో 'తెలుగు కన్నియ ముంగురులు పాయలు పాయలుగా విడిపోయెను' వన్నాడు. ఆయన ఏ అభిప్రాయంతో యీ మాట అన్నప్పటికిని తెలుగు సాహిత్యమేకాదు, సమస్త భారతీయ సాహిత్యం పాయలుగా విడిపోయినది. నాటినుండి యిటీవలి వరకు రెండు పాయలను మనం స్పష్టంగా పోల్చుకోవచ్చును. పాలకులు, వారి ఆశ్ర యంతో గ్రాసవాసోదైన్యం లేక సుఖ జీవనం గడిపిన విద్వాంసులు సృజించిన సాహిత్యం ఒక పాయ; పాలకులతోనూ, పండితులతోనూ, వారి ఆదరణతోనూ, అనుగ్రహంతోనూ సంబంధం పెట్టుకొనక, అప్పుడప్పుడు వారి ఆగ్రహానికి కూడా గురియై, సహజ ప్రతిభ కలిగిన రసార్ద్ర హృదయులు సృజించిన సాహిత్యం మరొక పాయ. మొదటి పాయ పాలకుల సాహిత్యమంటే రెండవ పాయ ప్రజల సాహిత్యమని చెప్పవచ్చును. ఈ విభజన సాహిత్యరంగంలోనే కాదు, యితర కళారంగాలలో కూడా మనకు స్పష్టంగా కనిపిస్తున్నది. ఇది ఒక్క తెలుగు దేశంలోనే కాదు, భారత దేశంలోని అన్ని ప్రాంతాలలోనూ గోచరిస్తున్నది.

లిపులు భిన్నమైనప్పటికిని భారతీయ సాహిత్యమంతా ఒకటేనన్న సూక్తి సుప్రసిద్ధమైనది. స్థూల దృష్టితో పరిశీలించినా యీ సూక్తిలోని సత్యం స్పష్టం కాగలదు. తమిళం వంటి సారస్వతానికి కొన్ని ప్రత్యేకతలు ఉన్నప్పటికిని, ఒకటి రెండు శతాబ్దాల వ్యత్యాసంతో భారతీయభాషాసాహిత్యాలన్నీ ఒకేవిధంగా వికాసం పొందినవి. సంస్కృతభాష అందులోని సాహిత్యం; రామాయణ భారతాలు, పారసీ అరబ్బీలు, ఆపైన ఇంగ్లీషు, ఇటీవల ఫ్రెంచ్, రష్యన్ మొద లైన భాషలు భారతీయ సాహిత్యాన్ని ప్రభావితం చేసినవి. ఆదేమి చిత్రమోకాని

ఆనాడు శాక్యరాజ్యానికి వారసుడు కావలసిన గౌతముడు రాజ్యాన్ని విడిచి సమాజ శ్రేయస్సుకొరకు ఆత్మార్పణం గావించడానికి కారణభూతాలైన రోగగ్రస్త దరిద్ర దృశ్యాలు భారతదేశంలో ఏ పట్టణానికి, ఏ పల్లెకు వెళ్ళినప్పటికిని మనకు వీధివీధిని వాడవాడలో యీనాడూ కనిపిస్తూనే ఉన్నవి. గడచిన కొన్ని శతాబ్దాలలో దశాబ్దాలలో కొన్ని దేశాలు యీ దృశ్యాలు గోచరించని సమాన సమాజాన్ని ఏర్పాటు చేసుకున్నవి. సత్వర భవిష్యత్తులో భారతదేశానికి యిటువంటి అదృష్టం పట్టునా అన్న ప్రశ్న ఉత్పన్నమౌతున్నది.

'అవియున్ గుండెలు జాతికైనఁ గనుమన్నా! విశ్వదైన్యమ్ము, బా
లవు నీర్వెట్టఁగ వేయికన్నులు, భుజాలక్షల్ వలెన్ పాపకూ
పవిపన్నాత్ముల నుద్ధరింప, వెతఁబాపన్, సేదఁబోకార్ప, మై
నివురన్, బాష్పజలమ్ముఁ బోఁదుడువఁ దంద్రీ! లెమ్ము సజ్జుండవై'

అన్న కవి మాటలవెనక మన చరిత్ర, మన సమాజం తొంగిచూస్తున్నవి. అక్షరాస్యత, సుఖజీవనం కొద్దిమందికే లభించిన సదుపాయంకాగా-అత్యధిక సంఖ్యాకులు గ్రాసవాసోదైన్యానికి గురియైన సమాజంలో సాహిత్యం, కళలు, కవిత్వం రెండు పాయలుగా ప్రవర్ధమానమైనవి. దీనివెనుక ఉన్న చరిత్ర మత, సాంఘిక రాజకీయ పరిస్థితులను మనం గుర్తించవలసి ఉంటుంది.

ఆదిమ కాలంనుండియే ప్రపంచంలో కవిత్వం యితర కళలతో పాటు ఆవిర్భవించినది. పూర్వకాలంలో, లిపికూడా బాగా పరిణతి చెందని కాలంలో మన కళలు, సాహిత్యం సామూహికంగాను, నోటిమాటగాను, పాటగాను ముందడుగు వేసినవి. అనాదినుండి చరిత్ర, మతం, విశ్వాసాలు మొదలైనవన్నీ సాహిత్యంలో ప్రతిబింబితమైనవి. అందుచేత మానవ సమాజంయొక్క ప్రగతితో పాటు సాహిత్యం ముందడుగువేసినది. పూర్వకాలంలో కవిత, పాట, నృత్యం అన్నింటిని జనులు గుంపులుగా రూపొందించి ఆనందించిరి. తీరిక వేళలలో ప్రజలు ఆటపాటలతో కాలక్షేపం చేస్తూ గొంతెత్తి పాడిన పాటలలో కవిత్వం పుష్కలంగా కనిపిస్తున్నది.

మన సమాజం శతాబ్దాలనుండి, సహస్రాబ్దాలనుండి రెండుగా చీలిపోయిన సత్యం ఎవరూ కాదనడానికి వీలులేదు. చెమటోడ్చి కష్టించి పనిచేసే వర్గం ఒకటి; హాయిగా సుఖజీవనం గడిపే అల్పసంఖ్యాకవర్గం మరొకటి. వ్యాకరణం అలంకారం, ఛందస్సులపై ఆధారపడ్డ సాహిత్యాన్ని యీ అల్పసంఖ్యాక వర్గం

సృష్టించగా, తమ దైనందిన జీవితంయొక్క అనుభవంపై ఆధారపడి తమ నాల్కలమీద నాట్యమాడే శబ్దజాలాన్ని ఉపయోగించి అత్యధిక సంఖ్యాకులు ఆటల్లో పాటల్లో తమ హృదయాలను ప్రతిబింబింప జేసినారు. ఈ ప్రతిబింబమే ప్రజల సాహిత్యంగా, జానపద, నృత్య, కళారీతులుగా ప్రవర్ధమానమైనది.

కడమ దేశాల చరిత్ర అట్లుంచి భారతదేశ చరిత్రను పరిశీలించితే సమాజంలోని రెండువర్గాలు ప్రాచీన కాలంనుండియే గోచరిస్తున్నవి. క్రీస్తుశకం ప్రారంభంనుండియే సమాజంలో యిరువర్గాలు మనకు గోచరిస్తున్నవి. ఒకవైపు రాజులు, మహారాజులు, చక్రవర్తులు, వారి కొలువులో వారితో సమానమైన రాజ భోగాలు అనుభవించిన కవులు, విద్వాంసులు, గౌతమబుద్ధుని కదిలించిన దృశ్యాలను ఏమాత్రమూ గమనించని సాహిత్యం అందులో శృంగారం మేరమీరి పాండిత్య శౌండీర్యం కలిగిన సాహిత్యం ఒకటి రూపొందగా - మరొక వైపున సాధారణ జనులు తమ భాషలలో పాడుకున్న పాటలు జానపద సాహిత్యంగా రూపొందింది. ప్రాచీన కాలంలో సంస్కృతంలో మన సాహిత్యరచన జరిగినది. అది చదువుకున్న వారిమట్టుకే పరిమితమైనది. ఈనాడు గూడా అక్షరాస్యుల సంఖ్య నూటికి ముప్పయి మించని మన దేశంలో ఆనాటి నిరక్షరాస్యతను సులభంగా ఊహించవచ్చును. అక్షరాస్యులు కాని యీ జనసముదాయం తమ తమ భాషల్లో పాటలు పాడుకునేవి.

భారతదేశంలో అనేక మత, సాంఘిక ఉద్యమాలు వచ్చినవి. జైనులు, బౌద్ధులు తొలి ఉద్యమాలకు నాయకులు; నాటి మత సాంఘిక వ్యవస్థపైన బౌద్ధ జైనాలు తిరుగబాటు చేసినవి. వారు తమ అభిప్రాయాలను జన సామాన్యంలో ప్రచారం చేయడానికి పాలీ, ప్రాకృత భాషలలో రచనలు గావించినారు. తరువాత వచ్చిన భక్తి ఉద్యమ నాయకులు గూడా సంస్కృతంలో గాక జనుల భాషలలో తమ ఆశయాలకు అనుగుణమైన సాహిత్యాన్ని నిర్మించినారు. ఈ విధంగా సంస్కృతం ఉన్నత వర్గాల భాషకాగా, దేశీయ భాషలు జనసామాన్యం యొక్క భాషలుగా సాహిత్యరంగంలో ముందడుగు వేసినవి.

నన్నయకు ముందునుండియే తెలుగు భాష రెండు పాయలుగా చీలినట్లు కనిపిస్తున్నది. మొదటిది పండితులు ఉపయోగించిన కావ్యభాష కాగా, రెండవది

జనసామాన్యం పాడుకున్న పాటలకు ఆటపట్టైన వ్యవహార భాషయైనది. పండితులు కావ్యభాషలో సంస్కృత వృత్తాలను, వ్యాకరణ సూత్రాలను, అలంకార శాస్త్ర ఆదేశాలను పాటించగా అన్నమయ్య మొదలైనవారు సాధారణ జనులకు అందుబాటులో ఉండే రీతిగా తమ రచనలను కొనసాగించినారు. ఈ సందర్భంలో ఆధునిక కవి ఒకరు తెలుగును చిల్కతో పోలుస్తూ వ్రాసిన గేయ పంక్తి ఒకటి నాకు జ్ఞప్తికి వస్తున్నది.

పుట్టింది ఒక చిల్క
పొలము పచ్చల బైట -
పొరలు వాకల నాట -
అల్లారు ముద్దుగా - అందాల హద్దుగా
......పుట్టింది ఒక చిల్క.

పెరిగింది ఆ చిల్క
పిండివెన్నెల సీమ -
పిల్ల తెమ్మెర లోన
పూబొత్తికలలోన-పోకిళ్ళ కలలీన

త్రావింది ఆ చిల్క
తళుకు తీవెల రాలు -
తరిపి రంగుల పాలు -
పక్షాలు పచ్చగా - పలువన్నె లెచ్చగా

చవిజూచె నా చిల్క
చల్ల వెన్నెల రేల -
చందమామల మ్రోల -
పండుటాకుల జున్ను - వెండిగిన్నెల వెన్న

ఆడింది ఆ చిల్క
అలరు మావుల నీడ
ఆడు బిడ్డలతోడ -
ఆబాలగోపాల - మానందమున సోల

పలికించి ఆ చిల్క
తెలుగు మీటి మరంద
మలుగు వాఱ - నమంద
సౌందర్య మూరగా - సారస్యధారగా

నేర్పించి ఆ చిల్క
నింతు కమ్మదనాలు
పండ్ల పక్వరసాలు
పొంగారు పదములన్ - బంగారు ఫణతులన్

వినిపించె నా చిల్క
తెనుగు వాకిండ్లలో-
పెనుగు పూబెండ్లలో-
మిసలాడు మవ్వాల - అసియాడు అందాల

పాడితే ఆ చిల్క
పారవశ్యము పొంగు
భావదాస్యము క్రుంగు-
తెగిపోవు పీఠియల్ - దిగివచ్చు వాణియున్

విన్నారు జనులెల్ల
విన్నారు - పండితుల్
విన్నారు పాఠకుల్
భూచక్ర ముల్కగా - ఆ చిల్క పల్కగా

బ్రహ్మాండమయినట్టి
భాష్యాలు తుదిముట్ట-
పఠియించె నొాక భట్టు
పాండిత్యమున వచో - ఖాండంబు బరువెక్క

ఆ చిల్క నుడికార
మావేశ మెగబోయు-
ఆలించివలవేయ
పరవశంబున జిక్కి - పరతంత్రతనె మెక్కె

తెలుపారె తూర్పెల్ల
తెనుగు కుంకుమ తీగె
లనుగు కొమ్మలు సాగె-
ఎలుగెత్తె నా చిల్క - అలవాటు మైగల్క

ఆ యగ్ని వేదిః న్
ఆ శబ్ద ఘోషలో
ఆ శిష్ట భాషలో
ఉడికింది ఆ చిల్క - మిడికింది కడు నల్క

మ్రాగన్ను పెట్టింది
మధుర కంఠము మూసి-
మనసు ముచ్చట రోసి-
గాసిల్లి గాసిల్లి ఆసించె తొలి యిల్లె

భారతారణ్యాన
పడిపోయె నా భట్టు-
విడిపోయె వాకట్టు
ఇదె సందనుచు చిల్క - యెగిరిపోయింది.

ఈ గేయంలో సంస్కృత భాషా ప్రభావం వలన తెలుగు భాష ఏ విధంగా ఉక్కిరి బిక్కిరి అయినదో వెల్లడి అవుతున్నది. సంస్కృత భాషా ప్రభావం ఒక్క తెలుగు మీదనేకాదు, ఇతర దేశ భాషలమీద కూడా అత్యధి కంగా పడినది. తెలుగులోను, దేశభాషలలోను ప్రావీణ్యం కావలెనంటే సంస్కృ తంలో పాండిత్యం తప్పని సరియైన పరిస్థితి కలిగినది. అందుచేత జనసామాన్యం యొక్క సాహిత్యం మరొక పాయగా రూపొందక తప్పలేదు.

సంస్కృతంతో పాటు, రామాయణ, భారత, భాగవతాలు భారతీయ సాహిత్యాన్ని ప్రభావితం చేసినవి. రామాయణ భారత, భాగవతాలు విశ్వజనీన ములై సామాజికంగా ఉన్నత ఆశయాలు కలిగిన గొప్ప రచనలు కాని యితర కావ్యాలను గురించి యీ మాట చెప్పడానికి వీలులేదు. సంస్కృత భాషా ప్రభా వానికి లోనైన యితర కావ్యాలు భారతదేశంలోని అన్ని భాషలలోను కొద్ది మందికి మాత్రమే పఠన యోగ్యములైనవి. చదువురాని జనసామాన్యం రామా

యణ, భారత, భాగవత ప్రభావానికి లోనైనప్పటికిని యితర కావ్యాల ప్రభావానికి లోనుకాలేదు. తెలుగులో రాజులు, జమీందారుల పోషణలో సుఖజీవనమే గాక విలాసజీవనం గడిపిన కవులు వ్రాసిన కావ్యాలు జనసామాన్యానికి ఏమాత్రం ఉత్తేజాన్ని కలిగించలేకపోయినవి. రామాయణ, భారత, భాగవత కథలు విన్న జనసముదాయం ఉత్తేజం పొంది యిందులోని కథలను, యితివృత్తాలను కొన్నింటిని మార్చి హాయిగా తమ అభిరుచులకు అనుగుణంగా పాడుకున్నారు. ఊర్మిళాదేవి నిద్ర, లక్ష్మణదేవర నవ్వు, కుశలవకుచ్చలకథ, సులోచనకథ, ధర్మరాజు జూదం మొదలైనవి యిందుకు నిదర్శనం.

జైనము, బౌద్ధము, ఆనాటి సమాజ వ్యవస్థపై తిరుగుబాటు చేసిన ఉద్యమాలన్నమాట అందరికి తెలిసినదే. ముఖ్యంగా కులవ్యవస్థపైన, సమాజంలోని వ్యత్యాసాలపైన జైన, బౌద్ధాలు ధ్వజమెత్తినవి. కొంతకాలం జైన, బౌద్ధాలు బాగా వ్యాప్తిచెందినప్పటికిని క్రమక్రమంగా వాని ప్రభావం కూడా సన్నగిల్లినది. ద్వైత, అద్వైత, విశిష్టాద్వైతాలు వీనిని ఎదుర్కొన్నటువంటి ఉద్యమాలు. ఈ ఉద్యమాల ఆవిర్భావం, వ్యాప్తి, ఉన్నతి, క్షీణదశల వివరాలు యేమైనప్పటికిని ఎన్నడో ప్రారంభమై క్రమక్రమంగా బలపడి బాగా వేళ్ళు పాతుకుపోయిన కుల వ్యవస్థ యీనాటికిని మన సమాజంలో సుస్థిరంగా నిలిచి ఉన్నది.

నేటి రాజకీయాలలో, ముఖ్యంగా ప్రజాస్వామిక సామ్యవాద సరళిసమాజ వ్యవస్థలో కూడా, యీ కుల ప్రాతిపదిక ఎంత ప్రబలమైన శక్తిగా ఉన్నదో అందరి అనుభవానికి వచ్చిన వాస్తవం. కులముపైన, యితర సాంఘిక దురాచారాలపైన తిరుగుబాటు ఉద్యమాలు కొన్ని, జైన, బౌద్ధాలు బలహీనమైన తర్వాత కూడా వచ్చినవి. ఈ తిరుగుబాటుల ఆధారంగా కొంత సాహిత్యం ఆవిర్భవించి ప్రజలలో వ్యాప్తిచెందినది విశిష్టాద్వైతాన్ని బాగా ప్రచారం చేసిన రామానుజుడు కులవ్యవ్యవస్థను నిరాకరించి, హరిజనులకు సమాజంలో సమాన ప్రతిపత్తి కలిగించిన సంఘ సంస్కర్త. సంఘసంస్కర్తలలో యీయన అగ్రగణ్యుడని చెప్పితే అతిశయోక్తి కాజాలదు. శైవం కూడా యిదేవిధంగా కుల వ్యవస్థను నిరాకరించినది. ఈ ఉద్యమాలన్నీ భారతదేశమంతటా వ్యాపించి జనులలో బాగా ప్రచారానికి వచ్చి, ప్రజా సాహిత్య నిర్మాణాన్ని ప్రోత్సహించినవి. భక్తి ఉద్యమాలు మధ్యయుగంలో సమాజంలోని పేదవర్గాలను, కింది కులాలను ప్రభావితం చేసినవి. సాంఘిక ఆచారాలకు, కర్మకాండలకు ప్రాధాన్యం

యీయని యీ భక్తి ఉద్యమాలు, సమాజంలో సమానత్వాన్ని ప్రతిపాదించి పుట్టుకతో ఎవరికీ అధిక్యత రాదనీ, లేదనీ ఉద్ఘాటించి, మతంపేరిట ఆచరణలోనికి వచ్చిన దురాచారాలను, మౌఢ్యాలను తొలగించవలెనని ప్రచారం చేసినవి. భగవంతుని ఎదుట మానవులందరు సమానమని, భక్తి అందరికి సమానమని యీ ఉద్యమాలు ఉద్ఘాటించినవి హరిజనులు కూడా యీ ఉద్యమాలలో పాల్గొన్నారు. స్త్రీలు కూడా పాల్గొన్నారు. అండాళు, అక్కమహాదేవి, మీరా యిటువంటి స్త్రీలలో ముఖ్యమైనవారు. ఈ అభిప్రాయాలు, యీ ఉద్యమాలు అన్ని ప్రాంతాలలో వచ్చి, అన్ని దేశభాషలలో జనసాహిత్యాన్ని సృజించినవి. ఈవిధంగా రెండవ పాయయైన ప్రజల సాహిత్యం అవిర్భవించి వ్యాపించి వర్ధిల్లినది.

భారతదేశ చరిత్ర పరిశీలించినప్పుడు గుప్త సామ్రాజ్యం అంతరించిన తర్వాత రాజకీయ పరిస్థితులు ఆనాటి దేశభాషలలో సాహిత్యం రెండుపాయలుగా చీలిపోయి వ్యాపించడానికి కారణాలను వివరిస్తున్నవి. ఒక బలమైన కేంద్ర ప్రభుత్వం లేకపోవడం, సకల భారత స్థాయిలో కేంద్ర ప్రభుత్వం సమాజ శ్రేయస్సును గురించి ఆలోచించి ప్రజల అభ్యుదయానికి కావలసిన పనులు చేయకపోవడం మనకు భారతదేశ చరిత్ర తెలుపుతున్న సత్యం. భారతదేశంలో ఎన్నో సామ్రాజ్యాలు వచ్చినవి. కొంతకాలం దేశాన్ని పరిపాలించినవి. మహమ్మదీయులు, మొగలులు దండయాత్రలు గావించి సుస్థిర ప్రభుత్వాలను ఏర్పాటుచేసి దేశాన్ని పరిపాలించినారు. కాని ఆసేతుహిమాచల పర్యంతమైన యీ దేశంలో, వివిధ భాషలు మాట్లాడుతున్న ప్రజలుకల యీ దేశంలో, ఆర్థికమైన యిబ్బందులకు లోనై అత్యధిక సంఖ్యాకులు కనీస సౌకర్యాలకు నోచుకోని యీ దేశంలో, సాంఘికంగా అనేక దురాచారాలకు, మూఢవిశ్వాసాలకు గురియైన జనసముదాయం కల యీ దేశంలో, ఆర్థికంగా, సాంఘికంగా అత్యధిక సంఖ్యాకుల, అత్యధిక శ్రేయస్సును లక్ష్యంగా పెట్టుకొని 'సర్వేజనాస్సుఖినోభవంతు' అన్న ఆదర్శానికి అనుగుణంగా పరిపాలనను సమర్థవంతంగా నిర్వహించిన రాజకీయ, పరిపాలక వ్యవస్థ లేకపోయినది. కేంద్ర ప్రభుత్వాలు కొన్ని నూర్ల సంవత్సరాలు పరిపాలించినప్పటికిని వెనుకబడిన ప్రజల శ్రేయస్సు గురించి ఆలోచించిన ఉదాహరణలు ఎన్ని అన్న ప్రశ్నకు ప్రత్యుత్తరము చెప్పడము కష్టమే! తత్ఫలితంగా చిన్నచిన్న రాజ్యాలు, చిన్నచిన్న ప్రాంతీయ పరిపాలన వ్యవస్థలు, నాయకులు

దేశపరిపాలనను నిర్వహించడం జరిగింది. వీరి మధ్య కలహాలు, యుద్ధాలు చెల రేగినవి. సాధారణ ప్రజనుగూర్చి పట్టించుకున్నవారు లేకపోవడంవల్ల గౌతమ బుద్ధుని నాటి దృశ్యాలే యీనాటికి దేశంలో సర్వత్రా కనిపిస్తున్నవి. మతము పేరిట అనేక దురాచారాలు ప్రబలి, ఆరోగ్యకరమైన సంఘజీవనానికి ప్రతిబంధకములైనవి సాహిత్యము, కళలు రెండు పాయలుగా విడిపోవడం అనివార్యమైనది.

దేశంలో పైన పేర్కొన్న పరిస్థితులు వ్యాపించియుండగా సాధారణ జనులు వివిధ వృత్తులను తమ జీవనాధారంగా చేసుకున్నారు. వీరిలో స్వతంత్ర భావాలు వ్యాపిస్తూ ఉండేవి. ఇటువంటి స్వతంత్రభావాలు తిరుగుబాటు ఉద్యమాలకు దోహదం చేసినవి. ఈ స్వతంత్ర భావాలకు భక్తి ఉద్యమంకూడా ఆలంబన మైనది. మహమ్మదీయ రాజుల కాలంలో కొందరు మహమ్మదీయ మతం స్వీకరించినప్పటికిని ఆర్థికంగా వారి పరిస్థితులు కూడా మెరుగుపడలేదు. హిందూ సమాజంలోని ఆర్థిక అసమానతలు వారినికూడ పీల్చి పిప్పిచేసినవి. అందుచేత యీ భక్తి ఉద్యమాలు కింది కులాలవారిని, మహమ్మదీయమతంలో చేరినవారిని కూడా ఆకర్షించినవి. కులభేదాలు మతభేదాలు కూడదన్న భావాలతో భక్తి ఉద్యమం వివిధ రూపాలలో దేశమంతటా ప్రచారం పొందినది. తెలుగుదేశంలో అన్నమయ్య, వేమన, వీరబ్రహ్మం, సిద్ధప్ప మొదలైన కవులు యిటువంటి భావాలను ప్రచారం చేసినారు.

బౌద్ధం క్షీణదశకు చేరిన తర్వాత శంకరుడు, కుమారిలభట్టు బౌద్ధాన్ని దెబ్బగొట్టి అద్వైత మతాన్ని ప్రచారంచేసినారు. అయితే వీరిది జ్ఞాన ప్రధానమైన మార్గం. అందుచేత చదువుకున్న కొలతమందినే ఆకర్షించినది. తర్వాత నాథ సంప్రదాయం దేశంలో మొదలై, ప్రజలను తమవైపు అభిముఖులను చేసుకున్నది. ముఖ్యంగా మహారాష్ట్ర ప్రాంతంలో యీ సంప్రదాయం బాగా వ్యాపించినది. అందుకు కారణం యీ సంప్రదాయం కర్మకాండలను, మూఢాచారాలను, కులవ్యవస్థను వ్యతిరేకించడమేనని చెప్పవచ్చును. క్రమక్రమంగా శైవ, వైష్ణవాలు, సూఫీమతం మొదలైన ఉద్యమాలు బయలుదేరి ప్రజలను తమవైపు అభిముఖులను చేసుకున్నవి. దక్షిణాదిలో వైష్ణవమతం భక్తి మార్గాన్ని బాగా ప్రచారం చేసింది. సంత్ భక్తిమార్గంలో కులభేదాలేకాక హిందూ, ముస్లిం భేదాలు కూడా లేవని బోధించడం జరిగింది. ఈ విధంగా సంత్ మార్గం, నాథ మార్గం

శైవ, వైష్ణవాలు దేశమంతటా వ్యాపించి జనసామాన్యాన్ని బాగా ఆకర్షించినవి. ఇవన్నీకూడా ఉన్నత వర్గాల సంస్కృతిపైన వచ్చిన తిరుగుబాటు ఉద్యమాలేనని చెప్పవచ్చును. ఈ ఉద్యమాల ప్రభావం సాహిత్యంపై కూడా స్పష్టంగా కనిపిస్తున్నది. సామాజికంగా, విడివిడిగా ఉంటిన జనులకు యీ ఉద్యమాలన్నీ దగ్గరగా వచ్చినవి వారు కొంత సంఘటితం కావడానికి కూడా యీ ఉద్యమాలు తోడ్పడినవి. తమతమ వృత్తులను అనుసరిస్తూ కుటుంబ జీవనానికి దూరం కాకుండా యీ ఉద్యమాల ద్వారా, ముఖ్యంగా భక్తి ఉద్యమాలద్వారా సమాజానికి దారిచూపించినారు. కబీరు, తుకారాం, రైదాస్, వీరబ్రహ్మం, సిద్ధప్ప కుల నిరసనతోపాటు హిందూ, ముస్లింల సమైక్యతకూడా యీ భక్తిమార్గంలో మనకు కనిపిస్తున్నది. ఆర్థిక, సామాజిక వ్యత్యాసాలను వ్యతిరేకించడమే యిందుకు కారణమని మనం అనుకోవచ్చును. కులభేదాలు పోవలెనని, మిథ్యాడంబరాలు కూడదని కబీరు ఎలుగెత్తి చాటినాడు. హిందూ, ముస్లింల సమైక్యతను బోధించినాడు. కర్మకాండలను, మూఢవిశ్వాసాలను ఖండించవలెనని బసవేశ్వరుడు నొక్కి చెప్పినాడు. సామాజిక దృక్పథం, సంఘసంస్కరణ దృక్పథం భక్తిమార్గంలోను, విశేషించి పైన పేర్కొన్న ఉద్యమ నాయకుల సుభాషితాలలోను స్పష్టంగా కనిపిస్తున్నవి. చిత్రమేమనగా, ఉదారమైన భావాలు ఎన్ని ప్రకటించినను వీరిలో కొందరు స్త్రీలను గర్హించినారు. ఇది శోచనీయం కబీరు, వేమన, వీరబ్రహ్మం వంటి వారి రచనలలో యిందుకు ఉదాహరణలు మనకు కనిపిస్తున్నవి.

భారతదేశమంతటా పైన పేర్కొన్నటువంటి ఉద్యమాలు కొనసాగినవి. ఆ ఉద్యమాలను ప్రచారంచేసే రచనలు వచ్చినవి. ఈ రచనలు జనసముదాయాన్ని ఆకర్షించినవి. ఈ రచనలన్నీ జనసముదాయానికి అందుబాటులో ఉండే భాషలోనే వచ్చినవి. చాలామట్టుకు యీ రచనలన్నీ వాడుకభాషలో పాటల రూపంలో ఉన్నవి. సూటిగా హృదయాలకు హత్తుకొనిపోయే శైలి, పాడుకొనుటకు అనువుగా ఉండేరీతి వీనిలో కనిపిస్తున్నవి. అలంకారాలు, వ్యాకరణాలు, శబ్దచిత్రాలు మొదలైనవి యీ శ్రేణి కవులకు పరిచితాలు కావు భాష ఏవిధంగా ఉంటే యేమి, భావం ముఖ్యమని యీ శ్రేణికి చెందిన కవి ఒకరు ఉద్ఘాటించినాడు.

దేశంలోని అన్ని భాషా ప్రాంతాలలో యిటువంటి ఉద్యమాలు కొంచెం వెనుకాముందు తలఎత్తి వర్ధిల్లినవి. తమిళ ప్రాంతంలో నాయనారులు, ఆళ్వారులు భక్తిఉద్యమాన్ని ప్రచారం చేయగా, కర్ణాటకంలో బసవేశ్వరుడు తన అభిప్రాయాలను ప్రచారంచేసినాడు మహారాష్ట్రలో నాథసంప్రదాయం వ్యాపించినది.

కర్మ కాండలను, వర్ణవ్యవస్థను యీ సంప్రదాయం వ్యతిరేకించినది. సూఫీ మతం నిరాకార ఈశ్వరుని ప్రేమస్వరూపాన్ని ప్రణయతత్వాన్ని ప్రబోధించి నది. ఈ వరుసలోనే సంత్ భక్తిమార్గంకూడా వచ్చినది. ఇందులో కర్మకాండల ధిక్కారం, భక్తి, సూఫీ ప్రణయతత్వం మొదలైన అంశాలతోపాటు బౌద్ధ, జైనాల ప్రభావంకూడా గోచరిస్తున్నది. సంత్ కవుల రచనలు అనేకం గురు గ్రంథ్ సాహెబ్‌లో చేరినవి నానక్ సిఖ్ మతస్థాపన గావించినాడు. మహారాష్ట్ర నుండి పంజాబువరకు భక్తి ఉద్యమాలు వ్యాపించినవి, అస్సాం, ఒరిస్సాలలో రాధా మాధవ ప్రణయతత్వం ప్రధానమైన వైష్ణవభక్తి వ్యాపించినది.

ఒక్కసారి ఈ ఉద్యమాలను, ఉద్యమాల నాయకులను పరిశీలించితే యిందులో అనేక కులాలకు, వర్గాలకు సంబంధించినవారున్నట్లు స్పష్టమౌ తున్నది. సంప్రదాయంపై తిరుగుబాటు. కులాల వర్గాల నిరసన వీరందరి బోధ నలలో సామాన్యధర్మంగా కనిపిస్తున్నది బసవని వచనాలలో సర్వసమానత్వ భావన మనకు స్పష్టంగా కన్పిస్తున్నది. మహమ్మదీయ మతానికి చెందినవారు కూడా యిందులో కన్పిస్తున్నారు. మీరాబాయి రాజకుటుంబానికి చెందినది; మాణిక్య వాచకర్ మధుర, తమిళ రాజ్యంలో మంత్రిగా ఉండెను. కృష్ణమా చార్యులు, అన్నమాచార్యులు అగ్రవర్ణాలకు చెందినవారు. నాందేవుది దర్జీవృత్తి; తుకారాం దుకాణదారు; గుజరాతులోని అఖౌ కంసాలివాడు; సాధన కటికవాడు, దాదు దూదేకులవాడు; సేన మంగలివాడు, రైదాస్ చెప్పులు కుట్టేవాడు, కబీరు ముస్లిం మతానికి చెంది నేతవృత్తి నవలంబించినాడు. రామానంద్‌వంటి అగ్రవర్ణానికి చెందిన వేదాంతి కబీరును గుర్తించినాడు ఈవిధంగా వివిధ మతాలవారు యీ ఉద్యమాలను దేశంలోని అన్ని ప్రాంతాలలో స్థాపించి ప్రచారం చేసి మానవునికి - మానవునికి మధ్య అడ్డుగోడలు ఉండకూడదని, హెచ్చు తగ్గులుఉండకూడదని ఉద్ఘాటించినారు.

తెలుగులో యీవిధమైన సామాజిక భూమికతో వ్రాసిన కవులు చాలా మంది ఉన్నారు. వారి రచనలు కొన్ని శతాబ్దాల నుండి ప్రచారంలో ఉన్నవి. భక్తి, నీతి, తత్వం, సంఘవిమర్శ, తిరుగుబాటు ధోరణి యిందులో కనిపిస్తు న్నవి. మన సాహిత్య చరిత్రలో వీరి ప్రస్తావన లేదు! ఎవరో ఒకరి ప్రస్తావన ఉన్నప్పటికిని వారిని గురించి చెప్పినది మిక్కిలి తక్కువ. వారి రచనలకు తగిన విలువకట్టడం జరుగలేదు. "వేమన కవికాడు" అన్న పండితులు కూడా

కొంతమంది ఉండినారు. తెలుగు భాషను సంపన్నం చేసిన తాళ్ళపాక కవులకు కళలను, విద్యను పోషించిన చక్రవర్తులుగా మన కవులచేత పొగడ్తలందిన రాజులయాదరణ లభించినట్లు కనిపించదు. ఆశ్రయించడంలో నేర్పు, పొగడ్తలు చేయడంలో ప్రావీణ్యం కలిగి, రాజుగారి ఉంపుడుకత్తెలపైన కూడా పద్యాలు, కావ్యాలు రాయడానికి సందేహించని శుష్క పండితులు, స్తోత్ర విద్యలో ఆరి తేరిన ప్రవీణులు మాత్రమే ప్రాధాన్యం వహించే వ్యవస్థలో సమాజాన్ని గూర్చి ఆలోచించి జనుల దగ్గరకు వచ్చిన కవులకు పరిపాలకుల గుర్తింపు రాలేదు. మనదేశ పరిస్థితులు తెలిసిన వారెవరూ యిందుకు ఆశ్చర్యపడవలసిన పనిలేదు తెలుగులో యిటువంటి కవులు ఎవరు? వీరు వెల్లడి చేసిన అభిప్రాయాలు ఏమి? అన్న ప్రశ్నలు సహజంగా ఉత్పన్నమౌతున్నవి. ఈ ప్రశ్నలకు సమాధానంగా యీ ప్రసంగాన్ని ముగించడానికి ముందుకు నాలుగు మాటలు చెప్పవలసి ఉన్నది.

'సింహగిరి వచనాలు' రాసి తెలుగులో వచన కవితకు మార్గదర్శకుడైన కృష్ణమాచార్యుడు పద్నాల్గవ శతాబ్దంలో భక్తిమార్గాన్ని ప్రబోధించినాడు. ఆయన రచనలలో భక్తిగలవారందరూ సమానులే అన్న అభిప్రాయం స్పష్టంగా కనిపిస్తున్నది చూడండి!

> దేవా విష్ణుభక్తిలేని విద్వాంసునికంటె హరికీర్తనము సేయునతడె కులజుండు, శ్వపచుండైననేమి? ఏవర్గంబైన నేమి? ద్విజునికంటె నతడె కులజుండు సంధ్యా-వందనాది-నిత్యకర్మానుష్ఠానంబులు దప్పక సలిపిన నేమి? సకల ధర్మంబులు సేసిన నేమి? మా సింహగిరి నరహరిదాసులకు దాసులైన-గాని లేదుగతి! సింహగిరినరహరీ, నమో నమో దయానిధీ!

అన్న కృష్ణమూర్యుని వచనంలో పదమూడు, పద్నాల్గవ శతాబ్దాల్లోనే. అనగా కాకతీయులు తెలుగుదేశాన్ని పరిపాలించిన కాలంలోనే, తిక్కన జైన, బౌద్ధులను వాదంలో ఓడించి, హరిహర అద్వైతాన్ని ప్రతిపాదించిన కాలంలోనే, మానవునికి, మానవునికి మధ్య భేదాలు ఉండకూడదనే అభిప్రాయాలు ప్రకటిత మైనవని మనం గమనించవలసి ఉంటుంది.

తెలుగులో తాళ్ళపాక కవులది ప్రత్యేకమైన స్థానం. వారు విజయనగర రాజులకు సమకాలికులు. డాక్టర్ పుట్టపర్తి నారాయణచార్యులవారి అభిప్రాయం

ప్రకారం "తెలుగు పదములను జోడించుటలో తిక్కనకు పిడిచేయి అన్నమయ్య. ఆయనలో భాష మైనంవలె వంగును. అన్నమయ్యలో కవిత్వమును నేటిపట సముద్రమునకు ఏతమెత్తుట."

రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు అన్నమయ్య కవిత్వాన్ని ప్రశంసిస్తూ- "అసాధారణ భావన, స్వతంత్ర మధురధార, భావములోని అసందిగ్ధమైన ఆర్జవము, విషయ వైవిధ్యము అన్నమయ్య కవితలోని ప్రధాన గుణములు" అని అన్నారు. సంగీత సాహిత్యములలో పెన్నిధి అయిన అన్నమయ్య—'ఎంమి హరిదాసు లేజాతియైననేమి ? తలమేల ? కులమేల? తపమె కారణము' అన్నాడు. అంతేకాదు—

'నిండార రాజు నిద్రించు - నిద్రయు నొకటే
అండనే బంటునిద్ర - అదియు నొక్కటే
మెండైన బ్రాహ్మణుడు - మెట్టుభూమి యొకటే
చండాలు డుండేటి - సరిభూమి యొకటే.'

అని కూడా అన్నాడు-

ఇటువంటి అభిప్రాయాలు కల అన్నమయ్య సంకీర్తలను మరికొన్ని చూపించవచ్చును. ఆనాటి దేశ పరిస్థితులలో అన్నమయ్య వంటివారు చేసిన సంఘ విమర్శ యిది.

ఇక వేమన్నను గురించి తెలియని వారు తెలుగుదేశంలో లేరు. నాటి సంఘంలో వ్యాపించియున్న దురాచారాలను ఎలుగెత్తి ఖండించిన వేమన, తెలుగు కవులలో అన్ని విధాల విశిష్టమైన వ్యక్తి.

చూడండి.

'మాల మాలగాడు మహిమీద నేప్రొద్దు
మాట తిరుగువాడె మాలగాక,
వాని మాల యన్నవాడెపో పెనుమాల
విశ్వదాభిరామ వినురవేమ'

అన్న వేమన పద్యం, గురజాడ అప్పారావు-

'మంచి అన్నది మాలయైతే
మాల నేనౌదును'—అన్న ముత్యాలసరానికి ప్రేరణ అని చెప్ప వచ్చును.

మరొక పద్యం చూడండి—

'ఆత్మశుద్ధిలేని యాచార మదియేల
భాండ శుద్ధిలేని పాకమేల
చిత్తశుద్ధిలేని శివపూజ లేలరా?
విశ్వదాభిరామ వినురవేమ.'

అన్నమాట ఆనాటి సాంఘిక పరిస్థితిని గూర్చిన విమర్శయే కదా?

వీరివలెనే తెలుగుదేశంలో వీరబ్రహ్మం, సిద్ధప్ప మొదలైన కవులు యింకా యితర తత్వకవులు ఆనాటి సాంఘిక పరిస్థితులను నిశితంగా విమర్శించి, సమాజంలో ఉన్న వ్యత్యాసాలను వ్యతిరేకించి, సమస్త మానవుల సమానత్వాన్ని ప్రతిపాదించినారు. జనసముదాయానికి అర్థమయ్యే భాషలో వీరు తమ రచనలను కొనసాగించినారు. ఇందులో చక్కని తెలుగు నుడికారాన్ని చూడవచ్చును. వీరి రచనలు సాధారణ ప్రజలు పాడుకొని ఉత్తేజం పొందుతారు.

1981-82 'సారస్వత వేదిక' ప్రతినెల జరిగే ఉపన్యాసాలలో 'తెలుగులో భక్తి, తత్త్వ కవుల'ను గురించి విడివిడిగా వివరాలను తెలిపి, వారి సాహిత్యాన్ని సమీక్షించడం జరుగగలదు. ఈ కవులందరు సాహిత్య చరిత్రలో స్థానం పొందనివారు. రాజకీయాధికారం చేజిక్కించుకొని జనులమీద అధిపత్యం వహించిన రాజులు, జమిందారులు, మంత్రులు, పురోహితులు మొదలైన అగ్రవర్ణాల గుర్తింపుకు రానివారు. కర్మకాండలను, సాంఘిక దురాచారాలను, కుల వ్యవస్థను, వర్ణాశ్రమ ధర్మాన్ని వ్యతిరేకించిన వీరి సాహిత్యం జనులలో బాగా వ్యాప్తి చెంది, వారిని ప్రబోధించి సంఘటితపరచినది. స్వతంత్రభావాలు కలిగిన ఈ కవులు జాతికి వెలుగుబాట చూపించినారు.

వేయి సంవత్సరాలకుపైగా భారతదేశంలోని భిన్నప్రాంతాలలో రచనలు గావించిన యీ సమాజ కవులు ప్రజలమధ్య జీవించినారు; ప్రజల కష్ట సుఖాలలో పాలు పంచుకున్నారు; ప్రజల నాల్కలమీద ఆడే భాషలో ప్రజలలో జాగృతిని కల్గించడానికి, సమాజ సంక్షేమం సాధించడానికి మానవ శ్రేయస్సు

కొరకూ రచనలు గావించినారు. జీవిక కొరకు ఏదో ఒక వృత్తిని అవలంబించి ఎవరిపని వారుచేసుకుంటూ, పొలములమీద కవితలు అల్లి, సులభంగా ద్రవ్యార్జన చేసి విలాసజీవనం గడుపుకునే కోరికలు ఏమాత్రం లేక, రచనారంగంలో ముందడుగు వేసినారు. లోకహితార్థము కవితలు అల్లినారు. మన అలంకారికులు కావ్యం విశ్వశ్రేయస్కరము కావలెనని అన్నారు. ఈ కవుల రచనలు నూటికి నూరుపాళ్ళు విశ్వశ్రేయస్కరాలు. తమకు కనిపించిన దృశ్యాలచే ప్రేరితులై, అజ్ఞానము, పేదరికములలో మునిగితేలుతున్న తోడిసోదరుల ఉన్నతి కొరకు కవిత్వాన్ని అల్లిన ఈ కవులు సమస్త ప్రపంచాన్ని తమ కుటుంబంగా భావించిన ఉదార చరిత్రులు.

గురజాడ అప్పారావుగారు—

'మతం వేరై తేను యేమోయ్?
మనసు లొకటై మనుషులుంటే
జాతమన్నది లేచి పెరిగీ
లోకమున రాణించునోయ్!
చెట్టపట్టాల్ పట్టుకొని
దేశస్థులంతా నడువవలెనోయ్!
అన్నదమ్ములవలెను జాతులు
మతములన్నీ మెలగవలెనోయ్!'

అన్నారు.

ఇందుకు అనుగుణంగా వీరి కవిత కొనసాగి దేశీయుల అభిమానాన్ని చూరగొన్నది.

'ఆకులందున అణగి మణగీ
కవిత కోవిల పలుకవలెనోయ్,
పలుకులను విని, దేశమందభి
మానములు మొలకెత్తవలెనోయ్.'

(4-10-1981 నాడు ఆంధ్ర సారస్వత పరిషత్తు పక్షాన నిర్వహించే సారస్వత వేదిక ప్రారంభోపన్యాసం)

# నవ్య కవితా నీరాజనము*

## I

### కవి స్రష్ట

కవిత్వము లలితకళలలో నగ్రగణ్యము. లలితకళలను నామమే వాని రామణీయకమును ప్రస్ఫుట మొనరించుచున్నది. లలితకళలు సౌందర్య ప్రధానములు. వానియనుభవము హృదయాహ్లాదకరము. శ్రావ్యమగు గానము వినినప్పుడు చక్కని చిత్రము చూచినప్పుడు సరసమగు పద్యము జదివినప్పుడు మనకు కలుగు దివ్యమగు నానందము అనిర్వచనీయము, అనుభవైకవేద్యము.

కళానుభవము మనశ్శాంతి కమూల్యమగు సాధనము. మనస్సు కలతపడి చీకాకు నొందినప్పుడు తమ యభిమాన కళోపాసనము చేత తాత్కాలికముగా వేదననుండి విముక్తులై తన్మయానంద మొందువారు కలరు. సంతోష సమయమున కళోపాసనము మన యానందమును ద్విగుణీకృత మొనరించును. ఏకాంతముగా నున్నప్పుడు, పనిపాటలు లేనప్పుడు, విశ్రాంతి కాలమున కళోపాసనము మనకాప్తమిత్రము. ముఖ్యముగా కవిత రసిక జనచకోరములకు పూర్ణ చంద్రోదయము. కళాపుష్పవాటికాంతరమున ప్రవేశించి యందలి యరవిరి మొగ్గలను అరవిచ్చిన సుందర సుమచయమును కోరికదీర గోసికొని వాని సౌందర్య సౌరభ్యముల మనసార ననుభవించి తన్మయులై యానందమున నోలలాడు భాగ్యము రసార్ద్రహృదయులది. కళోపాసకునికి ప్రకృతి యంతయు ప్రేమ మయము, సౌందర్య పూర్ణము, ఆనందదాయకము.

రమణీయములగు నర్థములనిచ్చు సుందర పదసముదాయమే కావ్యమని చెప్పనొప్పును. రామణీయకమనగా క్షణ క్షణ నవ్యతను జూపి మనల నానంద పరవశుల జేయుగుణము. నిక్కపు కవిత కిట్టిగుణము సహజసిద్ధము. భాగవత

* (1943-44 సంవత్సరాలకు మధ్య హైద్రాబాదు నుండి వెలువడిన తెలంగాణా దినపత్రికకు వ్రాసిన వ్యాసాలు)

మందలి గోపాల కృష్ణుని బాల్య క్రీడలవర్ణన, గోపికా గీతములు, భ్రమర గీతములు మున్నగువి యిందుకు నిదర్శనములు. ఈ భాగముల నెన్నిమారులు జదివి నను తనివి దీరదు. మనము వానిని పఠించు ప్రతి పర్యాయమును అందేదో క్రొత్తదనము గోచరించును. ఈ క్రొత్తదనమే కావ్య రామణీయకమునకు ప్రత్యేక లక్షణము.

ఉద్రేకమే కవితకు ప్రాణాధారమని యొకానొక యభిప్రాయము. ఉద్రేకము లేనిది యే మహాకార్యమును నెరవేరుట దుస్తరము. అనాథల నిమిత్తము తన సర్వస్వము ధారవోయు త్యాగశాలి, దేశ స్వాతంత్ర్య సంపాదనార్థము తన ధన మాన ప్రాణములనర్పించు వీరవరేణ్యుడు ఇందుకు దృష్టాంతములు. ఇతర రంగముల నట్లుంచినను సాహిత్యాంగణమున గూడ ఉద్రేకము ప్రముఖ పాత్ర ధరించుచున్నది. ఉద్రేక ఫలితములగు మనోవికారములు, భావములు శాంత సమయమున సహజ ప్రతిభాశాలియగు వ్యక్తిచే సంస్మరింపబడి కవితా రూపమున ప్రత్యక్షమగును. భావోద్రేకమన నేమియో యెరుగని శుష్క హృదయులు కవులెన్నటికిని కాజాలరు. ఉద్రేకముయొక్క అభావము కళా సౌందర్యాభావమేయని చెప్పిన అతిశయోక్తి కానేరదు. హృదయము భావ ప్రపూర్ణమై రసార్ద్రమై విలసిల్లినప్పుడే కవికుమారుని లేఖనీ ముఖమున ముత్యాలవర్షము కురిసి, సాహితీ క్షేత్రమును సస్యశ్యామలము గావించును.

చూడుడు-

"చైత్రపల్లవదూతి చక్కిలిగింతలన్, గుస్తరింపగబాడు కోకిలంబు;
జలకమాడిన నభోజననిఘనాలక లారవిప్పిన వేళనాడు నెమలి;
పండు వెన్నెల జున్నుబాలు చేపినరేల స్వరజతుల్ వల్లించు
భ్రమర బాల; దానిమ్మ పగడాలు కానుపుగనునప్డు నామ
కీర్తనసల్పు రామచిల్క; అట్లే, "ప్రాణిలోకము రసవదిష్టార్థరక్తి
వివశమగునప్డుయు" న్మక్త యగును కవిత."

కవిత్వతత్త్వ నిరతిశయానంద భావభరితాంతః కరుణుడై తిక్కనార్యుడు భారతరచనకు కృత ప్రయత్నుండయ్యెనట. ఆయన యొక దివ్య స్వప్నమున హరిహర నాథునిచే ప్రబోధితుడగుట భవ్యమగు కవితావేశ ప్రభావము. సోమయాజిది గంభీర మగు భావనాశక్తి. ప్రహ్లాద గజేంద్రులలో లీనుడై రస

పారవశ్యమున తన్మయుడైన పోతన్నది తన్మయ భావనాశక్తి. ముఖ్యముగా నీ యిరువురి రచనల సౌందర్యమునకు కారణము ఆవేశమేయని తెలియనగును. భావనాశక్తి యేరూపమున ప్రత్యక్షమైనను దానికి ప్రోత్సాహ కారణము ఉద్రేకమే. పరమ పవిత్రమగు వైదికావేశమేకదా నన్నయార్యుని కావ్య మహత్వమునకు హేతువు.

సహజ ప్రతిభాశాలియగు కవి సృష్టిలో నే వస్తువును తిలకించినను ఆతని హృదయమున నొక విధమగు నుత్సాహము జనించి, ఆవేశభరితుడగును. అప్పుడాతని హృదయమున కొన్ని భావములు జనించి రసోదయమగును. ఈ విధముగ భావమునకు రసమునకు జన్యజనక సంబంధము గలదు. కవితయందు భావప్రాధాన్యమును ఉద్రేక ప్రాముఖ్యమును స్పష్టీకరించుట కొరకే నవ్యకవితకు భావకవిత్వమను నామాంతర మొసంగినారు ఆధునికులు. ఎవ్వాని హృదయము అపూర్వములగు భావములకు నిలయమో అదియే రసమునకు నిధానము; రామణీయకమునకు పట్టుగొమ్మ. అట్టి-

వానిడెందంబు సోకిపోవని తలపులు
వాని కనుసన్నతలలు వంపనియుపమలు
వాని కలమున కులుకు జూపని పదములు

యీ ప్రపంచమున గానరావు. చూడుడు- బాలెంతరాలైన యొక పల్లెటూరి పడుచునుగాంచి యాధునికాంధ్ర కవి శేఖరుడేమని ప్రశ్నించుచున్నాడో!

అత్యంత సుకుమారివైనట్లు గనుపింతు
వేలాగు నడిచితో యీ దూరపథమెల్ల
ఏ లీల గడచితో యీ ముండ్ల పొదలెల్ల
ఆకుపచ్చని నిగ్గు లసియాడు నీమేన
ఏ భంగి మోసితో యీ పాలభాండంబు
ఏ చాయ మూసితో యీ బాల భాగ్యంబు

అప్పుడు-

కూర్చుండు మొక్కింత చేర్చుక్క చెమటార
సోలేవులేకున్న సురపొన్న సుమమట్లు

ప్రాలేవు లేకున్న పసితమల్లాకట్లు
గులక జాబాటలన్ మొలక పూదోటలా
గేచాయ మార్చితో యీ మెత్తని పదాల
యేతల్లి నేర్పెనో యింద్రజాలంబు
—అని ఆశ్చర్యమొంది

ఎవరియింటివి ఆలు ఎవరు పిండిరి పాలు
చిన్నారిలేగలన్ కన్నెతీగలగట్టి
కన్నారికడకిట్లు మున్నెవచ్చితివెట్లు
పాలూరునీపల్కు బాలెంతసిచిల్కు
పాలీయ వచ్చితీ పదరానిపాట్లోర్చి
పాలమ్ము వ్రతమంత భావగతోక్తంబో?

అని యర్థాంతరన్యాసమున ముగించు నప్పుడు భావము భాషయను ఇరువురు బాలకులు "నేను ముందు నేను ముంద"ని పందెము వైచుకొని రస సముద్రము నీదుచున్నారోయను భావము కల్గుచున్నది.

కవి సృష్టికర్త. ఆనంద సౌందర్యము లీ సృష్టికి ప్రత్యేక లక్షణములు.

"తమ్మిచూలుకేలు దమ్మినిగలనేర్పు
కవికలంబునందు గలదుగాన
నీశ్వరత్వమతనికే చలామణీయయ్యె."

కవి నిర్మిత జగత్తు మన దైనందిన వ్యవహార ప్రపంచమునకు శుష్క నీరసాను కరణముగాదు; ప్రతిభావంతమగుస్వతంత్ర నిర్మాణము. కవిప్రకృతిని తన కవితా దర్పణమున ప్రతిఫలింప జేయవచ్చును. కాని తత్కార్య నిర్వహణ మందు గూడ నాతడొక విధమగు నవ్యత, స్వీయ ప్రతిభ ప్రదర్శించుచున్నాడు. జుగుప్సాదులను ధూమ కలుషిత దుర్గంధములను తిరస్కరించి హ్లాదరణీయము లను, సౌందర్య మాధుర్యములను గ్రహించును. "ప్రకృతి యందు రమ్యము గాని వస్తుతతిని చిత్రకళలు రమ్యముగ దీర్చెడిని." అంతియేకాని కవియంధుడై ప్రకృతిని నీరసముగా ననుకరింపడు. రమ్యముగా దీర్చుటలో కవి స్వీయభావనా మహిమను, నిర్మాణకౌశలమును ప్రదర్శించి, రవిగాననిది కూడ కవిగాంచునని తెలియజేయుచున్నాడు.

నీరు తీసిపోయిన తటినీ తటాల
పొరలుపడ్డ యిసుక మడపులను చూచి
పానుపును వీడిలేచు భామానితంబ
గళిత సిత దుకూలాంచలముల

స్మరించుట కవి ప్రతిభకు నిదర్శనము.

స్వీయ నిర్మాణ జగమునందు కవి సర్వ సమర్థుఁడు. అందాతనికి దుస్సాధ్యమగు కార్యమే లేదు. దైనిక ప్రపంచమున దైవసంకల్పమువలె కావ్య జగత్తునందు కవి కుమారుని సంకల్ప మమోఘము.

భావములను వ్యక్తీకరించు సాధనము భాష. కావ్య సంసారమున శబ్దార్థములకు గల సంబంధము మానవప్రపంచమునందలి దాంపత్యమును బోలును. వీనిలో నొకటి లేక యింకొకటి శోభిల్లదు. రెండింటి సంయోగమే ఫలప్రదము. భావమున కాహ్లాదమెంత ప్రధానమో శైలికి సౌందర్యమంత ముఖ్యము. కవిత ఆనంద సౌందర్యములచే విలసిల్లునది కదా! ఆనందము భావమున; సౌందర్యము శైలిలో. ఈ యానంద సౌందర్యముల సమ్మేళనమే రామణీయకము. ఏ విధముగ దుఃఖము, కరుణ మున్నగు రసముల ననుభవించుటలో ఆనందము కలదో, అదే విధముగ క్రోధాదులను వర్ణించు రీతులయందు సౌందర్యము కలదు. సందర్భములనుబట్టి శైలియు భేదించును. ఏ భావమునకు యే శైలియే వృత్తము అనుగుణ్యమో అది చక్కగా తెలిసి వ్రాసిన మహాకవి తిక్కన. కవుల చోద్య ప్రయోగ కౌశలము అమృత శబ్దావతారము దాల్చి, పాఠకులను శిరీష కుసుమ పేశల సుధామయోక్తులతో చిరునవ్వు పెదవుల కందళింప పలుకరించును. కావ్య శైలీ మాధుర్యమునకు ప్రమాణము శ్రవణ సుఖము. పరభాషా పదములను స్వీయభాషా సంప్రదాయమున కనుకూలముగ అవసరము గలిగినపుడు పోహళించి స్వీయభావ ప్రబోధము జేయువారే నిక్కంపు కవులు.

కవులు నిరంకుశులు. వారికి ''ఇవి వలయును, ఇదికూడ''దని యాజ్ఞాపించుట యసమంజసము. రసానుభవమే మన విధి; అన్యములు మన కనవసరములు. భోజ్యములు రుచికరములుగా నున్నవియా యని పరిశీలించుటయే మన విధి. కాని ప్రత్యేక పరిమాణ యుక్తముగ లవణాదులను వాడవలయు

ననుట భావ్యము కాదు. ఇట్టి నలంకారములు వాడవలెను, ఇట కూడదు అనియు, పాత్రలు ప్రత్యేక లక్షణములతో నొప్పారవలె ననియును విధించుట సహృదయ లక్షణముగాదు. కావ్యరచనకు కావలసినది సహజ ప్రతిభకాని, కేవలము ఛంద శ్శాస్త్ర పాండిత్యము, వ్యాకరణ నేతృత్వము కాదు. కావ్యము సహృదయుల కానందము గూర్చగలదా యను ప్రశ్నయే ముఖ్యము; ఇతరము లసంభావ్యములు.

కావ్యములు నీతిబోధకముగా నుండవలయునని యొక మతము; ఉండిన నుండవచ్చును. కాని కావ్య ప్రధానోద్దేశము నీతిబోధనము మాత్రము కాదు. నీతిని బోధింపక పోయినంత మాత్రమున నొక కావ్యమును రసప్రపంచము నుండి బహిష్కరించుట రసికసమ్మతముగాదు కావ్య ప్రధానోద్దేశమగు రస స్ఫోరకత్వమునకు నీతిబోధ విధేయమై యుండవలయును; కాని నీతివాదుల యొక్కయు తాత్వికులయొక్కయు అడుగులకు మడుగులొత్తుచు వారికి చరణా శ్రిత దాసియై కవితాకాంత యూడిగ మొనరింపజాలదు.

> కవికి తాత్వికునకు కయ్యంబె సాగెను
> బహుదినాలు వాక్ప్రపంచమందు
> రాగరక్తుడొకడు రాగముక్తుడొకడు
> సగుణ నిర్గుణముల సఖ్యమెట్లు?

మార్పు జగల్లక్షణము. మానవ ప్రపంచమున నిది స్పష్టము. ఆదినుండియు మానవుడెన్నియో మార్పుల నందినాడు. సమస్త వ్యవహారములందీ మార్పు సుస్పష్టము. సాహిత్య మీ సామాన్య సూత్రమున కపవాదము కాజాలదు. ఇంత యేల? సాహిత్యమునకు మార్పే, నవ్యతయే శోభ గూర్చుననుట పరమసత్యము.

> "కాలధర్మానుగతమై జగత్ప్రవృత్తి,
> మారునపుడు వాఙ్మయమును మారు నిజము."

ఒక జాతి సారస్వతము ఆ జాతి జాతీయ జీవనము కద్దము వంటిది. కావున వాఙ్మయము ఒక పురుషాంతరము నుండి మరియొక పురుషాంతరము

వరకు క్రమక్రమాభివృద్ధి నొందు చుండును ఈ సందర్భమున రాయప్రోలు సుబ్బారావుగారి వాక్యములు ఉదాహరణ యోగ్యములు: "కవి కర్మయే కావ్యము; అయితే కవులన నెవరు? మంత్రద్రష్టలై ఛందస్సుల నవతరింప జేసిన వైదికర్షులు కవులు; విజ్ఞాన పారంగతులై యుపనిషత్తుల నుపపాదించిన బ్రహ్మవాదులు కవులు; ఆనందోపాసకులై మానవజీవిత మాధుర్యమును సంకీర్తన మొనరించిన కాళిదాసాదులు కవులు. అయితే యీ కవుల కందరకు ఏకాదర్శమే గోచరింపదు. లక్ష్యలక్షణముల రెంటను అంతర మగపడుచున్నది" ఆంగ్ల సాహిత్యమున గూడ నీ మార్పు విస్పష్టము. ఛాసరు షేక్స్పియరుల, మిల్టను కీట్సుల కావ్యము లిందుకు నిదర్శనములు. నన్నయ తిక్కనలు, ఎఱ్ఱన సోమనలు, శ్రీనాథ పోతనలు, పెద్దన సూరనలు. తెనుగు వాఙ్మయమున మార్పునకు త్రోవజూపిన వారు. లక్ష్యలక్షణముల రెంటి యందును ఈ కవులలో నంతర మగపడు చున్నది.

సంఘ జీవితమునకు సాహిత్యమునకు వీడరాని సంబంధము కలదు. ఒక కాలమునందలి నాగరికత ప్రత్యేక స్వరూపమును దాల్చుటకు కారణములు, ఆ నాగరికతపైన గల యితర ప్రభావములు (influences) ఆ జాతి సాహిత్యమునందును స్పష్టముగా గన్పట్టును. అసాధారణ ప్రతిభాశాలియగు రచయిత స్వీయ వాఙ్మయమునందు నూత్నశక మారంభించి సమకాలిక సాహిత్యమునకు క్రొత్తరుచులను గల్పించుటయు గలదు కాని యెంతటి శేముషీసింధువైనను సమకాలిక సంస్కృతి, విజ్ఞానము, ఆదర్శములు, నైతిక మానసిక విప్లవశక్తులు మున్నగువాని ప్రభావమునుండి తప్పించుకొనజాలడు. కవి వ్యక్తిత్వము, తత్కాలమందలి యాదర్శములు, వీని పరస్పర ప్రభావ పరిణామ ఫలితము సాహితీ చరిత్రమున నొక విలక్షణమగు రసవదధ్యాయమును ప్రారంభింప జేయును. ఇందుకు మన యాధునిక కవి కుమారుల ఖండ కావ్యములు ఉజ్వలోదాహరణములు.

అదియేమి చిత్రమో కాని ప్రపంచమున ప్రతి సారస్వతమునకు ఆరంభము పద్య రచనయే పూర్వకాలమున నేటివలె విజ్ఞానము ఎక్కువగా నభివృద్ధి నొందక, ఉన్నది కొంచెము సరిగా ప్రబలక యుండుటవలన, మానవుల

హృదయశక్తి బలవత్తరమైయుండెను. ఆనాడు వారి మెదడుకన్న హృదయమే గొప్పది. కావుననే కాబోలు గద్యరచనకన్న పద్యవాఙ్మయము, కవిత్వము ఆనాడు యెక్కువగా నభివృద్ధి నొందినది. ఆదికవులందరు పురాణములకే ప్రాముఖ్య మొసంగిరి; కావ్యములు, నాటకములు తరువాతవి. జనులకు మానవాతీతములగు విషయములందు రక్తియు, దేవతల మహిమయందు భక్తియు నిందుకు కారణమైయుండనోపును. కవులు తమ కృతులు జనాదరణకు పాత్రములు కావలెనను తలంపుతో రచించుటచే ఆనాడు ప్రజా జీవితమునకును అవినాభావసంధమే యుండెను. మతమునకు సంఘమునగల మహనీయ ప్రాముఖ్యము మానవుల నావేశ భరితులనుగా జేయుటలో దాని సామర్థ్యము, పురాణ రచనా కారణములలో నొక్కటియై యుండనోపును. కాల క్రమమున జనుల రుచి భేదమే సాహితియందలి మార్పునకు కారణమయ్యెను.

ఆంధ్రమున నన్నయాదులు స్వతంత్ర కావ్యరచనా శక్తికి చాలినవారయ్యును. పురాణముల నాంధ్రీకరించుట తోడనే సంతృప్తి నందియుండుటకు కారణములు దేశకాల పాత్రములేయనుట సత్యము. వైదికావేశమున సాంస్కృతిక బహుళంబగు శైలిని భారత రచన గావించిన మహాత్ముడు నన్నపార్యుడు. రాజనీతి రహస్యములెరింగి తీపి గొలుపు తెనుంగున భారత రచన సాగించి ప్రబంధావళికి బీజముల నాటిన వాఙ్మయ ధురంధరుడు తిక్కన సోమయాజి; నన్నయ తిక్కనల విలక్షణ వ్యక్తిత్వముల సమన్వయించిన దక్షుడు శంభుదాసుడు. సోమన శబ్ద చిత్రమునకు ప్రాధాన్యమిచ్చినాడు. పాల్కురికి కవి జాను తెనుంగున తన రచనలను విలసిల్లజేసి స్వీయభావ ప్రచారము నిరాఘాటముగా సాగించినాడు. శ్రీనాథ పోతనలు సమకాలికులు. అక్క చెల్లెండ్రనదగు భక్తి శృంగారములు వీరి రచనలయందు అల్లిబిల్లిగా నల్లుకొన్న రెండు తీగెలవలె నొప్పుచున్నవి. సానలదీరిన జాతిరత్నములను సాహితీసుందరికి కాన్క యొసంగినవారు పెద్దన రామరాజభూషణులు. కల్పనాచాతుర్యము సూరన్నది. వర్ణనా నైపుణ్యము రామకృష్ణునిది. ఇట్లాంధ్ర సారస్వతమున గణనీయుడగు ప్రతి వ్యక్తియు స్వీయాభిప్రాయములను, ఆత్మ వ్యక్తిత్వమును ప్రకటించుచు స్వతంత్రములగు దారులను ద్రొక్కి, మార్పు వాఙ్మయ లక్షణమని చెప్పక చెప్పినారు.

నీరసానుకరణములు, బింబ ప్రతిబింబ సదృశములగు ప్రబంధములు మన సారస్వతమున కొన్ని జన్మించినవి. పరంపరా గతములగు భావములే, పూర్వ ప్రబంధముల పోకడలే వానికి ముఖ్య లక్షణములు.

"శివుడున్ తాండవమాడ నాడవె, పిశాచీ భూత బేతాళముల్!"

శతక వాఙ్మయ మొక్కటే యీ కాలమున సాహిత్యమని చెప్పదగినది. ఇట్లుండ వచన వాఙ్మయమునకు పునాది వేసినవాడు చిన్నయసూరి. కాని తెనుగు వచనము చక్కదనముతో ముద్దులొల్కినది వీరేశలింగయుగమున. వీరేశ లింగము గద్యతిక్కన; అపరనన్నయ. మన వాఙ్మయమును సర్వాంగ శోభితను జేసినది వీరేశలింగం పంతులు. ఆయన "ఆంధ్ర సాహితీ పునరుద్ధరణ ప్రభావు"డనుట నిక్కువము.

# నవ్య కవితా నీరాజనము

# II

## నవ యుగోదయము

వీరేశలింగ యుగమున సాహిత్యలక్ష్మి నూత్న శోభలతో విలసిల్లినది. ప్రబంధ కవిత్వాది శృంఖలా విమోచనమువలన కళకళలాడు నెమ్మోముతో పెంపెసలారినది. నిడుదలగు సమాసములపై మక్కువ మాయమైనది. చదివినను వినినను జనుల కర్థమగు శైలికలిగి అల్పపద పరికరముతో అనల్పార్థమును వ్యక్తీకరించు గ్రంథ సముదాయముపై ప్రీతి హెచ్చినది. రాజుల ఇష్టానిష్టముల ననుసరించి వారికనుకూలమగు రచనలు సాగించు కాలమంతరించినది. సామాన్య ప్రజల జీవితమునకు ప్రాముఖ్యము హెచ్చినది. ఉద్రేకము కవితా రంగమున ప్రముఖస్థానము నాక్రమించినది. జీవకళతో సాహిత్యము తేజోవంతమైనది.

సారస్వత ప్రపంచమున వీరేశలింగము త్రొక్కని త్రోవలేదు. ఆయన బహుముఖ సారస్వత సేవకు ముఖ్య కారణము ఆంగ్లవాఙ్మయ సంపర్కము. ఆ కాలమున విశ్వవిద్యాలయములలం దాంగ్లేయ విద్య నభ్యసించిన విద్యార్థికులు ఆంగ్లభాషాభిరుచులను గలిగి ఆ మార్గమున జేసిన రచనలను ప్రోత్సహించిరి; వీరేశలింగముగారిచే స్థాపితమైన యీ నవీన సారస్వతోద్యమమున పాల్గొని భాషా యోషను మేలిసొమ్ములతో నలంకరించిరి. తెనుగున ఆధునిక పద్ధతి నాటక రచనకు పునాదులు వేసి గురజాడ అప్పారావుగారికి మార్గదర్శియైనది వీరేశ లింగముగారి యమృత లేఖినియే ఆంగ్ల వాఙ్మయ సంపర్కము వలన నాంధ్ర మున విషాదాంత నాటకము ఉద్భవించినది. రామకృష్ణమాచార్యుల విషాద సారంగధర మిట ప్రత్యేక స్మరణీయము. సాంఘిక దురాచారములను ఈ కాల మున ప్రకటించు నాటకములీ నవీనోద్యమ ఫలితములే. చారిత్రక, సాంఘిక, అద్భుత కథా ప్రధానములగు నవలలు మన సారస్వత నికుంజమున మొగ్గ

దొడిగినవి. రాజశేఖర చరిత్రము, చిలకమర్తివారి నవలలు, మాలపల్లి, ఇటీవల అడవి బాపిరాజు, విశ్వనాథ సత్యనారాయణగార్ల రచన లిందుకు నిదర్శనములు. కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి, వేంకట లక్ష్మణరావు, పానుగంటి లక్ష్మీనరసింహారావు మున్నగువారు వ్యాసరచనలో ఆత్మప్రతిభా సూచకమగు వివిధ మార్గములను జూపినారు

దేశచరిత్రము, శాసన పరిశోధనయందు విద్వాంసులు శ్రద్ధ వహించినారు. కవితా విమర్శనము పూర్వ పద్ధతులను విడిచి నూతన మార్గముల నడచినది. సంవత్సరాది సంచికలలో విద్యాధికుల వ్యాసములు, గ్రంథాలయ సర్వస్వము నందలి రాయప్రోలు సాహిత్య విమర్శనములు. కవిత్వ తత్త్వవిచారము, అనంతకృష్ణశర్మగారి వ్యాసములు సాహితీ విమర్శనమున క్రొత్త పద్ధతులను ప్రవేశపెట్టినవి. ఆంగ్లభాష యందువలె వసంతలేఖలు, శారదలేఖలు పత్రికల నలంకరించినవి. కవి జీవితములు, వ్యక్తి చరిత్రములు, స్వీయ చరిత్రలు మన భాషయందు కూడ ప్రభవించినవి. ఈ నవీనోద్యమమునకు ప్రాణాధారము పత్రికా వాఙ్మయము. ఆంధ్ర, కృష్ణాపత్రికాధిపతు లొనరించిన సేవ తెనుగు వాఙ్మయమున స్వర్ణాక్షరములతో లిఖింపదగినది. ముట్నూరి కృష్ణారావుగారి సంపాదకీయములు తెనుగున నొక క్రొత్తశైలిని కళా ప్రపంచమున క్రొత్త రుచులను ప్రబలజేసినవి. భారతి, శారద, సాహితి, సుజాత, ప్రతిభ, ఉదయిని మున్నగు మానపత్రిక లొనరించిన సేవ గణనీయము.

ఆనాడు సంఘసంస్కరణోద్యమ ఫలితముగా ఆంధ్రమున నెంతయో సాహిత్య ముద్భవించినది. వీరేశలింగము బ్రహ్మ మతావలంబకుడు, సంఘసంస్కారి, దక్షిణదేశ విద్యాసాగరుడు. ఆయన తన భావములను రచనల మూలకముగా నాంధ్రావనిలో ప్రచారమొనరించి ఆంధ్రులను మేలుకొలిపి నవయుగోదయ మొనరించినాడు. ఈ నవయుగ ప్రభాతమున వీరేశలింగమున కించుమించు సైదోడులగు వైతాళికులు వేంకటలక్ష్మణరావు వేంకటరాయశాస్త్రి, వీరభద్రరావు, వడ్డాది వావిలికొలనులు, జయంతి గిడుగులు, తిరుపతి వేంకట కవులు, నాగేశ్వరరావు మున్నగువారు.

లక్ష్మణరావుగారు వివిధ విజ్ఞాన శాఖలయందు ప్రవీణులు. బహుభాషా కోవిదులు. విజ్ఞాన సర్వస్వ సంపాదకులై, విజ్ఞాన చంద్రికా గ్రంథ మండలి

స్థాపించి ఆంధ్రులకు విజ్ఞాన భిక్షపెట్టిన విజ్ఞాని లక్ష్మణరావు వేంకటరాయశాస్త్రి సంస్కృతాంధ్రముల యందు మహాపండితులు. ప్రతాప రుద్రీయము ఆయన కళానేతృత్వమునకు, స్వతంత్ర నాటక రచనాశక్తికి నిదర్శనము. సాహిత్య దర్పణాది గ్రంథములను రచించి నైషధ ఆముక్తమాల్యదలకు వ్యాఖ్యాన మొన రించిన యాతడు నిజముగా జంకు కళంకులేని కవిచంద్రుడు, తోషిత కోవి దేంద్రుడు. ఇరువదియవ శతాబ్దారంభమున ఆంధ్ర మహాపండితులలో ప్రత్యేక వ్యక్తిత్వము గలిగి, చారిత్రాత్మకములగు నిర్ణయములకు కారకులు జయంతి రామయ్య, గిడుగు రామమూర్తిగారలు. ఆంధ్ర మహా పురుషులలో వీరిరువురకు ఉత్కృష్ట స్థానములు గలవు. ఇరువురును ఉద్దండ పండితులు, విజ్ఞాననిధులు. ఇరువురు కళా ప్రపూర్ణులే. ఇరువురి జీవిత పరమావధి భాషాసేవయే. ఇరువురు తమ ఆదర్శ నిర్వహణార్థము తమ సర్వస్వము ధారపోసినారు. ఇట్లు ఏకాశయ బద్ధులయ్యు వారు భిన్నమార్గానుయాయులు. వ్యావహారిక భాషను గ్రంథముల కెక్కించి వానిని జనసామాన్యములో వ్యాప్తికి దేవలెనని గిడుగువారి సంకల్పము. భాషను చక్కగా సంస్కరించి, సరళమగు శైలిని పుస్తకములను ప్రకటించి, విజ్ఞానము ప్రజలకు పంచిపెట్టవలెనని జయంతివారి ఆశయము. ఇట్టి వాదము లతో నీ పండిత సింహము లొండొరుల ఢీకొనినవి. విజయాభిలాషులై పోరా టము సాగించినారు. భావ సంఘర్షణము ప్రస్ఫుటమై యాంధ్రలోకమున ఇరు కక్షలు బయలుదేరినవి. గురజాడవారు Social reform and spoken Telugu తో గిడుగువారి కండయై నిలిచినారు. పానుగంటివారు రామయ్య గారి వాదమును బలపరచినారు. ఆంధ్రుల యశోవంతమగు చరిత్రను గ్రంథస్థ మొనరించి, వారిని భాస్వంతమగు భవిష్యత్తును నిర్మింప ప్రబోధించిన మహనీ యులు చిలుకూరి వీరభద్రరావుగారు. తిరుపతి వేంకటకవులు కవితకు స్వేచ్ఛా విహార మొసంగి ప్రజలలో వాఙ్మయాభిరుచిని పునరుజ్జీవింప జేసినారు. సార స్వతోద్యానవనమున వీరు కల్పించిన క్రొత్త పాదులనుండి యుద్భవించిన నూతన కవిత్వవల్లి నవప్రసవములను విరబూచినది. ఆధునికాంధ్ర కవులలో వీరికి శిష్యులో, ప్రశిష్యులో, ఏకలవ్య శిష్యులో కానివారు లేరనుట అతిశయోక్తి కానేరదు ఆంధ్రావనిలో పద్య రచనకు బహుళ ప్రచారము కల్పించిన వారు తిరుపతి వేంకటకవులు. గంగా ప్రవాహమును బోలు వీరి కవితా వాహినియందు స్నానమాడి సాహితీ దేవాలయమున ఖండకావ్య కుసుమములతో ప్రవేశించిన

పడినట్లు నటించినా చివరకు శ్రీమతి వటీరావు శ్రీవారి శివరూపం ప్రక్కన పార్వతి వేషం ధరించడానికి ఒప్పుకొన్నది. అంతేగాక ఎంతో ఉత్సాహంగా పార్వతి వేషం వేయడానికి ఉబలాట పడుతున్నట్లు కనుపించింది. కల్చర్డులేడీ వటీరావు తన అభిమతానికి అనుకూలంగా మారినందుకు అతని సంతోషానికి హద్దులేదు. నిర్హేతుక జాయమానమైన యీ పరిణామము కొంత ఆశ్చర్యం మాత్రం కలిగించింది.

అనుకున్నట్టుగానే ధనుర్మాసంలో ఒకనాడు తెల్లవారక ముందే శివవేష ధారణ ప్రారంభమయినది. అతను చన్నీళ్ళ స్నానంచేసి వంటి నిండా విభూతి పూసుకున్నాడు. భార్య తన కోసం తెచ్చిన పెద్దపులి బగ్గీల బట్ట కట్టుకున్నాడు. నొసట కుంకుమ బొట్టు పెట్టుకున్నాడు. అతను వద్దు వద్దు అంటున్నా విన కుండా, ఆమె స్వయంగా అతనికి అలంకరణ చేయసాగింది. అతని జుట్టు పైకి యెగదీసి ముడివేసి అందులో రేకు చంద్రుణ్ణి దోపింది. దారముతో రెండు చేతు లకు రెండు రబ్బరు పాములను కట్టింది. ఎముకల హారము ఒకటి అతని మెడలో వేసింది. బుడుబుక్కలవారి దగ్గర తానుకొన్న డమరుకాన్ని అతని వ్రేళ్ళకు కట్టింది. పులిచర్మము ఒకటి తీసుకొచ్చి పీటమీదవేసి దాని మీద శివరూపం ధరించిన భర్తను కూర్చొనబెట్టింది. ఇక ఆ సాధ్వి సత్వరంగా పార్వతిగా సాక్షాత్కరించడమే ఆలస్యం! స్వాములవారి సలహా ప్రకారం "నగర సంకీర్తనం" ప్రశస్తంగా ప్రారంభించవచ్చునని శివరూపధారి అయిన అతను ఉవ్విళ్ళూరుతున్నాడు. గంట గడిచింది. అతను "శివోహం" అని గట్టిగా కేకవేసి శంఖం ఊదుతున్నాడు; ఇంతలోనే ఆమె ప్రవేశించింది. ఆశ్చర్య పడ్డాడు. యింకా వటీరావు శ్రీమతి వటీరావు గానే ఉన్నది; పార్వతి వేషం వేసుకోలేదు. ఆమె వెనుకనే మరి అయిదుగురు అధునిక నాగరికత అవతారాలు పడమటి సభ్యత ప్రతిమలు గూడ ప్రవేశించినారు - అతనికి సిగ్గయినది. కాని అతనికంటె యెక్కువ - కల్చర్డు లేడీస్ సిగ్గుపడ్డారు. అందులో ఒకామె దీని పేరేమిటి అని అడిగింది. "ఇది శివ రూపం - ఈయన నా ప్రియభర్త" అని శ్రీమతి వటీరావు ఇంగ్లీషులో అన్నది. ముసి ముసి నవ్వులతో ఆ అయిదుగురు అతని వేషాన్ని జాగ్రత్తగా అన్ని కోణాల నుండి పరీక్షించినారు. తరువాత పది నిముషాలలో వాళ్ళు కూర్చున్న కారు వెళ్ళిపోతున్న చప్పుడు వినిపించింది.

ఇదంతా అతనికేమీ అర్థంకాలేదు. ఈ అయిదుగురు స్త్రీలు యెందుకు వచ్చినట్లు? శ్రీమతి పటి పార్వతి వేషం యెందుకు వెయ్యనట్లు? పురుషుడన్న సందేహం గూడా లేకుండా తనను వాళ్ళంతా అంత పరీక్ష చెయ్యడ మేమిటి? భక్తిప్రపత్తులతో జరుగవలసిన నగర సంకీర్తనం ఈ విధంగా పరిణమించి నందుకు అతనికి బాధ కలిగింది.

తప్పకుండా తనను అవమానించడానికే తన భార్య పటీరావు యీ కుట్ర పన్ని ఉంటుందని అతని అనుమానము. దీనికి శిక్ష యేమిటా అని అతను ఆలోచించ సాగినాడు. అక్కసుతో నిండిన అతని మనసుకు అనేక ఉపాయాలు స్ఫురించినవి. ఇంటికి వచ్చిన తరువాత భార్య గొంతు నులిమివేయవచ్చును, లేదా యింటిలో దూలానికి ఉరితియ్య వచ్చును; లేకుంటే ఒక గదిలో తాళం వేసి తిండి పెట్టకుండా మాడ్చివేయవచ్చును; ఈ ఊహల మధ్య శ్రీమతి పటీరావు తటిల్లతవలె రానే వచ్చింది. వచ్చీ రావడమే "మైడియర్ హబ్బీ", "మైడియర్ పెట్", "మై పీచ్". "మై డార్లింగ్" అంటూ ఆమె భర్త మీద యెన్నడూ లేని అనురాగాన్ని కురిపించసాగింది; ఆమె సంతోషానికి అవధులు లేవు. ఆ సంతోషాన్ని చూసి తన భార్యకు మతి పోయిందేమో లేక హిస్టీరియా లక్షణాలు సంక్రమించినవేమోనని అతను సందేహించినాడు. కాని అవేమీ కావు. ఆమెకు అతని కారణంగా క్లబ్బులో ఉన్నతమయిన స్థానం లభించినదట! అతనివలన ఆమెకేవో బహుమానాలు వచ్చినవట! అతనికి గూడ కొన్ని బహుమానాలు లభించినవట!

ఇంతకూ యీ బహుమానాలేమిటి? ఆమె క్లబ్బులో మెంబరు గనుక బహుమానాలు వచ్చి ఉండవచ్చును. కాని క్లబ్బుతో యేమీ సంబంధంలేని తనకు యీ బహుమానాలేమిటి? ఆ అయిదుగురు స్త్రీలు తనను యెందుకు అంతగా పరీక్షించి నట్లు? వచ్చిన బహుమానాలు పుచ్చుకొని ఊరుకోక యెందుకీ కుశంకలు అని ఆమె అతన్ని మభ్యపెట్టడానికి ప్రయత్నించింది. కాని అతను ఊరుకోలేదు. కోప్పడనని మాట ఇస్తే చెప్పుతానన్నది. అతను వాగ్దానము చెయ్యనన్నాడు. చివరికి ఆమె చెప్పక తప్పలేదు.

ఒకనాడు లేడీస్ కల్చర్ క్లబ్బులో సభ్యురాంద్రంతా సమావేశమయినారట. వినోద కాలక్షేపమే క్లబ్బు కార్యక్రమాల పరమావధి. అందువలన ప్రతి

సంవత్సరమూ సభ్యురాండ్రలో ఒక్కరికి యిచ్చే బహుమానం ఆయేడు యే విధముగా యీయవలెనని చర్చ జరిగినవి. కొందరు అలంకరణల పందెం బాగుంటుందంటే మరికొందరు ఆటల పందెం బాగుంటుందన్నారు. ఇవేవి గాకుండా మరొక వింత సూచన యేకగ్రీవంగా ఆమోదించబడినది. ఈ వింత సూచనచేసినది. శ్రీమతి వటీరావు తప్ప మరొకరు కాదని ఆమె భర్త అనుమానం. ఈ సూచన సారాంశం యిది:

మగవాడికి వలెనే ఆడదానికి గూడ వ్యక్తి స్వాతంత్ర్యము ఉండవలెను. ఇప్పటివరకు మగవాడు ఆడదాన్ని బానిసగా చూస్తున్నాడు. ఇప్పుడు మగవాడికి బుద్ధిచెప్పవలసిన బాధ్యత ఆడదానిది; కొట్టిగాని తిట్టిగాని, సాధించిగాని, ఏడ్పించిగాని, తిండిపెట్టకగాని, చాకిరి చేయించుకొనిగాని, వెంట తిప్పుకొనిగాని యీ బుద్ధి చెప్పవచ్చును. అందుచేత యిష్టమున్న సభ్యురాండ్రందరు తమ తమ భర్తల్ని దద్దమ్మలను - ఫూల్సును - చెయ్యడానికి ప్రయత్నించవలెనని ఆనాటి సభలో తీర్మానించబడినది. ఎవరు భర్తను ఫూల్ చేయడంలో ఎక్కువ నేర్పు చూపుతారో వారికి, ఫూలయినవారి భర్త ఆ యేటి బహుమానం. ఇదంతా విన్న వటీరావు భర్తకు అపాదమస్తకం కోపం మండిపోయింది. తనవలెనే దద్దమ్మలయిన భర్తలు యెందరో ఉన్నారనుకొని సంతృప్తిపడి అతను కోపాన్ని దిగమ్రింగుకొన్నాడు. అంతకంటే తనుచేసేది గూడ యేమీ లేదు.

ఎందుకంటే యీ బహుమానాల బెడద ప్రతి యేడు యెదురవుతున్నదే! క్లబ్బులో భార్యామణికి బహుమానం రావడానికి, కల్చర్డు లేడీలలో శ్రీమతి వటీరావు పేరు ప్రతిష్టలు పెరగడానికి అతను యెంత అప్రమత్తుడై ఉన్నా బలిగాక తప్పలేదు. శ్రీమతి వటీరావు అంతటి గడుసరి.

లేడీస్ కల్చర్ క్లబ్బులో బహుమానాల కొరకు పెట్టే పోటీలు గూడ చిత్రమయినవి!

భర్తచేత వెర్రివేషాలు వేయించి క్లబ్బు సభ్యురాండ్రముందు అతన్ని హాస్యాస్పదుణ్ణి చేయడం ఒకసారి!

శీలానికి భంగంరాకుండా ఎవరైతే తమ భర్తలో తమ శీలాన్ని గురించి అనుమానం కలిగిస్తారో వారికి బహుమానం మరొకసారి! స్వేచ్ఛగా పర

పురుషునితో బహిరంగ ప్రణయ కలాపాలు సాగించి బహుమానం కొట్టి వేయ డానికి వెనుదీయని సాహసురాలు శ్రీమతి వటీరావు.

ఇంకొకసారి ఫాన్సీ డ్రెస్ పోటీలు. భర్త గూడ పోల్చుకోలేని విధంగా, డ్రస్సు ఉందో లేదో అన్నట్టుగా విచిత్ర వేషధారణచేసి బహుమానం పొందిన అతి సాహసి ఆమె!

భర్త ఖర్మకొద్దీ ఒకసారి శ్రీమతి వటీరావు ఆదినారాయణ శాస్త్రిగారి రేడియో ప్రసంగాన్ని వినడం తటస్థించింది! శాస్త్రిగారు పూర్వాచార పరాయణులే; ప్రసంగం శాస్త్రీయమైనదే; అందుచేతనే శ్రీమతి వటీరావు భర్త ఇరకాటంలో పడవలసి వచ్చింది! శాస్త్రిగారు ప్రాచీన హైందవుల సౌందర్య పోషణ పద్ధతులను గూర్చి శాస్త్రీయమైన ప్రసంగం చేసినారట. వెనుకట పురుషులు స్త్రీలకు స్వయంగా స్వహస్తాలతో అలంకారాలు చేసేవారని గూడ ఆయన శాస్త్రీయమైన ప్రసంగంలో అన్నారట. అందువలన శాస్త్రంలో ఆవిధంగా చెప్ప బడ్డది కాబట్టి మీరు నాకు రోజూ అలంకరణం చెయ్యాలన్నమాట అని ఆమె అంటుంది. ఫేస్ పౌడర్లు, లిప్ పెయింట్లు, టీత్ పాలిష్, నేల్ పాలిష్, ఫుట్ డెకొరేషన్, బాడీ డెకొరేషన్, వగైరా లన్నీ యీ అలంకరణ కాండలోని అంశాలు. "ఫెస్ పౌడరు, లిప్‌స్టిక్, స్నో, నెయిల్ క్లిప్పర్స్ వగైరా వస్తువులు మీవద్దనే ఉంచుకొని సరియైన కాలానికి వాటిని నాపట్ల వినియోగిస్తూ ఉండాలి" అని ఆమె ఆజ్ఞ. శ్రీమతి వటీరావు కథలను పరిశీలించినప్పుడు మనకు ఆధునిక సమాజంలో యిటువంటి సంఘటనలు యెన్నో కనుపించగలవు.

క్లబ్బు జీవితమే శ్రీమతి వటీరావు నిరంతర ధ్యానం. ఆమె పూర్తి సమయం క్లబ్బు కార్యక్రమాలకే. తోడి మహిళా మణులలో అగ్రస్థానం వహించ డానికీ తన ఆధిక్యతను స్థాపించుకొనడానికి ఆమె భర్తను కీలుబొమ్మగా చేసి కోతివలె ఆడించుతుంది. ఆమె జీవిత లక్ష్యం ఇంతే ఒక్కసారి ఆలోచించితే. హాస్యం పేరుతో రచయిత ఆధునిక నాగరికత మీద చేసిన వ్యంగ్య విమర్శ యేమో యీ కథలని మనకు అనిపించుతుంది.

ఇంటబుట్టిన ఆచారాలకూ దిగుమతి అయిన ఆచారాలకు సంఘర్షణ జరిగి నప్పుడు రాలే విస్ఫులింగాలే 'శ్రీమతి వటీరావు కథ'లని దీక్షితులుగారు స్వయంగా చెప్పినారు. ఇంతకన్న చక్కగా యీ కథలను వర్ణించడం అసాధ్యం.

జాతీయ సంప్రదాయాన్ని వదులుకొని అన్యజాతీయ సంప్రదాయాన్ని అనాలోచితంగా అవలంబించడం యెంత హాస్యాస్పదమో యీ కథలలో గమ నించదగ్గ విషయం.

ఈ కథలు వ్రాసి పావు శతాబ్దం గడిచిపోయింది. దేశానికి స్వాతంత్ర్యం వచ్చింది. జాతీయ దృక్పథం అలపడింది. దేశపరిపాలన మన వారి చేతిలోకి వచ్చి, స్వదేశ సముద్ధరణకు ప్రాధాన్యం హెచ్చింది.

అయినా పాశ్చాత్య మనస్తత్వం, దేశానికి యెంత మాత్రము కుదరని ఆచారాలు, అభిప్రాయాలు మన విద్యావంతుల సంఘంలో యింకా రాజ్యం చేస్తూనే వున్నవి.

అందుచేత యీనాటి క్లబ్బులలో యితరత్ర సంసారపు గొడవలు పట్టించు కోక క్రీడాభిరామంగా ఇరువై నాలుగు గంటలు విహరించే మహిళామణులలో మనకు శ్రీమతి వటీరావులు పుష్కలంగా కనిపిస్తున్నారు.

(రేడియో ప్రసంగం-1954)

# స్త్రీల పాటలలోని కవిత్వము

"ఏడువకు యేడువకు వెఱ్ఱినాగన్న, ఏడిస్తె నీకండ్లు నీలాలుగారు
నీలాలుగారుతే నే జూడలేను, పాలైనగారవే బంగారుకండ్లు."

అని యే చల్లనితల్లి, తీయని యెలుగున, యెప్పుడు తొలిసారిగా యుయ్యెల నూచినదో కాని, ఆ కమనీయ గేయము వినినప్పుడెల్ల యేదో యొక యనిర్వచనీయమైన రసానుభూతి కలిగి ముగ్ధులమై మరి యొక్కమారా గేయమును విన నువ్విళూరుచుందుము.

## సంగీత సాహిత్యములు

సంగీత సాహిత్యములు శారదాదేవికి స్తనద్వయమని వర్ణించుట మన సాహితీ సంప్రదాయము. శారద సమస్త విద్యా ప్రదాయినియే కాదు. సకల కళాస్వరూపిణికూడ. సూరనార్యుడు సరస్వతీ చతుర్ముఖుల విలాస వర్ణనావసరమున, భారతీదేవి గళస్వనమున నపురూపమగు మాధుర్యము నొలికించినాడు.

మున్నెన్నడు కనివిని యెరుంగని యా కోమల గళస్వనము నాలకించి "మరియొక్కమారు, మరి యొక్క మా"రని చతురాస్యుడు కొసరి, కొసరి యామెను ప్రార్థించినాడు.

కమల సంభవుడు ఆ గళస్వనమాధుర్యమునకు మై మరచియే కాబోలు, చక్కెరబోడుల కంఠములందు కమ్మదనము చిలుకరించినాడు. కావుననే సంగీత మెలనాగల స్వత్వమై యొప్పుచున్నది.

సంగీతమే యననేల? జాతీయములతో నొప్పు చక్కని సంభాషణా చాతుర్యము స్త్రీలకు వెన్నతోడ బెట్టినవిద్య. ఈ రెండు గుణములు వారి వేడుక పాటలయందు ప్రతిబింబించుచున్నవి. జాను తెనుగు నిక్కపు సొగసు మన చెలియల పలుకులయందే నెలకొని యున్నది. భామామణులు భావాల బరిణెలు;

వారి హృదయములు. రసార్ద్రములు. ఈ రసార్ద్రత వారి వేడుక పాటలయందు ప్రతిబింబించుచున్నది.

వివిధ సాంఘిక సమస్యల కాలవాలములగు స్త్రీలపాటలు మన సాంసారిక సౌందర్యమునకు ప్రతిబింబములు. కళాస్వరూపములగు కసుగందుల నిదుర బుచ్చుటకై యుయ్యేల నూచునప్పుడు, తోడి నెచ్చెలులతోడ పూదోటయందు మెలగునప్పుడు, వివాహాది శుభకార్యము లందు వరుసగల వనితలతో పరి యాచకములనాడు నవసరమున, మంగళ గౌరి, శ్రావణ శుక్రవారము మున్నగు నోములు నోచునప్పుడును మగువల మనసులు భావార్ద్రములగుట సహజము. తత్ఫలితమే వారి గేయసముదాయము.

## జోలపాటలు : లాలిపాటలు

జోలపాటలు, లాలిపాటలు ముఖ్యముగా శబ్దచిత్ర ప్రధానములు. లలిత సంస్కృత పద బహుళములు. చూడుడు:

"జో రవికుల శుభాంగ, జో సన్నుతాంగ"
"లాలి బంగరు బొమ్మ లాలి మా యమ్మ
లాలి ముద్దులగుమ్మ లాలి సీతమ్మ"
"పగడంపు రతనాల పసితొట్టెగట్టి,
సొగసైన పైడి గొల్సులు చేతబట్టి
మగువ లూచెదరు సంభ్రమము లెగదొట్టి
మొగలి రేకులు కొప్పుల నిండ జుట్టి
మొలక నవ్వులు నెన్నెలలు వెదజల్ల
తళుకు చూపులు దిక్కులు పిక్కటిల్ల"గా
"గాజు లొరయగను, కంకణములు జార;
జాజికొప్పులనుండి జలజలరాల,
తేజ మలరగ నందియలు ఠవళిల్ల
రాజముఖు లూచెదరు..."

అను సుందర వాతావరణమెంత యాహ్లాదకరము!

## ఆభరణ ప్రీతి

స్త్రీలకు భూషణాలంకారములందుండు సహజప్రీతి కిది నిదర్శనము. పచ్చకర్పూరము, అత్తరువు పన్నీరు, మొల్లలు,తెల్లచేమంతులు మున్నగు భోగ్య వస్తువులు వారి పాటలయందు కొల్లలు. రమణులకు ప్రియతమములగు నీవస్తువులు రసికుల కానంద ప్రదములుగదా!

వరుసపాటలలో పెండ్లికొడుకుతో మరదండ్రు హాస్యమాడుట, వదినె మరదండ్ర యన్యోన్య పరిహాస ప్రసంగము, వియ్యపురాండ్ర నెయ్యపుతీయము ముఖ్యములు.

వింతవింత రంగులచీరెలు, వాని కనుగుణములైన రవికెలు మానవతీ మణులు మక్కువతో నపేక్షించువస్తువులు. ఈ వస్తు ప్రేమ వారి పాటలయందు సమయోచితముగా, సవిశేషముగా వ్యక్తమగుచున్నది.

"సంపెగ పువుచీరె, కెంపునీలపు రవికె
ముడితెల్లని, నిండు మొగ్గలుగల రవికె,
నిమ్మకాయ వన్నెచీర, నీలివన్నె రవికె."

అను జతలు వీరిపాటలలో మనకు కనులపండు వొనరించును. ఇది జదువునపుడు మన నవ్య కవికుమారుల సెనగపూరైక దొడిగిన చిన్నది మనవైపు తొంగి చూచుచున్నది.

## తలుపు దగ్గర పాట

తలుపు దగ్గరి పాటలు కొన్ని మిక్కిలి రమ్యములు. వీనిలో నాయికా నాయికుల సంభాషణాచాతుర్యము స్తవనీయము. నాయిక ప్రణయ కోపము వహించియుండ నాయకుడామెను ప్రసన్న నొనర్చుటకొరకు స్వీయవర్తనము సమర్థించుకొన్నయత్న మాపాటలకు ప్రాణాధారము. జిలుగు బంగరు చీరలు, రత్నములు దాపిన రవికెలు, దవనము, మరువము మున్నగు విలాసవస్తువులు లంచము నిచ్చి, ఆమె యనుగ్రహము నపేక్షించును. కాని యామె మాత్రమిది వేళగాదని కచ్చితముగా పలుకుచున్నది, చూడుడు :

"పచ్చని బంగారుపీటలు గట్టిగ సమ్మతిపడవే భామా"
"జిలుగు బంగారుపీటలు వేసితె వేళగాదు పోవోయి"
"సత్యభామ, నీ చక్కని జడలకు జాజులైనే ముడిచేనే
పారిజాతములైనే ముడిచేనే"
"జాజులుముడిచే సఖియలు మాకు చాలగలరు పోవోయి"
"వనితరొ వినవె సత్యభామ నీ పాదములకు మ్రొక్కెనే"
"అవతలి వీధిని రుక్మిణియున్నది అయుష్మంతుడవోయి
దీర్ఘాయుష్మంతుండవోయి."

తుదకు ఎట్లో తలుపు తెరచి లోనికి రానిచ్చినది. సఖుని సందర్శనమైనంతనే సఖియకు సందేహము లెక్కువైనవి. ప్రత్యక్షముగ గన్పట్టు రతి చిహ్నములను గాంచి యూరకుండ లేక పోయినది. అప్పుడు వారి సంభాషణ :

"గోవిందుడ నీ చక్కని గోటికొనలు కందెనేమోయి"
"గోవర్ధనగిరి పర్వతమెత్తితె గోళ్ళుకందెనె భామా"
"సరసిజాక్ష ని అధరము నొక్కిన సారసాక్షి ఎవరోయి?
ఆ సారసాక్షి ఎవరోయి?"
"తరుణిరొ అదియొక ఫలమని చిలుకలు తగిలిపొడిచేనే భామా"
"వరదుడ నీ చెక్కుల నెలవంకలున్న వేమోయి?
నెలవంకలున్న వేమోయి?"
"గోరువంకలు పట్టుకరాగా, గోరికెనె యవి ముద్దులగుమ్మా"
"సారసాక్ష నీ మేన తెల్లని చందనమెక్కడిదోయి?"
"పూలతోటలో విహరింపగ పుప్పొడిరాలెనె తరుణీ,
ఆ పుప్పొడిరాలెనె తరుణీ"
"పూలతోటలో విహరించుటకు పోయిన కారణమేమోయి?
ఆ పోయిన కారణమేమోయి?"
"పావురము దప్పించుకపోగా పట్టబోతినే చెలియా,
పట్టబోతినే చెలియా!"
"దేవదేవ నీ బుగ్గను, కాటుక దిద్దిన సఖి, ఎవతోయీ!
ఆ దిద్దిన సఖి యెవతోయీ?"

"గుప్పున చెమటకు గారేన చుక్కబొట్టు వో ముగువా!
అది చుక్కబొట్టు వో ముగువా!"

ఈ సుకుమార శృంగార చిత్రము ముందు ప్రబంధాదుల యందలి వర్ణనలు నిస్తేజములు గదా! గోరువంకల పట్టుట, పావురములతో నాడుట, చిలుకల పలుకులు వినుట, రసికుల కాహ్లాదకరములగు క్రీడలు గాబోలు! అన్య దేశీయ దాస్యముచే చైతన్యముడిగిన మనకు కుక్కలను పెంచుట, వాసన హీనములగు కాగితపు పూలను ముడిచికొనుటయే నాగరికతా లక్షణమగుట ఎట్టి విపరీతము, దౌర్భాగ్యము!

## కుమార్తెపై గారాబము

చిన్ననాట నుండియు మిగుల గారాబముతో బెంచిన ప్రియ కుమారిక నత్తవారింటి కంపు సందర్భమున కన్నీళ్ళతో,

"ఎన్నడు నినువిడిచి యెడబాయనైతి
కన్నతల్లిరొ నేను గడతేరు టెట్లు?
బొమ్మరిండ్లనుకట్టి పొలతులా బిలిచి
అమ్మరో యెవరింక ఆటలాడుదురు?
వేర్వేరు బొమ్మల పెండ్లిండ్లు జేసి
చిట్టిబొట్టు నోములా చేడెల గూడి
ఎవ్వార లికను మా యింట నోచెదరు?
నెయ్యగ త్తెలగూడి నిండు వేడుకను
ఉయ్యాల లెవ్వార లూగుదురింక?"

అని మాతృప్రేమ ఉట్టిపడునట్లు వచియించు సన్నివేశమెంత రస స్ఫోరకము?

## చెలికత్తెల పరిహాస వాక్యములు

వీరి పాటలలో మంగళహారతులకు మేలుకొలుపులకు ముఖ్యస్థానము కలదు. పురాణగాథలు - అందు ముఖ్యముగా రామాయణకథను-మన స్త్రీలెన్నియో విధముల తనివిదీర పాడుకొందురు సీతమ్మ వారికి ఇలవేలుపు. ఆమె కల్యాణ సందర్భమున పేరంటాండ్రు తమలో తామాడుకొను పలుకుల నొకమా రాలకింపుడు :

"పచలె పిసింపమే పట్టించినదె
మణిపతక మొక్కటి మగువ మాకీయవె
ఎక్కడిదె యీపతక, యింతిరో నీకు
మ్రొక్కగా, నా విభుడు మొన్న దెప్పించె
పలనాగ యెక్కడిదె, యీ బన్నసరము
పలబెట్టి చేయించె, పెలద నా విభుడు
ఓ సెమ్మ, నీకింత యొయ్యార మటనె
చూచిన నెవరైన, సౌరిది నవ్వెదరు
పయ్యెద జారెను, పద్మాయతాక్షి
చయ్యన పతివచ్చి సవరించుకొనవె"

అను సహజాపాతరమణీయోక్తులు శ్రోత్రరసాయనములు కదా!

కల్యాణ సందర్భమున సీతమ్మకు జేసిన యలంకారము కనుల గట్టునట్లు వర్ణింపబడిన దీ పాటలయందు.

## రూపవర్ణనా చాతుర్యము

ఈ పాటలలో రూపవర్ణనా చాతుర్యము మిక్కిలి ప్రశంసనీయము.

"చేమంతి రేకులే చెలియచెక్కిళ్ళు
దానిమ్మగింజలే తరుణి పల్వరుస"

అనునదొక చిన్న యుదాహరణము. తన చెల్లెంద్రతో శాంతా సమేతయైన సీతమ్మను రామచంద్రుడు కొంతదూరము నుండి చూచి శత్రుఘ్నునితో :

"చుక్కలలో బాలచంద్రుడున్నట్లు
కొలువయి కూర్చున్న మన యక్క జూడు
అందరి లోపల సుందరి ననుచు
అష్టవంకర్లతో మీ వదినె జూడు"

అని పల్కె నా యనుజన్ముడు.

"ఆదిలక్ష్మి సీత ఆ లోకమాత" అని వదినగారిని ప్రశంసించును. సీతమ్మ యాంధ్ర సుందరుల పాలిటి యమృతావతారము, కావుననే గొన్నడో పాపరాజు.

"జననీ! నీవు మహాపతివ్రతవు. నీ సౌశీల్య పల్లాండ్రి చెల్లను మెచ్చెంతి" యని ముక్తకంఠముతో కీర్తించినాడు.

ఆ లక్ష్మణుడన్నగారితో వనవాసమొనరించిన పదునాలుగేండ్లు, పాపము సాధ్వీమణి ఊర్మిళాదేవి అన్నపానములు వర్జించి సుషుప్త్యవస్థలో నుండెనట. తిరిగి సౌమిత్రి అయోధ్యానగరమునకు వచ్చినది కూడ ఆమెకు స్మృతియే లేదు. ఆ యవస్థలో లక్ష్మణుడు భార్యకడకేగి ప్రక్కనకూర్చుండగా నామె,

"అయ్యొ మీ రెవరయ్యా మీరింత
యాగడంబుల కొస్తిరీ.
సందుగొందులు వెదుకుచూ మీ రింత
జంకులేకిట కొస్తిరి.
ఎవ్వరును లేనివేళ మీరిప్పుడేకాంతముఁ కొస్తిరా?
మా తండ్రి జనకరాజు వింటె మిమునిప్పుడాజ్ఞ సేయగ మాసరూ
మాయక్క బావవిన్నా మీకిపుడు ప్రాణాలకే హానివచ్చు
మాయక్క మరిది వింటె, మిమ్మిపుడు బ్రతుకనివ్వరు జగతిలో
హెచ్చయిన వంశానికి, అపకీర్తివచ్చె నేనేమి సేతూ"

అని దుఃఖ పౌరుషములతో, క్షత్రియాంగన కావున, రోష కషాయితాక్షియై వచించెనట.

శాంతమ్మ యచ్చముగా నాంధ్రులయింటి ఆడుబిడ్డ. ఆమెకు మరదంద్రతో పరిహాసమాడుటయన్న మిక్కిలి ముచ్చట కావున, యూర్మిళను గూర్చి యామెయక్క చెల్లెండ్లతో,

"పసిడిపానుపున సొలసియుండే
ఉండె నొక పదునాలుగేండ్లు పడతి,
కుందనపు ప్రతిమ కళలు
ఈ కళలు యెందుండి దాగున్నవో,
దృష్టి తగులకుండా నీలాల
నివ్వాళు లివ్వరమ్మా"

అని మందహాస మొనరించినది. అపుడు సీతమ్మ చెల్లెలి పక్షమున శాంతకు-

"ఇంద్రాది చంద్రముఁను వలపించేటి
చంద్రులూ మీ తమ్ములూ
దృష్టితగులకుండా, నీలాల
నివ్వాళు లివ్వరమ్మా"

అని వదినెగారు గావున, వినయ సహితమగు ప్రత్యుత్తర మిచ్చినది. అయితే శాంతమ్మ యంతతో మిన్నకొనలేదు.

"అక్కచెల్లెండ్రు మీరూ
మిక్కిలీసౌందర్య శాలులమ్మా
మా తమ్ములను వలపించేటి
జాణలకు దృష్టితగులా"

అని మాటకు మాట వచించినది.

సీత కల్యాణ సందర్భమున వడ్డించిన భక్ష్యవిశేషములు, శాక పాకములు నోరూరజేయును. పట్టాభిషేక కాలమున శాంతమ్మ ముద్దులమరదలగు ఊర్మిళతో పరిహాసమాడకుండ నుండలేకపోయినది.

"నిద్రబోయిన పదునాలుగేండ్ల మధ్యలో
భుజియింపకున్నట్టి భూమీశుదేవి
చాలనే పాయసము, మేలయిన పిండివంటలు
సంతుష్టిగా గుడిచి, సరయూనదీ నీళ్ళు
వాంఛతో తాగవే, వచ్చె లక్ష్మణుడు
నిర్విచారము, లేదు నిద్ర, యీ రాత్రి
సరసమాడావలెను సౌమిత్రితోడ"

అని చిరునవ్వును చిలుకరించినది.

(ఆంధ్రప్రభ దిన పత్రికలో-1944)

# వాఙ్మయము-జాతీయోద్యమ ప్రభావము

నిద్రాణమైయున్న జాతిని మేలుకొలుపుటకు సాహిత్యముకన్న మహత్తరమైన సాధనము మరొకటిలేదు. ఒక దేశము కష్టసుఖములు, మంచిచెడ్డలు, ఒడిదుడుకులు ఆ వాఙ్మయములో ప్రతిబింబించుచుండును. ఒక జాతి చరిత్రను నిర్మించుటలో రచయితలకు గల ప్రభావము అమోఘమైనది. రూసో, వాల్టేరుల రచనలు ఫ్రెంచి విప్లవమునకు కారణభూతములైనవి.

టాల్‌స్టాయి, మాక్సింగోర్కీ, డాస్టొవాస్కీ ప్రభృతులు రష్యన్ వాఙ్మయము ద్వారా ఆ దేశీయులలో అద్భుతమైన ప్రబోధము కలుగజేసిరి. శ్రీకృష్ణదేవరాయల నిర్యాణానంతరము శత్రురాజొకడు విజయనగరము మీద దండెత్తి వచ్చినప్పుడు అల్లసాని పెద్దన చెప్పిన పద్యము విని సిగ్గిల్లి ఆ రాజు తన సైన్యముతో పలాయనము చిత్తగించినాడట. ఖడ్గతిక్కన రణరంగమున వెన్నిచ్చి, యింటికి మరలి వచ్చినప్పుడు, అతని తల్లియు భార్యయు చెప్పిన చాటుపద్యాలు అతనిలో పరాక్రమము విజృంభింపజేసి, యుద్ధభూమికి పంపినవట. ఇవన్నియు రచయితలకు, వాఙ్మయమునకు, దేశచరిత్రను దిద్ది తీర్చుటలో గల ప్రభావమునకు స్థాలీపులాకముగా పేర్కొనిన నిదర్శనాలు మాత్రమే.

బ్రిటిష్ పరిపాలన క్రింద అణగిపోయిన భారతీయులను తమ విధ్యుక్త ధర్మములను పాలింపవలసినదని ప్రబోధించి, మేలుకొలిపినది వాఙ్మయమేయని చెప్పిన అతిశయోక్తి కాజాలదు. ఒక యుద్యమము చక్కగా వ్యాప్తిజెందుటకు వాఙ్మయము మిక్కిలి శక్తిమంతమైన సాధనమని స్వాతంత్రోద్యమ చరిత్ర నిరూపించుచున్నది. ప్రబుద్ధ భారతమునకు తొలి వైతాళికులు రచయితలేనని చెప్పవలెను.

మన దేశీయులను మేలుకొలిపిన ప్రప్రథములలో స్వామీ దయానంద సరస్వతి ముఖ్యుడు. ఆయన వ్రాసిన సత్యార్థ ప్రకాశిక బహు భాషలలో పరివర్తితమై అసంఖ్యాకులగు ప్రజల హృదయాలలో జాతీయ ఆత్మగౌరవ బీజము

లను చల్లి, వారిచేత స్వదేశపు గొప్పదనమును గుర్తింపజేసినది. తమకొక ప్రత్యేక సంస్కృతి, భాస్వంతమైన చరిత్ర కలదనియు, అందుకనుగుణముగా తమ భవిష్యత్తును నిర్మించుకోవలెననియు సత్యార్థ ప్రకాశిక ప్రబోధించినది. వంగదేశమున ఈశ్వరచంద్ర విద్యాసాగర ప్రభృతులు స్వదేశీయులలో తమ రచనలద్వారా చైతన్యమును కలుగజేసినారు.

తరువాత స్వామీ వివేకానందుని రచనలు, ఉపన్యాసములు ఆసేతు హిమాచల పర్యంత ప్రదేశమున ఉద్బోధము, చైతన్యము కలుగజేసినవి. ముఖ్యముగా విదేశాలలో వివేకానందుని వలన భారతదేశ వ్యక్తిత్వము ప్రపంచమునకు బోధపడినది. పాశ్చాత్యదేశాలలో భారతీయులు అనాగరికులు, అడవి మనుష్యులను అపోహలను వివేకానందుడు తొలగించెను. వంగదేశములో క్రమక్రమముగా వ్యాపించుచున్న క్రీస్తుమత ప్రచారమును అరికట్టుటకు మరొకవంకనుండి బ్రహ్మ సమాజము ఉద్భవించినది. రఘుపతి వేంకటరత్నము నాయుడు, వీరేశలింగము పంతులు గారలద్వారా ఆంధ్రదేశము మీద బ్రహ్మ సమాజ ప్రభావము ఎక్కువగా పడినదని చెప్పవచ్చును. కేశవ చంద్రసేనుని రచనలు వంగదేశము నందలి యువకులను ఊపి ఉత్సాహ తరంగితులను జేసినవి. ఈ విధముగా దేశములో సంచలనము కలుగజేసి, ప్రజలలో చైతన్యము వ్యాపింపజేయుటకై ఉద్యమములు క్రమక్రమముగా తలయెత్తినవి. ఈ యుద్యమాల ప్రచారము భారత దేశమునందలి వివిధ భాషలలో విరివిగా జరిగినది.

భారత రాజకీయాలలో డాక్టరు అనీబిసెంటు ప్రవేశము ఒక చరిత్రాత్మక ఘట్టము. ఆమె జాతీయోద్యమమునకు తొలిసారి విప్లవ దృక్పథము నిచ్చిన వీరనారీమణి. త్యాగశీల. హోంరూలు ఉద్యమము ద్వారా శాసనోల్లంఘనము జేసి, చెరసాల కరిగి, ప్రజలలో చెరసాల భయము తొలగించిన గౌరవము డాక్టర్ అనీబిసెంటుకు చెందుచున్నది. భారతీయ సంస్కృతి, నాగరికతా విజ్ఞానములమీద ఆమెకు అత్యంత గౌరవము. భగవద్గీతను ఇంగ్లీషులోనికి అనువదించి, యువకులలో గీతా ప్రచారము గావించి, భారతీయులలో దేశాభిమానము ప్రచారము జేయుటకు ఆమె జేసిన సేవ అత్యంత ప్రశంసనీయమైనది. దివ్యజ్ఞాన సమాజ ఉద్యమముద్వారా, దివ్యజ్ఞానసమాజ సంఘమును స్థాపించి

ఉపన్యాసములతో భారతదేశమును ప్రబుద్ధము గావించినది డాక్టర్ అనిబిసెంటు. విద్యాధికులు, విద్యార్థులు యువకులు డాక్టర్ అనీబిసెంటుకు అనుచరులుగా చేరిరి.

మరొక ప్రక్కనుండి మహారాష్ట్రములో వీరసావర్కార్ విప్లవధ్వజమును ఎగురవేసి, సోదరదేశీయులలో తన పుస్తకముల ద్వారా ప్రబోధము సాగించెను. మహారాష్ట్ర సామ్రాజ్య స్థాపన, ఉన్నతి, పతనములగూర్చి వివరించుచు సావర్కార్ వ్రాసిన హిందూపథ్ పాదుషాహి గ్రంథము మహారాష్ట్రులలో స్వతంత్ర భావములను కలుగజేసెను.

1857 సంవత్సరములో మన దేశమున బ్రిటిషు పరిపాలనమీద ప్రకటింపబడిన స్వాతంత్ర్య యుద్ధమును, బ్రిటిషు ప్రభుత్వము కొందరు విద్రోహుల సహాయముతో అణచివేసి, దానిని ఒక తిరుగుబాటుగ మాత్రమే చిత్రించినది. వీర సావర్కార్ ఈ 1857 విప్లవమునుగూర్చి "భారత స్వాతంత్ర్య సమరము" అను ఉద్గ్రంథమును రచించెను. మహోజ్వలమగు ఈ గ్రంథమును బ్రిటిష్ ప్రభుత్వము నిషేధించినను రహస్యముగా ఎందరో యువకులు పఠించి, సోదర దేశీయులలో స్వాతంత్ర్యోద్యమ ప్రచారము చేసిరి. ఈ గ్రంథమును పఠించి నారను నేరము మీద ఎందరో యువకులు నిర్బంధితులైనారు. "భారత స్వాతంత్ర్యసమరము" దేశీయుల రక్తమును ఉడుకెత్తించి, స్వాతంత్ర్యకాంక్షలు చెలరేగజేసినది. లోకమాన్య బాలగంగాధర్ తిలక్ మరాఠా, కేసరి పత్రికలలో సంపాదకీయాలద్వారా దేశములో ప్రబోధము సాగించెను. స్వాతంత్ర్య భావ ప్రపూర్ణములగు ఆ సంపాదకీయాలకు భీతిల్లి అయనను బ్రిటిషు ప్రభుత్వము నిర్బంధించినది. జెయిలును శ్రీకృష్ణ జన్మస్థానమని భావించి, తిలక్ మహాశయుడు తన నిర్బంధ కాలమున గీతా భాష్యమును కర్మయోగమను పేరుతో రచించెను. తిలక్ కర్మయోగమునకు భారతదేశములో విశాల వ్యాప్తి కలిగినది. కర్మయోగము ద్వారా భారతీయులు తమ ధర్మమును గుర్తించి, పరదేశ ప్రభుత్వ దాస్య బంధములను తెంచివేయవలెననియు, శ్రీకృష్ణుని బోధనలలోని రహస్య మిదియేననియు బాలగంగాధరుడు ప్రబోధించెను. తిలక్ కర్మయోగము భారతదేశములోని అన్ని భాషలయందు అనువదింపబడినది. 'స్వాతంత్ర్యము నా జన్మ హక్కు'ని బాలగంగాధరుడు గర్జించెను. గోఖలే, దాదాబాయి నౌరోజి, రమేశచంద్రదత్తులు అంగ్ల రచనల ద్వారా విద్యాధిక ప్రపంచమునకు బ్రిటిష్ పరిపాలనవలన నష్టములను సకారణముగా నిరూపించి,

స్వపరిపాలన ఆవశ్యకతను ఋజువు చేసిరి. కాని వారి రచనలు ఆంగ్ల విద్యార్థులకు మాత్రమే ఉపకరించినవి. ఇవి ఇతర భాషలలోనికి అనువదింపబడలేదు.

మహారాష్ట్ర దేశమున లోకమాన్య బాలగంగాధర తిలక్‌తోపాటు తన కలమును జాతీయోద్యమ ప్రచారమునకు వినియోగించిన విద్వాంసుడు చింతామణి కేల్కార్. తిలక్ తరువాత కేసరి పత్రికకు సంపాదకుడుగా పనిజేసి ఆయన మహారాష్ట్ర దేశములో జాగృతిని కలిగించెను. మహారాష్ట్ర భాషలో జాతీయోద్యమ వ్యాప్తికి తోడ్పడిన రచయితలలో సానేగురూజీ ప్రముఖులు. ఈయన తన రచనలలో ప్రాచీన సంస్కృతిని, పురాణములను, భారతీయ సాంఘిక పద్ధతులను సామ్యవాద సూత్రములతో సమన్వయించినాడు. మామా వరేర్కార్ తన లేఖినిద్వారా మన విద్యార్థులను క్రైస్తవ మిషనరీలవలె దేశాభ్యుదయమునకై జీవితాలను అంకితము చేయవలెనని, ధర్మాదాయములను జాతీయము చేయవలెనని ప్రబోధించెను. ఈయన రచనలో హాస్యము, చమత్కారము ఉట్టిపడుచుండును. మహారాష్ట్ర దేశములో ఖాండేకర్, హిందీలో ప్రేమ్ చందులవలె, తెలుగులో చింతా దీక్షితులు చిన్న కథలద్వారా జాతీయోద్యమ ఘట్టములను చక్కగా చిత్రించిరి. నారాయణ సీతారాం ఫడ్కే సుప్రసిద్ధ నవలా రచయిత. సమకాలిక సమస్యలు యీయన నవలలకు యితివృత్తములు. తిలక్ కాలమునందలి రాజకీయాలను ప్రవాసియను నవలయందును, 1942 విప్లవమును జంఝామారుతము అను నవలయందును ఫడ్కేగారు చక్కగా వివరించిరి. చీకటి బజారును, ప్రజాహిత జీవనములోని అవినీతిని నిర్దాక్షిణ్యముగా యీయన తన రచనలో ప్రకటించి, సంఘమునకు దారి జూపినాడు. ఈయన కాశ్మీరు సమస్యను గూర్చి కూడ ఒక చక్కని నవలను వ్రాసినాడు. మహారాష్ట్ర దేశములో గాంధీ రాజకీయాలను, గాంధీ వాఙ్మయమును వ్యాప్తిలోనికి దెచ్చిన పండితులు ఆచార్య వినోబాభావే, కాకా కలేల్కారు గార్లు. ఆచార్య అత్రే సంఘములోని చాదస్తములన్నింటిని తూర్పారబట్టిన విమర్శకుడు. హాస్యమునకు ఆటపట్టులగు యీయన రచనలు మహారాష్ట్ర దేశమున మంచి ప్రబోధము కలిగించినవి. మహారాష్ట్ర జాతీయ కవులలో గోవింద అగ్రజ్, తాంబేగార్లు ప్రముఖులు.

హిందీ భాషలో జాతీయోద్యమ ఘట్టములకు వాఙ్మయములో స్థాన మొసంగిన కథకులు మున్షీ ప్రేమచంద్, సుదర్శన్‌గార్లు. మున్షీ ప్రేమచంద్

కథలు అన్ని భాషలలోనికి, ముఖ్యముగా తెలుగుభాషలోనికి చాలవరకు పరివర్తితమైనవి. బెంగాలు నాటకమునుగూర్చి క్రిష్ణచంద్ర వ్రాసిన అన్నదాత యను గ్రంథము సుప్రసిద్ధమైనది. హిందీ జాతీయ కవులలో సుమిత్రానందన్ పంత్, మైథిలీశరణగుప్త, మహాదేవీవర్మగార్లు ముఖ్యులు. క్షితీంద్ర మోహనసేన్, దేవేంద్ర సత్యార్థిగార్లు హిందీ భాషలో జాతీయ వాఙ్మయమును బహుళముగా సృష్టించిరి. భారత రాజ్యాంగ పరిషత్తు సభ్యులు బాలకృష్ణ శర్మగారు హిందీ భాషలో మంచిరచయితలు. ఆధునిక హిందీ రచయితలలో రాహుల్ సాంకృత్యాయన్ ప్రముఖులు. ఈయన రచనలయందు విప్లవ దృక్పథము ప్రముఖముగా నుండును. "వాల్గానుండి గంగా తీరము వరకు" అను రాహుల్ సాంకృత్యాయన్ గ్రంథము సుప్రసిద్ధమైనది.

కర్ణాటక సాహిత్యములో గూడ ఇట్టి పరిణామము మనకు కనుపించుచున్నది. ఆలూరి వెంకటరావుగారు గాంధీ రాజకీయాలకన్న ముందే కర్ణాటక దేశములో దేశభక్తిని ప్రబోధించు రచనలు గావించిరి. కర్ణాటక భాషలో కృష్ణశర్మగారు జాతీయ సమస్యలను ప్రజలకు విప్పి చెప్పు రచనలను విరివిగా చేసినారు. అంబికాతనయదత్తు మన శ్రీశ్రీ వలె కర్ణాటకభాషలో విప్లవధ్వజము నెత్తిన రచయిత. దివాకర్‌గారు కర్ణాటకభాషలో గాంధీ రాజకీయాలకు, గాంధీ వాఙ్మయమునకు చక్కని సమీక్షలను వ్రాసిరి. వీరిని మనము ముట్నూరి కృష్ణారావుగారితో పోల్చవచ్చును. ఆచార్య గోకాక్ జాతీయ వాఙ్మయ సమీక్షకులలో ఎన్నదగినవారు. రాజరత్నం, పుట్టప్పగార్లు ఉత్తేజకరమైన జాతీయ గేయములను రచించిరి.

స్వాతంత్ర్యజ్యోతిని మారుమూల పల్లెలలోనికి దీసికొని వెళ్ళి, ఇంటింట వెలిగించి చీకటిలోనున్న ప్రజా సామాన్యమునకు వెలుతురు జూపించి, భారతీయ జాతీయోద్యమమును నిజమైన ప్రజల ఉద్యమముగా జేసిన సంపూర్ణ గౌరవము గాంధీ మహాత్మునికే చెందుచున్నది. గుజరాతీలో నవజీవన్, ఇంగ్లీషులో యంగ్ ఇండియా మున్నగు పత్రికల ద్వారా గాంధీమహాత్ముడు ప్రజలలో జాతీయ భావాలను ప్రజ్వరిల్ల జేసెను. ఇంగ్లీషు భాషయందును, గుజరాతీ యందును గాంధీమహాత్ముని కలము అత్యంత శక్తివంతమైనది. పూవువలె మృదువేగాక, వజ్రమువలె కఠోరమైనదిగూడ ఆయన రచన. గాంధీ

మహాత్ముని వ్యాసములు అసేతు హిమాచలపర్యంతము ప్రజలను పులకాంకిత గాత్రులను జేసి, స్వాతంత్ర్య సమరములో వారు నడుముకట్టి ముందుకు దూకుటకు ఉపయోగపడినవి. క్విట్ ఇండియా సందర్భమునందును, అంతకు ముందును, ఆయన నిర్వహించిన వివిధ ఉద్యమాల సందర్భమున ఆయన వ్రాసిన వ్యాసములకు ప్రపంచ వాఙ్మయమున అత్యున్నత స్థానము కలదు. రస్కిన్, టాల్‌స్టాయిల రచనల ప్రభావము గాంధీమహాత్ముని జీవితముమీద యెక్కువగా పడినదని చెప్పవచ్చును. మహాత్మునివలెనే జవాహర్లాల్ కూడ రచనల ద్వారా భారత దేశమును ప్రబోధించెను.

ఈ సందర్భములో భారత స్వాతంత్ర్య ఉద్యమమునకు తోడ్పడిన విదేశీయుల రచనలను గూర్చి కూడ ప్రస్తావించుట అవసరము. సండర్ లాండు వ్రాసిన ఇండియా ఇన్ బాండేజి (దాస్యబంధాలలో జిక్కుకొనిన భారతదేశము), రామ్సే మాక్డోనాల్డు రచనలు మున్నగునవి భారత జాతీయయోద్యమ ప్రచారమునకు బాగుగా తోడ్పడినవి. మనదేశములో అమృతబజారు పత్రిక; ప్రకాశం పంతులుగారి స్వరాజ్య; బొంబాయి క్రానికల్; చింతమణిగారి లీడర్; ట్రిబ్యూన్ మున్నగు ఆంగ్ల పత్రికలు నిర్భయ విమర్శల ద్వారా దేశములో చైతన్యము ప్రబోధము కలుగజేసినవి. భారత జాతీయోద్యమమును గూర్చి వ్రాసిన విదేశీయులలో బ్రెయిల్స్‌ఫర్డు గారికి ఉన్నత స్థానము గలదు. భారత జాతీయ కాంగ్రెస్ ఆశయాలను ధైర్యముతో తమ రచనలద్వారా సమర్థించిన వారిలో బ్రెయిల్స్‌ఫర్డుగారు ముఖ్యులు. 1942 సంవత్సరమున గాంధీ, నెహ్రూ, పటేలు మున్నగు నాయకులు చెరసాలలో బంధింపబడిన తరువాత, భారతజాతీయోద్యమును దౌర్జన్యపద్ధతుల ద్వారా అణచివేయుటకు బ్రిటిషు ప్రభుత్వము ప్రయత్నించిన సందర్భమున, సుప్రసిద్ధ పత్రికా రచయిత లూయీ ఫిషర్ భారత జాతీయ కాంగ్రెసును గూర్చియు, మన జాతీయోద్యమమును గూర్చియు వ్రాసిన వ్యాసములు ప్రపంచమును దిగ్భ్రాంత మొనరించి, భారతీయుల హక్కులు న్యాయమైనవి ఋజువు చేసినవి. భారత జాతీయోద్యమ చరిత్రలో లూయీఫిషర్ రచనలు చిరస్మరణీయములు.

వందేమాతరం గేయము భారతీయులను ప్రబోధించుటలో చేసిన సేవను గూర్చి యెంత ప్రశంసించిన తక్కువయే. బంకించంద్రుని జీవిత కాలమున

ఆయన నవలలు, వంగదేశమును ప్రబోధించినవి. కాని, తరువాత క్రమక్రమ ముగా జాతీయోద్యమ విస్తరణతో, రాజకీయాలలో గాంధీమహాత్ముని అవత రణతో, జాతీయోద్యమము దాల్చిన విప్లవ పరిణామముతో, వందేమాతరం గీతము సకల భారతీయుల హృదయాలను ఉత్సాహతరంగితము జేసి, వారి నెత్తురును ఉడుకెత్తించి, ఉత్తేజితులను గావించినది. ఈ గీతము పాడుచు ప్రాణ ములనైన ఒడ్డుటకు యువకులు సంసిద్ధులైరి. వందేమాతరమనగా జాతీయోద్య మమునకు, భారత స్వాతంత్ర్యజ్యోతికి పర్యాయపదమైనది. భారత దేశములో వందేమాతరంవలె ప్రజల హృదయాలమీద ఆధిపత్యము వహించిన గేయము మరొక్కటి లేదనిన సత్యమునకు తలవంపులు వాటిల్లవు. జాతీయకవి రవీంద్రుడు శక్తిమంతమైన ఒక మహాసంస్థగా అవతరించి, భారతీయులలో ప్రబో ధము గావించెను రవీంద్రుని 'జనగణమన' భారతజాతీయ గేయముగా అంగీక రింపబడినది. వంగభాషలో శరత్‌చంద్ర ప్రభృతులు తమ రచనల ద్వారా సోదర దేశీయులను ప్రబోధించిరి మహర్షి అరవిందునికి రవీంద్రునితో సమాన మైన స్థానము వంగదేశమున కలదు. గాంధీమహాత్ముడు రాజకీయ రంగమున ప్రాధాన్యము వహించకముందే ఆయన గీతా ఉపన్యాసములు వంగదేశమును ఉత్తేజిత మొనరించినవి ఆ దినాలలోని వంగదేశము నందలి విప్లవోద్యమ నాయకులందరును అరవిందుని గీతా ఉపన్యాసములను విని ప్రబోధితులై, భారతమాత సేవకు జీవితములను అంకితము జేయుటకు నిశ్చయించి ముందుకు వచ్చినవారేనని చెప్పవచ్చును. ఇంగ్లీషులో కె. యన్. వెంకటరమణి మున్నగు వారు రచించిన గ్రంథములు విద్యాధికులను, విద్యార్థులను ప్రబోధితులను జేసినవి. వెంకటరమణిగారి గ్రంథములు-తెలుగులో పరివర్తితమైనవి.

తెలుగు దేశమున వాఙ్మయము ద్వారా ప్రజలను మేలుకొల్పిన వైతాళి కుడు వీరేశలింగం పంతులు. వీరేశలింగం పంతులు తమ రచనలద్వారా సంఘములోని కుళ్ళును బయట పెట్టి, సంస్కరణోద్యమమును, మాటలతో ప్రచారము జేసి సంతృప్తి జెందక, ఆచరణలోనికి దెచ్చిరి. వీరేశలింగము గారిది సంస్కరణ దృక్పథము. రాజకీయముగా వీరేశలింగముగారు ప్రజా ప్రబోధము చేయకపోయినప్పటికి వారి సంఘ సంస్కరణోద్యమము ఆంధ్రుల కన్నులు తెరిపించి, జాతీయోద్యమ వ్యాప్తికి ఆంధ్రదేశములో మంచి అవ కాశము కలుగజేసినది. ఆంధ్రపత్రికను స్థాపించిన కాశీనాథుని నాగేశ్వర

రావు పంతులుగారు ఆంధ్ర దేశమున రాజకీయ చైతన్యమును కలుగజేయుటకు అద్వితీయమైన కృషి చేసిరి. ఆంధ్రుల ఏకైక దినపత్రికగా ఆంధ్ర పత్రిక స్వాతంత్ర్యోద్యమ బీజాలను ప్రజాహృదయ క్షేత్రాలలో చల్లి, చిరస్మరణీయమగు సేవ గావించినది. ఆంధ్రదేశములో రాజకీయ ప్రబోధము కావించిన పత్రికలలో కృష్ణాపత్రికది అగ్రతాంబూలము. ఒకమారు ముట్నూరి కృష్ణారావుగారు తమ పత్రికలో యెక్కువగా వార్తల ప్రకటన జరుగుటలేదను ఆరోపణకు ప్రత్యుత్తరమిచ్చుచు, కృష్ణా పత్రిక వార్తాపత్రిక కాదనియు (News paper), అది అభిప్రాయాల పత్రిక యనియు (Views paper) తెలిపిరి. భారతజాతీయ కాంగ్రెసు ఆదర్శాలను గూర్చి, కాంగ్రెసు అధ్యక్షోపన్యాసాలను గూర్చి జాతీయ భావ ప్రబోధకములగు కృష్ణాపత్రిక సంపాదకీయములు ఆంధ్రదేశములో అపూర్వమగు సంచలనము కలుగజేసినవి మారుమూలలనున్న ప్రజలు కృష్ణాపత్రిక సంపాదకీయములను చదివి రాజకీయముగా చైతన్యవంతులైరి. నాయకులను, విద్యాధికులను, ప్రజాసామాన్యమును అందరిని ఒక్కుమ్మడిగా ఊపి, ఉత్సాహతరంగితులను జేసినవి కృష్ణాపత్రిక సంపాదకీయాలు. వేదాంతవేత్తలనేకాక పల్లెటూరి ప్రజానీకమును గూడ కృష్ణా పత్రిక సంపాదకీయాలు, ఉత్తేజితులను గావించినవి. నాయకులు, కార్యకర్తలు, సామాన్య ప్రజలు ఆ పత్రికా సంపాదకీయాలను చదివి, ప్రబోధితులగుచుండెడివారు.

ఆంధ్ర, కృష్ణాపత్రికల ననుసరించి యితర పత్రికలు బయలుదేరి ఆంధ్ర దేశ రాజకీయ వాతావరణమును చైతన్యపూరితము జేసినవి. యువకులు భావగేయములద్వారా, ప్రజానీకమును మాతృదేశ సేవకై ముందుకు వచ్చునట్లు చేసినారు. గురజాడ, రాయప్రోలు కవీంద్రులు ఇట్టి యువకులు. దువ్వూరి, విశ్వనాథ, జాషువ, తుమ్మల కవీశ్వరుల రచనలు ఆంధ్రదేశములో దేశభక్తి, త్యాగదీక్షను ప్రబోధించినవి. గరిమెళ్ళ సత్యనారాయణ గారు కృష్ణాపత్రికలో తమ గేయములద్వారా, సత్యాగ్రహోద్యమ ప్రబోధమును జేసిరి. "మాకొద్దీ తెల్ల దొరతనము," "అంటరాని వారెవ్వరో కాదు, మావెంట రానివారె." "దండాలు భరతమాత" అను గేయాలు అపారమైన చైతన్యము కలుగజేసినవి. ఆధునికాంధ్ర కవిశేఖరుల రచనలోని "చావలేదు ఆంధ్రుల మహోజ్వల చరిత్ర," "దేశమంటే మట్టికాదోయ్, దేశమంటే మనుషులోయ్", "వీరగంధము తెచ్చినారము, వీరులెవ్వరొ చెప్పుడీ",

"కొల్లాయిగట్టితేనేమి మా గాంధి కోమటై పుట్టితేనేమి" అను కవితలు ఆంధ్ర ప్రజల నాలుక మీద నాట్యముజేసినవి. 'భరతఖండము చక్కనిపాడియావు' వంటి పద్యములు ప్రజా సామాన్యములో బ్రిటిష్ పరిపాలనా స్వరూపమును బాగుగా చిత్రించినవి. రాయప్రోలు, గురజాడ, విశ్వనాథ, జాషువా, తుమ్మల, దువ్వూరి మున్నగు అధునిక కవిశేఖరుల రచనలు బహిరంగ సభలలో వేదికల మీద, శ్రావ్యముగా పఠితమై, ప్రజలను చైతన్యవంతులనుగా జేసినవి. సభలలో దేశభక్తి ప్రబోధములగు గేయాలు, పద్యాలు అద్భుతమైన జాగృతిని కలుగ

ఈ జాతీయోద్యమ వాఙ్మయ ప్రభావ ఫలితముగా తెలుగులో వీర కావ్యములు గూడ బయలుదేరి, పరదేశ పాలనా బంధములను త్రెంచుకొనుటకై ప్రబోధము జేసినవి. ఆధునిక కవులలో శివశంకరశాస్త్రి, అడవి బాపిరాజు, కొడాలి ఆంజనేయులు మున్నగువారు త్యాగ సమయములందు ముందుకు వచ్చి చెరసాలల నలంకరించినారు. ఉన్నవ లక్ష్మినారాయణగారి 'మాలపల్లి' అను నవల ప్రజలలో చాల ప్రబోధము కలుగజేసినది.

(రేడియో ప్రసంగం-1954—గోలకొండ పత్రికలో ప్రచురితం)

# తెలంగాణ సాహితీ వికాసము

తెలుగు దేశ చరిత్రలో, తెలుగుసీమ భూగోళంలో నెల్లూరు మండలం విశిష్టమైనది. కళలకు, సాహిత్యానికి, సంస్కృతికి తరతరాలనుండి కాణాచి సింహపురి. అందుచేతనే సింహపురిలో జరిగే సన్మానానికి ప్రత్యేక ప్రాధాన్యాన్ని మన కవి, పండితులు యిస్తున్నారు. అనేక సంవత్సరాల నుండి కవిత్రయ జయంతులు జరుపుతూ, ఆ సందర్భాలలో కవులను, పండితులను ఆహ్వానించి వారిచేత విద్వదభిరామమైన ఉపన్యాసాలను చేయించే ప్రశస్త సంప్రదాయం నెల్లూరులో నెలకొని యున్నది. విశ్వవిద్యాలయాలు చేయించే ఎక్స్టెన్షన్ లెక్చర్స్ వంటివి ఈ కవిత్రయ జయంతి సందర్భంలో జరిపించే ఉపన్యాసాలని విద్వాంసుల ఏకగ్రీవ అభిప్రాయము.

ఈ సంవత్సరం ఈ సన్మానాన్ని స్వీకరించి ప్రసంగించవలెనని ఆహ్వానించినపుడు నాకు కొంత ఆశ్చర్యము కలిగినది. అంతేకాదు, నిర్వాహకుల వివేకములో కొంత సందేహము కలిగినది. అయితే ఇంకా ఆలోచించినపుడు ప్రతి సంవత్సరం కవి పండితులను మాత్రమే ఆహ్వానించే యీ ప్రశస్త సంప్రదాయాన్ని యీ సంవత్సరానికి నిల్పివేసి విద్వాంసుల శ్రేణికి చెందని వ్యక్తినొకరిని యీ పర్యాయం ఆహ్వానించి, జరిగే చమత్కారము చూడవలెనని ఈ నిర్వాహకులు ఉబలాటపడినారేమో యని నాకు తోచినది. ఇదే నిజమైతే ఆ ఉబలాటం తీర్చవలెననే నేను మీ ముందు నిలిచినాను. నా ఈ సాహసానికి మరొక కారణం నాకు పరమాప్తులై యీ జయంతుల నిర్వహణ కార్యకలాపాలకు యాజమాన్యము వహిస్తున్న డా॥ బెజవాడ గోపాలరెడ్డిగారి నిర్ణయం కాదనగలిగే శక్తి లేకపోవడం.

ఈ రోజు నేను యేమి మాట్లాడవలెనని ప్రశ్నించుకున్నపుడు అప్రయత్నంగా రాయప్రోలు పద్యమొకటి నా నాలుకమీద దొరలినది:

పాయలు పాయలుగా విడి
పోయిన తెనుగు కన్నియ ముంగురులకు, వే

ణీ యోగ్యా భరణముగా జడకుచ్చు ల
ల్లి యిచ్చితి భ క్తిన్

వెంటనే యీనాటి ప్రసంగానికి యీ పద్యాన్నే ప్రధాన ప్రాతిపదికగా చేసుకుంటే బాగుంటుందనే తలంపు మెరపువలె మెరసినది. నిజమే! తెలుగు కన్నియ ముంగురులు పాయలు పాయలుగా విడిపోయినవి. ఎన్ని పాయలు? ఎంత కాలంనుండి? అనేక శతాబ్దాల నుండి, క్రీస్తుకు పూర్వం నుండి, రెండు వేల సంవత్సరాలనుండి. తెలుగు వానికి విదేశాలతో వ్యాపారం చేసే సంబంధాలు రెండు వేల సంవత్సరాలకు పైగా ఉన్నవి స్వర్గీయ మల్లంపల్లి సోమ శేఖరశర్మగారు వ్రాసిన వాక్యాలు వినండి: "ఆనాడు (అనగా క్రీస్తుపూర్వం) మన దేశము, రోము మొదలైన పడమటి నగరాలతోను, తూర్పు దేశాలతోను, ద్వీపాలతోను వర్తక వ్యాపారాలు సాగించింది. ఓడల వర్తకులతో పాటు మన మతము, మన విద్యలు, మన కళలు అన్నియుకూడ తూర్పుదేశాలకు, ద్వీపాలకు వెళ్ళినవి. ఈ విధంగా భారతీయ సంస్కృతిని తూర్పుదేశాలలోను, ద్వీపాల లోను వ్యాపింప జేసిన మొట్టమొదటి వారు మన పూర్వులు బౌద్ధాంధ్రులు. కాళింగులూను" - విదేశాలతో తెలుగు వారికి గల సంబంధాలు మిక్కిలి ప్రాచీన మైనివి. ఈనాడు మనము తెలుగును గూర్చి అంతర్జాతీయ స్థాయిలో ఆలోచిస్తు న్నాము. తెలుగువారు తగినంత సంఖ్యలో అన్ని దేశాలలో కనిపిస్తున్నారు. మళ్ళీ రాయప్రోలువారు చెప్పిన పద్యమే వినండి :

"మోటుపల్లి తీరమున లంగరేసి ఓ
డలు సుంక మర్పింప నిలుచునాడు
రాయలసీమ రారాయబార్లు వసించి
చిత్రచరిత్రల్ రచించునాడు
పాకాల చెరువు చెంపలపండు ధాన్యము
అన్య దేశాధీశు లడుగునాడు
అద్దంకి కోడెల నాబోతులకు నై
దూరాగతులు కొని త్రోలునాడు
ఖండ ఖండాంతరములన్ ప్రకాశమయ్యే
తెనుగు తల్లి లాలాటికా తిలకదీప్తి

తమ్ముడా మాయసిత్తువే తల్లి వన్నె
చెల్లెలా చిన్నబుత్తువే తల్లి చిన్నె''

అను ప్రబోధము యీనాడు మనలను ఉత్తేజితము చేస్తున్నది.

అయితే సాంస్కృతిక సంబంధాలు పరస్పరమైనవి. మనము కొంత ఇచ్చినప్పుడు మరికొంత తీసుకోవడం కూడ జరుగుతుంది. పరదేశ, పరప్రాంత, పరభాష, పర సంస్కృతులను జూచి తెలుగు వాడెన్నడు ఉలికిపడలేదని చరిత్ర చాటుచున్నది. ఈ దృక్పథంతో తెలుగు దనాన్ని పరిశీలించినపుడు వ్రాయవలసిన సంగతులు ఒక గ్రంథమే కాగలదని అనిపిస్తున్నది.

ఈనాడు తెలుగువారు విదేశాలలోను, మనదేశంలోని ఇతర రాష్ట్రాలలోను అధిక సంఖ్యలో నివసిస్తూ ఆయా దేశాల, ఆయా ప్రాంతాల అభివృద్ధికి పాటుబడుతున్నారు. కొన్ని విదేశాలలో తెలుగువారు మనకన్న ఆర్థికంగా సంపన్నులై, సామాజికంగా పురోగాములై ఉన్నారు. బర్మా, మారిషన్, దక్షిణాఫ్రికా, ఫిజి, మలేషియా మొదలైన దేశాలలోని తెలుగువారు ఇందుకు నిదర్శనం. ప్రత్యేకంగా వారికి కుల సంబంధమైన స్పృహలేదు. ఏ కులంవారో ఎప్పుడు వెళ్ళినారో తెలియదు కానీ, తెలుగు మాట్లాడే వారంతా ఒకే కులంగా రూపొందినారు. మన సంస్కృతిని విదేశాలకు, విదేశాలలోని తెలుగువారికి అందించే ప్రయత్నంతోపాటు కులరహితమైన అక్కడి సంస్కృతిని మనం గ్రహించే ప్రయత్నం చేయవలసి ఉంటుంది. ఈ కుల రహితమైన సమాజ పరిణామ ఫలితంగా ఆ దేశాలలోని తెలుగు భాష పరిణామము కూడ మనం గమనించవలసి ఉంటుంది. భాషనుబట్టి కులాన్ని పోల్చుకోలేని నుడికారము అది. ఈ నుడికారముపైన సహజంగా అక్కడి భాషల ప్రభావం కూడా పడి ఉంటుంది. అంతర్జాతీయ తెలుగు సంస్థవంటి సంస్థలు విదేశాలలోని తెలుగు భాషా పరిణామాన్ని పరిశీలించవలసి ఉంటుంది. ఇదే విధంగా భారతదేశంలోని ఇతర రాష్ట్రాల తెలుగు నుడికారాన్ని కూడా పరిశీలించవలసి ఉంటుంది.

కొన్ని దేశాలలో తెలుగు, సాహిత్యపరంగా కూడ మంచి అభివృద్ధి పొందినది. బర్మాలో వివిధ వాఙ్మయ ప్రక్రియలలో సాధన చేసిన తెలుగు రచయితలు, తెలుగు పత్రికలు, తెలుగు సారస్వత సంఘాలు, నాటక సమాజాలు

ప్రశంసనీయమైనకృషి గావించి, సాంస్కృతిక చైతన్యానికి పాటుపడుటు జరిగినది. ఇటీవల అంతర్జాతీయ తెలుగు సంస్థ బర్మా, మారిషస్ దేశాలను గూర్చి రెండు పుస్తకాలు ప్రకటించినది. ఇతర దేశాలలోని తెలుగు భాషను గూర్చి యిటువంటి పుస్తకాలు ప్రచురణ కావలసిన ఆవశ్యకత ఉన్నది. ఇది జరిగినపుడు విదేశాలలోని తెలుగు సాహిత్యవికాస చరిత్రకు తగిన సామగ్రి లభించగలదు.

ఇతర దేశాల, ఇతర రాష్ట్రాల తెలుగు స్వరూప స్వభావాల పరిశీలన నా ప్రసంగానికి ప్రస్తుతం కాదు. మన తెలుగు సీమలో విభిన్న ప్రాంతాల మాండలికాలను గూర్చి కొద్దిగా ప్రస్తావించి తెలంగాణా సాహిత్య వికాసాన్ని సమీక్ష చేయడమే యీనాటి నా ప్రసంగం ఉద్దేశ్యం. ఇందుకు భూమికగా కొన్ని మాటలు చెప్పవలసి ఉంటుంది. తెలుగుజాతికి ఉజ్జ్వలమైన చరిత్ర ఉన్నది. అయితే యీ చరిత్రను పరిశీలించినపుడు తెలుగువారు ఏకపరిపాలన క్రింద ఉన్న ఘట్టాలు మూడు మాత్రమే మనకు కనిపిస్తున్నవి. మొదటిమారు కాకతీయయుగంలో; రెండవ పర్యాయం గోలకొండ రాజుల పరిపాలనలో; మూడవసారి నేటి ఆంధ్రప్రదేశ్ ఏర్పడ్డ తరువాత. ఈ విషయంపై మల్లంపల్లి సోమశేఖర శర్మగారు వ్రాసిన మాటలు గమనించండి:

"గణపతి దేవ మహారాజు తెలుగు మాట్లాడే ఆంధ్రులందరిని ఒక్క రాజ్యంలోకి తీసుకరావలెనని మొదటిసారి ప్రయత్నించాడు. ఈ మహారాజుకు సమకాలికుడు తిక్కన సోమయాజి. ఈయన మహాకవి. నెల్లూరు పాలించిన తెలుగు చోళరాజు మనుమసిద్ధి ఆస్థానంలో ఉండి, విరాటపర్వము దగ్గరినుండి సంస్కృత మహాభారతం పదిహేను పర్వాలున్న తెనుగుచేసి మనదేశంలోని వేద మతధర్మానికి గట్టి పిత్తనం వేశాడు. మనది ఆంధ్రదేశం. మనం ఆంధ్రుల మనే జాతీయాభిమానం మొదటిసారి మనకు ఈ కాలంలోనే కలిగింది. దేశంలో క్రొత్త ఉత్సాహం ప్రబలింది. ఇక లోటేమిటి? గణపతిదేవమహారాజు సర్వవిధాల సమర్థుడు, శౌర్యపరాక్రమాలు గలవాడు...మన ఆంధ్రదేశం ఇంచుమించుగా ఓరుగంటి కాకతీయుల అధికారంలోనికి వచ్చింది. "తరువాత తెలుగుదేశంలోని అత్యధిక భాగాన్ని పరిపాలించినవారు బహమనీ రాజులు (అయితే బహమనీ రాజ్యము బహుభాషా రాష్ట్ర, కర్ణాటక, తెలుగు ప్రజల సమష్టి కుటుంబము — పూర్వపు హైదరాబాదువలె.) బహమనీ రాజ్యం విచ్ఛిన్నం అయిన తరువాత

గోలకొండ రాజ్యం యేర్పడినది. గోలకొండ రాజ్యచరిత్ర అంటే ముస్లిం సుల్తానుల పరిపాలనలోని ఆంధ్రదేశ చరిత్ర అన్నమాట. గోలకొండ తెలుగురాజ్యము, గోలకొండ సుల్తానులు తెలుగు ప్రభువులు అయినారు. తెలుగు కవిత్వంలో ఇబ్రాహీం కుతుబ్‌షా, ఇభరాముడుగా మారి తెలుగు జనానికి అభిరాముడైనాడు. బహమనీ రాజుల క్రింద, గోలకొండ సుల్తానుల క్రింద ఫారసీ, ఉర్దూ భాషలతో తెలుగు భాషకు, తెలుగు దేశానికి పరిచయము కలిగినది. ఈ ప్రభావం ఆనాటి నుండి నేటివరకు కనిపిస్తుంది.

గోలకొండ రాజ్యం పతనమైన తరువాత ఇరువై సంవత్సరాల క్రింద వరకు అనగా ఆంధ్రప్రదేశ్ యేర్పడేవరకు మధ్యన ఉన్న కాలంలో తెలుగుదేశం భిన్నపరిపాలన క్రింద ఉండిపోయినది. తెలంగాణా ప్రాంతం, రాయలసీమ ప్రాంతం, సర్కారు ప్రాంతాలు రూపొందినవి. సర్కారు, రాయలసీమ ప్రాంతాలు ఇంగ్లీషు పరిపాలన క్రిందికి పోయి తమిళ, కర్ణాటక, మలయాళ భాషీయులతో కలిసి ఉండటం తటస్థించింది. ఇంగ్లీషువారికి సామంతుడైన నిజాం యేలుబడిలో తెలంగాణా, మహారాష్ట్ర, కర్ణాటక ప్రాంతాలతో కలసి నిలచినది. రాయప్రోలు ప్రస్తావించిన తెలుగు కన్నియ ముంగురులు యీ విధంగా పాయలు పాయలుగా తెలుగు సీమలోనే విడిపోయినవి. తత్ఫలితంగా తెలుగు భాషా వికాసంలో మాండలికమైన ప్రత్యేకతలు యేర్పడినవి. రాయలసీమ సర్కారు జిల్లాలు, తెలంగాణము అనే మూడు పాయలలో యీ ప్రత్యేకతలను స్పష్టంగా పోల్చుకోవచ్చును.

తెలంగాణ నిజాం యేలుబడి క్రింద సుమారు నూటాయేబది సంవత్సరాలు ఉండిపోయినవి. ఈ 150 సంవత్సరాలలో ఇక్కడి సాహిత్య స్వరూపాన్ని పరిశీలించడం అవసరం. తెలంగాణాలో కూడ జిల్లా స్థాయిలో మాండలికమైన ప్రత్యేకతలు మనకు కనిపిస్తున్నవి. మహబూబునగరు జిల్లా భాషకు ఖమ్మం జిల్లా భాషకు వ్యత్యాసాలు మనం పోల్చుకోవచ్చును. ఆదిలాబాదు, నిజామాబాదు జిల్లా మాండలికాల ప్రత్యేకతను మనం గమనించవచ్చును. మెదక్, వరంగల్ జిల్లాల మాండలిక స్వరూపాన్ని మనం గుర్తించవచ్చును. తెలుగు అకాడమీ వారు జిల్లా స్థాయి భాష సర్వే జరుగుచున్నది. ఈ సర్వే ఫలితం భాషా శాస్త్రజ్ఞుల పరిశోధనలకు ఉపయుక్తం కాగలదని చెప్పవచ్చును.

తెలంగాణా మాండలికాన్ని పరిశీలించినపుడు శబ్దపరంగా మనకు కొన్ని ప్రత్యేకతలు కనిపిస్తున్నవి. "గెడ్డం" అన్నమాటకు తెలంగాణాజిల్లాలో అర్థం వేరు. ఆంధ్ర జిల్లాలలో అర్థం వేరు. ''వాకిలి'' అనగా తెలంగాణాలో ఇంటి ముందు చోటుకాని తలుపుకాదు. "గడప" అన్నమాట తెలంగాణా వ్యవహారంలో ''కడప''. 'పోకలు' అనే మాటకన్న ''బాగాలు'' అనే మాట తెలంగాణా వ్యవహారంలో ఉన్నది. ''పెదాలు'' అన్నమాటకు పెదములు అని తెలంగాణాలో వ్యవహారం. ''అలా'' అనేమాటకు తెలంగాణాలో ''ఇట్లా'' అంటారు. కావాలి, చేయాలి అనే ''లి'' ప్రత్యయం తెలంగాణా వాడుకలో లేదు. వచ్చాడు, పోయాడు కూడ తెలంగాణా వాడుకలో లేవు. గోలకొండ సుల్తానుల కాలంలోను, అంతకు ముందుగాను పారసీభాషా ప్రభావంవల్ల తెలుగులో అనేక పారసీ ఉర్దూ శబ్దాలు వచ్చినవి, వీని సంఖ్య నూర్లలో ఉంటుంది. అయితే యీ శబ్దాల వాడుకలో కూడ తెలంగాణ, ఆంధ్ర ప్రాంతాలలో కొన్ని వ్యత్యాసాలు కనిపిస్తున్నవి. "షికారు" అనగా వాహ్యాళి కాదు - ''వేట''. "ముద్దాయి" అనగా నిందితుడు కాదు నేరారోపకుడు. ఇంకా ఇటువంటి శబ్దాలను అనేకము సూచించవచ్చును. మాండలికమైన వ్యత్యాసాలకు మచ్చులు మాత్రమే యీ శబ్దాలు. ఈ సందర్భంలో తెలంగాణా నుడికార ప్రభావం కూడ కొద్దిగా ఉర్దూమీద కనిపిస్తున్నదనీ, కొన్ని తెలుగు శబ్దాలు ఉర్దూలో కూడ దొరలినవని మనం గమనించవలసి ఉంటుంది. ఆ విషయం ప్రస్తుతం కాదు. తెలంగాణా ప్రాంతములోని మరికొన్ని సాంస్కృతిక ప్రత్యేకతలను కూడ యీ సందర్భంలో గమనించవలసి ఉన్నది. ఉదాహరణకు ఉత్తర భారతపు ప్రభావము వలన ''హోళీ'' పండుగకు తెలంగాణాలో ప్రాచుర్యం ఎక్కువగా ఉన్నది. మొహర్రం సందర్భంలో పీర్ల పండుగ కూడా ఇటువంటిదే. విజయదశమికి ముందుగా తొమ్మిది రోజులు తెలంగాణా ప్రాంతములో ప్రతి పట్టణంలోను ప్రతి పల్లెటూరులోను స్త్రీలు వినోదించే బతుకమ్మ పండుగ తెలంగాణాకు ప్రత్యేకమైనది. ఈవిధమైన ప్రత్యేకతలను కొన్నింటిని ఆహార విహారాలలోను, ఆచార విచారాలలోను, వేషభాషలలోను పోల్చుకోవచ్చును. కాని యీ ప్రత్యేకతలు తెలుగు సంస్కృతిని విభజించునట్టివి కావని, బహిరంగానికి మాత్రమే చెందినవని, అంతరంగికంగా ఆంధ్ర సంస్కృతి ఏకత్వానికి ప్రతిబంధకము కావని యీ సందర్భంలో స్పష్టీకరించవలసి ఉన్నది.

తెలుగు సాహిత్య చరిత్రలో తెలంగాణా ప్రాంతానిది విశిష్టమైన స్థానము. తెలుగు సాహిత్యములో ప్రశస్తమైన, గణుతి కెక్కిన గ్రంథాలు మూడు. భారతము, భాగవతము, రామాయణము. ఏకశిలా నగరంలోని గణపతి దేవుని ఆస్థానంలో తిక్కన భారతావిష్కరణ జరిగినది. భాస్కరరామాయణము వ్రాసిన భాస్కరుడు, మల్లికార్జునభట్టు, కుమార రుద్రదేవుడు, అయ్యలార్యుడు తెలంగాణా ప్రాంతమువారే. ఆంధ్ర మహాభాగవతము వ్రాసిన పోతనామాత్యుడు తెలంగాణా ప్రాంతీయుడే. మారన మార్కండేయ పురాణం యీ ప్రాంతముననే వ్రాసినాడు. మొట్టమొదటి అచ్చ తెనుగు కావ్యము యయాతి చరిత్ర రచించిన పొన్నగంటి తెలగన్న యీ ప్రాంతము వాడే సామాన్య ప్రజలకు అందుబాటులో నుండునట్లు జానుతెలుగులో రచన గావించవలెనని ప్రబోధించి బసవపురాణాన్ని వ్రాసిన పాల్కురికి సోమనాథుడు తెలంగాణా ప్రాంతీయుడే. ఈ విధంగా ప్రాచీన సాహిత్యం తెలంగాణాలో వర్ధిల్లినది. తెలంగాణము ఇతరాంధ్ర దేశంతో వేరొక పాయగా విడిపోయిన తరువాత కూడా తెలుగు సాహిత్యం యిక్కడ ప్రవర్ధమానమైనదని యీ సందర్భంలో చెప్పవలసి ఉన్నది. రాజకీయంగా వేరుపడిపోయినప్పటికిని భాషాదృష్ట్యా తెలంగాణా ప్రాంతం ఆంధ్రప్రాంతంలో సన్నిహితసంబంధాలు కలిగియుండినది. ఈ సంబంధాలు ఎన్నడూ తెగిపోలేదు. కావున తెలంగాణా ప్రాంతంలో తెలుగు పాండిత్యం లేదని, తెలుగు సంస్కృతికి చోటులేదని ఆంధ్రప్రదేశ్ యేర్పడక పూర్వం కొన్నివర్గాలలో వ్యాపించిన అభిప్రాయం సరియైనది కాదు. తెలంగాణాలోని గ్రామాలలో తాళపత్ర గ్రంథాలు లేని ఊరు లేనేలేదని చెప్పితే అతిశయోక్తి కాజాలదు. సుమారు ఏబది సంవత్సరాల క్రిందట నా చిన్నతనమున కాకినాడ ఆంధ్ర సాహిత్య పరిషత్తు పక్షాన స్వర్గీయ జయంతి రామయ్య పంతులు గారి ఆదేశంపై స్వర్గీయ శేషాద్రి రమణ కవులలో ఒక్కరైన దూపాటి వేంకట రమణాచార్యులవారు తెలంగాణా ప్రాంతమంతా తిరిగి ఎన్నో శాసనాలను, నూర్ల కొద్ది తాళ పత్ర గ్రంథాలను సంపాదించి సాహిత్య పరిషత్తుకు అప్పగించి యుండిరి. ఇవి అన్నీ సాహిత్య పరిషత్తు కార్యాలయంలో యీనాటికి ఉండవచ్చును. ఆంధ్ర చరిత్రకు, ఆంధ్ర సాహిత్యానికి అక్కరయిన సామగ్రి అనేకము యీ శాసనాలలోను, యీ తాళపత్ర గ్రంథాలలోను లభించిందని విజ్ఞులు చెప్పిన మాటలు నాకు బాగా తెలిసిన సత్యము. ఈ తెలంగాణా శాసనాలలో

కొన్నింటిని హైదరాబాదులోని లక్ష్మణరాయ పరిశోధక మండలివారు ప్రకటించి నారు. మరికొన్ని శాసనాలు ఆర్క్యాలజీ శాఖకు అప్పగించబడినది. ఇందులో కొన్ని ప్రకటితమైనవి కూడా. ఇంతకూ చెప్పవలసిన మాట యేమనగా-తెలంగాణా ప్రాంతంలో తెలుగు దీపాలు ఎన్నడూ ఆరిపోలేదన్న సత్యం - అప్పటి ప్రభుత్వ విధానాల వలన యీ దీపాలు దేదీప్యమానముగా ప్రకాశించక పోవచ్చును. కానీ మిణుకు మిణుకుమని వెలుగుచునే యుండెను. హైదరాబాదు నగరంలోని పరిస్థితి ఎట్లున్నప్పటికిని పల్లె ప్రాంతాలలో తెలుగు భాషా సాహిత్యములు అంతరించలేదు.

గోలకొండ సుల్తానులు ప్రజల మతాన్ని, ప్రజల భాషను, ప్రజల సంస్కృతిని ప్రోత్సహించి ఆదరించినారు. కానీ ఆసఫ్‌జాహీ వంశీయులు ఈ ఉత్తమ సంప్రదాయాన్ని పాటించలేదు. ముఖ్యంగా గత శతాబ్దం తుది భాగం నుండి భారతదేశానికి స్వాతంత్ర్యము వచ్చి హైదరాబాదు పైన పోలీసుచర్య జరిగేవరకు ప్రభుత్వ విధానాలు ప్రజల భాషలను అణచివేయునవిగా ఉండినవి. బ్రిటిషు పరిపాలనలో భాషలను అణచివేయుటకు ఇటువంటి ప్రయత్నాలు జరుగలేదు. మాతృభాషల ద్వారా విద్యాబోధన అవకాశాలు అప్పటి హైదరాబాదు రాష్ట్రంలో పూర్తిగా లేకుండెను బ్రిటిషు పాలనలో గ్రంథాలయాల స్థాపన నిషేధించలేదు. రాజకీయాలతో సంబంధము లేని సారస్వత కృషి బ్రిటిషు ప్రాంతంలో నిరంతరాయంగా జరిగింది. సి. పి. బ్రౌను వంటి సివిలియన్ అధికారులు ప్రజల భాషల వికాసానికి కృషి చేసిరి. వీరేశలింగంపంతులు మొదలైన వారి సారస్వత కృషికి ప్రభుత్వం ఆటంకాలు కలిగించలేదు. కానీ తెలంగాణా ప్రాంతంలో పరిస్థితి మరొక విధంగా ఉండినది. మాతృభాషల వికాసానికి గొడ్డలిపెట్టు వంటి విధానాలను హైదరాబాదు ప్రభుత్వం అమలు చేసినది. తెలుగు చదువు కొనడానికి అవకాశాలు లేనే లేకుండినవి. ఒక గ్రంథాలయాన్ని పెట్టుకోవడమే చాలా కష్టమైన పనిగా ఉండినది. కవిసమ్మేళనాలు, సారస్వత సభలను జరుపుకోవడం కూడా ప్రభుత్వానికి కంటగింపుగా ఉండినది. ఇందువలన ప్రజలలో స్వతంత్ర భావాలు వ్యాప్తిజెంది రాజకీయంగా తన అస్తిత్వానికి భంగము కలుగగలదని అప్పటి ప్రభుత్వం అభిప్రాయపడినది. ఆంధ్ర అనే పేరిట ఏ ఉద్యమము సాగినప్పటికిని దానిని ప్రభుత్వం శత్రుభావముతో చూచినది ఆంధ్ర అనే పదముతో ఉద్యమాలు నడిపితే తుదకు యీ ఉద్యమాల

ఫలితంగా తెలంగాణా ఆంధ్ర ప్రాంతముతో కలిసిపోయే ప్రమాదము వాటిల్ల గలదని అప్పటి ప్రభుత్వం అభిప్రాయపడినట్లు ప్రామాణికమైన ఆధారాలు ఉన్నవి. అందుచేత సారస్వత కృషి కూడ ఆరోజులలో రాజకీయ కృషివలె ప్రచ్ఛన్నంగా జరుగవలసిన అవసరం యేర్పడినది. ఈ పరిస్థితినే వాగ్బంధన శాసన పైశాచిక తాండవమని స్వర్గీయ సురవరం ప్రతాపరెడ్డిగారు ఒకమారు వర్ణించియుండిరి.

తెలంగాణా ప్రాంతమున ఊరూర ఉద్దండులైన సంస్కృతాంధ్ర పండితు లున్నప్పటికిని వారు సభలలో సమావేశమై పరస్పర అవగాహన చేసుకునే అవకాశాలు బొత్తిగా లేకుండెను. రాజ భాషయైన ఉర్దూ, ప్రాథమిక దశనుండి విశ్వ విద్యాలయ దశవరకు బోధనాభాష కావడంవల్ల తెలుగు భాషాభివృద్ధికి గొప్ప సంకట పరిస్థితి యేర్పడినది. ఆ రోజులలో హైదరాబాదు రాష్ట్రం ఒక ప్రత్యేకమైన ద్వీపకల్పముగా సిద్ధమై, అక్కడ నివసించే ప్రజలను ఇతర ప్రపంచము నుండి వేరుచేసినది. అందుచేత గత శతాబ్దము నుండి భారత స్వాతంత్ర్య ప్రాప్తివరకు అక్షరాస్యులైన ప్రజల సంఖ్య మిక్కిలి తక్కువగా ఉండెను. సంస్కృతాంధ్ర పండితులు కవులు గ్రాసవాసోదైన్యానికి గురియై పల్లెటూళ్ళలో కృశించిరి. కొద్దిమంది ఉర్దూ, ఫారసీ భాషలలో పరిచయం చేసుకొని ప్రభుత్వ ఆశ్రయముతో తమ పనులను నెరవేర్చుకొనిరి. ఈ విధంగా తెలుగు భాషా వికాసానికి తెలంగాణా ప్రాంతంలో గ్రహణము పట్టినది.

ఈ పరిస్థితులలో తెలుగు భాషను ఆదరించి, ప్రోత్సహించినటువంటి సంస్థానాల కృషిని మనము మరచిపోవడానికి వీలులేదు. గద్వాల, వనపర్తి, ఆత్మకూరు సంస్థానాలను యీ సందర్భంలో ప్రశంసించవలసి ఉన్నది. ఆంధ్ర ప్రాంతానికి, తెలంగాణా ప్రాంతానికి ఒక విధంగా యీ సంస్థానాల ఆదరణ వలన సాంస్కృతిక సంబంధాలు పెంపొందినవి. ప్రతి సంవత్సరం ఆంధ్ర ప్రాంతము నుండి కవులు, పండితులు వచ్చి యీ సంస్థానాలలో సన్మానము పొందేవారు. ఇటువంటి వారిలో తిరుపతి వేంకట కవులు కూడ ముఖ్యులు. ఈ అవధానాలు ఆనాడు తెలంగాణా ప్రాంతానికి, ఆంధ్ర ప్రాంతానికి మధ్య భాషాపరమైన వంతెనలుగా ఉండినవి. వీనికితోడు కొన్ని నాటక సంఘాలు కూడ ఆంధ్ర ప్రాంతమునుండి వచ్చి తెలంగాణా ప్రాంతములోని కొన్ని పట్టణాలలో నాటకాలను ప్రదర్శిస్తుండేవి. మైలవరము, సురభి మొదలైన నాటక

సంఘాలు వరంగల్లు మొదలైన తెలంగాణా ప్రాంతాలలో నాటకాలను ప్రదర్శించి, యీ రెండు ప్రాంతాల మధ్య సాంస్కృతిక సమైక్యతను బలపరచిన సత్యము యీ సందర్భములో మనము గమనించవలసి ఉన్నది.

తెలంగాణాలోని పరిస్థితులను గమనించి యీ ప్రాంతమున సాహిత్య వికాసానికి కృషి చేయవలెనని సంకల్పించినవారు స్వర్గీయ కొమర్రాజు వేంకట లక్ష్మణరావుగారు. ఆయన గొప్ప పరిశోధకుడు. తెలుగు భాషా వికాసానికి అపారమైన కృషి చేసిన మేధావి. నిష్కళంక దేశభక్తుడు. ఆ రోజులలో చాలా మంది ఆంధ్ర ప్రాంతీయులకు తెలంగాణాను గూర్చి సరియైన అవగాహన లేకుండెను. లక్ష్మణరావుగారు మునగాల సంస్థానానికి దివానులైనందువలన, మునగాల సంస్థానాధీశ్వరులకు తెలంగాణా ప్రాంతంతో సంబంధాలు ఉండినందు వలన ఆ ఉభయులు హైదరాబాదుకు రాకపోకలు చేస్తుండేవారు. లక్ష్మణరావుగారి కృషికి మునగాల రాజావారి తోడ్పాటు లభించినది. ఈ విధంగా 1900 సంవత్సరమున శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయము స్థాపితమైనది. తరువాత 1904 వ సంవత్సరమున రాజనరేంద్ర భాషా నిలయం హనుమకొండలో స్థాపితమైనది. ఆ తరువాత మరికొన్ని సంవత్సరాలకు వరంగల్లులో శబ్దానుశాసనాంధ్ర భాషా నిలయం స్థాపితమయ్యెను. లక్ష్మణరావుగారి విజ్ఞాన చంద్రిక గ్రంథమండలి కూడా 1900ల సంవత్సరమున హైదరాబాదులో స్థాపితమైనది. లక్ష్మణరావుగారు రావిచెట్టు రంగారావుగారు, మునగాల రాజాగారి తోడ్పాటుతో తెలంగాణా ప్రాంతములో సాహిత్య వికాసానికి, సాంస్కృతిక చైతన్యానికి గట్టి పునాదులు నిర్మించినారు. తరువాత క్రమక్రమంగా తెలంగాణాలో అనేక గ్రంథాలయాలు స్థాపితమై సాహిత్య సభలు జరిగి కవి పండితులను మేల్కొల్పి తెలుగు భాషాభ్యుదయానికి కృషి చేయడం జరిగింది. ఈ కృషికి లక్ష్మణరావుగారి అడుగుజాడలలో వారి ప్రోత్సాహంతో నాయకత్వం వహించినవారు మాడపాటి హనుమంతరావుగారు, సురవరం ప్రతాపరెడ్డిగారు, ఆదిరాజు వీరభద్రరావుగారు. తెలంగాణాలో తెలుగువారిని మేలుకొల్పిన గౌరవము యీ మహనీయులకు ఈయవలసి ఉన్నది ఆనాటి తెలుగువాని చిత్తవృత్తిని ఒక కవి ఈ విధంగా వర్ణించినాడు:

యంచును గాలిబంచును సదా యె
ఖ్యాలె వో, షాయరిన్ చాలా చాలా వఫీ
సు లుట్టిపడ మాషాల్లా రచించెన్గదా!

అని తెలుగువాడు హర్షించే వాడట. ఇటువంటి పద్యాలు ఇంకా మరికొన్ని ఉదాహరించవచ్చును. మొత్తంమీద ఉర్దూ, ఫారసీ భాషల ప్రభావానికి లోనై తన మాతృభాషకు అంత ప్రాధాన్యం యీయని పరిస్థితిని ఆనాటి తెలంగాణ ములో కనిపించినది. ఈ సందర్భములో పైన పేర్కొన్న ముగ్గురు మహనీయుల మార్గదర్శకత్వంలో గ్రంథాలయాలు, పత్రికలు, గ్రంథమాలలు స్థాపితమై తెలంగాణాను మేలుకొల్పడం జరిగినది. ఈ విధంగా మేలుకొని యువకులు ముందంజవేసి సాహిత్య వికాసానికి కంకణ బద్ధులైనారు. ఈవిధంగా తెలంగాణా సాహిత్య రంగంలో నవయుగోదయమైనది. కృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయాన్ని స్థాపించిన 1900 సంవత్సరము నుండి యీ నవయుగము ప్రారంభమై 1948 సెప్టెంబరులో జరిగిన పోలీసుచర్య వరకు కొనసాగినదని చెప్పవచ్చును. ఈ అర్థశతాబ్దములో సాహిత్య కృషి యేవిధంగా జరిగినదో స్థాలీపులాక న్యాయంగా వివరించడం యీనాటి నా ప్రసంగం యొక్క ముఖ్యోద్దేశము. అందుచేత ఈ కాలంలో సారస్వత వ్యాసంగము చేసిన వారిని గూర్చి మాత్రమే ప్రస్తావించనైనది. 1948 సెప్టెంబరు తరువాత జరిగిన సాహితీ వికాసము మరొక అధ్యాయము. డాక్టరు సి. నారాయణరెడ్డి ప్రభృతులైన ప్రముఖాంధ్ర కవులు, విమర్శకులు, రచయితలు పోలీసు చర్య తరువాత తమ సాహితీ జైత్రయాత్రను ప్రారంభించినారు.

తెలంగాణా సాహిత్య రంగంలో నవయుగోదయానికి వైతాళికులు నిస్సందేహంగా కొమర్రాజు వేంకట లక్ష్మణరావుగారు. ఆయన బహు భాషా వేత్తలు, గొప్ప మేధావి, మహా విజ్ఞాని. ఆధునిక యుగంలో తెలుగు భాషా వికాసానికి కృషి చేసిన వారిలో వీరేశలింగంగారి ప్రక్కన ఉండవలసినవారు. ఆధునిక అవసరాల దృష్ట్యా తెలుగుభాష ప్రగతి చెందవలెనని ఉద్దేశించి అందుకు అనుగుణమైన వాఙ్మయాన్ని పుష్కలంగా నిర్మించిన మార్గదర్శి మహామనీషి లక్ష్మణరావుగారు. చరిత్ర పరిశోధన, భాషాపరిశోధన, విజ్ఞాన వాఙ్మయాభివృద్ధి, వచన వాఙ్మయ ప్రగతి లక్ష్మణరావుగారి ఆశయాలు. ఈ ఆశయాలకనుగుణంగా వారు తమ అనుయాయులను తీర్చిదిద్దినారు. మాడపాటి హనుమంతరావుగారి

పైన లక్ష్మణరావుగారి ప్రభావము స్పష్టముగా గోచరిస్తున్నది. ఆదిరాజు వీరభద్రరావుగారు లక్ష్మణరావుగారి శిక్షణలో పెరిగినవారు. సురవరం ప్రతాపరెడ్డిగారు లక్ష్మణరావుగారిని తమ మార్గదర్శకులుగా అభిమానించి నారు. అందుచేత యీ ముగ్గురు ఆధునిక యుగంలో తెలంగాణా సాహిత్యాభి వృద్ధికి లక్ష్మణరావుగారి అడుగు జాడలలో కృషి చేసిరి. మాడపాటి హనుమంత రావుగారు ఇంగ్లీషు, ఉర్దూ, ఫారసీ, తెలుగు భాషలలో ప్రవీణులై, మహారాష్ట్రము, హిందీ, సంస్కృత భాషలతో తగినంత పరిచయం కలిగినవారు. ఉర్దూలో మంచి రచయిత కూడా. "ముషీర్ దక్కన్" అనే దిన పత్రికకు అనేక సంవత్సరాలు సంపాదకీయాలు వ్రాసినారు. తెలుగులో సరళమైన వచన రచన చేయగలిగిన వారు. "క్షాత్రకాలపు హింద్వార్యులు" అనే గ్రంథాన్ని ఆయన మహారాష్ట్రము నుండి తెనిగించినారు. తెలుగు భాషలో మొట్టమొదటి కథానిక రచయితలలో హనుమంతరావు గారిని పేర్కొనవలసి యున్నది. స్వయంగా మంచి కథలను వ్రాయడమేగాక మున్షీ ప్రేమ్‌చంద్ కథలను మొట్టమొదటిసారిగా అనువదించి తెలుగు వారికి పరిచయం చేసిన గౌరవం మాడపాటి హనుమంతరావుగారికి దక్కు తున్నది. రాజకీయాలలో గోఖలేవంటి మితవాది అయిన హనుమంతరావుగారు తెలంగాణాలో రాజకీయ, సాహిత్య, సాంస్కృతిక ఉద్యమాలకు వైతాళికులు. వారివలెనే ఆదిరాజు వీరభద్రరావుగారు రాజకీయాలతో సంబంధంలేక, గొప్ప పండితులై, మహాగ్రంథ రచయితలై ఉత్తమ వ్యాసకర్తలై గ్రంథాలయోద్యమ నిర్వాహకులై తెలంగాణాలో నవచైతన్యానికి తోడ్పడినారు. సురవరం ప్రతాపరెడ్డి గారు సంపన్న కుటుంబీకులై, బి. ఏ; బి. ఎల్ పట్టభద్రులై న్యాయవాద వృత్తిని అవలంబింపక తగిన అవకాశాలు ఉన్నప్పటికిని ప్రభుత్వ ఉద్యోగం స్వీకరిం పక జీవితమంతయు తెలుగు భాషాభివృద్ధికి అర్పించిన త్యాగమూర్తులు; బహు భాషావేత్త; అనేక గ్రంథకర్తలు; ఉత్తమశ్రేణికి చెందిన పరిశోధకులు, నిర్భ యంగా పత్రికను నడిపిన సంపాదకులు. ఆయన గోలకొండ పత్రికద్వారా తెలంగాణా ప్రజలను అన్ని రంగాలలో మేలుకొలిపినారు. గోలకొండలో వీరు వ్రాసిన సంపాదకీయాలు అనేక విషయాలకు సంబంధించిన విజ్ఞాన నిక్షేపాలు. రామాయణ రహస్యాలు, హిందువుల పండుగలు. ఆంధ్రుల సాంఘిక చరిత్ర మొదలైన గొప్ప పరిశోధనాత్మకమైన గ్రంథాలను వారు వ్రాసినారు. వారు కవులు, కథకులు, విమర్శకులు, వ్యాసకర్తలు, బహుముఖ ప్రతిభాసంపన్నులు

వారు వ్రాసిన కొన్ని చిన్న కథలు నిరీక్షణము వంటివి కథానికా వాఙ్మయములో ప్రథమశ్రేణికి చెందినవి.

తెలంగాణాను ఆధునిక యుగానికి అనుగుణంగా చైతన్యవంతము చేసిన మరికొన్ని సంస్థలను కూడా ఈ సందర్భములో పేర్కొనవలసి యున్నది. అందులో ప్రత్యేకంగా రెండు పత్రికలను గురించి మొట్టమొదట ప్రస్తావించవలసియున్నది. తెలంగాణాలోని మొదటి పత్రిక "హితబోధిని" 1913 వ సంవత్సరమున స్థాపితమై ఒక సంవత్సరం మాత్రమే నడిచినది. తరువాత 1920 వ సంవత్సరమున రెండు పత్రికలు యించుమించుగా ఒకే పర్యాయం ప్రారంభమైనవి. ఒకటి తెనుగుపత్రిక వరంగల్లు జిల్లా ఇనుగుర్తినుండి వెలువడి ఐదేండ్లు నడిచినవి. రెండవది నల్లగొండనుండి షబ్నవీసు నరసింహారావు గారి సంపాదకత్వమున వెలువడిన "నీలగిరి." ఇది కూడా ఐదేండ్లు నడిచినది. తెనుగు పత్రిక సంపాదకులైన ఒద్దిరాజు సీతారామచంద్రరావు, రాఘవ రంగారావు సోదరులు; సంపన్న కుటుంబీకులు. ఫారసీ, ఉర్దూ, ఇంగ్లీషు, తెలుగు, సంస్కృత భాషలలో ప్రావీణ్యము గలిగిన పండితులు, రచయితలు. షబ్నవీసు నరసింహారావుగారు ఉర్దూ, తెలుగు భాషలలో ప్రవీణులు ఈ రెండు పత్రికలు వాఙ్మయ ప్రచారానికి, రచయితలకు, జాతీయోద్యమానికి చేయూతనిచ్చి చేసిన కృషి చరిత్రాత్మకమైనది. వీని తరువాత 1926 వ సంవత్సరంలో గోలకొండ పత్రిక అర్ధ వార పత్రికగా ప్రారంభమైనది. తరువాత యీ పత్రిక 1947 లో దినపత్రికయై, సుమారు ఇరువై సంవత్సరాలు నడిచినది తెలంగాణాను ప్రబుద్ధము చేయుటలో గోలకొండ పత్రిక చేసిన కృషి చరిత్రాత్మకమైనది. సురవరం ప్రతాపరెడ్డిగారు యీ పత్రికకు సంపాదకులుగా లభించడం వలన దేశాభ్యుదయానికి, భాషాభివృద్ధికి అపారమైన మేలు కలిగినది. ఈ విధంగా తెలంగాణ రచనా రంగంలో నూతన యుగము ప్రారంభమైనది. అప్పుడు యువ రచయితలలో హైదరాబాదు నుండి ఒక సాహిత్య మాసపత్రిక వెలువడవలెనని ఒక గాఢమైన అభిప్రాయము కలిగినది. ఈ అభిప్రాయానికి మాడపాటి హనుమంతరావుగారి యొక్కయు, సురవరం ప్రతాపరెడ్డిగారి యొక్కయు తోడ్పాటు లభించినది తత్ఫలితంగా "సుజాత" అనే మాసపత్రిక శ్రీ పి ఎన్. శర్మగారి సంపాకత్వమున వెలువడి కొన్ని

సంవత్సరాలు నడిచినది. ఈ పత్రికలో విమర్శనాత్మకమైన వ్యాసాలు, కథలు, కవితలు, విజ్ఞానాత్మకమైన వచనరచనలు అనేకము వెలువడినవి. బూర్గుల రామకృష్ణారావుగారు ఉర్దూ భాషాసారస్వతాలను గూర్చి, ఉమర్ ఖయాంను గూర్చి వ్రాసిన వ్యాసాలు యిందులో ప్రకటితమైనవి. రామకృష్ణారావుగారు స్వయంగా బహుభాషా ప్రవీణులు, కవులు, విమర్శకులు. అయన ఆ రోజులలో "ఎంకి" పాటలవంటి నవీన కావ్యాలను హర్షించి ప్రశంసాత్మకమైన వ్యాసాలను వ్రాసినారు. ఈ పత్రికలతో పాటు "ఆంధ్రాభ్యుదయం" హనుమకొండ నుండి, హైదరాబాదు జిల్లా తూపురాను నుండి "దేశబంధు", సికిందరాబాదు నుండి "తెలుగు తల్లి", "విభూతి", "దివ్యవాణి" అనే తెలుగు పత్రికలు వెలువడినవి తరువాత 1945 లో అడవి బాపిరాజుగారి సంపాదకత్వములో "మీజాన్" బి. ఆర్. చారిగారి సంపాదకత్వంలో "తెలంగాణా" అనే రెండు దినపత్రికలు వెలువడినవి. ''ఆంధ్రకేసరి'', ''ఆంధ్రవాణి'' అనే వార పత్రిలు సికిందరాబాదునుండి, "తరణి'' వరంగల్లునుండి, ''శోభ'' వంటి సాహిత్య పత్రికలు వెలువడి కొంతకాలం నడిచినవి. ఈ విధంగా తెలంగాణాలో నూతన యుగోదయమై అనేక మంది రచయితలు ఆవిర్భవించినారు. వీరి రచనలు పైన పేర్కొన్న పత్రికలలోను యింకా యీ ప్రసంగంలో ప్రస్తావించని అనేక పత్రికలలోను చూడవచ్చును. ఈ పత్రికలన్నీ జాతీయోద్యమ ప్రభావితాలై నవీన వాఙ్మయ నిర్మాణానికి దోహదము గావించినవి.

ఈ నవ యుగోదయానికి పూర్వం కూడా తెలంగాణాలో ఉత్తమ శ్రేణికి చెందిన కవిపండితులుండిరని ఇంతకు ముందే చెప్పినాను. వీరిలో కొందరిని పేర్కొనవలసి యుండును. శ్రీ వెల్లాల సదాశివ శాస్త్రులవారు కొల్లాపుర వాస్తవ్యులు; బహు గ్రంథకర్తలు; మహా పండితులు. సంస్కృతంలో చంపువులు, శాస్త్ర చర్చలు గావించిన గొప్ప వైయాకరణి. చంద్రికా పరిణయ వ్యాఖ్యాత. ఆంధ్రుల చరిత్ర విమర్శనము మొదలైన బహు గ్రంథ కర్తలు. శ్రీ బుక్కపట్టణం శ్రీనివాసాచార్యులవారు బాలకవులు. మైసూరు సంస్థానములో బాలసరస్వతి బిరుదాన్ని పొందినవారు. నవ ద్వీపములో తర్క తీర్థ బిరుదమును పొందిరి. ఉత్తర భారతంలోని దర్భాంగ, జోధ్‌పూర్, గవాలియార్, ఇందూర్, ధారానగర్, జమ్మూ మొదలైన సంస్థానాలలో దిగ్వి

జయం గావించిరి. ఎనిమిది భాషలలో శతఘంటకవనము చేసిరి. మదరాసు, కడప, జనగనపల్లి, పెనుకొండ, తాడిపత్రి, సురపురాలలో అవధానాలు గావించినారు. వీరి కుమారులైన వెంకటాచార్యులవారు గొప్ప మేధావి. వీరి ఆశుకవితను హిందు, మదరాస్ మేల్ వంటి ఆంగ్ల పత్రికలు ప్రశంసించినవి. మైసూర్‌లోని వైష్ణవ పీఠానికి అధిపతులుగా వెళ్ళిన పరకాల స్వాములవారు గద్వాల వాస్తవ్యులు. శతాధిక గ్రంథకర్తలు. రాయచూరు వాస్తవ్యులైన మల్లికార్జున శాస్త్రులవారు శతావధానులు. గణితశాస్త్రంలో ఎన్నికోట్ల సంఖ్యలైనను నోటితో లెక్కించి చెప్పగల సమర్థులు. పట్టెం వాస్తవ్యులైన పాపకవి తెలుగులో గొప్ప కవులు. ఆనాటి కవి పండితులలో పేర్కొనదగినవారు ఇంకను ఎందరో ఉన్నారు. వనపర్తి వాస్తవ్యులైన విక్రాల సోదరులు, గద్వాల వాస్తవ్యులైన కర్ణమడకల ఆనందాచార్యులవారు. పత్రి విశ్వేశ్వరశాస్త్రిగారు, గర్గభాగవతాది గ్రంథకర్తలు చివుకుల అప్పయ్యశాస్త్రిగారు, గాడేపల్లి వీరరాఘవ శాస్త్రిగారు, నల్లగొండ జిల్లాకు చెందిన చిదిరమఠము వీరభద్రశర్మగారు మొదలైనవారు ప్రాచీన సంప్రదాయానికి చెందినవారు. ఐతమురాజు కొండల రావుగారు బహు భాషా విశారదులు. ఉర్దూ, ఫారసీ, అరబ్బీ, సంస్కృతం, కన్నడం, ఇంగ్లీషు మొదలైన భాషలలో గొప్ప ప్రావీణ్యం కలిగి, ఉర్దూ-తెలుగు, తెలుగు-ఉర్దూ నిఘంటువులు కూర్చిన విద్వాంసులు. ఇదే శ్రేణికిచెంది యీ నాటికిని మన మధ్య వున్న గండేరావు హర్కారేగారు, పట్టెం నరసింహ శాస్త్రిగారు, కొయిల్ కందాళై రామానుజాచార్యులుగారు, కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారు, కేశవపంతుల నరసింహశాస్త్రిగారు-విద్వత్కవులు, నిష్ణాతులైన పండితులు, వీరితో సమకాలికులై కొన్ని సంవత్సరాల క్రింద స్వర్గస్థులైన గంగుల శాయిరెడ్డిగారు, అంబటి లక్ష్మీనరసింహరాజుగారు మొదలైనవారు పాత కాలానికి చెందిన కవులు. ఈ విధంగా తెలంగాణాలో కవి పండితుల సంఖ్య కెన్నడు కొదువ కలుగలేదు. ఒకమారు ఎవరో తెలంగాణాలో కవులు, పండితులు లేరని ఎక్కడనో అన్నప్పుడు స్వర్గీయ సురవరం ప్రతాపరెడ్డిగారు గోలకొండ కవుల సంచికను ప్రకటించి అందులో 354 మంది సమకాలికులైన కవులను పరిచయం చేసి రెండు నూర్లమంది పూర్వకవులను ప్రస్తుతించిరి తెలంగాణలోని పండిత కవులు ఆ రోజులలో చేసిన అవధానాలు, చెప్పిన ఆశు కవితలు పాండిత్యానికి, ప్రతిభకు ఆలవాలాలు. ఈ అవధానాలు

ఆశు కవితలలోని పద్యాలను సేకరించి ప్రకటించితే ఒక రసవంతమైన కవితా సంపుటి కాగలదు. ఈ మధ్య ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమికి ఒక విద్వాంసుడు యీ సూచన చేయగా ఆ పనిని మరొక విద్వాంసునికి అప్పగించనైనది. ఈ సందర్భములో అవధానిగా, ఆశు కవితా శిరోమణిగా ప్రఖ్యాతి గాంచిన గాదేపల్లి వీరరాఘవశాస్త్రిగారిని గూర్చి ప్రస్తావించవలసి ఉన్నది. ఆయన గద్వాలలో ఆస్థాన కవీశ్వరులుగా ఉండిరి. అద్వితీయమైన ధార, గొప్ప ప్రతిభ ఆయన సహజ స్వత్వములు. ఆయన చేసిన సమస్యా పూరణలు, అవధానాలు, ఆశుకవితలు శ్రీనాథ తెనాలి రామకృష్ణాది పూర్వకవీశ్వరుల ప్రతిభావ్యుత్పన్నతలను తలపింప జేసెడివని చెప్పుదురు. ఒక సభలో 'పాండిత్య హీనాః కవయః' అని ఒక రెడ్డి పొడిచినప్పుడు వీరు,

> "వ్యాసుండన్న పురాణ కర్త అతడా పాండిత్యహీనుండు, కా
> ళాసుండన్న మహాకవీంద్రుడతడా పాండిత్యహీనుండు, వా
> గ్వ్యాసంగుండగు భట్టబాణుడతడా పాండిత్యహీనుండు ?..."

అని యాభై రెండు పాదములు శార్దూల వృత్తములో ఆశువుగా చెప్పి "...కుస్తీకిపు డీకొందువా ? నీ సంసారము గుట్టులోదలచి వందేయంచు వాకొందువా ?" అని ప్రశ్నించిరట. వీరు రసవంతంగా అనేక సమస్యలను పూరించిరి. వానిలో "దారములేని హారము నుదారత నీకెవరిచ్చిరమ్మరో" అను సమస్య ఒక ఉదాహరణ :

> "సారసగాత్రి యొక్కతె నిశాసమయంబున మంచిముత్తెముల్
> గూరిచి తాధరించి, తనుగూడెడు నాథు కవుంగిలింపజే
> కూరెను గుర్తులవ్విగని కోమలి కిట్లనిరెల్ల నెచ్చెలుల్
> దారము లేని హారము నుదారత నీకెవరిచ్చిరమ్మరో."

దీనినే పూర్వకవులు కొందరు పచ్చలా దారములేని హారమనీ, మందారము లేని హారమనీ పూర్తిచేసిరని చెప్పితే యీ పూరణలోని స్వారస్యము స్పష్టము కాగలదు. ఇంకా యీ కాలంలోని పండిత కవులను చాలమందిని పేర్కొనవచ్చును. బహుభాషా ప్రావీణ్యము వీరి ప్రత్యేకత. అరబ్బీ, ఫారసీ,

ఉర్దూలతోపాటు సంస్కృతాంధ్రాలలో నాటి పండితులు నిష్ణాతులు. వీరందరిని విపులముగా చెప్పడానికి ఒక ప్రత్యేక గ్రంథమే కావలసి వుంటుంది.

తెనుగు, నీలగిరి, గోలకొండ సుజాత మొదలైన పత్రికల ఆవిర్భావముతో యువరచయితలకు ప్రోత్సాహం లభించి, పరంపరాగతమైన సంప్రదాయం నుండి విభిన్నమైన సాహిత్యం, పుంఖాను పుంఖముగా ప్రకటితమైనది. కొంతకాలం నుండి దూర దూరాలుగా నుండిన యీ రెండు ప్రాంతాలు సాహిత్యపరంగా సన్నిహితమై, ఉభయ ప్రాంతాల రచయితల మధ్య పరస్పర పరిచయం అభిమానం పెంపొందినవి. విడిపోయిన రెండు పాయలు దగ్గరికి రాదగిన వాతావరణం యేర్పడినది.

కాకతి గణపతిదేవుని యేలుబడిలో ఏక ఖండంగా రూపొందిన తెలుగు సీమ బహమనీ సుల్తానుల ఆధిపత్యంలో మహారాష్ట్ర, కర్ణాటక ప్రాంతాలతో కలిసిపోయి గోలకొండ రాజుల పాలనలో తిరిగి ఏక భాషా ప్రాంతంగా అవతరించి ఆసఫ్‌జాహీ ప్రభుత్వం క్రింద ఆంగ్లరాజ్య విస్తరణ ఫలితాలైన రాజకీయ కారణాల వలన చీలిపోయి, మళ్ళీ మహారాష్ట్ర, కర్ణాటక ప్రాంతాలతో తెలంగాణము; తమిళ, కన్నడ, మళయాల ప్రాంతాలతో ఆంధ్ర ప్రాంతంగాను రెండు పాయలైనది, ఆంధ్ర ప్రాంతంతో విడిపోయిన 150 సంవత్సరాల కాలంలో తెలంగాణా పాయలో యే విధంగా ఆంధ్ర సాహిత్య సంస్కృతులు - నాటి ప్రభుత్వము నుండి ప్రబల వ్యతిరేకతకు గురియైనప్పటికిని - చెదరిపోక నిలిచిన ఉదంతాన్ని కొంత ప్రస్తావించినాను. తెలంగాణా ప్రాంతాన్ని గ్రంథాల యోద్యమము, పత్రికలు, లక్ష్మణరావు ప్రభృతులైన విద్వాంసులు, నాయకులు యే విధంగా పునరుజ్జీవితం కావించినారో కూడా ప్రస్తావించినాను. ఈ పునరుజ్జీవన కృషికి తోడ్పడి నటువంటి మరికొన్ని ఉద్యమాలను కూడ యీ సందర్భంలో ప్రస్తావించవలసి యున్నది. అసిఫ్‌జాహీ పరిపాలనలో తెలుగు వాడు తౌరక్యాంధ్రుడైనాడు. ప్రాథమిక విద్య కూడ తెలుగులో చదువుకునే భాగ్యం లభించలేదు. తెలుగు సరస్వతి అరబ్బీ, ఫారసీ, ఉర్దూ బిబ్బీల వెనక నెట్టివేయబడి తబ్బిబ్బు చెందినది. జిల్లాలోను పల్లెటూళ్ళలోను తెలుగు సజీవంగా ఉన్నప్పటికిని ఆంధ్ర నగరమైన హైదరాబాదులో తెలుగు అజ్ఞాత

హాసము చేయవలసి వచ్చినది. 1921 వ సంవత్సరమున మహారాష్ట్ర విద్వాంసుడైన కర్వే పండితుని అధ్యక్షతన హైదరాబాదులో ఒక సంఘ సంస్కరణ సభ జరిగినది. ఆ సభలో మహారాష్ట్రులు, కర్ణాటకులు, తెలుగువారు సమావేశమైన వేదికమీద ఆలంపల్లి వెంకట్రామారావుగారు తెలుగులో ఉపన్యాసం మొదలు పెట్టగా సభ్యులు చప్పట్లతో హేళన గావించిరి ఈ హేళన హైదరాబాదు ఆంధ్రులకు ఆవేదన కలిగించినది. వెంటనే ఆదే రోజు టేకుమాల రంగారావుగారి ఇంట్లో అప్పటి ఆంధ్రప్రముఖులు సమావేశమై "ఆంధ్ర జన సంఘము" అను ఒక సంస్థను స్థాపించిరి. ఆ సంస్థకు అధ్యక్షులు బారిష్టరు రాజగోపాలరెడ్డిగారు, కార్యదర్శి మాడపాటి హనుమంతరావుగారు.

నిజాం రాష్ట్రమందలి ఆంధ్రులయందు పరస్పర సానుభూతిని కలిగించి వారికొరకు సంఘాలను, సంస్థలను స్థాపించి ఉపన్యాస సభలను యేర్పాటు చేసి చైతన్యాన్ని కలిగించవలెనని యీ సంఘము ఆశయము ఇందుకొరకు వారు నిర్ణయించిన కార్యక్రమం గ్రంథాలయాల స్థాపన, నిర్వహణ, విద్యార్థులకు సహాయము - ప్రోత్సాహము, విద్వాంసులకు సన్మానము, తాళపత్ర గ్రంథాల శాసనాల సేకరణ - పరిశోధన, కరపత్రాల, లఘుపుస్తకాల ప్రకటన, విజ్ఞాన ప్రచారం, ఆంధ్రభాషా ప్రచారానికి కావలసిన ప్రయత్నాలు. ఈ ఆంధ్ర జన సంఘం క్రమక్రమంగా ఆంధ్రోద్యమంగా వ్యాపించి తెలంగాణాలో సాహిత్య ప్రచారానికి విశేషమైన కృషి గావించి యువకులను తెలుగు సాహిత్యాభిముఖులను చేసినది. తరువాత ఆంధ్రోద్యమము క్రమక్రమంగా రాజకీయోద్యమంగా పరిణమించి 1946 లో స్టేట్ కాంగ్రెస్‌లో లీనమైనది. అందుచేత సాహిత్య కార్యక్రమాలకు మరొక సంస్థ అవసరమైనది. కావున 1943 లో ఆంధ్ర సారస్వత పరిషత్తు స్థాపితమై, ఇంచుమించుగా ఆంధ్ర జనసంఘ ఆశయాలతోనే తెలుగు భాషా వ్యాప్తికి అపారమైన కృషిగావించి అనేక రచయితలను ప్రోత్సహించి యీ నాడొక మహా సంస్థగా విలసిల్లుతున్నది. ఆంధ్ర జనసంఘము, ఆంధ్ర సారస్వత పరిషత్తు కృషిమూలంగా ఎందరో రచయితలు బయలుదేరి వివిధ వాఙ్మయ వీధులలో విహరించినారు. ఆంధ్ర ప్రాంతంలోని ఆంధ్రోద్యమానికి, తెలంగాణా ప్రాంతంలోని ఆంధ్రోద్యమానికి వ్యత్యాసమున్నదని యీ సందర్భములో చెప్పవలసియున్నది. ఆంధ్ర ప్రాంతంలో అది ఒక ప్రత్యేక రాష్ట్రసాధనకు కృషిచేసినది. తెలంగాణాలో అది మొదట సాహిత్య ప్రచార ఉద్యమంగా ప్రారంభమై తరువాత

బాధ్యతాయుత పరిపాలనకోరకు పోరాటము నిర్వహించిన రాజకీయ ఉద్యమంగా పరిణమించినది.

గ్రంథాలయోద్యమము వలెనే ఆంధ్రోద్యమము కూడా తెలుగు భాషా సంస్కృతుల వ్యాప్తికి దోహదము గావించినది. ఈ ఆంధ్రోద్యమముతోపాటు, పత్రికలతో పాటు, గ్రంథాలయాలతో పాటు కొన్ని గ్రంథమాల లవతరించి పుస్తకాలు ప్రకటించి రచయితలను ప్రోత్సహించినవి. ఈ గ్రంథమాలలలో పేర్కొనదగినవి గోలకొండ, కిన్నెర, ఉదయవాణి, మాతృభారతి, ఆంధ్రశ్రీ, కాకతీయ, పూలతోట, వీరేశలింగకవి కంఠాభరణ, కృషి ప్రచారిణి, శివధర్మ గ్రంథమాల, విజ్ఞాన ప్రచారిణి, వెంకటేశ్వర, అణా, దేశోద్ధారక, ఆంధ్రకేసరి, సాహితిమేఖల, సాధన సమితి మొదలైనవి. ఈ విధంగా తెలంగాణాలో 1900 నుండి 1950 వరకు సారస్వతోద్యమం ఒక మహోద్యమంగా అవతరించి పురోగమించింది. సంప్రదాయాన్ని అనుసరించే కవి పండితులతో పాటు ఆధునిక వాఙ్మయ ప్రక్రియలలో సాధనచేసిన రచయితలు కూడా అనేకులు తెలుగు తల్లికి పూలదండలు వేసి ఆరాధించిరి. వీరి రచనల మీద ఆంధ్రోద్యమ ప్రభావము, జాతీయోద్యమ ప్రభావము, హైదరాబాదు ప్రజల విమోచనోద్యమ ప్రభావము స్పష్టంగా కనిపిస్తున్నవి. గ్రంథాలయ సభలు, సారస్వత సమావేశాలు ఆనాడు వీరి ప్రతిభకు దోహదం గావించినవి.

ఫారసీ, ఉర్దూ భాషలతో తెలుగు భాషకు కొన్ని నూర్ల సంవత్సరాల సంబంధ ఫలితంగా ప్రాచీన కవుల కావ్యాలలో ఫారసీ ఉర్దూ శబ్దాలు మనకు కనిపిస్తున్నవి, బహమనీ, గోలకొండ అసఫ్‌జాహీ పరిపాలన ఫలితంగా వ్యవహారంలోనూ, సాహిత్యములోనూ, ఫారసీ, ఉర్దూ పదాలు పుష్కలంగా దొరలినవి. పరిపాలనా పరిభాషలో యీ శబ్దాలు ఇంకా ఎక్కువ సంఖ్యలో తెలుగు దేశమందలి అన్ని జిల్లాలలో కనిపిస్తున్నవి. తెలంగాణాలో ఫారసీ, ఉర్దూ ప్రచారం ప్రభుత్వ ప్రోత్సాహంతో బాగా జరిగినది. చదువుకున్న తెలుగు వారందరు ఫారసీ, ఉర్దూలలో ప్రవీణులై ఉండిరి. ఈ భాషలలో చక్కగ వ్రాయగలిగినంతమంది తెలుగువారు ఆ రోజులలో ఉండిరి అయితే యీ భాషల ప్రభావం తెలుగుమీద ఎంతవరకు పడినది అన్న ప్రశ్న సహజంగా ఉత్పన్నమవుతున్నది. పరిశీలించి చూస్తే ఫారసీ, ఉర్దూ సాహిత్యాలు తెలుగును ఎక్కువగా

ప్రభావితము చేసినట్లు కనిపించదు. ఈ ప్రభావము యేమైనా ఉంటే అది పద్జాలం మట్టుకే పరిమితమైనది. ఈ ఫారసీ, ఉర్దూ సాహిత్యాలను చదివిన ప్రేరణతో, ఉత్సాహముతో తెలుగులో వచ్చిన సాహిత్యం చెప్పదగినదేమియు లేదు. ఇదే విధంగా తెలుగు సాహిత్యం కూడా ఆ భాషలలోనికి వెళ్ళలేదు. తెలుగుమీద సంస్కృత ప్రభావం అందరికీ తెలిసినదే. ఇంగ్లీషుభాషా ప్రభావంతో తెలుగులో కావలసినంత వాఙ్మయము వచ్చినదికాని ఉర్దూ, ఫారసీల ప్రభావము తెలుగు సారస్వతం మీద యీ విధంగా కనిపించడంలేదు. కనీసం ఆధునిక యుగంలో బెంగాలీ భాష తెలుగు సారస్వతాన్ని ప్రభావితం చేసినంతగానైనను ఉర్దూ, ఫారసీ సాహిత్యాలు చేయలేదు. బంకించంద్రుడు, రవీంద్రుడు, శరత్ చంద్రుడు తెలుగువారికి సుపరిచితులు. వారి పుస్తకాలన్నీ యించుమించుగా తెలుగు లోనికి వచ్చినవి. ఉర్దూ, ఫారసీ భాషలనుండి ఇటువంటి దిగుమతి జరుగలేదు. తెలుగు సాహిత్యం మీద ఆంగ్ల సాహిత్య ప్రభావంతో పోలిస్తే ఉర్దూ సాహిత్య ప్రభావం చాలా తక్కువ. అయితే ఆంగ్లభాష ఒక మహా సముద్రం వంటిది. సకల ప్రపంచ సమస్త విజ్ఞాన సాహిత్య భాండాగారాలలోనికి ప్రవేశం కలుగజేసే మహత్తరమైన సాధనము ఆంగ్లభాష. చదువరులను ఉత్తేజితము చేయుశక్తి ఆంగ్ల భాషకున్నది. అయితే ఉర్దూ భాష ఇంత శక్తివంతమైనది కానందువలన కాబోలు దాని ప్రభావం తెలుగు సాహిత్యం మీద ఎక్కువగా కనిపించదు. ఉర్దూ ఆంగ్ల భాషవలె విశాలమైనదికాదు. అందులోని సాహిత్యం పరిమితమైనది. ప్రేమ్ చంద్ తెలుగులోనికి వచ్చినప్పటికిని ఆయనకు హిందీ, ఉర్దూ భాషల రెండింటి యందును సమాన గౌరవస్థానము ఉన్నది. గాలిబ్, సాదీ, ఎఖ్బాల్, ఫిర్దౌసీ, ఉమర్ ఖయాం మొదలైన కవులను గూర్చి సుజాతవంటి సాహిత్య పత్రికలలో ఉత్తమ వ్యాసాలు కొన్ని ప్రకటితమైనవి. వారి వాఙ్మయం కొంత పరివర్తిత మైనది. ఆధునికులైన తెలుగు కవులు కొందరు ఉర్దూ గజల్ పద్ధతిని తెలుగులో గేయాలు వ్రాసినారు. ఇంతకన్న హెచ్చుగా ఫారసీ, ఉర్దూ ప్రభావము తెలంగాణాలోని తెలుగుపైన కనిపించదని చెప్పితే వాస్తవానికి వ్యతిరేకమైన మాటగాదు.

తెలంగాణాలో 1900-1950 మధ్యన, అనగా అర్ధశతాబ్దములో వచ్చిన వాఙ్మయాన్ని గూర్చి యీ సందర్భమున నాలుగు మాటలు చెప్పవలసియున్నది.

ఈ వాఙ్మయముపై లక్ష్మణరావుగారి ఆశయాల ప్రభావం స్పష్టంగా కనిపిస్తున్న దని మొదలే చెప్పినాను. కావున చరిత్ర పరిశోధనకు సంబంధించిన వాఙ్మయము, విజ్ఞాన ప్రచారానికి సంబంధించిన వాఙ్మయము యీ అర్ధశతాబ్దములో తెలంగాణములో కనిపిస్తున్నది. పాత పద్ధతిని రచించిన కావ్యాలు కూడ యీ కాలంలో తగినన్ని వచ్చినవి. ప్రాచీన సంప్రదాయాన్ని అనుసరించే కవులు, పండితులతోపాటు ఆధునిక ప్రక్రియలైన కథానిక, నవలవంటి వ్యాసంగాలలో కృషిచేసిన రచయితలు కనిపిస్తున్నారు. చలం రచనల ప్రభావం కొందరి మీద కనిపిస్తున్నది. మునిమాణిక్యంవలె రచనలు చేసినవారు కూడా ఉన్నారు. శ్రీశ్రీచే ప్రేరితమై రచనలు చేసినవారున్నారు. ఇంకా రకరకాలైన ప్రక్రియలలో సాధనచేసిన వారున్నారు. ఎవరి ప్రభావానికి లోనుకాకుండా స్వతంత్రమైన కవితలు, కథలు, వ్యాసాలు వ్రాసినవారు తగినంతమంది కనిపిస్తున్నారు. ఇక్కడి రాజకీయోద్యమాలచే ప్రభావితులై ఉత్కృష్టమైన కవితలు వ్రాసి, ప్రజలను ఉత్తేజితులను చేసిన కవులు మనకు కనిపిస్తున్నారు.

కాని ఒక విషయం స్పష్టంగా కనిపిస్తున్నది. తెలంగాణా మీద భావ కవిత ఛాయలు ఎక్కువగా పడలేదు. ఆంగ్ల సాహిత్య ప్రభావం చేత ఉత్తేజితులై అనేక రచనలు గావించిన భావ కవులు ఆంధ్ర ప్రాంతంలో అసంఖ్యాకులుగా ఉన్నారు. కాని భావ కవితా మార్గంలో ప్రయాణం చేసినవారు తెలంగాణములో చాలా తక్కువ మంది. వీరు చేసిన రచనలు కూడా ప్రకటితమైనంతమట్టుకు స్వల్పమనే చెప్పవలెను.

ఆ అర్ధ శతాబ్దములో యావదాంధ్ర ప్రఖ్యాతి గాంచిన కవులు తెలంగాణములో ఉన్నారు. వానమామలై వరదాచార్యులు పోతన మహా కావ్యము వంటి ఉత్తమ కావ్యాలు వ్రాసి, నేటి తెలుగు కవులలో మేటిగా కీర్తిగాంచినారు. కాళోజీ నారాయణరావు అన్ని జాతీయోద్యమాలలో పాల్గొనిన స్వాతంత్ర్య యోధుడు, ప్రజా కవి. జనులకు అర్థమయ్యే సరళ శైలిలో ఉత్తేజకరమైనటువంటి రచనలు చేసి ఆయన ప్రజలను స్వాతంత్ర్య పోరాటము వైపు అభిముఖులను చేసినాడు. 'నా గొడవ' అనే సంపుటాలలో ఆయన రచనలు ప్రకటితమైనవి.

నల్లగొండలో నాజీశక్తుల
నగ్న నృత్య మింకెన్నాళ్ళు?
పోలీసుటండను
దౌర్జన్య శక్తులు పోషణపెంచే దెన్నాళ్లు?

అని ఆనాడు ఆయన వాణి గర్జించినది. కాళోజీ రచనలలో అడుగడుగునా ఒక విశిష్టత ఉన్నది. అప్పటి నిజాం ప్రవేశ పెట్టిన రాజ్యాంగ సంస్కరణల కూర్చి ఆయన వ్రాసిన గేయము మన జాతీయ ఉద్యమ వాఙ్మయములో శాశ్వతంగా నిలువదగినది. రెండవ ప్రపంచ యుద్ధము ఫలితంగా వచ్చిన ద్రవ్యోల్బణాన్ని గూర్చి వ్రాస్తూ "యుద్ధము మూలముగ దలామలకు ఉబ్బుల రోగము వచ్చింది" అన్నాడు. సంఘంలోని వ్యత్యాసాలను గూర్చి వ్రాసిన గేయంలో "గట్టి దవడలొక వైపు కమ్మని చకిలాలొక వైపు" అన్న పాదాలు ఆయన విశిష్టతకు ఒక మచ్చుతునక. కాళోజి నూటికి నూరు పాళ్ల ప్రజాకవి. డాక్టరు దాశరథి కాళోజీవలెనే స్వాతంత్ర్యయోధుడైన మహాకవి నూనూగు మీసాల నూత్న యౌవనమున దాశరథి స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొని,

"తెలంగాణము రైతుదే
ముసలి నక్కకు రాచరికంబుదక్కునే?"
అని గొంతెత్తి పలుకగా తెలంగాణమంతా ప్రతిధ్వనించినది.
"పీడిత ప్రజావాణికి మైక్ అమర్చెదన్"
అన్నాడు ఒక సందర్భంలో దాశరథి.
"మూడు కోటుల నొక్కటే ముడిబిగించెద"
నన్నాడు మరొక్క సందర్భంలో.
"అనాదిగా సాగుతుంది అనంత సంగ్రామము
ఆగర్భ శ్రీనాథుడికి అనాథునికి మధ్య"

అని ఆయన వేరొకసారి విజృంభించినాడు. నేటి తెలుగు కవులలో దాశరథిది ప్రత్యేకస్థానము. ఆయన కవితాదీపము మరెన్నోదీపాలను వెలిగించినది. కాళోజీ నారాయణరావు, దాశరథి కృష్ణమాచార్యులతో పాటు తెలంగాణా ప్రజల ఉద్యమాలకు ప్రాతినిధ్యం వహించి ప్రజలను ప్రబోధించిన కవివ

రేణ్యులు అనేకులున్నారు. కళ కళ కొరకే అని ఆలోచించే పద్ధతి కవులు కారు వారు సమ సమాజాన్ని కాంక్షించి తమ కవిత్వాన్ని ఆ ఆశయం కొరకు ఉపయోగించినారు యీ కవులు. 'లోకంతో మనకేమి లోలాక్షి రాపోదము' అని వీరు అనుకోలేదు. దేశ పరిస్థితులను గుర్తించి సమస్యలను ఆకళింపు చేసుకొని, జాతీయ వికాసానికి, ప్రజల అభ్యుదయానికి అనుగుణమైన రచనలు వీరు కావించినారు. కుల మత విద్వేషాలకు అతీతంగా సమాజం పురోగమించవలెనని యీ కవుల ఆకాంక్ష.

ఏమి వ్రాయాలే నేనేమి వ్రాయాలే
ఏమి వ్రాయాలే నేనేమి వ్రాయాలే
నా యింటి నానుకొని పెనుమంటలే రేగ
నా తమ్ములే విలయ నాట్యాలు సేయగా
నా కూనలీనాడు బాకులకు గురికాగ
నా అక్క చెల్లెండ్ర మానాలు దోపిడైనాక
నా తల్లి గుండియల్ కోతల్కు పడ్డాక
ఏమి వ్రాయాలే!

నా నేల కరువులకు తావలంబైనాక
నాకు ఆకలి డొక్క చూసుకున్నాక
నా సభ్య సంస్కృతుల్ నరుకుళ్ళు పడ్డాక
నా నాయకుల రక్తనాళాలు దెగినాక
నా రాజ్య సౌధాల దారిద్ర వీథులే
బారు దీర్చుచునుండి కూలిపోతున్నాక
వారు కోరినదెల్ల బూడిదై పోయినాక
నేనే నాశనమొంద చూనుకున్నపుడు

అని ధవళా శ్రీనివాసరావు రజాకారు రాజ్యంలోని ఘోర దౌర్జన్యాలను ప్రతిఘటించినారు. పోలీసు చర్య కాగానే నాయకులు పరస్పరము తగవులాడు కొని అధికారానికి పెనుగులాడుతుండగా-

ఉన్నావో లేవయ్యా ఓ జగన్నాథ
విన్నావ మా గోడు పీనులారంగా
తలతామకొనలేక తనువుపై లేక
తొలిపూటకే లేక తోడేమిలేక
తెలంగాణ ప్రజల బన్నాలు విన్నావా
మమ్మేలవలసిన మా ప్రజాపతులు
దొమ్మిలో దిగినారు దుర్విధి వలన
గారాబు టొక బిడ్డ గణికయైనట్లు
మా రాజకీయాలు మలినంబులయ్యె

అని గడియారం రామకృష్ణశర్మ గొంతెత్తి పలికినారు.

తెలుగు తోటలలోన తెలుగు వన్నెలు లేవు
శోభ నిచ్చే దెన్నడో
తోటంత
సొగసు గులికే దెన్నడో
తేజమొచ్చే దెన్నడో
తోటంత తీగ బారే దెన్నడో

అని సిరిప్రగడ భార్గవరావు తెలుగుతల్లి ఆనాటి దీనావస్థను జూచి ఆవేదన చెందినాడు. ఆనాటి తెలంగాణ కవుల రచనలకు ఇవి కొన్ని మచ్చుతునకలు మాత్రమే. తెలంగాణా కవులతో శ్రీమతి సోమరాజు ఇందుమతీ దేవి, పులిజాల హనుమంతరావు, ధవళా శ్రీనివాసరావు, సిరిప్రగడ భార్గవరావు, నెల్లుట్ల రామకృష్ణకవి, బెల్లంకొండ చంద్రమౌళి శాస్త్రి, పొట్లపల్లి రామారావు (పీరు చక్కని కథలు వ్రాసినారు), కంచనపల్లి చిన వెంకట రామారావు, వెల్దుర్తి మాణిక్యారావు, అద్దూరి అయోధ్యరామకవి, గార్లపాటి రాఘవరెడ్డి, గవ్వా మురహరి రెడ్డి, ఊటుకూరి రంగారావు మొదలైనవారు ఉత్తమశ్రేణికి చెందిన కవిత్వము వ్రాసినారు. నందగిరి ఇందిరా దేవి, యల్లాప్రగడ సీతా

కుమారి, నందగిరి వేంకటరావు, ఇల్లిందల సరస్వతీదేవి, బూర్గుల రంగనాథరావు, భాస్కరభట్ల కృష్ణారావు, ధరణికోట శ్రీనివాసులు, నెల్లూరి కేశవస్వామి మొదలైనవారు ఉత్తమశ్రేణికి చెందిన కథానికలు వ్రాసినారు. చక్కని నవలలు వ్రాసినవారిలో వట్టికోట ఆళ్వారుస్వామి, భాస్కరభట్ల కృష్ణారావు, ఇల్లిందల సరస్వతీదేవి మొదలైనవారిని పేర్కొనవలెను. వీరిలో స్వర్గీయ వట్టికోట ఆళ్వారుస్వామిని ప్రత్యేకంగా పేర్కొనవలెను. తెలంగాణా విముక్తి కొరకు జరిగిన అనేక ఉద్యమాలలో పాల్గొనిన స్వాతంత్ర్య వీరుడు ఆళ్వారుస్వామి-తెలుగులో చౌక ధరలకు మంచి పుస్తకాలను వ్రాయించి ప్రకటించి ప్రజలను ప్రబోధించిన సంస్కృతీ పరుడు ఆళ్వారుస్వామి. ఆయనది డిగ్రీలు లేని పాండిత్యము. స్వయం కృషిచేత వ్యక్తిత్వాన్ని వికసింపచేసుకున్న దేశభక్తుడు ఆళ్వారుస్వామి.

ఆయన నవలలో రెండిందిని తప్పక పేర్కొనవలెను. "ప్రజల మనిషి" అనే నవలలో స్టేట్ కాంగ్రెస్ సంస్థ ఆవిర్భవించడానికి పూర్వము తెలంగాణా లోని పరిస్థితులను ఆయన చిత్రించినాడు. "గంగూ" అనే నవలలో నిజాం నిరంకుశ ప్రభుత్వానికీ, ప్రజలకూ మధ్యన కాంగ్రెస్ ఉద్యమము ప్రారంభము కాక పూర్వము జరిగిన పోరాటాన్ని చిత్రించినాడు. రెండు నవలలలోను ఆయన తెలంగాణా జన సామాన్యంలో వాడుకలో ఉన్న భాషను ఉపయోగించి నాడు. "మాలపల్లి" శ్రేణికి చెందినవి యీ రెండు నవలలు. ఈ నవలల వలన కలిగిన ప్రేరణతో ఇటీవల దాశరథి రంగాచార్యులు చిల్లర దేవుళ్ళు, మాయ జలతారు, జనపదం మొదలైన ప్రశస్తమైన నవలలను వ్రాసినారు. మంచి విమర్శకులు, చరిత్ర పరిశోధకులు కూడా తెలంగాణములో ఉన్నారు. స్వర్గీయ ఆదిరాజు వీరభద్రరావు, గడియారం రామకృష్ణశర్మ, ఖండవల్లి లక్ష్మీరంజనం సోదరులు, స్వర్గీయ యం. డి. వీరభద్రయ్య విమర్శనా, పరిశోధనా రంగాలలో అపారమైన కృషిచేసి తెలుగు భాషను సుసంపన్నము చేసినారు. సన్నిధానం సూర్యనారాయణ శాస్త్రి, పుండేరావు హర్కారే, కప్పగంతుల లక్ష్మణశాస్త్రి, కేశవపంతుల నరసింహశాస్త్రి మొదలైనవారు మహా పండితులు, మహాకవులు. సంగీతము, చిత్రకళలలో ప్రవీణులైనవారు యీ అర్ధ శతాబ్దములో తెలంగాణ ములో చాలమంది ఉన్నారు. ఉర్దూ - ఇంగ్లీషు భాషలలో ఉత్తమ రచయితలు,

దినపత్రికలను ప్రతిభావంతంగా నిర్వహించిన సంపాదకులు కూడా ఉన్నారు. ఈ విధంగా యీ అర్ధ శతాబ్దంలో తెలంగాణా సాహితీ-సాంస్కృతిక రంగాలలో తన పాత్రను ప్రశంసనీయంగా నిర్వహించి సకలాంధ్ర స్థాయిలో సముచిత స్థానాన్ని ఆక్రమిస్తున్నది.

నూటా యేబది సంవత్సరాల క్రింద చీలిపోయిన తెలంగాణా పాయ తిరిగి 1వ నవంబరు 1956 నాడు ఆంధ్రప్రదేశ్ యేర్పడినప్పుడు ఆంధ్ర ప్రాంతంలో కలిసిపోయినది. ఈ కలయిక సహజమైనది, సముచితమైనది.
(1978 ఫిబ్రవరిలో నెల్లూరులో చేసిన ఉపన్యాసం-ఎఱ్ఱన జయంతి సందర్భంలో)

# స్వాతంత్ర్యానంతర సాహిత్యము

భారతీయ సాహిత్యానికి రూపాలు అనేకము ఉన్నప్పటికిని, ఆత్మ ఒక్కటే. ఈ సత్యమునే మరొకరు భారతీయ సాహిత్యము, లిపులు వేరైనప్పటికిని ఒక్కటే అని చెప్పినారు. వేదకాలము నుండి యీనాటి వరకు మన దేశములో వివిధ భాషలయందు అవతరించిన సాహిత్యమును స్థూలముగా పరిశీలించినప్పటికిని, వివిధ భాషా వాఙ్మయాలలో ఐక్యత గోచరించుచున్నది. వివిధ కాలాలయందు వివిధ భాషలలో సమానమైన సాహిత్యరీతులు మనకు కనిపించుతున్నవి. స్వాతంత్ర్యానికి ముందు, స్వాతంత్ర్య ప్రాప్తి తరువాత మన దేశ భాషలలోని సాహిత్యరీతుల సామ్యము యీ సత్యమును వెల్లడి చేస్తున్నది.

భారతదేశానికి స్వాతంత్ర్యము వచ్చి ఇరువదిరెండు సంవత్సరాలు గడిచి పోయినవి. ఇది ఇరువదిమూడవ సంవత్సరము. అనగా స్వతంత్ర భారతములో జన్మించిన పౌరుడు నేడు వయోజనుడై ఓటింగు హక్కును పొంది ఉన్నాడు.

దేశములో క్రొత్తతరము వివిధరంగాలలో బాధ్యతలను నిర్వహించుటకు సంసిద్ధమై ఉన్నది. ఈ క్రొత్త తరానికి స్వాతంత్ర్య ప్రాప్తికి ముందరి పరిస్థితులు అవగాహన కాకపోవచ్చును. కాని స్వాతంత్ర్య సాధనలో పాల్గొనిన పూర్వపు తరమువారు కూడ యీనాడు మనదేశంలో వివిధ రంగాలలో తమ తమ పనులను నెరవేర్చుకొంటున్నారు. ఈ రెండు తరాల మధ్య అఖాతము మనకు స్పష్టముగా కనిపించుతున్నది. రెండు తరాల ఆలోచనలలో, ఆచరణలలో, ఆశయాలలో వ్యత్యాసాలు సాహిత్యరంగమున గూడ ప్రతిబింబించుతున్నవి. స్వాతంత్ర్య ప్రాప్తికి ముందు ఉన్నతశ్రేణి రచయితలుగా పేరు గాంచినవారు పూర్వపు మార్గాలలో తమ తమ విశిష్ట ధోరణులతో నేటికిని రచనలు గావించుతున్నారు. ఈ రచనా మార్గాలను అనుసరించినవారు యువ రచయితలలో కూడ కనిపిస్తున్నారు. పూర్వపు రచనలపైన తిరుగుబాటు ఉద్య

మాలు యీనాడు అన్ని భాషలలో కనిపించుచున్నవి. ఈ తిరుగుబాటు కాలానుగుణ్యమైనదని నిస్సందేహముగా చెప్పవచ్చును. ఈ తిరుగుబాటు ధోరణులు సాహిత్యవీథులన్నింటి యందును కనిపిస్తున్నవి. ఈ నూతన రచనలే స్వాతంత్ర్యానంతర సాహిత్యము యొక్క ప్రత్యేకతలు. ఈ ప్రత్యేకతలు భావాలలో, వస్తువులో, శైలిలో గోచరిస్తున్నవి.

ఈనాడు పూర్వ పద్ధతిలో రచనలు గావించు కవులూ ఉన్నారు. పాత కాలపు రచనా ధోరణులు వివిధ వచన రచనలలో గూడ కనిపించుచున్నవి. ఐనప్పటికిని మొత్తముమీద స్వాతంత్ర్యానికి ముందటి అభిరుచులు యీ రెండు దశాబ్దాలలో బాగుగా మారిపోయినవి. ఈనాటి సాంఘిక, రాజకీయ, ఆర్థిక పరిస్థితులు యీ మార్పుకు ప్రధాన కారణాలు.

స్వాతంత్ర్యము వచ్చిన తరువాత అక్షరాస్యత పెరిగినది. పత్రికల సంఖ్య పెరిగినది. పాఠకుల సంఖ్య పెరిగినది. సాహిత్య సమాజాలు ప్రభుత్వ ప్రోత్సాహము పొంది, మౌలికమైన రచనలు ప్రకటించుచున్నవి. భారతీయ భాషలమధ్య సహకారము పెంపొందినది. సాంస్కృతిక సంబంధాలు పెరుగుతున్నవి. రేడియో ద్వారా రచయితలకు ప్రోత్సాహము లభిస్తున్నది. విదేశ భాషలనుండి అనువాదాలు అధిక సంఖ్యలో అవతరిస్తున్నవి. విదేశ భాషా సాహిత్యాలతో సంబంధాలు పెంపొందుతున్నవి. అనువాదాలు ఒక భాషనుండి మరొక భాషకు జరుగుతున్నవి. పత్రికలలో రచనలకు బహుమతులు లభించుతున్నవి. రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలు వివిధ పథకాల ద్వారా రచయితలను ప్రోత్సాహిస్తున్నవి. ఐనప్పటికి యువరచయితలలో నిరాశా, నిస్పృహలు అతిశయించి, వారి రచనలలో ప్రతిబింబించుచున్నవి. ఇందుకు కారణమేమి అను ప్రశ్నకు సమాధానము వెదకవలసిన అవసరము లేదు.

స్వరాజ్యము వచ్చిన తరువాత సమాజముతో పాటు సాహిత్యము గూడ సర్వాంగ సుందరముగా పెంపొందగలదను భావన అందరిలో ఉండినది. సామాన్యమానవుని కష్టాలు తీరిపోగలవని, విదేశ పరిపాలన క్రింద నలిగిపోయిన పౌరుడు అన్ని రంగాలలో అభివృద్ధిని సాధించగలడని జనులలో వ్యాపించిన ఆశలు నిరాశలైనవను భావము ప్రబలముగా కన్పట్టుతున్నది. గడచిన రెండు దశాబ్దాలలో బ్రహ్మాండమైన ప్రగతి ఆర్థిక, రాజకీయ రంగా

లలో సాధించిన మాట సత్యమే. వివిధ రంగాలలో అమలుజేసిన ప్రణాళికలు మన యెదుట నున్నవి. ఆసేతు హిమాచలము పర్యటనగావించి భారతదర్శనము చేసినచో యీ విజయాలను కనులార చూడవచ్చును. కాని మనదేశ సమస్యలను గమనించినప్పుడు, సాధించిన అభివృద్ధి కొంచెము, సాధించవలసినది మిక్కిలి యెక్కువ అని వెల్లడి కాగలదు. ప్రజాస్వామిక వ్యవస్థలో ప్రణాళికా బద్ధమైన ప్రగతికి మందగమనము యెక్కువ.

ఈనాడు దేశములో ఆహార పదార్థాల ధరలు మిన్నంటి పోతున్నవి. నిరుద్యోగము ప్రబలుతున్నది. విద్యావంతులలో, విద్యార్థులలో అశాంతి అతిశయిస్తున్నది. రాజకీయాలలో అవినీతి సర్వత్ర కనిపించుతున్నది. లంచగొండితనము, దొంగమార్కెటులు విజృంభించుతున్నవి. రాజకీయాధికారమును హస్తగతము కావించుకొనిన కొందరు అపారమైన ధనము ఆర్జించి ధనికులైన నిదర్శనాలు చూపించవచ్చును. కరువు కాటకాలు అప్పుడప్పుడు తప్పుటలేదు. రాజకీయ, ఆర్థిక, సామాజిక రంగములలో కొన్ని కుటుంబాల ప్రాబల్యము సామాజిక మానవుని సమస్యల పరిష్కారమును దూరము చేస్తున్నది. కావుననే యీ నాడు రచనా రంగములో కూడ అశాంతి కనుపించుచున్నది. దిగంబర కవుల రచనలలో యీ అశాంతిని మనము చూడవచ్చును.

హిందీలోని నయీ కవితా ఉద్యమము వంటిదే తెలుగులో దిగంబర కవితా ఉద్యమము. నవజీవన విధానమును రూపొందించవలెనని దిగంబర కవుల ఆశయము. వీరికి ఏ ఒక ప్రత్యేక రాజకీయ మతముతో సంబంధము ఉన్నట్టులేదు. మూఢనమ్మకాలను, చాదస్తాలను వీరు ధిక్కరింతురు. ఈ ధిక్కారములో ఉద్రేకపు పొంగు హెచ్చుగా కనిపించును. అశ్లీలము ఉపయోగించుటకు కూడ వీరు వెనుకాడరు. నేడు దేశభాషలన్నింటిలో యీ విధమైన రచనలు కనిపించుతున్నవి. స్వాతంత్ర్యానంతరము తలయెత్తిన నూతన సాహిత్య ధోరణి యిది. ఇంతకుముందు ప్రస్తావించినట్లుగా స్వాతంత్ర్యానంతరము సమాజములో వచ్చిన అవాంఛనీయ పరిణామాల ఫలితమే యీ సాహిత్య ధోరణి.

స్వాతంత్ర్యానంతరము తెలుగులో అభివృద్ధిచెందిన సాహిత్యము వచన కవిత్వము. ఈ మార్గములో ఉత్తమమైన రచనలు వచ్చినవి. అగ్రశ్రేణి రచయితలుగా వచన కవులు ప్రసిద్ధి పొందినారు. గేయ కవిత్వానికి యీనాటి

సాహిత్యములో ప్రముఖస్థానము. ప్రశంసనీయమైన గేయ కవితా రచనలు చాల గత దశాబ్దములో ప్రకటితమైనవి. తెలుగు వాఙ్మయములో యీ రచనలు మిక్కిలి విలువగలవి. మనదేశములో యిప్పటికి నాలుగు సాధారణ ఎన్నికలు జరిగినవి. ఈ ఎన్నికల సందర్భమున కొన్ని మంచి గేయాలు ప్రకటితమైనవి ఎన్నికల సాహిత్యమైన యీ గేయాలను యేరి కూర్చి ప్రకటించిన బాగుండ గలదు. గత దశాబ్దములో పాకిస్తాన్, చైనాలు మనదేశముపైన దురాక్రమణ గావించినవి. ఈ దురాక్రమణ సందర్భములో మన కవులు. పెద్దలు - పిన్నలు చేసిన రచనలు కొన్ని ఉత్తమ శ్రేణికి చెందియున్నవి. స్వాతంత్ర్యానంతరము వచ్చిన సాహిత్యములో యీ రచనలను సమర సాహిత్యముగా మనము పరిగణింపవచ్చును. ఇదే విధముగా సినిమా పాటలలో రసవంతమైన సాహిత్యము కొంత మనము సేకరించవచ్చును.

ఈనాడు అన్ని భాషలలోవలె తెలుగులో కూడ నవలలు, కథానికలు పుష్కలంముగా ప్రకటితమగుతున్నవి. ఈ నవలలలో, ఈ కథానికలలో సమ కాలిక జీవితము తత్సంబంధమైన సమస్యలు ప్రధాన స్థానము ఆక్రమించు తున్నవి. స్వాతంత్ర్యము తరువాత ఇతివృత్తము, శైలికి సంబంధించిన మన అభిరుచులలో వచ్చిన మార్పులను నేటి నవలలో, కథానికలలో చూడవచ్చును. కవిత్వము, కథలు, నవలలు యీ మూడు సాహిత్య ప్రక్రియలలో హిందీ, బెంగాలీ భాషలనుండి అనువాదాలు చాల ప్రకటితమైనవి. రవీంద్రుడు, శరత్ చంద్రుడు, ప్రేంచంద్, జయశంకర్ ప్రసాద్, జైనేంద్ర కుమార్ ప్రభృతుల రచనలు అనేకములు తెలుగులోనికి వచ్చినవి. వీని తరువాత పేర్కొనదగిన సాహిత్యము నాటకాలు, నాటికలు. అయితే యీ రంగములో మనము ప్రశంస నీయమైన ప్రగతి సాధించలేదేమో! రేడియో ద్వారా ప్రసారమైన వానిలో కొన్ని ప్రశస్తమైన నాటికలు ఉన్నవి.

స్వాతంత్ర్యానంతరము స్త్రీ రచయితలు చాలమంది ముందుకు వచ్చి పురుషులతో సమానముగా రచనలు గావించుచున్నారు. కొంతమంది విద్వాం సులు ఉత్తమ సాహిత్య విమర్శలను ప్రకటించినారు. ప్రాచీన, ఆధునాతన రీతులలో యీ సాహిత్య విమర్శలు సాగినవి. పదప్రయోగకోశాలు, నిఘంటు వులు, వృత్తి పదకోశాలు యిటీవల ప్రకటితమైన ప్రామాణిక ఉత్తమగ్రంథాలు. ఒకవైపున అత్యంత ఆధునికమైన అభిరుచులు పూర్వపద్ధతుల పైన తిరుగుబాటు

స్వాతంత్ర్యానంతర సాహిత్యము యొక్క ప్రత్యేకతలుగా కనిపించుచుండగా మరొక వంక ప్రాచీన రచనలపట్ల అభిమానము, ఆదరణ కూడ నేడు పాఠకులలో గోచరిస్తున్నది.

ఉద్రేకము, సౌకుమార్యము సరసముగా సమ్మేళనము పొందిన ప్రకృతి ఆంధ్రునిది. కావుననే కాబోలు తెలుగులో కవుల సంఖ్య నాటికీ నేటికీ యెక్కువే. సంప్రదాయము, ప్రయోగము రెండును నేటి కవిత్వంలో గోచరిస్తున్నవి ఇంతకుముందు చెప్పినట్లుగా గేయ కవిత - వచన కవిత స్వాతంత్ర్యానంతరము తెలుగులో అభివృద్ధి పొందిన కవితా రీతులు. అభ్యుదయ కవిత్వము తరువాత పొడసూపిన నూతన మార్గము దిగంబర కవిత. మానవతా వాదము యీ రెండు కవితా మార్గాలకు ప్రధాన ప్రాతిపదిక. పీడిత ప్రజలవాణి యీ రచనలలో బిగ్గరగా వినిపింపబడుతున్నది. స్వాతంత్ర్యానంతరము నవలలు, కథానికలు పాఠక లోకమున విశేషముగా ఆకర్షిస్తున్న సాహిత్య ప్రక్రియలు. ఈ రెండు మార్గాలలో అసంఖ్యాకముగా ప్రకటితమగుతున్న రచనలు నేటి సమాజానికి ప్రతిబింబాలు. విశేషించి మధ్యతరగతి కుటుంబాల పరిస్థితులు - సమస్యలు వీనికి యితివృత్తాలు. ఈ శతాబ్దపు రచనలను, ముఖ్యముగా స్వాతంత్ర్యానంతర రచనలను కళాదృష్టితో విలువ కట్టవలసి వచ్చినచో కథానికకు ప్రథమ తాంబూలము ఈయవలెను. తెలుగు కథానికకు భారతీయ సాహిత్యములో గౌరవస్థానము.

గడచిన అర్ధ శతాబ్దములో, అందులోను స్వతంత్ర భారతములో భారతీయ సాహిత్యముపైన విదేశీయ - విజాతీయ ప్రభావము గోచరించినప్పటికిని భారతీయ సంస్కృతి యొక్క ముద్ర యితర సాహిత్యములతోపాటు తెలుగు సాహిత్యము మీద స్పష్టముగా కనిపించును.

(1970)

# కళ

మానవునికి సౌందర్య సంవీక్షణము వలన కలుగు ఆనందము ప్రకృతి సిద్ధమైనది. నిండు పున్నమనాడు పడమటి కాంతయొడిలోన పవళించియుండు నెలబాలుని తిలకించినప్పుడు కాని, ఆకులు రాలక పూలువాడని ఆరామమందు "చిలుక పోటులచేత జెరగిన సహకార ఫలముల" నుండి స్రవియించు పచ్చి తేనెను పరికించినప్పుడు కాని, మరియెట్టి మనోహర దృశ్యమును గాంచి నప్పుడు కాని, మన హృదయములందు సౌందర్య సాక్షాత్కారమగుచుండును. విద్యాధికులకు, విజ్ఞానులకు, విద్యావిహీనులకు, అజ్ఞానులకు, శ్రీమంతులకు, నిరుపేదలకు, స్త్రీలకు, పురుషులకు, బాలురకు, అందరికిని కొలదియో, గొప్పయో సౌందర్యశక్తి యుండితీరును. మానవునకు సౌందర్యమునందున్న సహజమగు ప్రేమయే ఆతడు లలితకళల నారాధించుటకు ప్రోత్సాహ కారణ మని చెప్పవచ్చును. మానవుని హృదయమున యెచ్చటనో దాగియున్న సృష్టి శక్తి పైకుబికివచ్చి ఏదోయొక రూపము దాల్చుటయే లలితకళ ఆవిర్భావమని చెప్పవచ్చును. లలితకళలు సౌందర్యపు భావచిత్రములు కావున కళ స్వభావ మును గుర్తించినప్పుడే మనము సౌందర్య దర్శనము చేయగలుగుదుము.

ప్రపంచమునందలి ఏ గొప్పకళనైన తిలకించుడు; అది ఒక ప్రత్యేక వ్యక్తి నిర్మాణమని విశదమగును. అట్లగుటచే ఒక కావ్యముగాని ఒక చిత్రము కాని ఒక భంగిమకాని సరిగా పూర్వ సాంప్రదాయమునే అనుసరించి, ఇదివర కున్న వానివలెనే యుండి ఒకే యంత్రము నుండి తయారుచేసిన నాణెముల వలె నుండుట సంభవము కాదు. ఒక క్రొత్త భావము, ఒక క్రొత్త జీవకళ, ఒక క్రొత్త చైతన్యము కలిగినదే నిక్కమగు కళయని చెప్పవలసియుండును. పాతపాటలే తిరిగి పాడిన రోతగా నుండదా? ఉద్రేకము కవిత్వమునకే కాదు, సౌందర్య ప్రధానములగు కళలన్నింటికిని జన్మస్థానమని చెప్పవచ్చును. కవివలె చిత్రకారుడు కూడ భావనా వీథులందలి తన యనుభవములను వర్ణముల రూపమున ప్రదర్శించుచుండును.

లలితకళల లక్షణములను వివరించుచు సిద్ధాంతములను ప్రతిపాదించు గ్రంథము లనేకము కలవు. కాని ఈ సిద్ధాంతములను మాత్రమే నమలి మ్రింగుట వలన యెవరికిని నవనవోన్మేష శాలినియగు ప్రజ్ఞ లభింపజాలదు. సహజ ప్రతిభ పరిపూర్ణముగా అభివృద్ధి నొందుటకు దోహదము మాత్రమే కావించునవి లక్షణ గ్రంథములు. సంప్రదాయము, కళలను సమకాలిక సాంఘిక పరిస్థితులతో సమన్వయించి ఆ రెండింటికి సమరసభావము కలిగించునది మాత్రమే! ఒక కాలమున అత్యుత్తమముగా పరిగణింపబడిన సంప్రదాయము మరియొక కాలమున పనికి రాకపోవచ్చును. కావుననే కాలముతో పాటు సంప్రదాయములు మారి జాతీయ పునర్వికాసము జరుగుచుండును. కళా సౌందర్యమును ప్రతిపాదించు యేయొక్క సిద్ధాంతమును గాని మనము ఆ విషయమున తుదిమాటగా అంగీకరించుట పొసగదు. సర్వకాల సర్వావస్థలయందు కళాసౌందర్యమును ప్రతిపాదించు ఆదర్శమిది యొక్కటేనని యెవ్వరును ప్రేలెత్తి చూపజాలరు. అట్లయినచో అభివృద్ధియను మాటయే మన శబ్దకోసము నుండి అంతరించవలసి యుండును. ఒక కాలమునందు ఒక గొప్ప కళోపాసకుడు నిర్మించిన కళాశకలమును అచ్చుగ్రుద్దినట్లు మరల మనము తయారు చేయజాలము. అట్లు చేయుట కళకాదు; చేసినను అది యొక నమూనా మాత్రమే యగును. అందు కళాసౌందర్యము లోపించితీరును. ప్రత్యేక వ్యక్తిత్వము వైలక్షణ్యము కలిగిన నిర్మాణమే కళోపాసకుల ఆదర్శము. బింబములకు ప్రతిబింబములను తయారుచేయుట కళోపాసకుల పనికాదు.

కవిత్వము లలితకళలలో ప్రధానస్థానము నాక్రమించును—కవిత్వమునకువలె ఇతర లలితకళలకును కారణభూతములగు విషయములు రెండు—మొదటిది భావచిత్రము; రెండవది భావచిత్రములను హృదయ ఫలకములందు ప్రదర్శించు మనోవికారము. కావ్య ప్రపంచమున వ్యక్తుల భావచిత్రములు, వివిధ వస్తువుల దృశ్యముల భావచిత్రములు, మానవుని సుఖదుఃఖముల భావచిత్రములు మున్నగునవి ప్రదర్శితము లగుచున్నవి. ఈ భావచిత్రముల వెనుక కవి యొక్కనివే కాదు, పాఠకుల మనోవికారములు కూడ గోచరించుచుండును. దుస్సహ దుఃఖానుభవములు, కంటికి నీరుదెచ్చి హృదయమును కరిగించు కరుణరసప్రపూర్ణములగు ఘట్టములు, పరమాత్మలో లీనమగుటకు అంతరాత్మపడు

ఆవేదన మున్నగు మనోవికారములతో పాటు "దాటిపోయిన యుగము" నాటి చరిత్ర యొక్క భావచిత్రములను లలితకళలు మనయెదుట ప్రదర్శించుచున్నవి. కార్యకారణ క్రమమున వివరింపరాని అనిర్వచనీయ మాధుర్యము,సౌందర్యానుభూతి కవిత్వము మన కొసగుచున్నది. భావచిత్రములను, మనోవికారములను కళా ప్రపంచమున వేరుపరచుటకు వీలులేదు. ఈ రెండు శక్తుల సరస సమ్మేళనమే కళాసౌందర్యము. ఈ రెండు శక్తులుగాక కళా ప్రపంచమున అనేక యితర విషయములు కూడ సౌందర్య దర్శనమునకు సహాయకారులు కావచ్చును. ఈ సందర్భమున కళావస్తువు చారిత్రకముగా గాని ఇతరత్రముగా గాని యధార్థము కావలసిన యవసరము లేదని మనవిచేయుట అవశ్యకము.

ఒక ఛాయాచిత్రమును పరికించుడు—అది ప్రపంచమందలి మానవుని యొక్కగాని వస్తువుయొక్కగాని ప్రతిబింబము. ఈ ప్రతిబింబము కళాశకలము గాజాలదు. కేవలము వివిధవర్ణముల విచిత్ర సమ్మేళనము కళ కాజాలదు అట్లే వివిధ ధ్వనుల సమ్మేళనము కూడ సంగీతము కాజాలదు. అదియే సంగీతమైనచో గాయకుడు కానివాడు కూడ సంగీతమును రచింపవచ్చును. తుట్టతుదకు వివిధ ధ్వనులను సాధ్యమైనన్ని విధములుగా సమ్మేళనము జేసిన తరువాత, వివిధ శబ్దములను సాధ్యమైనన్ని విధములుగా సమ్మేళనము జేసిన తరువాత సంగీతము, కవిత్వము ఈ ప్రపంచమునుండి శాశ్వతముగా నిష్క్రమించవలసి వచ్చును. కావున బాహ్యస్వరూపమును గాంచి, శబ్ద వర్ణ ధ్వనుల సమ్మేళనము గాంచి అదియే నిక్కమగు కళయని భ్రమించుట ప్రమాదము. కళా సౌందర్యమును ప్రతపాదించు భావచిత్రములు, మనోవికారములు లేనిది అది కళ యెన్నటికిని కాజాలదు. కవితా రసపిపాసువగు పాఠకుడొక గ్రంథమును పఠించునప్పుడు శబ్దజాలము యొక్క ఇంద్రజాలముతో సంతృప్తిపడక అందలి కావ్యసౌందర్యమును తనివిదీర యనుభవించును. మేధాసంపద, యుక్తివాదము, వివిధ విషయ పరిజ్ఞానము ప్రపంచమునకు పరమోపకారము మొనరించుట నిస్సంశయమే కాని రసపిపాసువునకు సౌందర్య సాక్షాత్కారము కలిగించు శక్తి మాత్రము వానికి లేదు. హృదయశక్తి లేని మేధాశక్తి, సౌందర్యములేని విజ్ఞానము భార్యలేని భర్త సంసారము వంటివి. ఈ సత్యమును కళాసౌందర్యమును తృణీకరించు శుష్కహృదయులు గ్రహింపవలెను.

కళ తత్వశాస్త్రము కాదు; కళ చరిత్ర కాదు; కళ భౌతికశాస్త్రము కాదు; గాలిలో మేడలుకట్టుట కళగాదు. భౌతికశాస్త్ర తత్వశాస్త్రముల వలె యుక్తివాదముపై ఆధారపడకున్నను, చరిత్రవలె గతకాలమున జరిగిన సంగతులను గ్రహించునది కాకపోయినను కళ యందుకూడ ఒక ప్రత్యేకమగు క్రమము, విలక్షణమగు సత్యము గోచరించుచుండును అస్పష్టమై, క్రమబద్ధము గాక చెల్లాచెదరై యున్న మనోవికారములకు విశిష్టత క్రమబద్ధమునగు స్వరూపము నొసంగుటయే కళ ప్రత్యేకత. ఆకాశ హర్మ్యములను నిర్మించునదిగాక ప్రతిభావంతమగు సృష్టిని గావించునది కళయని మనము గ్రహింపవలెను.

మన యందరికిని మనోవికారములు కలుగుచుండును. మనము సంతోషించెదము; దుఃఖించెదము; కోపించెదము; దయార్ద్రహృదయముల మగుదుము. ఆ సందర్భములందు అప్రయత్నముగా మన నోటినుండి శబ్దజాలము ఉబికివచ్చును. కాని ఈ మాటలు కవిత్వము కాజాలవు. కవియగువాడు తన మనోవికారములను ఏకముఖము గావించి క్రమబద్ధముగా వ్యక్తీకరించునపుడే అది కవిత్వమగును; అందు సౌందర్యము ప్రతిఫలించును. కాని నోటికి వచ్చిన మాటలన్నియు కవిత్వము కాజాలవు. ప్రతిభాశాలియగు వ్యక్తినే ప్రశాంత సమయమున సంస్మరణము నొంది వ్యక్తమైన భావములే కళాసౌందర్యమునకు ఆటపట్టులని యొక విమర్శకుని అభిప్రాయము. కావుననే మన యందరి హృదయములందు కలుగు మనోవికారములు తాత్కాలికములే. కవిత్వము నందలి మనోవికారములు విశ్వజనీనములై యొప్పుచుండును. అనేకులు పుత్రశోకము ననుభవించుచున్నారు. ఆ సందర్భములందు మనోవికారము లెన్నియో రీతుల ప్రదర్శించుచున్నారు. ఈ ప్రదర్శనములు, ఈ ప్రలాపములు తాత్కాలికములు మాత్రమే. కాని కళయందలి శోకమట్టిదిగాదు; దానికొక శాశ్వతత్వము కలదు. దీనినే కళకు సంబంధించిన విశ్వజనీనత యని చెప్పవచ్చును. కావుననే కవి వ్యక్తీకరించిన శోకము, సంతోషము, కరుణ, వేడుక, వేదనలు ప్రత్యేక వ్యక్తిత్వము కలిగి, విశ్వజనీనములై యొప్పుచున్నవి. ఒకేయొక భావమును ప్రదర్శించు కళ కొంత వెగటు కలిగించవచ్చును. వైవిధ్యము కళ అందమును ద్విగుణీకృత మొనరించును. కావుననే కాబోలు మనవారు కావ్యమునందు అష్టాదశవర్ణ నాదులుండవలెనని విధించి కావ్యవస్తువును విశాలపరచినారు.

కళ ముఖ్య కర్తవ్యము ఉపదేశము, ప్రచారము, అనుశాసనములు కావు. ఉపదేశము, ప్రచారము, అనుశాసనము అంతర్వాహినులుగా నుండ వచ్చును. కవిత్వమును కాంతాసమ్మితముగా గ్రహించిన మన ప్రాచీనులు యీ సత్యమును చక్కగా విశదీకరించినారు. మానవ జీవిత విమర్శనమే కళకు ముఖ్య ప్రతిపాదకమగు విషయము.

కళా సౌందర్యమునకు కేంద్రస్థాన మేదియను ప్రశ్న స్వాభావికముగా కలుగుచున్నది. ఒక చక్కని అజంతా చిత్తరువును తిలకింపుడు— ఆ చిత్రము ఒక్కొక్క మానవునియందు అతని సంస్కృతి ననుసరించి ఒక్కొక్క విధముగా సౌందర్యానుభూతి కలిగించును. కొందరిని రవివర్మ పటములే యెక్కువగా ఆకర్షించుట జూచుచున్నాము. కావున కళా సౌందర్యమునకు ఆటపట్టులు మన హృదయములే యని చెప్పుట మిక్కిలి సమంజసము.

పటమునందలి వర్ణనములు, రేఖలు మున్నగు సాధనసామగ్రి మాత్రమే కళా సౌందర్యమున కాటపట్టులు గావు. అర్థశాస్త్ర ప్రపంచమున ఇవి యుపయోగకరములగు వస్తువులు, ఇవి కావు—అని మనము స్పష్టముగా నిర్దేశించ లేని విధముగనే కళా ప్రపంచమున గూడ ''ఇవి సుందరమగు వస్తువు''లని మనమొక కడపటి నిర్ణయము చేయజాలము. అర్థశాస్త్రమున అవసరము, సరఫరా మున్నగు విషయాలు వస్తువుల యుపయోగమును నిర్ణయించిన విధముగనే రసికుల మనోవృత్తి కళా ప్రపంచమున సౌందర్య నిర్ణయము గావించుచుండును.

మనము కావ్యములను శృంగార కావ్యములు, వీర కావ్యములు అని వివిధములుగా విభజించుచున్నాము. ఇది మన సౌలభ్యమునకై చేసికొనిన విభజనమే కాని కావ్యసౌందర్యమును కొలిచి చూపు మానదండము కాదు. శాస్త్ర ప్రకారముగా ఒక కావ్యము సర్వలక్షణ సమన్వితమై యుండవచ్చును. కాని సౌందర్యము సంపూర్ణముగా లోపించవచ్చును. వ్యాకరణము, అలంకార శాస్త్రము, సాహిత్య శాస్త్రము మున్నగునవి రచనా సూత్రములను బోధించి భాషా సంప్రదాయములను తెలుపుటకు సహకారము చేయును గాని, కళ అంతరాత్మను చూపించజాలవు. కళా సౌందర్యమునకు పరమ ప్రమాణములు రసికుల హృదయములు మాత్రమే.

(1945 నల్లగొండ సారస్వత పరిషత్తు వార్షిక సమావేశములో చదివిన ప్రసంగము)

# మహాత్ముని సమకాలికులు

ఏ దేశమందైనా, ఏ కాలమందైనా సమస్త ప్రపంచాన్ని తమ కుటుంబంగా భావించుకున్న మహాపురుషులు సర్వదా కారణ జన్ములు. నిరుపేదలను, నిర్భాగ్యులను ఆత్మీయులనుగా భావించుకొని, వారి ఇక్కట్టులను కడగండ్లను తమవిగా భావించుకొని మానవసేవయే మాధవసేవయని భావించిన మహనీయులలో ముగ్గురిని మనము ఒకే తరగతిలో చేర్చవచ్చును. గౌతమబుద్ధుడు, ఏసుక్రీస్తు, గాంధిమహాత్ముడు ఈ శ్రేణిలోనివారు. కరుణా స్వరూపులైన యీ ముగ్గురిని మనము స్మరించినపుడు మొదటి యిద్దరి సమకాలికులు ఎవ్వరో, మొదటివారి ప్రభావము ఈ మహనీయుల మీద ఎంతవరకుండినదో మనకు చాలకొద్దిగా తెలుసును. మూడవవాడైన గాంధీమహాత్ముని మనము స్వయముగా చూచి ఉన్నందువలన, ఆయన చరిత్రను ప్రత్యక్షంగా పరిశీలించినందున, ఆయన సమకాలికుల గూర్చిన సమాచారము తగినంత మన ముందున్నది.

చాల చిన్నతనములో అయనను ప్రభావితుని జేసిన వ్యక్తి ఆయన మాతృదేవి. శైశవముననే సదాశయాలకు ఆయన జీవితము తల్లిగారి ఆజ్ఞకే అంకితమైనది.

విదేశాలలో ఉన్నప్పుడు ఆయనపైన పడిన మొట్టమొదటి ప్రభావము రస్కిన్ రచనలు. ఆయన సర్వోదయ ఆదర్శాలు రస్కిన్ చేతనే ప్రేరితమైనవి. అయితే రస్కిన్ ఆయన సమకాలికుడు కాడు. లండన్‌లో బైబిలు పఠనము గాంధీ మహాత్మునిలోని ఉదారాశయాలను ప్రోత్సహించినవి. ఈ పరిస్థితిలో టాల్‌స్టాయ్ రచనలు అయనను ఆకర్షించినవి. టాల్‌స్టాయ్ ప్రభావము ఇంచుమించుగా జీవితాంతము మోహనదాసుమీద ఉండినది టాల్‌స్టాయ్‌తో తరువాత ఆయనకు స్నేహము కలిగి, ఉభయుల మధ్య ఉత్తర ప్రత్యుత్తరాలు కూడ జరిగినవి. రస్కిన్, క్రీస్తు, గౌతమబుద్ధులతో పాటు భగవద్గీత గాంధీమహాత్ముని జీవితమును సరియైన మార్గములో మలచినది.

స్వదేశ విదేశాలలో మహాత్మునితో కలసి మెలసి పనిచేసిన సహచరులు, ఆయన జీవితాన్ని కొంతవరకు ప్రభావితము చేసిన పెద్దలు, ఆయనను గౌర

వించినవారు, ఆయన గౌరవానికి పాత్రులైనవారు, ఆయనతో అభిప్రాయభేదాలు కలిగినప్పటికీ ఆయన ఆదరానికి పాత్రులైనవారు, ఆయనకు సలహాదారులు, ఆయన ఆశయాలను ఆచరణలో పెట్టిన మిత్రులు, శిష్యులు మనముందు చాల మంది కన్పించెదరు. వీరిని గురించి ఇప్పుడు మనము ప్రస్తావించుకోవలసి ఉన్నది.

మహాత్ముని సమకాలికులలో స్వదేశీయులు, విదేశీయులుకూడ ఉన్నారని చెప్పినాను. ఆయనను శాకాహార సమస్యలపట్ల శ్రద్ధ తీసుకొనునట్లుగా చేసిన ఇంగ్లీషు మిత్రులు కొందరు ఉన్నారు. ప్రపంచ ప్రఖ్యాత రచయిత అయిన రోమారోల గాంధీజీ జీవిత చరిత్రను రచించి తాను ధన్యుడైనట్లు ప్రకటించు కున్నారు. దక్షిణ ఆఫ్రికాలో జనరల్ స్మట్సుతో గాంధీమహాత్మునికి సంఘర్షణ సంభవించినది. ఆయన సత్యాగ్రహ విధానానికి మొదటి ప్రయోగశాల దక్షిణాఫ్రికా. అహింసాత్మకమైన సంఘర్షణ తరువాత గాంధీ స్మట్సుల మధ్య గౌరవాభిమానములు జీవితాంతము వరకుండినవి. మహాత్ముని సమకాలికులై, అతని సహచరులై ఉండిన యిద్దరు విదేశీయులను మనము ఈ సందర్భములో పేర్కొనవలసి ఉంటుంది. దీనబంధు సి. యఫ్. ఆండ్రూస్ మహాత్ముని అడుగు జాడలలో నడిచి, భారత స్వాతంత్రోద్యమమున పాల్గొనిన త్యాగమూర్తి. మిస్ స్లేడ్ అను ఆంగ్ల వనిత మహాత్ముని ఆశ్రమములో చేరి, తన పేరును మీరా బాయిగా మార్చుకొని ఆయన ఆశయాలకనుగుణముగా భారత స్వాతంత్ర్యోద్య మానికి తన జీవితమును అంకితము చేసినది.

మహాత్ముడు భారత రాజకీయరంగములో అడుగుపెట్టిన కాలమున దిగ్దంతులవంటి వారు, వివిధ రంగాలలో దేశానికి నాయకత్వము వహించి ఉండిరి. భారత మహాపురుషులైన దేవేంద్రనాథ ·ఠాగూరు, వివేకానందులపట్ల మహాత్మునికి అపారమైన అదరాభిమానాలుండి నప్పటికిని వారిని ఆయన కలసి కోవడం జరుగలేదు. దాదాభాయి నౌరోజీ వంటి మహామేధావులను, భారత రాజకీయ రంగములో మహాత్ముడు కలసికొన్నాడు. వారిపైన ఆయనకు అపార మైన గౌరవము ఉండినప్పటికిని ఆయన జీవితముపై వారి ప్రభావము హెచ్చుగా పడలేదు. వాస్తవానికి ఆ రోజులలో ఆయనను ప్రభావితము చేసిన వ్యక్తి గోపాల కృష్ణ గోఖలే. యావజ్జీవితము మహాత్ముడు గోఖలేను తన గురువుగా భావించు

కున్నాడు. భారత రాజకీయరంగంలో మహాత్మునికి తొలిశిక్షణ యిచ్చినవాడు గోఖలే. ఆ రోజులలో గోఖలే, తిలక్, ఫిరోజ్‌షా, మెహతా భారత రాజకీయ రంగములో ప్రముఖులుగా ఉండిన ముగ్గురు మూర్తులు. ఆ ముగ్గురు పెద్దలను సందర్శించిన మహాత్ముడు తన ఆత్మకథలో కన్నులకు కట్టినట్లుగా వారి వ్యక్తిత్వాలను చిత్రించినాడు. మహాత్మునికి ఫిరోజ్ షా హిమాలయాల పర్వత శ్రేణివలెను, లోకమాన్య బాలగంగాధర తిలక్ మహాసముద్రమువలెను, గోఖలే గంగామతల్లివలెను కనుపించినారు. హిమాలయ పర్వతము నధిరోహించుట అసాధ్యమైన ప్రయత్నము. సముద్రములో దిగి ఈదుట భయంకరమైన కార్యము కాని గంగానదిలో స్నానము చేసి ఆమె ఒడిలో ఆడుకొనుట చాల ఆహ్లాదకరమైన అనుభవము అని - ఈ ముగ్గురి విశిష్ట వ్యక్తిత్వాలను గూర్చి మహాత్ముడు మనోహరముగా వివరించినాడు. భారత భూషణ మదన్‌మోహన మాలవ్యా పండితుడు మహోన్నతమైన వ్యక్తిత్వముగల మహానాయకుడు. ఆయన హిందూ మతాభిమానము నిస్సీమమైనది. విద్యా వ్యాసంగములో ఆయన రక్తి అపరిమిత మైనది. సంస్కృతము, హిందీ, ఇంగ్లీషు భాషలలో ఆయన వైదుష్యము, వచోవిలాసము నిరుపమానమైనవి. కాశీ విశ్వవిద్యాలయ స్థాపనలోను అనంతరము దాని అభివృద్ధిలోను గాంధీమహాత్ముడు మాలవ్యా పండితునికి కుడిభుజముగా నిలిచినాడు. దేశ స్వాతంత్ర్యసాధనకై ఈ ఉభయులు కలసి మెలసి పనిచేసి నారు. కాని వారి వ్యక్తిత్వాల మధ్య ఉత్తర దక్షిణ ధృవాలకున్నంత దూరము. అనేక విషయాలలో వారిరువురికి తీవ్రమైన భేదాభిప్రాయా లుండినవి. అభిప్రాయ భేదాలున్నప్పటికిని గౌరవాభిమానాలకు లోటు వాటిల్లని సమకాలిక మిత్రులు మహాత్మునికి చాలమంది. శ్రీనివాసశాస్త్రి, తేజ్‌బహదూరు సప్రూలు ఈ తరగతికి చెందినవారు. శ్రీనివాసశాస్త్రిగారు గోఖలే శిష్యులు; వారసులు, రాజకీయరంగములో మితవాదులు. అందుచేత మహాత్ముని విధానాలతో ఆయనకు తీవ్రమైన అభిప్రాయ భేదాలుండినవి. అయితే మహాత్ముడు హృదయపూర్వకముగా శ్రీనివాసశాస్త్రిని గౌరవించి ఆదరించినాడు. శాస్త్రిగారికి మహాత్మునిపట్ల అపారమైన అభిమానము. సప్రూగారు గొప్ప న్యాయవాది. ఆయనకూడ మితవాది. మహాత్ముని తీవ్రవిధానాలను ఆయన ఎన్నడు హర్షించలేదు. అయినప్పటికి మహాత్ముడు ఆయ నను అభిమానించి ఆయన సలహాలను తీసికొన్న నిదర్శనాలను చూపించవచ్చును. స్వాతంత్ర్యప్రాప్తి తరువాత రాజ్యాంగపరిషత్తుకు సప్రూగారిని మహాత్ముడు ఆహ్వానించినాడు.

రాజకీయ రంగములో మహాత్మునితో సన్నిహితముగా పనిచేసిన వారిలో మోతిలాల్, చిత్తరంజన్‌దాస్‌లను మొట్టమొదట పేర్కొనవలెను. మొదట అభిప్రాయ భేదాలను కలిగియుండి తరువాత క్రమక్రమముగా ఆయన కనుచరులై, ఆయన ఆదేశాల ప్రకారము సర్వస్వము త్యాగము గావించిన న్యాయవాద శిరోమణులు మోతిలాల్, చిత్తరంజన్‌దాస్‌లు. చక్రవర్తి రాజ గోపాలచారిని కూడ ఈ శ్రేణిలోనే చేర్చవలెను. ఒకప్పుడు మహాత్ముని పక్షాన నిలచి, మోతిలాల్ చిత్తరంజన్‌లతో పోరాడి, విజయము సాధించిన రాజగోపాలాచార్యులు తరువాత కొన్ని సంవత్సరముల పిమ్మట కొన్ని ముఖ్య సమస్యల మీద మహాత్ముని వ్యతిరేకించిన సంఘటనలు మనముందున్నవి. రాజగోపాలాచార్యుల కుశాగ్రబుద్ధిపైన, చిత్తశుద్ధిపైన, ప్రతిభా సంపదపైన మహాత్మునికి అచంచల విశ్వాసము. కండ్లు మూసికొని మహాత్ముని అనుసరించిన వారిలో అబ్దుల్ గఫార్‌ఖాన్, రాజేంద్రప్రసాద్, వల్లభాయి పటేల్‌లను పేర్కొనవలసి యున్నది. కాని ఒకే గురువుకు శిష్యులైన యీ ముగ్గురి ప్రకృతులు భిన్నమైనవి. సత్యాహింసలలో అకుంఠిత విశ్వాసము కలిగిన గఫార్‌ఖాన్ సత్యాగ్రహ సమర సైనికుడు. అజాతశత్రువైన రాజేంద్రబాబు భారత ప్రజానీకానికి మహాత్మునితో సమానమైన ప్రతినిధి. శ్రీరామునికి హనుమంతునివలె మహాత్మునికి నమ్మినబంటుగా నుండిన సర్దార్ పటేల్ రాజనీతి కోవిదుడై కార్యశూరుడైన పరిపాలనా దక్షుడు. మహాత్ముని ఆదేశాలను మారు మాటాడక శిరసావహించినవారు వీరు కాని చిత్రమేమనగా వీరిలో ఒక్కరిని గూడ తన రాజకీయ వారసునిగా ఆయన ఎన్నుకొనలేదు. ఆయన రాజకీయ రంగములో తన వారసుడని నిర్ణయించిన వ్యక్తి జవహర్‌లాల్. అయితే మౌలానా ఆజాద్‌వలె జవహర్‌లాల్ మహాత్ముని ఆశయాలపట్ల సంపూర్ణమైన విశ్వాసమును కలిగి ఆచరించినవాడు కాదు. కాని "నా మరణానంతరం నా భాష జవహర్‌లాల్ మాట్లాడు"నని మహాత్ముడు చెప్పిన మాటలు తరువాత సత్యమైనవి. చిన్నతనముననే సీమకేగి, విద్యాభ్యాసము అంతా అక్కడనే పూర్తి చేసికొని పడమటి సభ్యతను ఆకళించుకొన్న సామ్యవాది జవహర్లాల్. తూర్పు పడమరల సంస్కృతుల సమన్వయము జవహర్లాల్‌లో మనము చూడవచ్చును. ఇటువంటి చిత్తవృత్తిగల జవహర్లాల్ గాంధేయుడుగా పరిణతి చెందడానికి కొంత కాలము పట్టినది. జయప్రకాశ్ నారాయణ మహాత్మునితో అభిప్రాయ భేదాలు కలిగి తొలి దశలో అహింసలో ఎక్కువ నమ్మకము లేకపోయినప్పటికి

తరువాత క్రమక్రమముగా మానసిక పరిణామము పొంది సర్వోదయానికి గాంధీ వాదానికి ప్రధాన ప్రతినిధిగా నిలచియున్నాడు. మహాత్ముడు తన చేతులార పెంచి పెద్ద జేసిన పెంపుడు కూతురు ప్రభావతీదేవిని జయప్రకాశ్ నారాయణకు ఇచ్చి పరిణయము జేసినాడు. సుభాష్‌చంద్రబోసు ప్రారంభంలో మహాత్ముని శిష్యుడై, తరువాత ఆయనను ధిక్కరించిన నాయకుడు. సుభాష్ చంద్రబోసుపట్ల మహాత్మునికి సర్వదా ప్రేమాభిమానము లుండినవి. సరోజినీదేవి మహాత్మునికత్యంత సన్నిహితురాలైన విదుషీమణి. మహాత్మునితో ఆమెకు ఉండిన చనువు మరొకరికి లేకుండెను. అనేక పర్యాయాలు మహాత్మునికి సేవ చేసే భాగ్యము ఆమెకు లభించినది. తెలుగు వారిలో మహాత్ముని అంతరంగ శిష్యులు చాలమంది. మహాత్ముడు సూత్రకారుడైతే, ఆయన భాష్యకారుడని ప్రఖ్యాతిగాంచిన మేధావి పట్టాభి సీతారామయ్యగారు మహాత్మునికన్న వయసులో కొన్ని సంవత్సరాలు పెద్దవాడైనా - అనేక పర్యాయాలు ఆయన అభిప్రాయాలను వ్యతిరేకించి ఆయన మార్గాన్ని అనుసరించనప్పటికిని, మహాత్ముని నాయకత్వానికి గొప్ప నైతిక బలమును సమకూర్చినవాడు రవీంద్రుడు. ఆ ఉభయుల స్నేహము విచిత్రమైనది. రవీంద్రుడు సౌందర్యానికి చిహ్నమైతే, జవహర్లాల్ శాంతికి ప్రతిబింబమైతే, మహాత్ముడు సత్యానికి స్వరూపము ఈ ముగ్గురి వ్యక్తిత్వాల సమ్మేళనమే భారతీయ సంస్కృతి. రవీంద్రుని మహాత్ముడు గురుదేవుడని పిలిచినాడు. భారతదేశానికి మహాత్ముని యేకైక నాయకత్వాన్ని రవీంద్రుడు బలపరచినాడు. ఆజన్మాంతము వారి మధ్య ప్రేమాభిమానాలు దినదినాభివృద్ధి చెందినవి.

మహాత్ముని ఉదారాశయాలు త్రికరణశుద్ధిగా నమ్మి ఆచరించిన శిష్యులు ముగ్గురు వినోబా భావే, ఆచార్య భాన్సాలీ, కాకా కాలేల్కరులు మహాత్ముని నమ్మిన బంటులు. సంయమీంద్రులైన యీ ముగ్గురు మహనీయులు విజ్ఞాన సముద్రమును ఆపోశనము పట్టిన అగస్త్యులు; గాంధీ మహాత్ముని ఆస్థాన విద్వాంసులు. మహాత్ముని ఆశయాల కనుగుణముగా తమ జీవితమును మలచికొన్న వ్యక్తులు ఆచార్య కృపలానీ, ప్యారేలాల్, సుశీలా నయ్యర్‌లు. ఈ ముగ్గురు మహాత్మునితో చాల దగ్గరగా మెలగిన వ్యక్తులు. మహదేవదేశాయ్ తన జీవితమును మహాత్మునికంకితము జేసినాడు. నిజానికి మహాత్ముని హృదయమును ఆయన భాషలోనే విప్పి చెప్పగలిగినవాడు మహదేవదేశాయ్. మహదేవదేశాయ్ అకాల మరణము మహాత్మునికి పుత్రశోకము కలిగించినది.

మహాత్ముని జీవితములో పాలుపంచుకొని మొట్టమొదలు కొన్ని విధానాలను ఇష్టపడక తరువాత క్రమక్రమముగా అన్నింటిలోన సంపూర్ణ విశ్వాసము కలిగి ఆయనను అనుసరించిన సాధ్వీమణి కస్తూరిదేవి. వశిష్ఠునికి అరుంధతివలె మహాత్మునికి కస్తుర్బా తోడునీడయైనది.

మహాత్ముని సాహచర్యముచేత ప్రభావితుడైనవాడు మౌంట్ బాటన్. చాల ఆలస్యముగా మహాత్మునితో ఈయనకు స్నేహము తటస్థించినప్పటికి మౌంట్ బాటన్‌కు మహాత్మునిపట్ల ఏర్పడిన భక్తి విశ్వాసాలు అద్వితీయమైనవి. మహాత్ముడు నిస్సహాయుడై నౌఖాలిలో శాంతియాత్ర సాగించిన సందర్భములో మౌంట్ బాటన్ చెప్పిన మాటలు ఎల్లప్పుడు మన చెవులలో ప్రతిధ్వనించును. "ఒకవైపు సుమారు అరలక్షమంది సైనికులు సాయుధులై పంజాబు సరిహద్దు మీద రక్తప్రవాహాలను ఆపి శాంతిస్థాపన చేయుచుండగా, మరొకవైపున నిరాయుధులైన యిద్దరు, ముగ్గురు సహచరులతో పాదయాత్ర చేస్తూ బంగాళా ప్రాంతమున గాంధీజీ శాంతిస్థాపన గావించినాడు!". ఆ సైనికుల కృషికన్న మహాత్ముని కృషి మహత్తరమైనది. మానవాళికి మార్గదర్శకమైనది. ప్రపంచ కల్యాణానికి వెలుగుబాట యైనది.

మహాత్ముడు పురుషోత్తముడగునో కాదో, ఆ చర్చ యెట్లున్నప్పటికీ, ఆయన ఉత్తమోత్తముడైన పురుషుడని నిస్సందేహముగా చెప్పవచ్చును. "హరే రాం హరే రాం" అంటూ అసువుల బాసిన మహాత్ముడు 'బలమునీవ నాకు భక్తుండ నీయెడ, ఇమ్మనుజ్ఞ కమలదళ మనోజ్ఞ నయన' అన్నట్లుగా పరమేశ్వరునిలో పరిపూర్ణ విశ్వాసము ఉంచి, తన ధర్మమును నిర్వహించిన ప్రపంచ పౌరుడు, నిష్కామ కర్మయోగి ఆ మహనీయుని సాహచర్య భాగ్యము కలిగిన సమకాలికులు ఎంత భాగ్యశాలురో, ఎంత ధన్యజీవులో కదా!

(4-4-70 - రేడియో ప్రసంగం)

# లాల్ బహద్దుర్ శా

స్వర్గీయ లాల్ బహద్దుర్ శాస్త్రి భారతదేశానికి రెండవ ప్రధాన మంత్రి. మొదటి ప్రధాన మంత్రియైన స్వర్గీయ జవహర్లాల్ నెహూ్రు, మూడవ ప్రధాన మంత్రియైన శ్రీమతి ఇందిరాగాంధీలవలె ఆయన ఉత్తరప్రదేశ్ రాష్ట్రానికి చెందినవాడు. విశేషించి లక్నో - అలహాబాదులలో రాజకీయ శైశవమును గడిపినవాడు. మొదటి ప్రధాన మంత్రికి రెండవ ప్రధాన మంత్రికి వయస్సులో పదిహేను సంవత్సరాల వ్యత్యాసమైనచో రెండవ ప్రధాన మంత్రికి మూడవ ప్రధాన మంత్రికి గూడ వయసులో దాదాపు అంతే వ్యత్యాసమున్నది. అన్నిటి కన్న మిన్నగా ఈ ముగ్గురు ప్రధాన మంత్రులు భారత రాజకీయ రంగములో అత్యంత సన్నిహితులుగా మెలగి పరస్పర ప్రభావితులైన వ్యక్తులు. ప్రత్యేకించి జవహర్లాల్ ముద్ర కడమ యిద్దరి మీద ప్రస్ఫుటముగా గోచరించుచున్నది. స్వతంత్ర భారత చరిత్రను పరిశీలించినవారికి ఈ ముగ్గురు ప్రధాన మంత్రులు ఒకే రాజకీయకుటుంబపు సన్నిహితసభ్యులుగా సాక్షాత్కరించుచుందురు మొదటి ప్రధానమంత్రి సిరిసంపదల మధ్య జన్మించి శైశవదశను, విద్యార్థిదశను రాజ భోగాలతో గడిపి. భారతదేశపు నిర్మకుటసార్వభౌముడుగా ప్రశస్తిగాంచిన మోతిలాల్ నెహూ్రుకు రాజకీయ వారసుడుగా భాసించినాడు. తండ్రి వదలిన తత్ క్షణమే, జాతిపిత గాంధీజీ ఆశీర్వాదాలతో జవహర్లాల్ కాంగ్రెసు అధ్యక్ష పదవిని చేపట్టినాడు. కాని లాల్ బహద్దుర్ కటిక దారిద్ర్యములో జన్మించి, యిక్కట్టులతో పోరాడుచు విద్యాభ్యాసము గావించి "ఇంతింతై వటు డింతయైనట్లు" ఒక్కొక్క మెట్టు పైకెక్కినాడు. జవహర్లాల్ పదునెనిమిది సంవత్సరాలు ప్రధానమంత్రి పదవిని నిర్వహించగా లాల్ బహద్దుర్ పదునెనిమి నెలలు మాత్రమే ప్రధానిగా పనిజేసినప్పటికిని భారతదేశ చరిత్రలో జవహర్లాల్ వెనుక నిలువ గలిగిన వ్యక్తిగా తన స్థానమును సుస్థిరము గావించుకొనినాడు. రామాయణములో శ్రీరామచంద్రునికి హనుమంతునికి గల సంబంధము వంటిదే ఆధునిక భారత ములో జవహర్లాల్ నెహూ్రు లాల్ బహద్దుర్ల సంబంధము.

గాంధీ మహాత్ముడు అవతరించిన పవిత్రదినమునాడే 2 అక్టోబర్ 1904 న ఒక నిరుపేద కుటుంబములో లాల్‌బహద్దుర్ జన్మించినాడు. ఇక్కట్టులు ఒక్కటిగా రావన్నట్లుగా శైశవముననే తండ్రి మరణించగా మాతృదేవి పర్యవేక్షణలో లాల్‌బహద్దుర్ మాతామహులయింట పెరిగినాడు. చిన్నప్పుడు ఒక జత బట్టలతో మాత్రమే ఆయన అనేక మాసాలు గడుపవలసి వచ్చినదని చెప్పినచో అప్పటి ఆయన పరిస్థితిని మనము ఊహించుకొనవచ్చును. పేదతనములో నున్న పెద్ద కుటుంబమును పోషించవలసిన బరువు బాధ్యతలు తనపై నున్నప్పటికిని విద్యార్థిగా నున్నప్పుడే ఆయన గాంధీజీ పిలుపు నందుకొని సహాయనిరాకరణోద్యమములో దుమికినాడు. మొట్టమొదట తిలక్ ప్రభావము, తరువాత గాంధీజీ ప్రభావము ఆయన రాజకీయ జీవితానికి రూపురేఖలు దిద్దినవి. ఆంగ్ల విద్యకు స్వస్తిజెప్పి, అప్పుడే ప్రారంభింపబడిన కాశీ విద్యా పీఠములో ఆయన విద్యార్థిగా ప్రవేశించినాడు. అప్పుడు కాశీ విద్యాపీఠానికి భారతరత్న స్వర్గీయ భగవాన్‌దాస్ ప్రధానాచార్యుడు. భగవాన్‌దాస్ మహా విజ్ఞాని; గొప్పపండితుడు; భారత తత్త్వశాస్త్ర సముద్రమును ఆపోశనము పట్టిన అగస్త్యుడు. ఆ మహాపురుషుని శుశ్రూష లాల్ బహద్దుర్ జీవిత సౌధానికి గట్టి పునాదులు వేసినది. అదే కాలములో ఆచార్య నరేంద్రదేవ్, అక్కడ అధ్యాపకులుగా నుండిరి. ఆచార్య నరేంద్రదేవ్ ఆదర్శ పాత్రమైన జీవనము, సౌజన్యము, విజ్ఞానము లాల్‌బహద్దురును ఆకర్షించినవి. 'శాస్త్రి' పరీక్షలో లాల్‌బహద్దుర్ ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణుడైనాడు. విద్యార్థిగా నున్నప్పుడే ఆయన టాల్‌స్టాయ్, రామకృష్ణ పరమహంస, వివేకానందుల గ్రంథాలతో పాటు లెనిన్ సిద్ధాంతాలను గూడ ఆకళించుకొనినాడు. అప్పుడే ఆయన తన జీవితమును నియమబద్ధముగా, నిరాడంబరముగా గడపవలెనని ప్రతిజ్ఞ చేసి, దానిని ఆజన్మాంతము పాలించినాడు. విద్యాభ్యాసము పూర్తికాగానే కుటుంబములో పెద్దల కోరిక ప్రకారము ఆయనకు వివాహము జరిగినది. అనసూయ వంటి మాతృమూర్తి ఆశీర్వచనము, సీతమ్మవంటి అర్ధాంగి సాహచర్యము ఆయన వ్యక్తిగత జీవితములో రెండు అత్యంత అదృష్టకరమైన సంఘటనలు. భారతీయ సంస్కృతికి సజీవ చిహ్నములైన యీ సాధ్వీమణులు లాల్ బహద్దుర్ గృహమును సత్యసందీప్తము కావించినారు. తరువాత కొంత కాలానికి లాల్ బహద్దుర్ అలహాబాదు ప్రవేశించి తమ కుటుంబము యెదుర్కొనుచుండిన డబ్బు ఇబ్బందులనుసైతము లెక్కచేయక తీవ్రమైన రాజకీయ ఉద్యమానికి, దేశ

దాస్యశృంఖలా విమోచనానికి అంకితమైనాడు. అనేక పర్యాయములు ఆయన కారాగారానికి వెళ్ళవలసి వచ్చినది. అతి సామాన్యుడైన కార్యకర్తగా, హరిజన సేవకుడుగా దేశసేవను ప్రారంభించి క్రమముగా, నిస్వార్థ సేవానిరతితో ఆయన అత్యున్నతమైన స్థానమును ఆక్రమించగలిగినాడు. 1928 లో అలహాబాద్ మ్యునిసిపాలిటీ అధ్యక్షుడుగాను, 1937 వ సంవత్సరములో ఉత్తరప్రదేశ్ శాసనసభ్యుడుగాను, 1947లో ఉత్తరప్రదేశ్ హోంమంత్రిగాను ఆయన పని చేసినాడు. 1951లో లాల్‌బహద్దూర్‌కు అయాచితముగా లభ్యమయిన అఖిల భారత కాంగ్రెస్ కార్యదర్శి పదవి ఆయన జీవితములో ఒక పెద్ద మలుపువంటిది. ఆ పదవిలో ఆయన జవహర్లాల్ రాజకీయ అంతరంగానికి తన ప్రజ్ఞాబలముచేత అతిసన్నిహితుడు కాగలిగినాడు. 1952 సాధారణ యెన్నికలలో కాంగ్రెసు సంస్థ వ్యవహారాల నిర్వహణ బాధ్యతను జవహర్లాల్ శ్రీ శాస్త్రికి అప్పగించినాడు. ఈ బాధ్యతను అత్యంత ప్రతిభావంతముగా నిర్వహించి రాష్ట్ర రాజకీయరంగపు పరిమితపరిధులను దాటి లాల్‌బహద్దూర్ అఖిల భారత రాజకీయరంగపు విశాల వేదికమీద అడుగుపెట్టినాడు తరువాత ఆయనకు కేంద్ర మంత్రివర్గములో అనేక శాఖలు లభ్యమైనవి. మంత్రి పదవులను ఆయన తృణప్రాయముగా చూచి నప్పటికిని ఆయనను మాత్రము ఆ పదవులు వరించుట మానలేదు. అయితే ఆయన కుటుంబపు ఆర్థిక పరిస్థితులు మెరుగుపడలేదు; సొంతమును గూర్చి ఆయన యెన్నడు ఆలోచించలేదు. అందుకు ఆయనకు వ్యవధియే లేకుండెను. 1956 లో రైలు ప్రమాదాలు హెచ్చుగా సంభవించినందున ఆయన తన రైల్వే మంత్రి పదవికి రాజీనామా యిచ్చి ఒక ఉత్తమ పార్లమెంటరీ సంప్రదాయానికి మార్గదర్శకుడైనాడు. 1957, 1962 సంవత్సరాలలో జరిగిన సాధారణ యెన్నికల సందర్భమున కాంగ్రెసు వ్యవహారాలకు తిరిగి నాయకత్వము వహించి భారత రాజకీయ నాయకులలో లాల్‌బహద్దూర్ కీలకమైన స్థానమును అలంకరించుట జరిగినది. 1961 మార్చి నెలలో మహామేధావి, గొప్ప పరిపాలనాదక్షుడు, అత్యంత ప్రతిభావంతుడైన పార్లమెంటేరియన్‌గా ప్రఖ్యాతి గాంచిన గోవిందవల్లభ్‌పంత్ అస్తమించగా ఆ స్థానమును లాల్‌బహద్దూర్‌కు జవహర్లాల్ అప్పగించుట ఆయన సమర్థతకు ఉత్తమ ఉదాహరణము. 1963 లో కామరాజ్ పథకము క్రింద లాల్‌బహద్దూర్ ప్రభుత్వము నుండి నిష్క్రమించి

నప్పటికిని తిరిగి కొద్దికాలములోనే "తాను చేయుచున్న పనులన్నింటిని నిర్వ హించు"కొరకని శ్రీ నెహ్రూ ఆయనను తన మంత్రివర్గములో చేర్చుకొనుట ఆయన యోగ్యతకు మరొక మంచి తార్కాణము. ఈ సంఘటనయే ఆయన జవహర్లాల్‌నెహ్రూకు రాజకీయ వారసుడని నిరూపించినది.

1965 మే నెలలో శ్రీ జవహర్లాల్ అస్తమించిన తరువాత ప్రధానమంత్రి పదవికి లాల్‌బహద్దుర్ ఏకగ్రీవముగా ఎన్నికయ్యె, 1966 జనవరి పదకొండు వరకు అత్యంత ప్రతిభావంతముగా, చరిత్రాత్మకముగా దేశ పరిపాలనారథానికి సారథ్యము వహించినాడు. ప్రధానమంత్రిగా మన పొరుగు దేశాలయిన బర్మా, సిలోన్, నేపాల్, ఆఫ్ఘనిస్తాన్, జపాన్ వంటి దేశాలతోనేగాక కెనడా, యుగో స్లేవియా, అరబ్ రిపబ్లిక్‌ల వంటి సుదూర దేశాలతోగూడ ఆయన మన సంబం ధాలను పటిష్ఠము గావించినాడు. అంతేకాదు, రష్యా, అమెరికా, ఇంగ్లండులతో మన దేశానికి ఉండిన సుహృత్సంబంధాలను ఆయన అభివృద్ధి చేసినాడు. 1965 సెప్టెంబరులో పాకిస్తాన్ దాడి చేసిన సందర్భమున ఆ దురాక్రమణను అపూర్వమైన ధైర్య సాహసాలతో ఎదుర్కొని భారతదేశానికి విజయమును సంపాదించి భారతదేశ చరిత్రలో శాశ్వత స్థానము సంపాదించినాడు. తరువాత తాష్కెంట్‌లో పాకిస్తాన్ అధినేతతో శాంతి ఒప్పందము చేసుకొనుటలో గూడ ఆయన నిరుపమానమైన ప్రజ్ఞను, నిశ్చలమైన శాంత్యభిలాషను ప్రదర్శించి నాడు. యుద్ధము, శాంతి యీ రెండింటికి సంబంధించిన సమస్యలను ఎదుర్కొని పరిష్కరించుటలో లాల్‌బహద్దుర్ చూపిన రాజనీతి నేతృత్వము, అద్వితీయ మైనది. "మెత్తని పులి ధర్మరాజు" అని తిక్కన చెప్పిన మాట లాల్‌బహద్దుర్ శాస్త్రికి సంపూర్ణముగా అన్వయించుచున్నది.

బహు గ్రంథావలోకనము గావించి, బహు దేశబుధులతో భాషించి, బహు గ్రంథ రచయితయైన జవహర్లాల్ వలె లాల్‌బహద్దుర్ కళోపాసకుడు కాదు. మోతీలాల్, చిత్తరంజన్‌దాస్‌ల వలె ఎంతటి మేధావినైనను పట్టీలు గొట్టించ గలిగిన ప్రతివాద భయంకరుడైన న్యాయవాది కాడు ఆయన. తిలక్, మాలవ్యాల వంటి మహాపండితుడు కాడు ఆయన. గోపాలకృష్ణ గోఖలే, లజపత్‌రాయ్‌ల వంటి విజ్ఞాని ఆయన కాడు. సురేంద్రనాథ్ బెనర్జీ, బిపిన్‌చంద్రపాల్‌ల వంటి మహా వక్తకాడు. రాజగోపాలాచార్యులవలె సంభాషణలో ఎదుటివారిని మంత్రముగ్ధు

లను చేయగలిగిన వచోవిలాసము ఆయనకు ఉండలేదు. సుభాష్‌చంద్రబోస్, జయప్రకాశ్‌ల వంటి విప్లవ వీరుడు కాడాయన అయినప్పటికిని దిగ్దంతులైన యీ మహాపురుషుల శ్రేణిలో చేరదగిన సాధుసత్తముడు లాల్‌బహద్దుర్. ఇందుకు ఆయనకుగల యోగ్యత ఒక్కటే-అదియే ఆయన శీలసంపద. ఉత్తమ పురుషుడైన గాంధీజీ అడుగు జాడలలో ఆయన తన శీలసంపదను దిద్ది తీర్చుకొనినాడు.

లాల్‌బహద్దుర్ శాస్త్రి జీవితము త్యాగశోభితమైనది. ఆయన ఆకారము వలె వేషభాషలు గూడ నిరాడంబరమైనవి పదవుల కోసము ఆయన ఎన్నడు ప్రాకులాడలేదు. తనను వెదకుకొని వచ్చిన పదవులను అవసరమైనప్పుడు వదలి వేయుటలో ఆయన ఎన్నడు సంకోచించలేదు. రాజకీయ అధికార ప్రపంచములో తామరాకు మీద నీటిబొట్టువలె ఆయన వ్యవహరించినాడు. చిత్తశుద్ధి, నీతి, నియమపాలనము ఆయన జీవిత వైభవానికి ప్రధాన ప్రాతిపదికలు. ఆస్తి సంపాదనను గూర్చి ఆయన ఎన్నడును ఆలోచించలేదు. తన కుటుంబానికి, కొడుకులకు, కూతుంద్రకు, అల్లుంద్రకు సుఖజీవితము కల్పించు కార్యక్రమాల పట్ల ఆయన యెన్నడు శ్రద్ధ తీసికొనలేదు. ఆయన మాతృదేవిగాని, సహధర్మచారిణిగాని యీ విషయములో ఆయన మీద ఎటువంటి ఒత్తిడిని తెచ్చినట్టు కానరాదు. తుదకు సొంత గృహమైనను ఆయన నిర్మించుకొనలేదు. ప్రపంచ రాజకీయ చరిత్రలో, ఉన్నతోన్నతమైన రాజకీయ పదవులను నిర్వహించిన వారియందు నిలుచుటకు నీడయైనను సంపాదించుకొనని యేకైక వ్యక్తి, ఉదార చరిత్రుడు లాల్‌బహద్దుర్. తిలక్, గాంధీలచే ప్రభావితుడై, భగవాన్‌దాస్, నరేంద్రదేవ్‌ల శుశ్రూష కావించి, రాజర్షి పురుషోత్తమదాస్ టాండన్ అడుగుజాడలలో రాజకీయ రంగమున శిక్షణపొంది, తరువాత జవహర్లాల్ నెహ్రూ ఆశయాలచేత, కార్యక్రమాలచేత, వ్యక్తిత్వముచేత ఉత్తేజము పొంది, ఆయనకు అత్యంత సన్నిహితుడై, అతి విశ్వసనీయుడైన అనుచరుడుగా నుండి భారత రాజకీయ గగనములో ప్రకాశించిన దివాకరుడు లాల్‌బహద్దుర్

భారత రాజకీయాలలో గాంధీ యుగమున మహానాయకులనేకులు ఉద్భవించినారు. ఈ నాయకుల పోలికలు అనేకము లాల్‌బహద్దుర్ వ్యక్తిత్వములో మేలికలయిక నొంది మనకు కనిపించుచున్నవి. రాజేంద్రబాబు వలె లాల్

బహద్దుర్ అజాత శత్రువు; హితభాషి - మితభాషి ఎక్కువ మిస్సియైన సర్దార్ పటేల్ వ్యవహారదక్షత, నిర్వహణ కౌశలము గూడ లాల్‌బహద్దుర్‌లో సిద్ధి కృతమైనవి. కుసుమము వలె మృదువైనప్పటికి అవసరమైనప్పుడు వజ్రమువలె కఠోరము కాగలిగినది ఆయన వ్యక్తిత్వము. రాజాజీ, గోవిందవల్లభ్‌పంత్ వలె యుక్తియుక్తముగా వాదించు నేర్పు, రాజనీతి కౌశలము, యెత్తుకు పైయెత్తు వేయగల చాతుర్యము లాల్‌బహద్దుర్‌లో మనకు గోచరించుచున్నవి. త్యాగము చేయవలసి వచ్చినప్పుడు అరనిముసము గూడ ఆలోచించక ముందుకు అడుగు వేయుటలో ఎవరికిని తీసిపోనివాడు లాల్‌బహద్దుర్. భారతదేశ సర్వతోముఖాభి వృద్ధి ఆయన జీవిత లక్ష్యము. సామ్యవాద సిద్ధాంతాలపట్ల, ప్రజాస్వామిక సంప్రదాయాల మీద అచంచలమైన విశ్వాసము ఆయనకు జవహర్లాల్‌తోగల దగ్గరి చుట్టరికానికి ప్రధాన కారణాలు. ఈ కారణాలే జవహర్లాల్‌కు లాల్‌బహద్దుర్‌పట్ల సంపూర్ణమైన విశ్వాసమును కలిగించినవి.

"భారతదేశానికి మీ జీవితకాలములో స్వాతంత్ర్యము వచ్చినచో మీరే బాధ్యతను స్వీకరింపదలచినా"రని ఒకమారు బాలగంగాధర తిలక్‌ను ఎవరో ప్రశ్నించినారట. అందుకు సమాధానముగా ఆయన అరనిమిషము గూడ ఆలోచించక "ఫెర్గుసన్ కళాశాలలో గణితశాస్త్ర అధ్యాపక పదవి నాకు కావలెన"ని చెప్పినారట. కాని ఆయనకు అటువంటి అవకాశము లభించలేదు. జాతిపిత గాంధీమహాత్ముడు దేశస్వాతంత్ర్యము వచ్చిన పిదప యే పదవిని కాంక్షించలేదు. తనకు అత్యంత సన్నిహితులైన అనుచరులు దేశ పరిపాలనా బాధ్యతను స్వీకరించగా గాంధీమహాత్ముడు కాలినడకన నౌఖాలిలో పర్యటించి శాంతిస్థాపన కృషికి ఆత్మార్పణ కావించినాడు. ఈ యిద్దరిచేత ప్రబోధితుడై సొంతమును గూర్చి యెన్నడు యోచించని లాల్‌బహద్దుర్‌శాస్త్రి ప్రధానమంత్రి పదవిని స్వీకరించిన సందర్భమున "జీవితములో ఏమి వచ్చినను రాకపోయినను, ప్రాణము ఉన్నను పోయినను, లాల్‌బహద్దుర్ దేశకల్యాణముకొరకు ఆత్మార్పణము చేయవలసి యుండును. అదియే నా కోరిక" అని ఆయన మాతృదేవి ఆశీర్వదించినది. సాధ్వీమణుల వచనముల సత్యసామీప్యములు—అమోఘమైన ఆమె వాక్కులు అక్షరాలా నిజమైనవి. లాల్‌బహద్దుర్ ధన్యజీవి; సత్యమూర్తి; తా

(1969 రేడియో ప్రసంగం)

# గాలిబ్ జీవిత విశేషాలు

ఒకవేయి ఎనమన్నూట అరువదితొమ్మిది సంవత్సరము ఫిబ్రవరి 17 వ తేదీనాడు ఉర్దూ కవులలో ప్రథమగణ్యుడైన గాలిబ్ పరలోకగతుడైనాడు. ఈ సంఘటన జరిగి నూరు సంవత్సరాలు గడచిపోయినందున గాలిబ్‌కవి నూరవ వర్ధంతి అఖిల భారత స్థాయిలో వైభవంగా జరిగినది. భారతదేశములోనేకాక ఇంగ్లాండు, రష్యా, పాకిస్తాన్, అమెరికా మొదలైన దేశాలలో గాలిబ్ శత వర్ధంతి ఉత్సవాలు జరిగినవి ఈ విధముగా విశ్వసాహితికి గాలిబ్ పరిచయము కలిగినది. వివిధ భాషలలో గాలిబ్ రచనలు అనువదించుటకు ప్రయత్నాలు జరుగుతున్నవి. ఈ ప్రయత్నాలు సఫలమైతే మానవాళికి గాలిబ్ సందేశము సువిదితము కాగలదు. నిజానికి గాలిబ్ సమస్త ప్రపంచమును తన కుటుంబముగా భావించుకొనినాడు. మతము, ప్రాంతము, జాతి అను భేదాలను పాటించని గాలిబ్ విశ్వజనీనుడైన మహాకవి. ఒకనొక స్నేహితునికి ఉత్తరము వ్రాయుచు "... ... ఎవరేమనుకొన్నప్పటికిని మానవులందరిని వారు ఎక్కడనున్నను, ఏ మత మవలంబించినను నా సోదరులుగా భావించుకొనుచున్నాను" అని ఆయన వ్రాసినారు. ఆయన రచనలలో ఇందుకు ఉదాహరణలు అనేకములు.

గాలిబ్ తండ్రి, తాతలు మధ్య ఆసియాలలోని సల్జూక్ రాజ కుటుంబానికి చెందిన తురుష్కులు. రణతంత్రములో ఆరితేరిన యోధులు. వీరు సుమారు మూడునూర్ల సంవత్సరాలు మధ్య ఆసియాను పరిపాలించిన తరువాత క్షీణ దశను ఎదుర్కొని తత్ఫలితముగా కుటుంబము వివిధ భాగాలై ఆసియాలలోని అనేక ప్రాంతాలకు వలస వెళ్ళుట తటస్థించినది. పదునెనిమిదవ శతాబ్ది మధ్య కాలములో ఈ విధముగా వలస వెళ్ళిన ఒక కుటుంబ విభాగానికి చెందిన గాలిబ్ తాతగారు భారతదేశానికి సమర్కండ్ నుండి బయలుదేరి అప్పుడు ఢిల్లీ పరిపాలించుచున్న షా ఆలంను ఆశ్రయించినాడు. అయితే అప్పటికే ఢిల్లీలోని మొగల్ సామ్రాజ్యము పతనావస్థలో ఉండెను. అందుచేత ఆయన తరువాత జయపూర్ మహారాజా ప్రభృతులను కూడ ఆశ్రయించి జీవనోపాధిని గడించి తుట్టతుదకు ఆగ్రాలో స్థిరపడినాడు. ఈయన కుమారుడు మిర్జా అబ్దుల్లా బేగ్

ఆగ్రాలోని ఒక ఉన్నత వంశానికి చెందిన యువతిని వివాహమాడినాడు. ఈ యువతీయువకుల జ్యేష్ఠపుత్రుడే మహాకవి మిర్జా అసదుల్లాఖాన్ గాలిబ్. ఈయన 27 వ డిసెంబర్ 1769 నాడు జన్మించినాడు. ఈయనకు సోదరీసోదరులు ఇద్దరు. ఈ ముగ్గురు చాలా చిన్నవారుగా నున్నప్పుడే తండ్రిగారు మరణించినందున పినతండ్రి అసదుల్లాబేగ్ వీరిని చేరదీసినాడు. కాని దురదృష్టవశాత్తు పినతండ్రి గూడ త్వరలోనే మరణించినందున చాలా చిన్నవయసులో వీరు ఆర్థికమైన ఇబ్బందులను ఎదుర్కొనవలసి వచ్చినది. ఇంచుమించుగా ఈ ఇబ్బందులు గాలిబ్‌ను ఆజన్మాంతము వెంబడించినవి. గాలిబ్ పినతండ్రి బావమరిదియైన నవాబ్ అహమద్ బక్ష్ ఖాన్ ఈ కుటుంబమును ఆదరించి ఈస్టిండియా కంపెనీ నుండి కొంత పెన్షన్ ఇప్పించి యుండెను ఇందులో గాలిబ్ వంతుకు దొరికిన పెన్షన్ సంవత్సరానికి ఏడునూర్ల ఏబది రూపాయలు. ఆజన్మాంతము ఆయనకు ఈ పెన్షనే నికరమైన ఆదాయము.

గాలిబ్ బాల్యమంతయు ఆగ్రాలోనే గడచినది. గాలిబ్‌కు పదమూడవ సంవత్సరమున నవాబ్ అహమద్ బక్ష్ ఖాన్ బంధువర్గములోని ఒక బాలికతో వివాహము జరిగినది. ఆదాయము లేకపోయినప్పటికిని గాలిబ్ చిన్నప్పటి నుండియు జాగీర్దారి కుటుంబాల పిల్లలతో కలసిమెలసి ఆ వాతావరణములో మెలగినందున దాబు, దర్పాలతో, ఆటపాటలతో ఆయన తిరిగినాడు. ఆయన విద్యాభ్యాసము సక్రమమైన పద్ధతిలో జరగలేదు. కావ్యరచనలో ఆయనకు గురువెవ్వరును లేరు. స్వయంకృషి వలన గాలిబ్ ఫారసీ, ఉర్దూ భాషలలో అసాధారణమైన పాండిత్యము గడించినాడు. ఆయన ధారణాశక్తి అనన్య సామాన్యము. ఒకసారి చదివిన విషయము స్మృతిపథములో అట్లే నిలచి పోయెడిది సహజ ప్రతిభయే ఆయన సాహితీ వ్యాసంగమునకు మూలకారణము. ఆయన మాతామహుడు సాహిత్య ప్రియుడు. మామగారు సుప్రసిద్ధ కవి. విద్వాంసులు, కవులు వీరిద్దరి చుట్టుచేరి కవితాచర్చలు, విద్వద్గోష్ఠులు గావించెడివారు. ఈ ప్రభావానికి లోనై చిన్నారి పొన్నారి వరుత కూకటినాడే గాలిబ్ కావ్య రచనకు ఉపక్రమించి, పదునేడవయేట ఢిల్లీ చేరుకొనినాడు. గాలిబ్ ప్రాథమిక రచనలు కఠినశైలిలో నుండినందువలన సామాన్యుల కర్థముగాక పరిహాసమునకు గురియైనాడు తరువాత ఆయన సులభశైలి నవలంబించి విశిష్టమైన రచనలు

గావించినాడు. ఏది వ్రాసినను గాలిబ్ బాగుగా ఆలోచించి కొద్దిగా, చక్కగా వ్రాయువాడు. కావుననే అతని కవితలో ఆవేశము, ఉద్వేగముకంటె నిదానము, ఆలోచన యెక్కువగా కన్పించుచున్నవి. ఈ విధముగా సాహితీరంగములో అడుగుపెట్టిన గాలిబ్ తన కుటుంబ సంప్రదాయము నుండి పితృ, పితామహుల వృత్తినుండి విడిపోయి సంపూర్ణముగా భిన్నమార్గములో సంచరించినాడు. పితృ, పితామహులు కత్తితో కసరత్తు గావించగా గాలిబ్ కలముతో కసరత్తు జేసినాడు పితృ, పితామహులది తాత్కాలికమైన కీర్తిమాత్రమే. కాని గాలిబ్ యశస్సు ఆచంద్రతారార్కమైనది.

మొట్టమొదలు ప్రస్తావించినట్లుగా గాలిబ్ శ్రీమంతుల యింటిలో జన్మించి నప్పటికిని అతనికి వారసత్వముగా సంక్రమించినవి ఋణము, దారిద్ర్యము మాత్రమే. కాని ఆయన స్థిరచిత్తముతో, సడలని ధైర్యముతో జీవితయాత్ర గావించినాడు. అడుగడుగున పోరాటమే ఆయన జీవితము. ఈ ఒక విషాదగాథ. స్వేచ్ఛగా డబ్బు ఖర్చుచేయుటకు అలవాటుపడిన గాలిబ్ పొదుపరితనమును అలవరచుకొనలేకపోయినాడు. కావుననే జీవితాంతము అప్పులబాధ ఆయనకు తప్పలేదు. ఈ బాధ భరించలేక చిత్తశాంతి కొరకు జూదమాడుటకు అలవాటు పడిన గాలిబ్ తుదకొక పర్యాయము ఖైదుకు వెళ్ళుట గూడ తటస్థించినది.

గాలిబ్ వ్యక్తిత్వము విశిష్టమైనది. స్వాభిమానము, అహంకారము ఆయనలో మూర్తీభవించి యుండెను. పేదరికపు పోరునుండి తప్పించుకొను ఉద్దేశ్యముతో గాలిబ్ ఉద్యోగ ప్రయత్నము గావించినాడు. ఆ కాలమున ఈస్టిండియా కంపెనీ స్థాపించిన ఢిల్లీ కళాశాలలో ఫారసీ అధ్యాపకుని స్థానము ఒకటి ఖాళీ కాగా, దానికి గాలిబ్ దరఖాస్తు పంపగా, ఆయనను ఇంటర్వ్యూకు రమ్మని పిలుపు వచ్చినది. ఈ పిలుపు నందుకొని ఆయన కళాశాల అధికారుల వద్దకు ఒక పల్లకీలో ఎక్కి ఆస్థానకవి తరహాలో వెళ్ళగా ఆయనకు ఆ స్థాయిలో ఆదరణ జరగలేదు. కళాశాల పక్షాన యెవరో వచ్చి తనకు స్వాగతమిచ్చి లోనికి తీసుకొనిపోవుదురని గాలిబ్ భావించెను. కాని అటువంటి స్వాగతము ఆయనకు లభించనందున, సాధారణ అభ్యర్థులవలెనే ఆయనను చూచినందువలన "ఈ ఉద్యోగము లేకున్న మానె. నా గౌరవానికి భంగము మాత్రము సహించను" అని భావించి గాలిబ్ గృహోన్ముఖుడైనాడు. తరువాత లక్నో

నవాబును ఆయన ఆశ్రయించగా అక్కడ గూడ తనకు స్థానము దొరకనందున స్వాభిమానముతో గాలిబ్ ఆ ఆశ్రయమునుగూడ వదులుకున్నాడు ఆ రోజులలో మొగలు వంశానికి చెందిన తుఫారాజైన బహదూర్‌షా ఢిల్లీని పరిపాలించుచుండెను. గాలిబ్ ఆయనను ఆశ్రయించుటకు ప్రయత్నించెను. కాని యీ ప్రయత్నము గూడ సులభముగా జయప్రదము కాలేదు. బహదూర్‌షా స్వయముగా కవియై యుండెను. ప్రసిద్ధుడైన జౌఖ్ ఆయన ఆస్థానకవిగా నుండెను జౌఖ్ బహదూర్‌షాకు ఆస్థాన కవియేగాక, కవితా గురువు. జౌఖ్ బ్రతికియుండగా గాలిబ్‌కు ఆస్థానకవి పదవి లభించు అవకాశము లేకుండెను. ఆ పదవి దొరికినరేతప్ప గాలిబ్ రాజాస్థానములో అడుగుపెట్టుటకు ఇష్టపడలేదు. జౌఖ్ మరణించిన తరువాత బహదూర్‌షా ఆదరము కొంత గాలిబ్‌కు లభించినది. తైమూరు వంశ చరిత్ర ఫారసీ భాషలో వ్రాయు పనిగూడ గాలిబ్‌కు జఫర్ అప్పగించెను. లక్నోలో నవాబు వాజిదలీషా అధికారము లోనికి వచ్చిన తరువాత ఆయన ఆదరము గూడ మన కవీశ్వరునికి కొంత లభించినది. కాని మంచి రోజులు ఎక్కువకాలము నిలవలేదు. 1856 లో వాజిదలీషా పదవిచ్యుతుడైనాడు. 1857 లో సిపాయీల తిరుగుబాటు సందర్భమున బహదూర్‌షా జఫర్ బంధితుడై నాడు. ఈ రెండు సంఘటనల ఫలితముగా గాలిబ్ తిరిగి నిరుద్యోగియై యథా ప్రకారము దీనస్థితికి గురియైనాడు ఆ పిమ్మట ఆయన రాంపూర్ నవాబును ఆశ్రయించినప్పటికిని యేదో ఒక సాహిత్యచర్చ సందర్భములో అభిప్రాయ భేదాలు వచ్చినందున ఆయనకు అ ఆశ్రయము గూడ త్వరలో తొలగిపోయినది. 'భగవంతుడు నా నుదుట కష్టాలు వ్రాసిపెట్టినాడు' అని ఆ సందర్భమున ఆయన చెప్పుకొన్నాడు. అప్పుడు హైదరాబాద్‌నుండి ఆయనకు దివాన్ చందూ లాల్ వద్దనుండి ఆహ్వానము వచ్చినప్పటికిని అప్పటి చిత్తవృత్తితో ఆయన వెళ్ళలేదు. ఢిల్లీలో ఆంగ్ల ప్రభుత్వము స్థిరపడినది. అందుచేత తనకు పెన్షన్ లభించగలదని గాలిబ్ ఆశించెను. ఆయన కలకత్తాకు వెళ్ళి ఇంగ్లీషువారిని ఆశ్రయించినాడు. విక్టోరియా రాణిమీద ప్రశంసా పద్యాలు వ్రాసినాడు. కాని ఆ ప్రయత్నముగూడ ఆయనకు ఎక్కువగా లాభించలేదు. మొత్తముమీద చాల ప్రయత్నము చేసిన తరువాత ఆయనకు కొంత పెన్షన్ లభించినది. అయితే యీ పెన్షన్‌వల్ల ఆయన అప్పులు తీరలేదు; అవస్థలు తీరలేదు. క్రమక్రమంగా ఆర్థిక

బాధలతో ఆయన చితికిపోయి, 1869 లో పరలోకగతుడైనాడు. జీవితాంతము ఆయన కష్టాలతో గడిపినాడు. ఆయన మరణానంతరమే ఆయనకు గణ్యత, కీర్తి లభించినవసునచో సత్యమునకు తలవంపులు కలుగజాలవు మన దేశములో అరాజకత్వము, అధికారము కోసము పెనుగులాట విజృంభించిన కాలములో ఇంగ్లీషువారు, మహారాష్ట్రులు భారతదేశ పరిపాలన హస్తగతము గావించుకొనుటకు సంఘర్షణపడిన రోజులలో గాలిబ్ జీవించినాడు. అప్పటి రాజకీయ పరిస్థితులు కవి పండితుల పోషణకు అనుగుణముగా లేకుండెను. బహదూర్‌షా జఫర్ స్వయముగా కవి, రసికుడు, సారస్వతాభిమాని యైనప్పటికిని చాలినంత అర్థబలముగాని, అంగబలముగాని లేనివాడు. ఈ కారణాలవలన గాలిబ్‌కు తగిన ఆదరణ లభించలేదు.

గాలిబ్‌కు ఫారసీ భాషపట్ల అత్యధికమైన అభిమానము. ఆయన తాను వ్రాసిన ఉర్దూ కవిత్వానికన్న తన ఫారసీ కవిత్వము మేలైనదని ఉద్ఘాటించెడివాడు. 'ఫారసీ నా స్వభావానికి సరిపడిన భాష' అని ఆయన ఒకసారి చెప్పియుండెను ఈ ఫారసీ వ్యామోహము వలన సాహిత్యరంగములో ఆయనకు చాలమంది శత్రువులైనారు కాని చిత్రమేమనగా, ఆయన ఫారసీ కవిత్వము ఈనాడు ప్రచారములో లేదు ఫారసీ భాషలో ఆయన రచనలు ప్రామాణికములైనవని సాహితీ విమర్శకులు అంగీకరించినప్పటికిని ఆయనకు శాశ్వతమైన కీర్తి తెచ్చిపెట్టినది ఆయన ఉర్దూ కవితయే ఉర్దూ భాషలో గాలిబ్ కవితకున్న ప్రభావము మరెవ్వరి కవితకు లేదు. ఉర్దూ వాఙ్మయములో ఉత్తమోత్తమమైనది గాలిబ్ కవిత్వము - ఉర్దూ కవులలో ఉన్నతోన్నతుడు గాలిబ్. ఉర్దూ సాహిత్యములో గాలిబ్ ఎంత గొప్ప కవియో అంత గొప్ప వచన రచయిత. నిజానికి ఆధునిక వచన రచనకు ఒరవడి పెట్టినవాడు గాలిబ్. గాలిబ్ తాను వచన రచయితనని యెన్నడు అనుకోలేదు. ఆయన ఉద్దేశ్యపూర్వకముగా వచన రచన గావించలేదు. ఆయన కొందరు మిత్రులకు వ్రాసిన జాబులే వచన రచయితగా ఆయనకు ఉర్దూ వాఙ్మయములో ఉత్కృష్ట స్థానము లభింపజేయుచున్నవి ఆయన వ్యక్తిత్వము, ప్రజ్ఞా ప్రభావము మనము ఈ జాబులలో చూడవచ్చును. ఈ జాబులలో ఆయన ఉపయోగించిన శైలి సహజ సుందరమైనది; సరళ మనోహరమైనది. ఇటువంటి వచన శైలి యింతకు ముందెవ్వరు వ్రాయ

లేదని విజ్ఞుల అభిప్రాయము ఆయన తర్వాత వచన రచయితలుగా సుప్రసిద్ధు లైన హాలీ, షిబ్లీ, సర్ సయ్యద్ అహమదలకు గాలిబ్ శైలి ఒరవడి యైనది. ఉర్దూ వాఙ్మయములో అన్నిటికన్న రసవంతమైన కవిత గజల్. ఈ గజల్ రచనలో సర్వోత్తముడు గాలిబ్ మహాకవి. ఆయన ఉర్దూ గజల్‌కు ఒక విశిష్టత గలిగించినాడు. ఉర్దూ కవితా సామ్రాజ్యానికి గాలిబ్ నిర్మకుట చక్రవర్తి. ఆ రంగములో ఆయనతో సమానులు మరొకరు లేరు. ఆధునిక ఉర్దూ కవులలో అగ్రగణ్యుడైన ఎక్బాల్ మీద గాలిబ్ ప్రభావము స్పష్టముగా కనిపించును.

గాలిబ్ మహాకవిని తలచుకొన్నప్పుడు ఆంధ్ర కవి సార్వభౌముడు శ్రీనాథుడు మనకు వెంటనే జ్ఞప్తికి వచ్చును. భాషా ప్రౌఢిమలో, భావ గాంభీర్యములో శ్రీనాథుని కవిత్వము గాలిబ్ కవిత్వమును జ్ఞప్తికి తెచ్చును. ప్రతిభా వ్యుత్పత్తులు ఈ ఉభయుల రచనలలో గోచరించును శక్తివంతమైన వారి వ్యక్తిత్వమును ప్రతిబింబింప జేయును శ్రీనాథుని వలె గాలిబ్‌గూడ విలాసప్రియుడు. జీవితములోని మంచిని పూర్తిగా అనుభవించవలెనను అభిప్రాయము గలవాడు. ఎవ్వరికిని యెన్నడును జంకని స్వతంత్రుడు. శ్రీనాథుని వలె గాలిబ్ గూడ ఆనాటి జమీందారులను ఆశ్రయించి సుఖ జీవనమును గడపుటకు ప్రయత్నించి నాడు. కాని శ్రీనాథునివలె పాపము గాలిబ్ కృతార్థుడు కాలేకపోయినాడు. శ్రీనాథుడు చరమదశలో సకల కష్టాలు అనుభవించగా, గాలిబ్ జీవితమంతయు ఇక్కట్టులతో, ఇబ్బందులతో గడపినాడు.

గాలిబ్ వ్యక్తిత్వము మిక్కిలి ప్రత్యేకమైనది. ఆయన జీవితమునందును, భావములయందును, శైలియందును ఈ ప్రత్యేకత గోచరించును. గాలిబ్ శైలిని తరువాతవారు అనుకరించి అపజయము పొందిన తార్కాణములు ఈ సత్యమును ఋజువుచేయు చున్నవి.

జీవిత కాలములోనే ఆయన రచనలు రెండుమూరులు ప్రచురితమైనవి. ఆయన చనిపోయిన తరువాత అనేక పర్యాయములు ఆయన రచనలు, విశేషించి దీవాన్ ఎ-గాలిబ్ అను ఉర్దూ కవితా సంపుటము కొన్ని నూర్ల పర్యాయములు ముద్రితమైనది. ఒక్కొక్క ప్రతి నూట ఏబది రూపాయల వరకు అమ్ముడు పోయిన ఉదాహరణలున్నవి. 1928 లో ప్రచురితమైన సంపుటములో చొఘ్తాయి

వంటి ఉత్తమ చిత్రకారుడు, ఆయన రచనలకు వ్యాఖ్యానములైన మంచి చిత్రాలను చేర్చినాడు. సైగల్ వంటి గాయకుడు ఆయన గీతాలను గానము చేసి రసికులను ఆనందింప జేసినాడు. హాలీవంటి గొప్ప సాహిత్యవేత్త గాలిబ్ కవి జీవితచరిత్రను వ్రాసినాడు. ఈ విధముగా ఒక చిత్రకారుడు, ఒక గాయకుడు, ఒక సారస్వతవిమర్శకుడు గాలిబ్ మహాకవిని అజరామరమైన మూర్తిని గావించి, ఉర్దూ సారస్వతములో ఆయన అద్వితీయమైన స్థానమును స్థిరీకరింప జేసినారు.

భారతదేశ చరిత్రలో నాటినుండి నేటివరకు ఎన్నియో రాజవంశములు పరిపాలించినవి. ఈ రాజవంశాలను గురించి చెప్పవలసిన మంచి చెడ్డలు చాల గలవు. బాబర్ నుండి బహదూర్‌షా వరకు పరిపాలించిన మొగలాయి రాజుల పరిపాలన సుదీర్ఘమైనది - ప్రత్యేకమైనది ఈ పరిపాలనను గురించి యెవరు ఏమి చెప్పినప్పటికిని ఒక సత్యము మాత్రము అంగీకరించక తప్పదు. ఈ పరిపాలనలో నిర్మితమైన ఉత్తమ కళాఖండము తాజ్‌మహల్. ఈ పరిపాలన తుది రోజులలో అవతరించిన గాలిబ్ మహాకవి ఉర్దూ సాహిత్య ప్రపంచానికి సూర్యునివంటివాడు. స్వతంత్ర భారత అవతరణకు కారణభూతుడై, స్వరాజ్య సాధనకు అనేక త్యాగాలు గావించిన మహాపండితుడు, మహామేధావి, ఉత్తమ రచయిత, ఉదాత్త సంస్కృతీపరుడునైన మౌలానా ఆజాద్ తన మీద గాలిబ్ ప్రభావము ఉన్నదని స్వయముగా చెప్పినాడు. ఆయనను ప్రభావితుని జేసిన గాలిబ్ కవిత్వము, వ్యక్తిత్వము ఎంతటి ప్రతిభావంతమైనవో సులభముగా ఊహించుకొనవచ్చును.

(రేడియో ప్రసంగం-16-7-69)

# గాంధీజి సారస్వతమూర్తి

కృష్ణవేణి జలాలచే సస్యశ్యామలమైన దివిసీమలో అవనిగడ్డ ఆంధ్ర సంస్కృతికి ఆటపట్టు. దివిసీమ సాహిత్యానికి, లలితకళలకు, సంస్కృతికి ముఖ్యకేంద్రమై చరిత్రలో ప్రసిద్ధికెక్కినది. ఈనాడు కూడా పూర్వచరిత్ర కనుగుణంగా పురోగమిస్తున్నది దివిసీమ; విశేషించి అవనిగడ్డ ప్రాంతము. అవనిగడ్డలో దేశాభ్యుదయానికి కావలసిన నిర్మాణాత్మక కార్యక్రమాలను నిర్వ హించే సంస్థలు స్థాపితమై ప్రశంసనీయంగా పనిచేస్తున్నవి. ఎక్కడైనా ఏ సంస్థ అయినా మంచిపని చేస్తున్నదంటే దానివెనుక దేశాభ్యుదయంకొరకు నిరంతరం ఆలోచించే ఒక ముఖ్యవ్యక్తి ఉన్నాడన్నమాట. అవనిగడ్డలో ఇన్ని సంస్థలు సుమారు ఒక దశాబ్దము నుండి ఎనలేని కృషిచేస్తూ ముందడుగు వేస్తున్నవంటే అందుకు కారణభూతులు, కార్యశూరులు, కర్మవీరులైన శ్రీ మండలి వెంకట కృష్ణారావుగారు. గట్టి పట్టుదల, ఎన్ని కష్టాలకయినా ఓర్చి పనిని సాధించగల నేర్పు, ఓర్పు మండలి వెంకట కృష్ణారావుగారి ప్రత్యేకతలు - అందుచేత ఈ సంస్థలు దినదినాభివృద్ధిచెంది, ఆదర్శసంస్థలుగా రూపొందగలవని నిస్సందేహ ముగా ఆశించవచ్చును.

ఈ సంస్థలు ప్రవర్థమానమౌతున్న ప్రదేశానికి నామకరణం సమంజ సంగా జరిగింది. 1929 సంవత్సరములో మహాత్మాగాంధీగారు యీ ప్రాంతానికి వచ్చినప్పుడు అవనిగడ్డకు గూడా విచ్చేసినట్లు తెలుస్తున్నది. చరిత్రాత్మకమైన ఆ సంఘటనకు సంస్మరణీయంగా కాబోలు దానికి గాంధీక్షేత్రమని నామకరణం చేసినారు. గాంధీగారు దేశసౌభాగ్యానికై నిర్దేశించిన నిర్మాణాత్మక ప్రణాళికకు ఇక్కడ పనిచేస్తున్న సంస్థలు అనుగుణంగా ఉన్నవి. ఇటువంటి క్షేత్రాలు అన్ని జిల్లాలలో అవతరించి పనిచేస్తే దేశసౌభాగ్యాన్ని సత్వరంగా సాధించవచ్చును.

నేడు మనం గాంధీ జయంతి ఉత్సవాలు జరుపుకుంటున్నాము. గాంధీ గారు వెళ్ళిపోయి ఇప్పటికి 30 సంవత్సరాలు కావస్తున్నవి. అనగా 40 సంవత్స రాల వయస్సులోపుగా ఉన్న దేశీయులు గాంధీగారిని చూచి ఉండకపోవచ్చును.

వారిలో చాలా మందికి ఆయన వ్యక్తిత్వం సరిగా అవగాహన కాకపోవచ్చును. గాంధీగారు మనదేశానికి స్వాతంత్ర్యం సాధించిన జాతిపిత అని మాత్రము అందరికి తెలుసును. కాని ఆయన వ్యక్తిత్వం అంతమాత్రానికే పరిమితంకాదు. గాంధీగారిది మహోన్నతమైన, బహుముఖమైన వ్యక్తిత్వం. భారతజాతి సర్వతో ముఖాభ్యుదయానికిని, సమస్త మానవజాతి కల్యాణానికి కృషి చేసిన ఉత్తమ పురుషుడు మహాత్మాగాంధీ. లక్ష్యసిద్ధి ఎంత ప్రధానమైనదో సాధనశుద్ధి కూడా అంతే ప్రధానమైనదని ఆయన వక్కాణించినాడు జీవితములో నైతిక విలువలను తాను పాటించి ఇతరులందరిని పాటించవలెనని ప్రబోధించిన ఉదారచరిత్రుడు ఆయన. సత్యానికి, అహింసకు ప్రతినిధిగా నిలిచిన మహనీయమూర్తి ఆయన. పీడిత ప్రజల సముద్ధరణకు ఆయన ప్రత్యేక ప్రాధాన్యం ఇచ్చినారు. ప్రతి నేత్రయుగం నుండి జారే ప్రతి బాష్పకణాన్ని తుడువడమే తన జీవిత ధ్యేయ మని ఆయన ఉద్ఘాటించినాడు. భారతదేశానికి స్వాతంత్ర్యం సాధించి, భారత ప్రజల సముద్ధరణకు మార్గదర్శకుడైన ఆ ఉత్తమపురుషుడు; సమస్త మానవ జాతి సర్వతోముఖవికాసాన్ని కోరి కృషి చేసిన విమలచరిత్రుడు; ప్రపంచము నంతా తన కుటుంబముగా భావించిన మహానుభావుడు.

గాంధీ మహాత్ముని సంస్మరించే యీ వారంలో సారస్వత వేదిక మీద కవి సమ్మేళనాన్ని ఏర్పాటు చేయడంలో సందర్భశుద్ధి గోచరిస్తున్నది. గాంధీ మహాత్ముని బహుముఖ వ్యక్తిత్వంలో రచనావ్యాసంగం ముఖ్యమైనది. అందు చేతనే యీ సందర్భములో మనము ఆయన సారస్వతమూర్తిని సందర్శించడం సముచితం కాగలదు. గాంధీజీ తల్లిదండ్రులు పవిత్రమూర్తులు. తల్లిగారు కఠోర వ్రతాలను, నియమాలను పాటించిన సాధ్వీమణి. తండ్రిగారు అనేక శాస్త్రచర్చ లలో నిరంతరము పాల్గొన్న మనీషి వారి ఇంటికి చిన్నప్పుడు జైన, వైష్ణవ విద్వాంసులు చాలామంది వచ్చేవారు ఈ విధంగా చిన్ననాడే ఆయనపైన జైన, వైష్ణవమతాల ప్రభావం పడింది. సత్యహరిశ్చంద్ర నాటకం ఆయన హృద యంపై చెరగని ముద్ర వేసినది. శ్రవణుని పితృభక్తి బాలకుడగు ఆయనను ఆకర్షించినది. తరువాత విద్యార్థిగా గౌతమబుద్ధుని చరిత్రను చదివి, సత్యము అహింసలు ప్రాతిపదికలైన ప్రగాఢ విశ్వాసాలను ఆయన ఏర్పరచుకొన్నాడు. అంతేకాదు, క్రైస్తవమత గ్రంథమయిన బైబిల్‌ను ఇంగ్లండులో విద్యార్థిగా ఉన్నప్పుడు శ్రద్ధగా పఠించినాడు. మొదటినుండి భగవద్గీత ఆయనకు అభిమాన

గ్రంథము. ఫలాపేక్షలేని కర్మ అనే గీతాబోధన జీవితాంతం ఆయన పాటించి నాడు. తులసిదాసు 'రామచరిత మానస్' ఆయన పదేపదే పఠించినాడు. రామ నామాన్ని తారకమంత్రంగా భావించుకున్నాడు. టాల్‌స్టాయ్ రచనలు ఆయన్ను ప్రభావితుణ్ణి చేసినవి. ఆయన వ్రాసిన 'స్వర్గం నీలోనే ఉన్నది' అన్న పుస్తకం చదివి, తాను చెప్పినది తాను ఆచరించే వ్యక్తి, సత్యాన్ని అనుసరించడంలో ఎటువంటి త్యాగానికి కూడా వెనుదీయని వ్యక్తి టాల్‌స్టాయ్ అని గుర్తించినాడు. విద్యార్థి అయిన గాంధీ తరువాత రస్కిన్ వ్రాసిన "Unto the last" అను గ్రంథాన్ని చదివి, 'సర్వోదయం' అనే పేరుతో దానిని గుజరాతిలోనికి అనువదించినాడు. ఈ విధంగా అన్ని మతాల సారాన్ని గ్రహించి, ఉత్తమ సాహిత్యాన్ని పఠించి, సర్వోదయ సిద్ధాంతాన్ని రూపొందించి. తన జీవితాన్ని ఆ విధంగా మలచుకొని ఆయన విశ్వమానవుడుగా రూపొందినాడు ఆయన పాటించిన నియమాలకు, నిర్ణయించిన కార్యక్రమాలకు, బోధించిన ఆశయాలకు వెనుకనున్న సంక్షిప్త కథ ఇది.

ఆయన సారస్వతమూర్తిని తీర్చిదిద్దిన సంఘటనల కథ కూడ ఇదే.

మహాత్మాగాంధీగారి వ్యాసంగాలలో రచన ముఖ్యమైనది. ఆయనకు మాతృభాష మీద మక్కువ ఎక్కువ. బనారస్ హిందూ విశ్వవిద్యాలయం ప్రారంభోత్సవ సందర్భంలో మాట్లాడుతూ "నా మాతృభాషకాని విదేశభాషలో మాట్లాడడం నాకు సిగ్గుగా ఉన్నది" అని ఆయన చెప్పినాడు. తరువాత సర్వదా ఆయన మాతృభాష ప్రాధాన్యాన్ని వక్కాణిస్తుండేవాడు. గాంధీగారు గుజరాతీ భాషలో అనేక రచనలు చేసినారు. ఆ రచనలు సమగ్ర జాతీయ జీవనానికి, అంతర్జాతీయ జీవనానికి మార్గదర్శకాలు. గాంధీగారి రచనలు అనేక మార్గాలలో సాగినవి. 'యంగ్ ఇండియా', 'హరిజన్', 'నవజీవన్' మొదలగు పత్రికలకు సంపాదకుడుగా మానవ ప్రపంచానికి సంబంధించిన సమస్త విషయాలమీద తన అభిప్రాయాలను వెల్లడి చేసినాడు ఆయన తన ఆత్మకథను ఒక గ్రంథంగా వ్రాసినాడు. సామాజిక, రాజకీయ, ఆర్థిక, తాత్త్విక విషయాలమీద ఆయన అనేక వ్యాసాలు వ్రాసినాడు. ఆయన రచనలు అనేక సంపుటాలుగా వెలువడినవి. ప్రపంచ మేధావులు అనేకులతో ఆయన జరిపిన ఉత్తర ప్రత్యుత్తరాలు చాలా వరకు ప్రకటితమయినవి. ఈ విధంగా గాంధీమహాత్ముడు సమస్త విషయాలమీద

వ్రాసిన పుటలు వేనవేలు కలవు. ఈ రచనలన్నియు ఆయనకు ప్రపంచ మహా రచయితలలో ఉన్నతస్థానాన్ని కల్పిస్తున్నవి.

తాను రచయిత కావాలననే ఉద్దేశంతో గాంధీగారు వ్రాయలేదు. లోకానికి ఆయన అభిప్రాయాలను విప్పిచెప్పవలెనని ఆయన వ్రాసినాడు. సారస్వత విషయాలకు మాత్రమే ఆయన రచనలు పరిమితం కాలేదు. మానవజాతికి సంబంధించిన అన్ని సమస్యలను గూర్చి ఆయన వ్రాసినాడు. ఆయన వ్రాతలన్నీ గొప్ప రచనలు. ఆయన శైలి నిరాడంబరమై, శక్తివంతమైనది. గంభీరమైనది. ఎంతటి గొప్ప అభిప్రాయాన్నయినా కొద్దిమాటలలో హృదయానికి హత్తుకొని పోయేటట్టు ఆయన చెప్పగలిగేవాడు.

ఆయన ఉపయోగించే ఉపమానాలు కూడా విశిష్టమైనవిగా ఉండేవి. గోవు ఆయనకు పవిత్రమైనది. గోవును గూర్చి వ్రాస్తూ ఆయన "It is a poem of pity" అన్నారు. ఒక విదేశీయ వనిత భారతదేశాన్ని అపనిందల పాలు చేయడానికి ఉద్దేశించి ఒక గ్రంథం వ్రాయగా దానిపై ఆయన "It is the drain inspectiors' report" అని ఒక మాటలో వ్యాఖ్యానించాడు. ఆయన ప్రజాహిత జీవనంలో ప్రవేశించిన తొలి రోజులలో బొంబాయిలో ముగ్గురు మహావ్యక్తులుండేవారు. ఒకరు ఫిరోజ్ షా మెహత, రెండవ వారు లోకమాన్య బాలగంగాధర్ తిలక్, మూడవ వారు గోపాలకృష్ణ గోఖలే. ఈ ముగ్గురిని ఆయన అభిమానించినప్పటికిని గోఖలే గారిని తన గురువుగా భావించుకున్నాడు. వీరి విశిష్ట వ్యక్తిత్వాలను వివరిస్తూ "ఫిరోజ్ షా మెహత హిమాలయ పర్వతాల వంటివాడు. ఆ యెత్తును చేరుకోవడం సాధ్యం కాదు. లోకమాన్యుడు సముద్రం వంటి వాడు. ఆ లోతును చేరడం కూడా సాధ్యం కాదు. గోఖలే చల్లగా ప్రవహించే నది వంటి వాడు. నది ఒడ్డున ఆడుకోవచ్చును గదా" అని రమ్యంగా చెప్పినాడు.

మహాకవి రవీంద్రునికి మహాత్మునిపట్ల విశేష గౌరవాభిమానాలుండేవి రవీంద్రుడు ఆయనను "ఇతడు ఉపనిషత్తులలోని పూర్ణపురుషుడు" (He is the Poorna Purusha of the Upanishaths) అని సంభావింపగా గాంధీజి రవీంద్రుని గురుదేవుడని పేర్కొనేవాడు కవయిత్రి సరోజినీదేవికి

మహాత్ముని పైన అపరిమితమైన భక్తి. జవహర్‌లాల్ నెహ్రూ మహాత్ముని అడుగుజాడలలో పెంపొందినాడు రవీంద్రునికి, మహాత్మునికి ఒకేసారి తీవ్ర అభిప్రాయభేదాలు పొడసూపినవి. విదేశవస్తు బహిష్కారము చేయవలెనని గాంధీ మహాత్ముడు కోరగా రవీంద్రుడు దానిని వ్యతిరేకించినాడు. కవియైన రవీంద్రుడు తన వ్యతిరేకతను లేఖారూపంలో తెలిపినాడు. ఆ లేఖ ఒక సాహిత్య శకలము. మహాత్ముడు దానికి సమాధానంగా మరొక లేఖ వ్రాసి రవీంద్రుని నిరుత్తరునిగా చేసినాడు. మహాత్ముని లేఖ భావ గంభీర్యంలోనూ, భాషాపటిమ లోనూ రవీంద్రుని లేఖకన్న ఉత్కృష్టమై ప్రపంచ లేఖా సాహిత్యములో మహోజ్జ్వలంగా ప్రకాశిస్తున్నది. సాహిత్యానికి నోబుల్ బహుమతి పొంది, మహాత్ముని జీవితచరిత్రను వ్రాసిన ఫ్రెంచి రచయిత రోమారోలో ఈ ఘట్టాన్ని రసవంతంగా చిత్రించి మహాత్ముని మహారచయితగా ప్రశంసించినాడు.

ఉత్తమ శ్రేణికి చెందిన మహాత్ముని జీవితములో రసవంతమైన మహా వాక్యాలకెన్నింటికో కావలసిన ఇతివృత్తాలు ఎన్నో ఉన్నవి. భారతదేశానికి స్వరాజ్య మీయవలెనని నిర్ణయించిన తరువాత దేశంలోని కొన్ని ప్రాంతాలలో సంఘర్షణలు, దోపిడీలు చెలరేగి రక్తము ప్రవహించినవి. బెంగాలులో ఈ హింసాకాండ మరింత చెలరేగినది. అప్పుడు బెంగాలులోని నౌఖాలీ ప్రాంతములో రక్తప్రవాహముల మధ్య మహాత్ముడు పాదచారియై ఒకరిద్దరు అనుచరులలో పర్యటన చేసి శాంతిని స్థాపించినాడు. పంజాబులో 50 వేల సైనికులు చేయలేని పని నౌఖాలీలో మహాత్ముడు సాధించినాడు. ''నా 50 వేల సైన్యానికన్నా మహాత్ముడు ఎక్కువ శక్తివంతుడు" అని అప్పటి గవర్నరు జనరల్ లార్డ్ మౌంట్ బేటన్ ఉద్ఘాటించినాడు. కవీంద్రుడు రవీంద్రుడు, కవయిత్రి సరోజినీదేవి ఈ శాంతి యాత్రలో మహాత్ముని ప్రోత్సహించి భక్త్యంజలి సమర్పించినారు. ప్రసిద్ధ విజ్ఞానవేత్త ఐన్‌స్టైన్ ''ఇటువంటి మహనీయులొకరు ప్రపంచము మీద అడుగుపెట్టి మానవాళికి వెలుగుబాట చూపించినాడని భావితరాలవారు విశ్వ సించడం కష్టసాధ్యము కాగలదు'' పని వక్కాణించినాడు ఈ విధంగా ఆ మన జీవితములో కరుణాలవాలమైన ఘట్టాలు, మన కవుల రచనలకు ఇతివృత్తము కాగలిగిన ఘట్టాలు ఎన్నో ఉన్నవి. మన కవులెంతమంది వీనిని స్వీకరించినారు?

గాంధీజీ జీవితాన్ని, ఆయన కృషిని గూర్చి దేశభాషలలో వాఙ్మయము పుష్కలంగా వచ్చినది. తెలుగులో కూడా ఆయనను గూర్చి అనేక గ్రంథాలు ప్రకటితమైనవి. బసవరాజు అప్పారావుగారు ఆయనను వర్ణిస్తూ ''వెన్నపూసా మనసు, కన్నతల్లిప్రేమ, పండంటి మోముపై బ్రహ్మతేజస్సు'' అని చెప్పిన మాటలు అందరికి తెలిసినవే. వేలూరి శివరామశాస్త్రిగారు ఆయన ఆత్మకథను చక్కని వచనములో తెనిగించినారు. తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు ఆయన ఆత్మకథను మహాకావ్యంగా వ్రాసినారు. ఇంకనూ రచయితలు, కవులు ఆయనను కీర్తించినారు. స్థాలీపులాక న్యాయముగా మహాత్ముని సారస్వతమూర్తి చిత్రణ ఇది.

(8-10-77 నాడు గాంధీజయంతి సందర్భంలో అవనిగడ్డలో జరిగిన కవిసమ్మేళన అధ్యక్షోపన్యాసము.)

# నవయుగ వైతాళికుడు వీరేశలింగం

చరిత్రలో మహా పురుషులు అనేకులు మనకు కన్పిస్తారు. కాని వీరిలో జాతి నిర్మాతలు కొద్ది మంది మాత్రమే ఇటువంటి జాతి నిర్మాతలలో వీరేశలింగం పంతులు నిస్సందేహంగా ప్రథమగణ్యుడని చెప్పవచ్చును. ఆయన నవయుగ వైతాళికుడు: ఆంధ్ర సాహితీ పునరుద్ధరణ ప్రభావుడు; సమాజాన్ని మేలుకొలిపి సరియైన దారి చూపించి ముందుకు నడిపించిన మార్గదర్శకుడు.

కందుకూరి వీరేశలింగం పంతులు రాజమహేంద్రవరంలో క్రీ శ. 1848 ఏప్రిల్ 16వ తేదినాడు జన్మించి, డెబ్బదిరెండు సంవత్సరాలు జీవించి, 1919 మే నెల 28 వ తేదీనాడు పరలోకగతుడైనాడు. ఒక జిల్లా కేంద్రంలో బీద బ్రాహ్మణ కుటుంబంలో జన్మించిన వీరేశలింగం ఉపాధ్యాయ వృత్తి అవలంబించినాడు. ఆయన ఆరోగ్యం అంత మంచిదికాదు. కష్టాలతో, కటకటలతో, ఎన్నో ఇబ్బందులతో; సంఘర్షణలతో ఆయన జీవితాన్ని గడిపినాడు. చిత్తశుద్ధితో తాను నమ్మిన ఆశయాల ఆచరణ కొరకు ధైర్యంతో ముందడుగు వేసి చాలా మట్టుకు తన కర్తవ్య పాలనలో కృతకృత్యుడై దేశాన్ని మేలుకొలిపి సాహిత్యంలో వెలుగు బాటలు చూపించినాడు. నిజానికి ఆయన ఉదారచరిత్రుడు; సమస్త ప్రపంచాన్ని తన కుటుంబంగా భావించుకున్న ధన్యజీవి. ఒకమారు ఆంధ్ర దేశచరిత్రను ఆవలోకించితే గడచిన కొన్ని శతాబ్దాలలో జన్మించిన మహనీయులందరిలో వీరేశలింగం పంతులు గొప్పవాడని నిస్సందేహంగా చెప్పవచ్చును.

వీరేశలింగంగారు జన్మించిన కాలాన్ని మనం గమనించవలసి ఉంటుంది. ఇంగ్లీషు ఏలుబడి క్రమక్రమంగా స్థిరపడుతున్న రోజులవి; ఆధునికయుగంలో మన దేశం అడుగుపెట్టబోతున్న రోజులవి; నూతన భావాలతో విద్యాధిక సమాజం ఒకటి రూపొందుతున్న రోజులవి; విశ్వవిద్యాలయాల స్థాపనకు కావలసిన వాతావరణం ఏర్పడుతున్న రోజులవి; జాతీయ భావాలు ప్రబలి సంఘం, సాహిత్యం పరివర్తన చెందవలెనన్న అభిప్రాయాలు విద్యాధికులలో

ప్రబలుతున్న రోజులవి; ఆసేతుహిమాచలపర్యంతమైన భారతదేశం నూతన భావాలతో ప్రభావితమై నవ శకంలో అడుగు పెడుతున్న రోజులవి; సంఘ సంస్కరణ ఆవశ్యకతను గుర్తించిన రోజులవి; వంగ రాష్ట్రంలో రాజా రామ మోహనరాయ్, ఈశ్వరచంద్ర విద్యాసాగర్, మహారాష్ట్రలో మహదేవగోవింద రానడే వంటి మహానుభావులు వివిధ ప్రాంతాలలో జన్మించి సంఘంలో, సాహిత్యంలో కాలానుగుణమైన మార్పులను తీసుక రావడానికి కృషి చేసిన రోజులవి; బాల్య వివాహాలు, సతీసహగమనం మొదలైన దురాచారాలను అరికట్టి వితంతు వివాహాలను ప్రోత్సహించి, సంఘంలో స్త్రీలకు సమాన స్థాయిని కల్పించి జాతిని మేలుకొల్పడానికి ఆనాటి దేశ నాయకులు పురోగమించినారు. ఈశ్వరచంద్ర విద్యాసాగర్ వంగ సమాజానికి, వంగ సాహిత్యానికి మార్గ దర్శకుడైనాడు. తెలుగు దేశంలో విద్యాసాగరునివలనే సంఘ సంస్కరణకు, సాహిత్యంలో మార్గదర్శకత్వానికి వీరేశలింగం నడుము కట్టినాడు. స్త్రీలు సమాజంలో ఎదుర్కొంటున్న ఇబ్బందులను గమనించి బాల వితంతువుల వివాహాలు చేయించడానికి కృతనిశ్చయుడై, ఎందరు వ్యతిరేకించినా జంకక అనేక సంస్కరణ వివాహాలు జరిపించినాడు వీరేశలింగం. కన్యాశుల్కము, బాల్య వివాహాలు, వ్యభిచారం, లంచగొండితనం ఇంకా అనేక దురాచారాలకు వ్యతిరే కంగా పోరాడి, దీనస్థితిలో ఉన్న విగత భర్తృకలకు వివాహాలు చేయించినాడు వీరేశలింగం. సంఘ సంస్కర్తగా ఆయన కీర్తి దేశం నలుమూలల వ్యాపించి దక్షిణ దేశ విద్యాసాగరుడుగా ఆయన పేరు గాంచినాడు. పొరుగుననే ఉన్న తమిళ ప్రాంతంలో సమకాలికుడైన ఒక గొప్ప రచయిత చంద్రిక అనే ఒక నవలను వ్రాసి, అందులో ఒక వితంతు వివాహ సందర్భమున వీరేశలింగంగారి కృషి సంస్మరించి ప్రశంసించినారు! నిజంగా చంద్రిక నవలకు నాయకుడు వీరేశలింగం.

ఆనాటి సమాజంలో ప్రబలియుండిన అనేక దురాచారాలను వీరేశలింగం వ్యతిరేకించినాడు లంచగొండులైన అధికారుల చర్యలను ఆయన ధైర్యంతో ఎదు ర్కొన్నాడు. ఆనాటి మెజిస్ట్రేట్ ఒకరు ఒకానొక కేసులో మొదట ఒక తీర్పు వ్రాసి, లంచం పుచ్చుకొన్న తరువాత మరొక తీర్పు వ్రాయగా దానిని ఆయన తన పత్రికలో బయట పెట్టినాడు. ఆ మెజిస్ట్రేట్ వీరేశలింగంపైన మాన నష్టపు దావా వేయగా వీరేశలింగం తెలివితో చాకచక్యంతో, నింపివేసిన మొదటి తీర్పు

కాగితాలను చెత్తకుండీలో పారవేసినందుకు తప్పించుకొని, ఆ కాగితాలను క్రమంగా జతపరిచి ఆ మెజిస్ట్రేట్ సొంత దస్తూరిలో ఉన్న మొదటి తీర్పును కూర్పులు చేసి దాఖలుచేయగా మానష్టపు దావాలో మెజిస్ట్రేట్ ఓడిపోయి తన పదవినికూడా కోల్పోయినాడు. వీరేశలింగం జీవితంలో ఇటువంటి సంఘటనలను ఇంకను చూపించవచ్చును.

సంఘంలో ప్రబలి వున్న దురాచారాలకు వ్యతిరేకంగా పోరాడి వీరేశలింగం తెలుగు సాహిత్యంలో క్రొత్త బాటలను వేయించినాడు. ఆయన పద్య కావ్యాలు వ్రాసినాడు; నాటకాలు, ప్రహసనాలు రచించినాడు; నవలలు, వ్యంగ్య రచనలు, హాస్యరచనలు రూపొందించినాడు కథావాఙ్మయాన్ని సృజించి పత్రికలను నిర్వహించి, వ్యాస రచనకు దారిచూపించినాడు. కవులచరిత్ర సమకూర్చినాడు; స్వీయచరిత్ర వ్రాసినాడు; దేశచరిత్ర, జీవిత చరిత్ర, సాహిత్య విమర్శ శాస్త్రీయ గ్రంథాలు, విద్యార్థులకు వాచకాలు అన్నింటినీ ఆయన తెలుగు భాషలో రచించి మార్గదర్శకుడైనాడు. ఇంతటి వైవిధ్యంలో శతాధిక గ్రంథాలు వ్రాసిన వీరేశలింగం ఆధునికాంధ్ర సాహిత్యానికి మార్గదర్శకుడైనాడు. బంధ కవిత్వం, చిత్ర కవిత్వం మొదలైన సాహితీ సర్కస్‌లతో కాలక్షేపం చేస్తున్న ఆనాటి కవుల గూర్చి వీరేశలింగం వ్రాసిన సరస్వతీ నారద సంవాదం అనే ఖండ కావ్యంలోని యీ పద్యం వినండి:

"దయమాలి తుదముట్ట తలకట్లు నిగడించి
ధీరుడై నన్ను బాధించు నొకడు
పాదంబులోపల పాదంబులిమిడించి
వీరుడై నన్ను నొప్పించు నొకడు
ప్రాసంబుపై పెక్కు ప్రాసంబులడరించి
పోటు బంటయి నన్ను పొడుచు నొకడు
బెండు పల్కులు గూర్చి నిండైన నగలంచు
దిట్టయై చెవులు వేధించు నొకడు
ఖడ్గ చక్రాది రూపముల్ గానిపించి
వర్ణముల్ మార్చి నన్ను చిక్కుపరచు నొకడు

కుమతు లొడలెల్ల విరిచి ప్రాణములు తీయ
ఒడలి పసలేక శుష్కించి యున్నదాన".

ఈ పద్యం వీరేశలింగం గారి అభిప్రాయాలకు ప్రతిబింబం. ఆంధ్రదేశ చరిత్రలో వీరేశలింగం అద్వితీయుడు ఆంధ్ర సాహిత్య చరిత్రలో ఆయనవంటి వాడు మరొకరు లేడు.

శకునాలను, మూఢ విశ్వాసాలను వ్యతిరేకించి, సంఘంలోని దురాచారాలను తొలగించడానికి పోరాడి, సాహిత్యంలో నూతన ప్రక్రియల నిర్మాణాలను కావించి, తాను త్రికరణ శుద్ధితో నమ్మిన ఆశయ సాధనలకు జీవితాన్ని అంకితం చేసి, సొంత లాభాన్ని అంతా మానుకొని సంఘ శ్రేయస్సుకొరకు పాటుపడిన కర్మవీరుడు వీరేశలింగం అనారోగ్యంతో, కష్టాలతో జీవిత పోరాటాన్ని నిర్వహించిన మహాయోధుడు వీరేశలింగం. ఒక పర్యాయం కట్టమంచి రామలింగా రెడ్డిగారు వీరేశలింగం గారిని సంస్మరిస్తూ చేసిన ప్రసంగంలో వీరేశలింగంగారి సమాధి మీద ఏమైన స్మృతి చిహ్నం నెలకొల్పవలసి వస్తే అది పదునైన కత్తి, వాడియైన కరవాలమే కాగలదు అని ఉద్ఘాటించినారు. ఈ ఉద్ఘాటన నూటికి నూరుపాళ్ళు సత్యమైన ఉద్ఘాటన: అది యేమాత్రం అతిశయోక్తి కాని ఉద్ఘాటన; వీరేశలింగం వ్యక్తిత్వాన్ని చక్కగా వెల్లడిచేసిన ఉద్ఘాటన.

వాఙ్మయంలోని వివిధ ప్రక్రియలకు సంబంధించిన మొట్టమొదటి రచనలు నూటికి పైగా గావించి, సమాజంలో ప్రబలియున్న దురాచారాలకు వ్యతిరేకంగా పోరాడి, అనేక సంస్కరణ వివాహాలు జరిపించిన వీరేశలింగం పంతులు ఇతర రంగాలలో కూడ చేసిన కృషి మిక్కిలి ప్రశంసనీయమైనది. రాజమహేంద్రవరంలో ఆయన అనేక సంస్థలు నిర్మించిరి. పురమందిరాన్ని కట్టించిరి. ప్రార్థనా మందిరాన్ని నెలకొల్పిరి, మదరాసులో ఆయన ఉద్యోగం చేసిన రోజుల్లో ఒక వితంతు శరణాలయం స్థాపించిరి. వివేక వర్ధిని, సతీ హితబోధిని మొదలైన పత్రికలను స్థాపించి నిర్వహించిరి విక్టోరియా పాఠశాలను రాజమండ్రిలో స్థాపించిరి. బ్రహ్మ సమాజం అవలంబించిన వీరేశలింగంపంతులు బెంగుళూరులో ఒక ప్రార్థన మందిరం కట్టించిరి. హితకారిణి సమాజం మొదలైన సంస్థలను స్థాపించిరి. పంతులుగారు తమ కార్యకలాపాలను ప్రారంభించి, విస్త

రించిన కాలంలో, అనగా క్రీ.శ 1870 - 90 మధ్య కాలంలో భారత జాతీయ కాంగ్రెస్ ఇంకా బలపడలేదు. మహాత్మాగాంధీగారి నాయకత్వ దశ యింకా ప్రారంభమే కాలేదు. మొదటి రోజులలో వీరేశలింగంగారు కాంగ్రెస్ సభలలో పాల్గొన్నారు పంతులుగారిపైన ఈశ్వర చంద్ర విద్యాసాగర్, మహదేవ గోవింద రానడే వంటి సంఘ సంస్కర్తల ప్రభావం గోచరిస్తున్నది.

ఈ ఉభయుల వలనే పంతులుగారుకూడ రాజకీయ రంగంలో మితవాదులుగా ఉండిరి. మొదటి దశలో ఒకటి రెండు భారత జాతీయ కాంగ్రెసు మహాసభలలో ఆయన పాల్గొన్నప్పటికినీ క్రమక్రమంగా భారత జాతీయ కాంగ్రెసు సంస్థ కార్యకలాపాలకు ఆయన దూరమైనారు. అందువలన ఆయన ఎక్కువ కాలాన్ని సాహిత్యానికి సమాజానికి వినియోగించి ఆంధ్ర మహాజనుల జీవితాల పైన చెరగని ముద్ర వేసినారు. అందుచేతనే ఆయన నవయుగ వైతాలికుడైనాడు. ఆంధ్రదేశానికి నాయకత్వము వహించిన మహా పురుషులలో ఆయన అగ్రగణ్యుడని, ఈ కాలపు జాతి నిర్మాతలలో మొట్టమొదటు లెక్కింపదగినవాడని, కట్టమంచి రామలింగారెడ్డిగారు ఒక సభలో చేసిన ప్రసంగంలో నొక్కి నొక్కి చెప్పినారు. రాజరామోహనరాయ్ మొట్టమొదటి ఆధునిక భారతీయుడని రవీంద్రనాథ్‌టాగూర్ ప్రశంసించినారు. రామ్‌మోహనరాయ్‌చేత ప్రభావితుడైన వీరేశలింగం దక్షిణదేశంలో మొదటి ఆధునిక భారతీయుడని చెప్పవచ్చును. ఆయన శత్రువులకు భయంకరుడు; అనేక యుద్ధాలలో ఆరితేరిన వీరాగ్రేసరుడు; జంకు గొంకు లేక చిత్తశుద్ధితో సామాజిక రంగంలోను సాహిత్య రంగంలోను తన అభిప్రాయాలను ఆచరణలో పెట్టిన కర్మవీరుడు. అభ్యుదయ ఉద్యమాలకు మార్గదర్శకుడు; గొప్ప సాహిత్యవ్రతుడు; గొప్ప విద్యావేత్త, గొప్ప సంస్కర్త; అన్నిటికన్న మిన్నగా గొప్ప మానవుడు.

(రేడియో ప్రసంగం-16-4-90)

# మార్గదర్శి లక్ష్మణరావు

చిన్నతనంలో సిరిసంపదలతో తులతూగే గారాబంగాని, అన్ని సదుపాయాలతో చదువుకొనే అవకాశంగాని ఆయనకు లభించలేదు. కారణం తండ్రిగారి అకాలమరణం. అందుచేత విద్యాభ్యాసమంతా యించుమించుగా ఆంధ్రదేశానికి దూరంగా న్న మహారాష్ట్ర ప్రాంతంలోని నాగపూరులో అక్కా-బావల యింట జరిగినది. సహజంగా కర్తవ్య పరాయణుడైన ఆ బాలకుడు ఆనాటి పద్ధతి ప్రకారం ఇంగ్లీషు ద్వారా ఎం. ఏ. పట్టభద్రుడై యింటికి వచ్చినాడు. అప్పుడు స్వర్గీయులైన తన తండ్రిగారి పలుకుబడి వలన సంస్థానంలో దివాన్‌గిరి ఉద్యోగం లభించినది. ఇటువంటి జీవిత ప్రారంభము సారస్వత కృషికి అంత అనుకూలమైనది కాదు. అయినప్పటికిని తన జీవిత సర్వస్వాన్ని ఆంధ్ర భాషాభివృద్ధికి అంకితం చేసినాడంటే కొంత ఆశ్చర్యం కలిగి తీరుతుంది. ఆ మహనీయుడే స్వర్గీయ కొమర్రాజు వేంకట లక్ష్మణరావు.

కేవలం ఇంగ్లీషు చదువుతో తృప్తి పడక హిందీ, బెంగాలీ, కన్నడము, మహారాష్ట్రము మొదలైన భాషలలో ఆయన ప్రావీణ్యము సంపాదించిరి. విశేషించి మహారాష్ట్ర భాషలో ఆయన ప్రావీణ్యము మిక్కిలి గొప్పది. ఆ రోజులలో మరాఠీలో వెలువడే పత్రికలలో అనేక విషయాల మీద మహారాష్ట్ర విద్వాంసులతో వాదోపవాదాలు గావించి, మరాఠీలో మంచి రచయితగా పేరుపొందిన ఆంధ్ర మేధావి ఆయన ఒక్కడేనేమో!

తెలుగు సారస్వత రంగంలో వీరేశలింగం విజృంభించిన కాలమది. ఆయన సమకాలికుడుగా లక్ష్మణరావు ఆంధ్రభాషా రంగంలో అడుగుపెట్టి, వీరేశలింగంగారికి పరమాప్తుడైనాడు. తెలుగులో అప్పటివరకు విజ్ఞాన వాఙ్మయము లేదు; చరిత్ర పరిశోధన తగినంత జరుగలేదు. వచనరచన వికాసము పొందలేదు; వ్యాసానికి సరియైన స్వరూపము ఏర్పడలేదు: ఈ లోటులను గమనించి వానిని తీర్చడానికి కంకణబద్ధుడై లక్ష్మణరావు ముందడుగు వేసినాడు. జీవించినది కొద్దికాలమైనప్పటికి, తన ఆశయాల సాధనలో చాలమట్టుకు ఆయన కృత

కృత్యుడైనాడని, ఈనాడు ముసముంకున్న ఆయన ఎచనలు వేనోళ్ల చాటుతున్నవి.

లక్ష్మణరావు ఇంటిపేరు కొమఱ్ఱాజు. విజయనగర సామ్రాజ్యాన్ని పాలించిన కృష్ణరాయలకు సమకాలికుడైన కొమఱ్ఱాజు అనే మహాశయుని వంశ ఈ కుటుంబానికి ఈ పేరు కలిగినది. లక్ష్మణరావు జన్మించిన వారి స్వగ్రామమైన పెనుగంచిప్రోలు నందిగామ తాలూకాలో ఉన్నది. వీరి పూర్వీకులు సాహిత్యము లోను, శాస్త్రాలలోను మంచి అభినివేశము కలిగినవారు. ఆయన తండ్రిగారు కొమఱ్ఱాజు వెంకటప్పయ్య, తల్లిగారు గంగమాంబ, అక్కగారు సుప్రసిద్ధ విదుషీమణి అచ్చమాంబగారు. అబలా సచ్చరిత్రమాల ఈమె రచించిన గ్రంథమే. సోదరీ సోదరులు సాంస్కృతిక రంగములో పరస్పర ప్రభావితులు. లక్ష్మణరావుకు చిన్నప్పటి నుండియే భాషా సంస్కృతులు అభిమాన విషయాలు. స్వయంగా మేధావి. అందుకు బహుభాషా పరిచయము, బహు గ్రంథావలోక నము తోడైనవి. మహారాష్ట్రభాషలో మోరోపంతు రచించిన భారతప్రతిని పరిశీ లించి, పాఠాలను నిర్ణయించి, లక్ష్మణరావు పత్రికలలో ప్రకటించినారు. ఆ విధంగా ఆయన సారస్వతోపాసన ప్రారంభమైనది. ఈ పరిశోధన మహారాష్ట్ర విద్వాంసుల ఆదరణ పొందినది. తరువాత వారితో వాదోపవాదాలు జరిపి, ఆ రోజులలో భారతదేశానికి నాయకమణి, మహామేధావియైన బాలగంగాధర్ తిలక్ దృష్టిని ఆకర్షించి, రామాయణంలో పేర్కొనిన పర్ణశాల తెలుగుదేశములోని భద్రాచలంలోనిదేనని, నాసిక్ వద్దది కాదని లక్ష్మణరావు ప్రతిపాదించగా బహు జనామోదము పొందినది.

తెలుగుదేశానికి వచ్చి ఉద్యోగ బాధ్యత స్వీకరించిన తరువాత మునగాల రాజా గారితో ఆయనకు గాఢమైత్రి ఏర్పడినది. ఆ మైత్రి ఫలితంగా నిజాం రాష్ట్ర ఆంధ్రులతో సన్నిహిత సంబంధాలు ఏర్పడినవి. లక్ష్మణరావు వేషభాష లలో మహారాష్ట్ర సంస్కృతీ ప్రభావం కొట్టవచ్చినట్లుండేది. అందుచేత ఆనాటి నిజాం రాష్ట్రంలో సమష్టికుటుంబంగా ఉన్న ఆంధ్ర మహారాష్ట్ర కర్ణాటకులకు లక్ష్మణరావు ఆప్తబంధువైనాడు.

నిజాం రాష్ట్రాంధ్రులతో ఏర్పడిన స్నేహ సంబంధాల ఫలితంగా మున గాల రాజాగారి ప్రోత్సాహంతో, మిత్రుడైన రావిచెట్టు రంగారావుగారి సహ

కారంతో 1 సెప్టెంబరు 1901 నాడు శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయం స్థాపనతో లక్ష్మణరావు కార్యరంగంలోనికి దిగినాడు. తరువాత కొన్ని సంవత్స రాలకు హనుమకొండలోని రాజరాజనరేంద్ర భాషానిలయము, వరంగల్లులోని శబ్దానుశాసన ఆంధ్రభాషానిలయము స్థాపితమైనవి. ఈ విధంగా గ్రంథాలయో ద్యమానికి లక్ష్మణరావు నాయకత్వం వహించి, గాడిచర్ల హరిసర్వోత్తమరావు, మాడపాటి హనుమంతరావు మొదలైన వారికి మార్గదర్శకుడైనాడు. తెలుగు దేశములో గ్రంథాలయోద్యమము జాతీయోద్యమమే గదా!

ఉత్తమశ్రేణికి చెందిన పరిశోధకుడూ పండితుడూ రచయితా అయిన లక్ష్మణరావుకు గ్రంథాలయోద్యమ వ్యాప్తితో తృప్తి కలుగలేదు. అందుచేత విజ్ఞానచంద్రికా గ్రంథమండలిని మొట్టమొదట హైద్రాబాదులో స్థాపించి, అప్పటి రాజకీయ పరిస్థితుల వలన మద్రాసుకు మరలించి గ్రంథ ప్రకటనకు పూనుకొని నాడు. చరిత్ర పరిశోధన, విజ్ఞాన వికాసము అనే రెండు ఆశయాలతో లక్ష్మణరావు సారస్వతయాత్ర సాగినది. వారికి పెట్టనికోటగా ఉండినారు మునగాలరాజా నాయని వేంకటరంగారావుగారు. మహారాష్ట్ర సంస్కృతి ప్రభా వము వలన కాబోలు లక్ష్మణరావు శివాజీ చరిత్రను ప్రామాణికముగా తెలుగులో రచించినారు. తరువాత హిందూమహాయుగము, మహమ్మదీయ మహాయుగము లను రచించి, చరిత్ర రచనలకు ఒరవడి పెట్టినారు. శాసనాలను సేకరించి వానిలోని లిపులను అన్వయించుకొని, అవసరమైన సామగ్రిని అంతా సమకూర్చు కొని సత్యాన్వేషణ దృక్పథముతో లక్ష్మణరావు చరిత్ర పరిశోధన కొనసాగినది. స్వర్గీయ మల్లంపల్లి సోమశేఖరశర్మ లక్ష్మణరావు వద్ద శిక్షణ పొందిన పరిశోధ కాగ్రణి. స్వర్గీయ ఆదిరాజు వీరభద్రరావు లక్ష్మణరావు వద్ద పనిచేసి, భాషా రంగములో తొలిపాఠాలను నేర్చుకొన్నారు. ఆంధ్రుల చరిత్రను వ్రాసిన స్వర్గీయ చిలుకూరి వీరభద్రరావు మీద లక్ష్మణరావు ప్రభావమున్నదని చెప్పక తప్పదు. వీరి ఆంధ్రులచరిత్ర విజ్ఞానచంద్రికా గ్రంథమండలి పక్షాన ప్రకటిత మైనది.

లక్ష్మణరావుది విజ్ఞాన దృక్పథమని గూడ చెప్పినాను. అందుచేతనే తన గ్రంథమాలకు విజ్ఞానచంద్రిక అని పేరు పెట్టినారు. ఈ గ్రంథమాలలో దేశ చరిత్రలు, జీవిత చరిత్రలే కాక తర్కశాస్త్రము, పదార్థవిజ్ఞానశాస్త్రము, రసాయనశాస్త్రము, జంతుశాస్త్రము, భూగర్భశాస్త్రము, అర్థశాస్త్రము మొద

లైనవారికి సంబంధించిన గ్రంథాలు వెలువడినవి. అనాటి విద్యార్థులను దగ్గరకు దీసి, వారిచేత ఈ గ్రంథాలను లక్ష్మణరావు వ్రాయించినారు. అంతే కాక సాహిత్యములో, చరిత్రలో, ప్రకృతిశాస్త్రములో పోటీ పరీక్షలు పెట్టి బహుమతులను ఇప్పించినారు.

తెలుగుభాషలో విజ్ఞాన సర్వస్వమును ప్రకటించవలెనని లక్ష్మణరావుకు సంకల్పము కలిగి అందుకై కృషిని వెంటనే ప్రారంభించినాడు. ఆలోచనకూ ఆచరణకూ మధ్య ఆలస్యమును సహించే స్వభావము లక్ష్మణరావుది కాదుకదా! అందుచేత ఆయన జీవితకాలంలోనే విజ్ఞాన సర్వస్వము మూడు సంపుటాలుగా ప్రకటితమైనది. ఈ మూడు సంపుటాలలోని రెండువేల పేజీలలో వేయి వ్యాసాల వరకు ఉన్నవి. ఈ వ్యాసాలలో స్వయంగా లక్ష్మణరావు వ్రాసినవి ముప్పై అయిదు. ఈ ముప్పయి అయిదు వ్యాసాలను పరిశీలించినప్పుడు ఆయన సర్వతోముఖమైన విజ్ఞానము మనకు స్పష్టమవుతున్నది. ఎందుకనగా, ఈ వ్యాసాలు భాష, గణితము, ధర్మశాస్త్రము, జ్యోతిషము, చరిత్ర, ప్రకృతిశాస్త్రము, రాజకీయ శాస్త్రము, తర్కశాస్త్రము, కళలు, సాహిత్యము మొదలైన అనేక విషయాలకు సంబంధించినవిగా ఉన్నవి. ఈ వ్యాసాలు ఆయన అద్వితీయమైన మేధాశక్తికీ, అపూర్వమైన వైదుష్యానికీ ఉత్తమమైన నిదర్శనాలు. ఇంతేకాక, చరిత్రకు సంబంధించిన అనేక విషయాలను గూర్చి పరిశోధకుల సందేహాలను ప్రజ్ఞాపాటవముచేత తీర్చినాడు. అణువునుండి అజాండము వరకు సమస్త విజ్ఞానము ఆయనకు సుపరిచితం. దేనిని గూర్చి వ్రాసినా సమగ్రతలేనిదే ఆయన తృప్తిపడలేదు. ప్రామాణికత ఆయన పాటించిన క్రమశిక్షణలో ముఖ్యమైనది. తెలుగులో కొత్తపదాలు కొన్నింటిని రూపొందించవలసిన అవసరం ఆయనకు కలిగినది. యూనివర్సిటీ అంటే - విశ్వవిద్యాలయము; ఎడ్యుకేషన్ అంటే - శిక్షణ, ఎడిటర్ అంటే- సంపాదకుడు, ఫలాన అంటే- అముక; అనే పదాలు ఆయన రూపొందించినవే.

ఒక దీపము అనేక దీపాలను వెలిగించగలదు. కాని సొంతకాంతి మాత్రం తగ్గించుకోదు. లక్ష్మణరావు జీవితము ఇందుకు గూడ నిదర్శనము. తన సొంత శక్తిని, వైదుష్యాన్ని ఆంధ్రభాషాభివృద్ధికి ఉపయోగించడమేగాక విద్యాధికులైన యువకులను ఆహ్వానించి వారిచేత తెలుగు సరస్వతికి పూజాప్రసూనాలు

అర్పింపజేసినారు. ఇటువంటి ఔదార్యము గల పెద్దలు మనదేశములో కొద్ది మంది మాత్రమే! గాడిచర్ల హరిసర్వోత్తమరావు వంటి దేశభక్తుని, సాహిత్య వేత్తను, గ్రంథాలయోద్యమాభిమానిని ఆయన దగ్గరకు దీసి తోడ్పడినాడు. అభినవాంధ్ర కవిత్వానికి ఆచార్యులైన రాయప్రోలు సుబ్బారావుగారికి ఆయన ఆదరము లభించినది. చిలుకూరి వీరభద్రరావు, మల్లంపల్లి సోమశేఖరశర్మ, ఆచ రాజు వీరభద్రరావు గార్లను గూర్చి యిదివరకే ప్రస్తావించినాను. ఒకసారి విజ్ఞానచంద్రికా గ్రంథమండలి ప్రచురణలను పరిశీలించితే ఆనాడు యువకులై తరువాత అనేక రంగాలలో నాయకత్వము వహించి దేశానికి వన్నె తెచ్చిన వారి రచనలను మనము పోల్చుకోవచ్చును. డా. ఆచంట లక్ష్మీపతి, కట్టమంచి రామలింగారెడ్డి, డా. భోగరాజు పట్టాభి సీతారామయ్య, అయ్యదేవర కాళేశ్వర రావు మొదలైన వారు ఈ శ్రేణిలో చేరుతున్నారు. ఇంతమంది మేధావులను ప్రోత్సహించిన ఉదారగుణ భూషణుడు లక్ష్మణరావు. దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులుగారు తరువాత విజ్ఞాన సర్వస్వమును సిద్ధముచేసే పనికి పూనుకొని లక్ష్మణరావుగారి రెండు సంపుటాలు పునర్ముద్రణ గావించినారు. నాగేశ్వరరావు పంతులుగారిమీద లక్ష్మణరావు ప్రభావము కొంత ఉండక తప్పదు.

భారతదేశానికి స్వాతంత్ర్యము వచ్చిన తరువాత దేశభాషలకు ప్రాధా న్యము హెచ్చినది. అధికార స్థాయిలో దేశభాషలకు సముచిత స్థానము లభింప జేయడానికి కృషి జరుగుతున్నది. ఇందుకు అనుగుణంగా మన ప్రభుత్వము తెలుగును అధికారభాషగా ప్రకటించినది. ఉన్నత విద్యాబోధన తెలుగులో జరిపించడానికి అవసరమైన కృషి జరుగుతున్నది. జాతీయస్థాయిలోను, అంతర్జా తీయ స్థాయిలోను తెలుగుకు కావలసిన పరిగణన సంపాదించడానికి ప్రయత్నాలు జరుగుతున్నవి. తెలుగు భాషను సంపన్నము చేయవలెననే ఉద్దేశముతో బహు ముఖమైన వ్యాసంగం జరుగుతున్నది. ఇదంతా ఆనాడు లక్ష్మణరావు ఊహించి ప్రారంభించిన కార్యక్రమాలకు అనుగుణమైనదే కదా! ఆ రోజులలో ఈనాటి అవసరము ఊహించి ముందడుగువేసిన ఆయన దృష్టి మనకు ఆశ్చర్యము కలి గిస్తున్నది కదా! ఆత్మ అనేది ఉంటే యీనాటి కృషిని ఆయన యెక్కడనుంచో పరిశీలిస్తూ ఆనందిస్తున్నారేమోనని అనుకోవచ్చు గదా!

సంచార విజ్ఞానసర్వస్వము అయిన లక్ష్మణరావు ఒకవ్యక్తికాదు; మహా సంస్థ; వాస్తవానికి నవ్యాంధ్ర సంస్కృతీ ప్రవర్తకుడు. ఆయన నిర్యాణ సందర్భములో ఒక కవీశ్వరుడు వ్రాసిన పద్యము ఈ సందర్భములో జ్ఞప్తికి వస్తున్నది.

"తెలుగను నాట్యరంగమున దివ్యులు మెచ్చ ప్రధానపాత్రగా
నిలచి విమర్శగీతములనిందితరీతిని పాడుచుండగా
కలిగిన కాలమృత్యువను కాండపటంబును జారనన్నవా
రలు గనలేరు నిన్ను కొమరాజుకులాగ్రణి లక్ష్మణాగ్రణీ!"

(15-9-75)

# రాయప్రోలు సుబ్బారావు

"ఏ ప్రఫుల్ల పుష్పంబుల నీశ్వరునకు
పూజ సలిపితినో యేను పూర్వమందు
కలదయేని పునర్జన్మ కలుగుగాక
మధుర మధురమైన తెనుగు మాతృభాష"

అని తమ ఆంకాక్షను తెలుపుకొనిన ఆధునికాంధ్ర కవీశ్వరులు రాయప్రోలు సుబ్బారావుగారు. ఈ దృక్పథముతోనే రమ్యాలోకము నందు 'భాషకంటె నవ్యులకు తపస్సు లేదు' అని చెప్పుట జరిగినది. సుబ్బారావుగారు కవితా రంగమున అడుగు బెట్టిన కాలమున సకల భారతమునందు వలెనే ఆంధ్ర దేశమునందు కూడ జాతీయోద్యమము గాఢముగ వ్యాపించి యుండెను. ఆంధ్రోద్యమము కూడ అవతరించి, అన్ని పక్షాల ఆమోదమును పొందియుండెను. ఈ రెండు ఉద్యమాల ప్రేరణతో వీనికి బలమైన అండగా సుబ్బారావుగారి వాణి తెలుగు దేశమును ఉత్సాహ తరంగితము కావించినది. ఆనాడు పెన్నానదీ తీరమున జరిగిన ఆంధ్ర సభలలో పెద్దలు అభిప్రాయ భేదాలతో ఐకమత్యమును విడనాడగా యువకులైన సుబ్బారావుగారు ఆంధ్ర ప్రబోధ పద్యాలు వ్రాసి వానిని చదువుటకు జంకుచుండగా ఆ పద్యాలను తీసుకొని ఆంధ్రరత్న గోపాల కృష్ణుడు ఆ వేదిక నుండి తన సహజ గంభీర ధోరణిలో పఠించగా ఆ సభలోని పెద్దలు, పిన్నలు, అందరు ఒక్కసారి తమ కక్షలను విస్మరించి కర్తవ్య పరాయణులైన ఉజ్జ్వల ఘట్టము ఆధునికాంధ్ర చరిత్రలో బహు రమణీయమైనది. ఆనాడు పెద్దలముందు వేదిక మీదనుండి పద్యాలను చదువుటకు జంకిన యువకవియే తరువాత అభినవాంధ్ర కవితా నిర్మాతయైనాడు ఆ పద్యాలే ఆంధ్రప్రబోధ వాఙ్మయము నందు ఉత్తమ స్థానమును ఆక్రమించి, తరువాతి కవుల రచనలకు ఒరవడి యైనవి.

గడచిన నూరు సంవత్సరాల తెలుగు సారస్వతమును సవిమర్శముగా పరిశీలించినపుడు వివిధ వాఙ్మయ పీఠులలో నూతనత్వము, ప్రత్యేకత, విశిష్టత

స్పష్టముగా గోచరించుచున్నవి. ఆధునికాంధ్ర కవిత్వము మీద అధునాతన ముద్రవేసిన వారిలో సుబ్బారావుగారిది అగ్రతాంబూలము. నేటి కాలపు కవిత్వమున క్రొత్తపోకడలకు మార్గదర్శకులు రాయప్రోలు వారని చెప్పినచో సత్యమునకు తలవంపులు కలుగజాలవు. వీరేశలింగంగారు ఆంధ్ర కవిత్వమునకు సారళ్యము సమకూర్చినప్పటికిని నవ్యతా ముద్ర వేయలేదు. ఈ నవ్యతా ముద్రను భావము, భాష మొదలగు సకల విషయములందు స్పష్టముగ ప్రవేశపెట్టినది సుబ్బారావుగారే. ఆంధ్ర సారస్వతమున స్వీయ భావప్రధానమైన ఖండకావ్య రచనకు దేశభక్తి ప్రబోధకమగు కవిత్వమునకు మార్గదర్శకులు రాయప్రోలు కవి. కావ్య కథన పద్ధతిలో వర్ణనా ధోరణియందు, భావ ప్రకటనావిధానమున సుబ్బారావుగారు క్రొత్తదారులను జూపించినారు. ఈ క్రొత్త దారులు అభినవాంధ్ర కవికుమారులకు అనుసరణీయములైనవి. అమలిన శృంగార సిద్ధాంతమును ప్రతిపాదించి, అందుకు అనుగుణముగా ఒక ఖండ కావ్యమును, ఒక లక్షణ గ్రంథమును, ఒక రూపకమును సుబ్బారావుగారు రచించినారు. తెనుగుతోట, జడకుచ్చులు, తృణకంకణము, స్వప్నకుమారము మొదలగు కావ్యనామకరణములందుకూడ సుబ్బారావుగారు నవ్యతను,సౌందర్యరక్తిని ప్రదర్శించినారు. రచనలయందేగాక వేషభాషలందు కూడ సౌందర్యరక్తి వీరియందు అడుగడుగున ప్రత్యక్షమగుచుండును. "ఆ నీలనగరిలో అందాలవాడ—అందాలవాడలో అతి తెల్లమేడ'' అను మాటలను జ్ఞప్తికి తెచ్చు కవిగారి గృహాంగణము సర్వదా సౌందర్య శోభతో కలకలలాడుచుండును.

సుబ్బారావుగారు ప్రకృత్యుపాసకులు. "మామిడికొమ్మ మీద కల మంత్ర పరాయణుడైన కోకిలస్వామికి మ్రొక్కి ఈ అభినవధ్వనిధారణ కుద్యమించితిన్" అని వారు ప్రకృతిని ఇష్టదేవతగా ఉపాసించినారు. తమ ఇంటిముందు ప్రేమతో పెంచుకొన్న ఆ అందమైన మామిడి చెట్టు ఈ సత్యమునే ఉద్ఘాటించుచున్నది. కావుననే కాబోలును ''ఆ వేద ఋక్కులన్—ఆ మంత్ర వాక్కులన్, అంది అందకయున్న యజ్ఞ పూరుష రేఖ''ను అందుకొను ప్రయత్నమున "తంత్రిజాడ నెరుంగ తల్లి చల్లని కొంగు'' పట్టినానని ఒక సందర్భములో తమ అభిప్రాయమును వివరించినారు.

తమ ఆంధ్రత్వమును గూర్చి ఉప్పొంగి పోవువారు సుబ్బారావుగారు. నిజానికి ఆంధ్రుల యశోగానము కావించిన కవులందరికి వీరే మార్గదర్శకులు. అంతేగాదు, ఆంధ్ర ప్రాభవమును అతి ఉదాత్తముగ, ఇహ మనోహరముగ కీర్తించిన నవ్య కవులలో సర్వవిధాల వీరికి ఉత్తమ స్థానము. రాయప్రోలువారి ఆంధ్రాభిమానము భారతదేశాభ్యుదయమునకు, జగత్కల్యాణమునకు పరిపోషక మైనదే కాని ప్రతిబంధకమైనది కాదు. ఆంధ్రదేశ చరిత్రలోని ఉజ్వల ఘట్టము లను, మహాపురుషుల ఉదార చరిత్రలను వీరు భావించి ప్రశంసించినారు. "చావ లేదు చావలేదు ఆంధ్రుల మహోజ్వల చరిత్ర" యని జ్ఞప్తికి దెచ్చినారు. ఒకనాడు ఆంధ్ర సంతతి క్షేమహితాభిమాన దివ్యదీక్షాముఖస్ఫూర్తి తీవరించి యుండెనో తిరిగి యీనాడు ఆ మహావేశ మర్థించి యాంధ్రులార! చల్లుడాంధ్రలోకమున అక్షతలు అని ఉద్బోధించినారు. ఈ కవి వాణియే "వేదశాఖలు పెరిగెనిచ్చట, ఆది కావ్యం బందె నిచట, బాదరాయణ పరమ ఋషులకు పాదు సుమ్మిది చెల్లెలా" అని తెలిపి, "పొగడరా నీ తల్లి భూమి భారతిని, నిలుపరా నీ జాతి నిండు గర్వమును" అని ఆదేశించినది. వీరు కృష్ణరాయ నాగేశ్వరుల భాషాసేవను ఎంత గాఢముగ ప్రస్తుతించినారో, సరోజినీ రవీంద్రుల వాఙ్మయసేవను అంత గాఢముగా కీర్తించినారు. వేదాంత వేత్తయైన ఆచార్య రాధాకృష్ణులను ఎంత హృదయ పూర్వకముగా కీర్తించినారో భారతదేశ ఆత్మయైన జవహర్‌లాల్ నెహ్రూగారిని అంతే హృదయ పూర్వకముగా ప్రశంసించినారు. కృష్ణా గోదావరి నదుల నెంత ప్రేమతో అరాధించినారో గంగామతల్లినిగూడ అంత భక్తితో పూజించినారు. స్వరాష్ట్రాభిమానము భారత జాతీయతకు ప్రతిబంధకము కాదనియు, దానిని భాషోన్మాదముగా భావించుట సహేతుకము కాదనియు ఆంధ్ర సాహిత్యము సుబ్బారావుగారి కవిత్వము స్పష్టీకరించుచున్నవి. తన తల్లిని ప్రేమించనేరని వాడు తన పినతల్లికి ప్రియము గావించుట అసంభవము.

సుబ్బారావుగారికి ఆర్ష సంప్రదాయము మీద అభిమానము మెండు. ఉదారచరితులయిన ఋషులను వీరు పునఃపునః ప్రస్తుతించి యున్నారు. ఆది కావ్యమును, ఉపనిషత్తులను తలచుకొని ఉప్పొంగి, "సూత్రయుగముల శుద్ధ వాసన, క్షాత్రయుగముల శౌర్యచండిమ, చిత్రదాస్యముచే చరిత్రల చెఱిగి పోయెనె చెల్లెలా!" అని ప్రబోధించినారు. అయితే సంఘ సంస్కరణకు

కాలానుగుణ్యమైన మార్పులకు కొందరు సనాతనులవలె సుబ్బారావుగారు వ్యతిరేకులుకారు అంతేకాదు, వారు సంఘసంస్కరణను హర్షించి ఆమోదించిన నిదర్శనాలు స్నేహలత మొదలయిన ఖండకావ్యాలలో కన్పట్టుచున్నవి. కుల, మత, వర్గ విచక్షణలను కూడ వీరు తీవ్రముగ నిరసించి యున్నారు. "కులము దడవక, పొలిమేర గోలపడక, బోయవలె తల్లి పల్లకి మోయుమాంధ్ర" అను మాటలు సుబ్బారావుగారి విశాల దృక్పథమునకు ఉజ్జ్వలోదాహరణలు. అస్పృశ్యతను కూడ వీరు అసందిగ్ధముగ నిరసించి యున్నారు. తెలుగు తోటలో "ప్రేమవృత్తికి చండాలభేదమేల, బ్రాహ్మణాగ్రహారమునందు పవలు రేలు విసరు పవనుండు కడజాతి వీటియందు, తాకలేక వీచెనే పక్షతంత్ర జడిమ?" అని తెలిపి యున్నారు. ప్రాచీన సంస్కృతి పైన, ఆర్ష సంప్రదాయము పైన అభిమానము కాలానుగుణ్యమగు దేశాభివృద్ధికి నిరోధకము కాదని కవివాణి స్పష్టీకరించు చున్నది.

సుబ్బారావుగారి కవిత్వమును పరిశీలించినపుడు వారికి తెలుగు సీమమీద, తెలుగుసీమ సొగసుమీద, తెలుగువారి ఇంటి ఆచారాల సొంపుమీద, తెలుగు మీరిన గర్వంపు తీరులమీద అత్యంత అభిమానమని స్పష్టమగుచున్నది. అందుకే "ఎరుపంచుల పట్టుచీరెలను," "పసుపద్దిన గళ్ళ రవికెలను" ధరించి "అత్తవారంపిన తొలి లాంఛనములతో" వరలక్ష్మి వ్రతము కావించు "క్రొత్తకోడలిని" "పసుపు కుంకుమ పూవులు కొసరి చల్లి, చిన్న కర్పూరహారతి చేతపట్టి" పాట పాడు ఆడబిడ్డలను కవిగారు తమ కవితాదర్పణమున సుందరముగా ప్రతిబింబింప జేసినారు. ఆంధ్ర కన్యల అభిమాన క్రీడలయిన కోలాటము మొదలైన వానిని బహుకోమలముగా ప్రదర్శించినారు.

"చిన్ని బంగారు పూసల చెండ్లవంటి
జొన్న కంకులు పండిన సొగసు చేల
ఎక్కడెక్కడి నుండియో చక్కవచ్చి
వ్రాలు చున్నవి పిట్టలు వేలువేలు"

అని చెప్పినపుడు తెలుగుసీమ సొగసు కడు రమణీయముగ చిత్రితమైనది. "కష్టకమల" లో పల్లెటూరిలోని మధ్యతరగతి తెలుగువారి సంసార సౌంద

ర్యము ఎంత మనోహరముగ చిత్రితమైనదో చూడుడు: అది యొక పల్లెటూరు; ఆ పల్లెటూరిలో ఒకానొకచోట మల్లెపందిరి; మల్లెపందిరికి కొంత దూరాననున్న ఒక తాళదళీ కుటీరము. దానికి చుట్టుపక్కల కంది చాపులు, చంద్రకాంతపు మొక్కలు, మరికొంత దూరాన తీగబచ్చలి పందిరి, దానికి సమీపాన గున్న గోరంట పొదలు, పచ్చ చేమంతి మడులు, బంతిపూల కుదురులు, ఇంకొకవైపు చేదుడు నూయి, ఆ నూయి ప్రక్కన పచ్చి పసుపు నూరెడు ఒక బ్రాహ్మణ సాధ్వి—తలంటు కొరకై ఆమె కూతురు. "చెవులకమ్మలు పెట్టని చెలువు కొంత, ముక్కు పుడకలు దీసిన బోసికొంత, చిన్నబోయిన ఆ కన్నె వన్నె కొంత" తనకు చెలువు గూర్చగా జారుముడితోడ వింత సింగార మొలకగా కనుపించు దృశ్యమెంతో రమణీయమైన ఘట్టము! ఆదే సందర్భమున దగ్గరగ నున్న చిన్న దానిమ్మ చెట్టుపై కూర్చున్న చిలుక దోరగా పండిన పంకు కొరికి మొలక కెంపులవంటి గింజలను రాల్చుట ఎంత మనోహరమైన దృశ్యము! ఈ సందర్భమున ఆ బ్రాహ్మణి మోముమీది పండువంటి బొట్టును కూడ కవి గారు వర్ణించక విడువలేదు. ఆడపిల్లలు గోరంటరసమును హస్తములకు అలంక రించుకొనుట, సాయంకాల సమయమందు పురాణపఠనము కావించుట, ప్రదోష మైనంతనే దానికి స్వస్తిచెప్పుట మొదలయిన ఆచారాలను సుబ్బారావుగారెంతో సుకుమారముగా చిత్రించినారు. కన్నుల కాటుకతో, వేణిలో జడకుప్పెతో, కంఠాన కాసుల దండతో సుబ్బారావుగారు కథానాయికను అలంకరించి అచ్చ మైన తెనుగు కన్నెగా మనకు చూపించినారు. అరగదంచిన సన్నబియ్యపు అన్నము, నేతి పోపు పెట్టిన పొట్లకాయకూర, పేరబెట్టిన మీగడ పెరుగుతో గూడిన కమ్మని శుద్ధాంధ్రభోజనమును రాయప్రోలు వారి కమలమ్మ ఆరగిం చినది. తెలుగు సీమ సౌందర్యమును ఇంత చక్కగా చిత్రించిన అభినవాంధ్ర కవి మరొక్కరు లేరని చెప్పవచ్చును.

భాషా విషయమున కూడ తెలుగు పదాల మీదనే సుబ్బారావుగారికి ఎక్కువ మక్కువ యైనట్లు స్పష్టమగుచున్నది. "జీవన్నవనీతమౌ తెనుగు పాల సముద్రమును పుక్కిలించిన" తిక్కన మీద సుబ్బారావుగారికి అభిమానము. "ఆ యగ్ని వేదికన్—ఆ శబ్దఘోషలో—ఆ శిష్టభాషలో—ఉడికింది ఆ చిల్క మిడికింది కడునల్క" అని తెలుగు భాషను ఒక చిల్కగా భావించి, అట్లు ఉడికిపోయిన ఆ చిలకను తిక్కన్న అందుకొని గారాబముగా పద్యముచెప్పినట్లు

కవిగారు భావించినారు. తెలుగు పదాల సొగసు సుబ్బారావుగారి కవిత్వము ప్రత్యేకత. ఈ పదాలను కూర్చుటలో వారి కలమునకు మంచి విన్నాణము కలదు. పదాల కూర్పు చెవికి ఇంపుగా నుండవలెనని రాయప్రోలు కవీంద్రుని ఆశయము. శ్రవణ కఠోరమైన పదజాలము వారికి ఇష్టముకాదు. శ్రవణ సౌభాగ్యము కొరకు వ్యాకరణ నియమాలను ఉల్లంఘించిన నిదర్శనాలు, అలం కార శాస్త్ర నియమాలను పాటించని ఉదాహరణలు కూడ కొన్ని వారి కవిత్వము నందు కన్పించుచున్నవి. భావోత్తరీయము పరచుట, కవితకు పెండ్లిపందిళ్ళు కప్పించుట, జారుచెమ్మట ముత్యాల జంపుసరులు, దానిమ్మ పువు వంటి తరుణి కెమ్మోవి, గుత్తపు కడియాల కరము, కడుపులో తేనెలు గల కన్నె పువ్వు, వెన్నెలన్ పేరని పన్నీటి పువ్వువంటి చక్కని పదజాలము వీరి కవిత్వములో సమృద్ధము. సుబ్బారావుగారికి తమ పినతల్లిమీద మిక్కిలి భక్తి వారిని ఉత్తే జితులను గావించినవారిలో ఆ చల్లని తల్లికి ప్రత్యేక గౌరవస్థానము కలదు. ఉదాత్తమైన సంస్కృతి కల ఆ సాధ్వి ప్రభావము సుబ్బారావుగారు ఉపయోగించు పదజాలము మీదనేకాక, వారు స్వీకరించిన కథా వస్తువుమీద కన్పట్టుచున్నది.

ప్రకృత్యుపాసకులైన సుబ్బారావుగారు ప్రకృతిని వర్ణించుటలో కూడ ప్రత్యేకతను చూపించినారు. గోరంటలు, బంతిపూలు, మల్లెపూలు, పాడియావులు వారికి ప్రేమాస్పదము లైనవి.

> "పచ్చగిల్లిన వసుమతీ భాగ్యసీమ
> నెల్ల యెడల కన్పిందుగా నుల్ల సిలుచు
> పసుపు పూసిన ముత్తైదువల మొగాల
> ననుకరించి గుమ్మడి పువ్వు లందమయ్యె"

అనునది వారి ప్రకృతివర్ణనా శక్తికి మచ్చుతునక. ప్రకృతిలోని ఒకానొక సంఘటనను తిలకించి, అందుండి ఒక ఉదాత్తమైన భావమును ప్రతిపాదించు నేర్పు సుబ్బారావుగారి ప్రకృతి వర్ణనలో మరొక ప్రత్యేకతగా కన్పించుచున్నది.

> "పూల బిడ్డల బ్రీతి నుయ్యాల లూపు
> పవను డెరుగడు తొడిమలు వదలు నసుచు
> తలపులకు విరుద్ధము లగు ఫలితములకు
> బాధ్యులెవ్వరో, పుణ్య పాపమ్ము లేవొ?"

అని కొద్దిమాటలలో గొప్ప అర్థమును వివరించు ఈ పద్యము ఇట్టి వర్ణనం కొక మంచి నిదర్శనము.

సుబ్బారావుగారు శృంగారమును బహు సుకుమారముగ చిత్రించినారు.

"హేమ పాత్రల చందన మెండి పోయె
ద్వారములు మోయు చున్నవి, హారములను
సానఁబందించె స్నాన కషాయ గంధ
మబల! యెవని కోసము సగమయి తపింతు?"
"చెక్కుచెదరని పాపట చిక్కువడియె
వేణి బంధము శిథిలమై పిరుదు లొరసె
కరగి చెరగిన తిలక రేఖలను తుడువ
వతివ! యెవడాహరించె నీ యార్ద్రహృదిని?"

అనునది ఆంధ్ర వాఙ్మయమందలి విరహ వర్ణనలలో విశిష్టమైనది- బహుమనో హరమైనది.

సుబ్బారావుగారి కవిత్వములో తెలుగుదనము మూర్తీభవించినది. భారత సంస్కృతి యందలి ఉదాత్తత ఈయన రచనా ప్రవాహమున అంతర్వాహినిగా నున్నది. అభినవాంధ్ర కవిత్వమునకు మార్గదర్శకులైన సుబ్బారావుగారి రచనల ప్రవాహము తరువాతి నవ్యకవుల మీద స్పష్టముగా కనిపించుచున్నది. రవీంద్రుని సాన్నిధ్యము గోపాలకృష్ణుని సాహచర్యము లక్ష్మణరావు సహవాసము ముప్పిరిగొని సుబ్బారావుగారి వ్యక్తిత్వమునకు ఒక ప్రత్యేక శోభను సమకూర్చినది. అక్కడక్కడ, ముఖ్యముగా స్వప్న కుమారమున గూఢత గోచరించుచున్నది. భావగాంభీర్యముతోపాటు భాషాసౌకుమార్యము వీరి కవిత్వములో సరసముగా సమ్మేళనమైనది.

(రేడియో ప్రసంగము - 1954)

# నే నెరిగిన అనంతకృష్ణశర్మ గారు

శ్రీమాన్ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ గారిని కన్నడ సీమలో సన్మానించే పూనిక ముచితమైనది; ప్రశంసనీయమైనది. శర్మగారు మైసూరులోనే తమ ఉద్యోగ జీవనము పూర్తిగా గడిపినారు. ఆ పిమ్మట తిరుపతిలో వారు కొంత కాలము ఉద్యోగము చేసినప్పటికినీ, పదవీ విరమణ తరువాత బెంగుళూరులో విశ్రాంతి తీసుకుంటున్నారు. తెలుగు కన్నడముల చుట్టరికము పురాతనమైనది ఈ చుట్టరికానికి శర్మగారు ఉత్తమ ప్రతినిధిగా ఉన్నారని చెప్పితే అతిశయోక్తి కాజాలదు. ఈ రెండు రాష్ట్రాలలోని సాంస్కృతిక వర్గాలు వారిని సమానంగా గౌరవిస్తున్నవి. శర్మగారిలోని ఈ విశిష్టత జాతీయ సమైక్యతకు ఉత్తమ చిహ్నము. సంగీత సాహిత్యాలు రెండును తెలుగు కన్నడములవలె, ప్రాకృత సంస్కృతముల వలె, ప్రాచీనాధునిక సాహిత్య సంప్రదాయాలవలె శర్మగారి సారస్వత మూర్తిలో సరసముగా సమ్మిళితమైనవి. హృదయశక్తి, మేధాశక్తి రెండింటి మేలికలయికను శర్మగారిలో మనము చూడవచ్చును. కావుననే కవులుగా, సాహితీ విమర్శకులుగా వారు అగ్రశ్రేణిని అలంకరిస్తున్నారు.

శర్మగారి సారస్వత మూర్తితో నాకు చిరకాల పరిచయము. నేను కళాశాలలో విద్యార్థిగా ఉన్న కాలములో అనుకుంటాను- వారు వ్రాసిన నిగమ శర్మ అక్క అనే సాహిత్య విమర్శన వ్యాసాన్ని భారతిలో సుమారు నలుబది సంవత్సరాల క్రింద చదివే అవకాశం లభించింది. ఆ వ్యాసము నన్ను అత్యంతంగా ఆకర్షించింది. నిజానికి తెలుగు సాహిత్య విమర్శలో నాకు అభిరుచి కలిగించింది యీ వ్యాసమేనని చెప్పవచ్చును. ఆ వ్యాసము Cutting తీసుకొని ఆ రోజులలో నేను పదే పదే చదువుకొనేవాడిని. ఇట్లా చదువుకున్నవారు తెలుగు వారిలో ఇంకా అనేకులుండవచ్చును. అనంత కృష్ణశర్మగారి ఇతర రచనలు చదువవలెననే కుతూహలంతో, వారి వ్యాసాల కొరకు అన్వేషించి రాయల నాటి రసికత, రాయల వైదుష్యము, నాచన సోముని నవీన గుణములు మొదలైనవ్యాసాలు చదువుకున్నాను. ఆపైన వేమన ఉపన్యాసాలు తెప్పించుకొని తనివిదీర చదువుకున్నాను. బహుశా ఆ రోజులలో నేననుకుంటాను - వారి

నాటకోపన్యాసాలు భారతిలో ప్రకటితము కాగా ఎంతో శ్రద్ధతో ఆ వ్యాసాలను శ్రద్ధపరచుకొని పలుమారు చదివినాను. ఈ విధంగా నాలుగు దశాబ్దాల క్రింద అనంతకృష్ణ శర్మగారి రచనలు నా హృదయము మీద చెరగని ముద్ర వేసినవి. ఆ చిన్న వయస్సులో వారిపైన నాకు కలిగిన అభిమానము దినదినాభివృద్ధి నొంది, వారిని సందర్శించవలెననే ప్రబలమైన కోరిక కలిగినది. కాని 1957 వరకు అనగా 20 సంవత్సరాలు గడిచేవరకు ఆ కోరిక నెరవేరలేదు.

ఇంచు మించుగా వారి వచన రచనలతో పరిచయము కలిగినప్పుడే వారి కవిత్వముతో కూడా నాకు పరిచయము కలిగినది. ఆ రోజులలో స్వర్గీయ కురుగంటి సీతారామయ్యగారు నిజాం కళాశాలలో తెలుగు అధ్యాపకులుగా ఉండే వారు. నాకు అనంతకృష్ణశర్మగారి పట్ల ఉన్న గౌరవాభిమానాలు వారికి తెలియ జేయగా, అవి సరియైనవని వారు హర్షించి, అనంతకృష్ణ శర్మగారు వ్రాసిన పెనుగొండను గూర్చిన కవితను నాకు వినిపించినారు. వీరరసపు ముద్దయైన ఆ కవిత నారక్తాన్ని ఉడికించినది. శాలివాహన గాథాసప్తశతికి శర్మగారు చేసిన కొన్ని అనువాదాలను కూడా అదే సందర్భంలో సీతారామయ్యగారు నాకు చదివి వినిపించి, శర్మ గారి పట్ల నా అభిమానాన్ని ద్విగుణీకృతము చేసినారు.

స్వర్గీయ సురవరం ప్రతాపరెడ్డిగారు నాకు ఆప్తులుగా ఉండేవారు. వారికి అనంతకృష్ణశర్మగారి పైన అపారమైన గౌరవము. తెలుగు సాహితీ విమర్శకులలో అనంతకృష్ణ శర్మగారిది అగ్రస్థానమని నాకు ప్రతాపరెడ్డిగారు చెప్పుతుండేవారు. 1950లో ప్రతాపరెడ్డి గారి సాంఘిక చరిత్ర నాతో గాఢ సంబంధము కలిగిన ఆంధ్ర సారస్వత పరిషత్తు పక్షాన ప్రకటితమైనది. ఆ గ్రంథాన్ని అనంతకృష్ణశర్మగారికి ప్రతాపరెడ్డిగారి కోరిక ప్రకారం పంపించగా శర్మగారు ఆ గ్రంథము పైన చక్కని విమర్శ గావించి, విలువగల అనేక సూచనలు చేసినారు. ఆ సూచనలన్నింటిని ప్రతాపరెడ్డిగారి ఆమోదముతో రెండవ ముద్రణలో క్రోడీకరించనైనది. తరువాత కొంతకాలానికి వారి అగ్రజు లైన గోపాలకృష్ణమాచార్యులవారితో నాకు పరిచయము కలిగి, క్రమక్రమంగా వారికి మిక్కిలి సన్నిహితుడను కాగలిగిన సదవకాశము లభించినది. గోపాల కృష్ణమాచార్యులవారు వారిసోదరుని గూర్చి మా సంభాషణలలో ప్రస్తావించేవారు.

1957 వ సంవత్సరమున ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి ఆవత రించినది. అనంతకృష్ణశర్మగారు సాహిత్య అకాడమి సభ్యులైనారు. అదే నాకు వారితో వ్యక్తిగతమైన తొలిపరిచయము. ఆ మొదటి పరిచయములోనే వారి పట్ల నాకు అంతకు ముందున్న గౌరవాభిమానాలు పదింతలు పెరిగినవి. సాహితీ పరులుగా వారి కీర్తి ఎంత విశిష్టమైనదో సుందరమైన వారి మూర్తి కూడ అంత విశిష్టమైనదిగా నన్ను ఆకర్షించినది. సాహిత్య అకాడమి సమావేశాలు జరుగు తుంటే విలక్షణమైన వ్యక్తిగా కవి పండితుల చూపులు వారిపైన ప్రసరించేవి. తెల్లని ధోవతి, తెల్లని ఉత్తరీయము, తీర్చిదిద్దిన ఊర్ధ్వ పుండ్రములు, మృదువైన హాసము, మధురమైన వాక్కు, సుందరమైన ఆకారముతో మూర్తీభవించిన సరస్వతి వలె యెంతటి విద్వత్సభకైనను మార్గదర్శి కాగలిగిన మహోన్నతులు వారు. నాటినుండి నేటివరకు శర్మగారితో నా పరిచయం క్రమక్రమంగా అభివృద్ధి పొందినది. అందుకు కారణము నా యోగ్యతకాదు; వారి సౌజన్యమే. ముత్యాలసరము వంటి వారి అక్షర పంక్తి వారి సుకుమార సరస హృదయానికి మేలి దర్పణము. అనంతకృష్ణశర్మగారి జాబులు సారస్వత శకలాలు. వారు వ్రాసిన లేఖల పఠనము హృదయాహ్లాదకరమైన వ్యాసంగము.

శాలివాహన గాథాసప్తశతిని వారు అనేక సంవత్సరాల క్రిందట తెనిగించి, అందులో కొంత భాగము ప్రకటించినారు. కాని పది సంవత్సరాల క్రిందటివరకు ఆ గ్రంథము పూర్తిగా ప్రచురణ కాలేదు. సమగ్రంగా ఆ గ్రంథాన్ని ప్రకటించే అవకాశం నా జీవితంతో గాఢముగా పెనవేసుకొనిన ఆంధ్ర సారస్వత పరిషత్తుకు లభించినది. మరొకమారు శర్మగారు మా అందరికీ, సారస్వత పరిషత్తుకు దగ్గరగా వచ్చినారు. అది మా అందరికీ గర్వకారణం.

నా నలుబది సంవత్సరాల ప్రజాహిత జీవనంలో వివిధ రంగాలలోని చాలా మంది గొప్ప వారితో పరిచయం, స్నేహం లభించినవి. నిజానికి ఎందరో మహానుభావులు. వీరిలో కొందరు త్యాగమూర్తులైన దేశనాయకులు; మరి కొందరు మేటి పరిపాలకులు; ఇంకా కొందరు గొప్ప విద్యావేత్తలు; ఆ పైన కొందరు ఉన్నతాధికారులు; వేరొక కొందరు ఉద్దండులైన పండితులు; ప్రతిభా వంతులైన కవులు-ఇందులో నా హృదయాన్ని ఎక్కువగా ఆకర్షించిన వారు అనంతకృష్ణ శర్మగారు.

కొందరిపైన అపారమైన గౌరవాభిమానాలు మనకు ఉండవచ్చును. కాని వారితో ఎక్కువ సేపు కాలక్షేపము చేయలేము; కొందరి ప్రతిభ ఎంత గొప్పదైనను వారు తొందరగా మన దగ్గర నుంచి వెళ్ళిపోతే బాగుండుననిపిస్తుంది. కాని అనంత కృష్ణశర్మగారి సహవాసములో ఎంతకాలము గడిపినప్పటికిని మరికొంత సేపు గడపవలెనని కోరిక కలుగుచుండి. వారితో సహవాసము, సంభాషణ విజ్ఞానదాయకమైనవి; రసాత్మకమైనవి. వారి సమక్షము పన్నీటి చిలుకరింపు, మల్లెపూల మైమరపు - ఎవరినీ నొప్పించే పరుషవాక్కు వారి నోట నుండి వెలువడదు ఏ భావమునైనను రమణీయముగా, ఆహ్లాదకరముగా చెప్పుటలో అనంత కృష్ణశర్మగారు అద్వితీయులు. సాహిత్య రంగములో వారు ఎంతటి యెత్తునైనను అందుకోగలరు; ఎంతటి లోతునైనను చేరుకోగలరు. పాండిత్యము, కవిత్వము, సాహిత్యమూ సంగీతము తెలుగూ కన్నడము, ప్రాకృతము, సంస్కృతము, ప్రాచ్యపాశ్చాత్య సాహితీ సంప్రదాయాలు వారికి కరతలామలకములు. తెలుగు వారిలో ఇంతటి మహనీయమైన సారస్వతమూర్తి మరియెవ్వరిది? తెలుగు విద్వన్మణి మండలిలో దివ్యమణి శ్రీ అనంతకృష్ణ శర్మగారు.

అనంతకృష్ణశర్మ సన్మాన సంచిక అనంతరాగంలోని వ్యాసము-1977)

# నాదృష్టిలో విశ్వనాథసాహితీవ్యక్తిత్వము

ఈ శతాబ్దావిలో తెలుగు దేశమున రచనా వ్యాసంగము చేసిన ప్రతిభా వంతులు అనేకులు ఉన్నారు. వారిలో కొందరు వైతాళికులుగా నిలచినారు; మరి కొందరు కొన్ని వాఙ్మయ ప్రక్రియలలో మార్గదర్శకులైనారు. ఇంకొక కొందరు ఒక్కొక్క రంగములో అగ్రగణ్యులుగా ప్రకాశించినారు. కాని సమష్టిగా బహు ముఖ ప్రజ్ఞ చూపినవారు మిక్కిలి కొద్దిమంది. వాస్తవానికి ఏ భాషలోనైనా ఇటు వంటి వారి సంఖ్య స్వల్పమే. తెలుగు భాషలో ఇటువంటి వారిని పేర్కొనవలసి వచ్చినప్పుడు శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారిని నిస్సంకోచముగా మొట్ట మొదలు చెప్పక తప్పదు.

కందుకూరి వలె ఆయన నవయుగ ప్రవక్త కాకపోవచ్చును; తిరుపతి వేంకట కవులవలె ఆయన తన కవితచే ఆబాలగోపాలమును రంజింపక పోవచ్చును. గురజాడ వలె వైతాళికుడు కాకపోవచ్చును. రాయప్రోలు వలె కవితా మార్గ సంస్కర్త కాక పోవచ్చును; కాని పరిమాణమును బట్టియే గాక ప్రమాణమును బట్టి కూడ విశ్వనాథ సృజించిన సాహిత్యము అందరికన్న ఎక్కువగా నున్నదని నిస్సందేహముగా చెప్పవచ్చును. కవిగా, నవలా రచయితగా, నాటక కర్తగా, కథానికా రచయితగా, విమర్శకుడుగా, ఉపాధ్యాయుడుగా, ఉపన్యాసకుడుగా అయన స్థానము అద్వితీయమైనది. వాఙ్మయరంగములో ఆయన సాధించక విడిచి పెట్టిన ప్రక్రియలేదని చెప్పితే అతిశయోక్తి కాదు. పట్టిన దాని నెల్ల బంగారము చేసినాడని చెప్పితే సత్యానికి తలవంపులు కలుగ జాలవు.

సత్యనారాయణ గారు తమ సారస్వత జైత్రయాత్రను ప్రారంభించిన రోజులలో ఆసేతు హిమాచలమైన భారత దేశములో గాంధీ మహాత్ముని నాయకత్వమున భారత స్వాతంత్రోద్యమము విజృంభించినది. భాషా రాష్ట్రాల నేర్పాటు చేయవలెనను ఉద్యమము కూడా తల ఎత్తినది. ఆంధ్రోద్యమము జాతీయోద్యమానికి అనుకూలముగా ముందడుగు వేసినది. ఈ ఉద్యమాల ప్రభావము సత్యనారాయణగారి మీద మనకు కనిపించుతున్నది. నా దేశము,

నా భాష, నా సంస్కృతి గొప్ప అనే భావము ఆ రోజు సమస్త భారత ప్రజానీకమును ఉత్సాహతరంగితము గావించినది. ఈ ఉత్సాహము, ఈ ఆవేశము ఆయన రచనలందు మనకు స్పష్టముగా గోచరించును. ఖద్దరు, స్వదేశీ ఉద్యమాలను సత్యనారాయణగారు అభిమానించినారు. సత్యనారాయణగారు కల్తీలేని జాతీయవాది.

విశ్వనాథ సత్యనారాయణగారు నూటికి నూరుపాళ్ళు తెలుగువాడు. ఆంధ్రావేశము ఆయనలో మూర్తీభవించినది. ఆంధ్రుల పూర్వ రాజ్యాలు అనాటి సంస్కృతి తలంచు కొన్నంతనే ఆయన హృదయము ఉప్పొంగినది. ఎన్ని జన్మములనుండియో కదా నా తనువున ఆంధ్ర రక్తము ప్రవహించుట అని ఆయన తలపోసినాడు. "ఆంధ్రప్రశస్తి" సత్యనారాయణగారి రచనలలో సకలాంధ్ర దేశమును ఉఱ్ఱూతలూగించిన కావ్యము. కిన్నెరసాని పాటలు తెలుగు భాషకు అపూర్వమైన అలంకారము. తెలుగు భాష నిలిచియున్నంతకాలము కిన్నెరసాని పాటలు తెలుగు వారి నాలుకపైన తాండవ మాడక తప్పదు. కవిత్వములో విశ్వనాథగారి కలము పోయినన్ని పోకడలు మరి యే కవి కలము పోలేదని నిస్సంశయముగా చెప్పవచ్చును. సంస్కృత సమాసాల నుపయోగించుటలో సత్యనారాయణగారు ఎంత నైపుణ్యము ప్రదర్శించినారో తీయని తెలుగు పదాల పొందికలో కూడ అంతే ప్రజ్ఞను చూపినారు. తెలుగు దేశము, తెలుగు పల్లెలు, తెలుగు ప్రజల ఆచారాలు వీరి రచనలలో కనిపించినంత పుష్కలముగా చాల తక్కువమంది రచనలలో కనిపించునని చెప్పవచ్చును. గేయము, పద్యము ఒకే రీతిగా నడిపించగలిగిన ప్రజ్ఞా సమన్వితుడు సత్యనారాయణగారు. నన్నయ, తిక్కన పోతనాది మహాకవుల అడుగు జాడలలో సత్యనారాయణగారు మహా కావ్య రచనకు ఉపక్రమించి, రామాయణ కల్పవృక్షమును వ్రాసి ధన్యులైనారు. ఆ మహా కావ్యమును ఆయన చదివినప్పుడు విని అశేషాంధ్రజనము ఆనంద సముద్రములో మునిగి తేలినారు. సత్యనారాయణగారి కవిత్వము ఎంత రమణీయమైనదో వారి కంఠము, చదివే పద్ధతి కూడా అంత వీనుల విందు గావించునది. కవిత్వము వీరి చేతులందలి క్రీడాకందుకము. అరి తేరిన క్రీడాకారుడు టెన్నిస్ కోర్టులో బంతి విసిరినట్లుగా సత్యనారాయణగారు కవితారంగమున విజృంభించినారు. పండితులకు గూడా దురవగాహమైన శైలిని వాడుటలో ఆయన ఎంత దిట్టయో సామాన్యజనులు కూడ అర్థము చేసుకొను శైలిని ఉపయోగించుటలో కూడ ఆయన అంతే సమర్థుడు. ప్రాచీనులలో ప్రాచీనుడు, ఆధునికులలో అధునికుడు విశ్వనాథ సత్యనారాయణగారు.

సత్యనారాయణగారు అనేక నాటకాలను వ్రాసినారు. వారి నాటకాలలో అనార్కలి, నర్తనశాల ప్రశస్తమైన రచనలు. నవలారచయితగా సత్యనారాయణ గారిది విశిష్టమైన స్థానము. సంఖ్యలో ఆయన వ్రాసినన్ని నవలలు మరొకరు వ్రాయలేదని చెప్పవచ్చును. రకరకాలైన ఆయన నవలలలో వివిధ శైలీవిన్యాసము మనకు కనిపించును. ఏకవీర, మాబాబు, బద్దన్న సేనాని మొదలైన నవలలు తెలుగుభాష ఉన్నంతకాలము నిలువదగిన రచనలు. చిన్న కథలు అనేకము విశ్వనాథ సత్యనారాయణగారు వ్రాసినారు. కథానికా రచయితగా సత్యనారాయణగారిది సమున్నతమైన స్థానము. "మాక్లిన్ దుర్గములో కుక్క", "సీ ఋణము దీర్చుకున్నాను" వంటి కథలు కథానికా రచయితగా సత్యనారాయణ గారి ప్రతిభకు ఉదాహరణలు.

సత్యనారాయణగారి చిత్తశుద్ధి గొప్పది. తాను విశ్వసించిన అభిప్రాయములను వెల్లడించుటలో ఆయన ఎప్పుడు వెనుదీయలేదు. ఆ భావాలు కొందరికి రుచించినను, రుచింపకపోయినను వారు స్వేచ్ఛగా సభలలోను, రచనలలోను ప్రకటించినారు. సత్యనారాయణగారి సమకాలికులలో ప్రతిభావంతులు చాలా మంది ఉన్నారు. కాని వారు ఏ ఒక్కరును ఒకటి రెండు ప్రక్రియలలోనే తమ ప్రతిభను ప్రదర్శించినారు. సత్యనారాయణగారివలె విభిన్న ప్రక్రియలను వారు చేపట్టలేదు. చేపట్టినప్పటికిని వాని సాధనలో సత్యనారాయణగారివలె విజయము పొందలేదు.

సత్యనారాయణగారిది సమున్నతమైన వ్యక్తిత్వము. ఈ వ్యక్తిత్వము ఆయన ఆకారములోను, మేధాశక్తిలోను, హృదయశక్తిలోను, వాక్కులోను సర్వదా ప్రతిబింబితమైనది. ఇంతటి సర్వతోముఖమైన ప్రతిభాశాలి గడచిన కొన్ని శతాబ్దములలో తెలుగుదేశమునందు జన్మించలేదని నిస్సందేహముగా చెప్పవచ్చును.

సత్యనారాయణగారు తమ గురువుగారిని గూర్చిన వ్రాసిన ఒక పద్యములో "ఆనాడు నన్నయకుగాని, తిక్కనకుగాని నా వంటి శిష్యుడు దొరకలేదు. ఇది మీకు ప్రత్యేకమైన గౌరవము" అని చెప్పినారు. ఈ మాట అత్యుక్తి కాదు; సత్యోక్తి మాత్రమే. సత్యనారాయణగారు తమ తొలి కవితలో,

సీచే మంజు కషాయ కంఠ కల కంఠీ గీతి పాడించెదన్
నీ చంద్రామృత సేక వాఃప్లుదులలో నిండించింతు కేదారముల్
ప్రాచీ దిగ్వనితాన నోజ్జ్వల దుషః ప్రారంభ రమ్యాంశు, మా
లా చీనాంబర డోలికావళి నినున్ లాలించి యూగించెదన్

అనియు,

నీ నుడుులయందు చిక్కన నెగడజేతు
నీ పలుకులందు జిగి తీపి నిలువజేతు
నీ వచస్సుధ ర క్తిమ నిలువజేతు
చెలగి భాషాంబుధిని పుడిసిళ్ళ గొనుము

అనియు ఆశావాణిచే ఒక కవికుమారుని ప్రబోధింపజేసినాడు. ఇది ఆయన నూనూగు మీసాల నూత్న యౌవనమున వ్రాసిన కవిత. సత్యనారాయణగారి సాహిత్యమును పరిశీలించినపుడు ఆనాడు ఆయన కనిన యీ స్వప్నము వారి జీవితములో సత్యముగా పరిణమించినదని స్పష్టమగుచున్నది. భాషాంబుధిని పుడిసిళ్ళగొన్న మహాకవులు సత్యనారాయణగారు.

సత్యనారాయణగారికి అన్ని గౌరవాలు లభించినవి. మరే రచయితకు ఇటువంటి సత్కారాలు జరుగలేదు. ఆయన రచనలు వేల ప్రతులు అమ్ముడు పోయినవి. సకలాంధ్రదేశము ఆయనకు బ్రహ్మరథముపట్టినది. ఆయన వెళ్ళని పట్టణము లేదు; పొందని సన్మానము లేదు. విశ్వవిద్యాలయము ఆయనను కళా ప్రపూర్ణుని చేసినది. కేంద్ర ప్రభుత్వము ఆయనను పద్మభూషణునిగా భూషించినది. రాష్ట్ర, కేంద్ర సాహిత్య అకాడమీలు ఆయన రచనలను బహుమానించినవి. జ్ఞానపీఠము ఆయనను సన్మానించినది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము ఆయనను ఆస్థానకవిగా చేసినది. సమస్త భారతము ఆయనను గుర్తించినది. ప్రాచీన-ఆధునిక కవు లెవరికిని ఇటువంటి అపూర్వ గౌరవాలు లభించలేదు. సత్యనారాయణగారు సర్వవిధాల ధన్యజీవి. ఆంధ్రభాష ఉన్నంతకాలము రచయితగా, కవిగా సత్యనారాయణగారు నిలువగలరని నిస్సందేహముగా చెప్పవచ్చును.

(విశ్వనాథ సాహిత్య సంచిక, కాకతీయ విశ్వవిద్యాలయ ప్రచురణ, మే-1978)

# స్వర్గీయ చలం

ఈ ఉదయం స్వర్గీయ గుడిపాటి వెంకటచలంగారి నిర్యాణ వార్త సాహితీ లోకాన్ని శోక సముద్రంలో ముంచివేసింది. గడచిన కొన్ని దశాబ్దాల తెలుగు సాహిత్యంపైన ఆయన రచనల ప్రభావం అద్వితీయమైనది. చలం రచనలు చదివి రచయితలు అయినవారు ఎంతోమంది. దేశంలో రకరకాల రచయితలు ఉన్నారు. అందులో ప్రతిభావంతులు కూడా అనేకులు. కాని సమాజంపైన, సమకాలిక సాహిత్యంపైన చెరగని ముద్ర వేసినవారు కొద్దిమంది. ఆ కొద్ది మందిలో చలం స్థానం విశిష్టమైనది. నిజానికి సమాజాన్ని ప్రభావితం చేసిన రచయితలలో వేమన్న వంటివాడు చలం అంటే అతిశయోక్తి కాజాలదు. త్రికరణశుద్ధిగల తెలుగు రచయితలలో చలం మున్నెన్నదగినవాడు.

ఆ రోజులలో రహస్యంగానో, పరోక్షంగానో చలం రచనలను చదువని తెలుగు పాఠకులు లేరని నిస్సందేహంగా చెప్పవచ్చును. రచయితగానే కాక వ్యక్తిగా చలం అనేకులను ప్రభావితులను జేసిన సాహిత్య విప్లవకారుడు. సమాజంపైన తిరుగుబాటు చేసిన రచయిత చలం - ఆయన రచనలు అనేకాలు. కథలు, నాటికలు, వ్యాసాలు, మ్యూజింగ్స్, ప్రేమలేఖలు మొదలయిన ఆయన రచనలు అన్నీ తెలుగు పాఠకలోకానికి సుపరిచితాలు.

చలం రచనలలో ఆయన భావాలు, ఆయన వ్యక్తిత్వం ప్రతిబింబిస్తుంది. తెలుగు వచన రచయితలలో చలంది అత్యున్నత స్థానం. ఆయన వచన శైలి శక్తివంతమైనది. ఆయన అభిప్రాయాలతో ఏకీభవించలేమని ఆ రోజులలో చెప్పినవారుకూడ ఆయన వచన శైలిని ప్రశంసించినారు. వచనంలో కవిత్వం వ్రాసిన రసహృదయుడు. చలం స్వర్గీయ చింతాదీక్షితులవంటి గొప్ప రచయితా, గొప్ప విద్వాంసుడు చలం వచనశైలిని హర్షించిన సత్యము సుప్రసిద్ధము. ఏ విషయాన్నైనా అత్యంత రమణీయంగా హృదయానికి హత్తుకునేటట్లుగా చెప్ప డంలో చలంతో సాటిరాగలవారు చాలా కొద్దిమంది, అనుభూతిని మేలుకొలిపి ఆలోచనలను రేకెత్తించగల గొప్ప ప్రతిభావంతుడు చలం అని ఒక విమర్శ

కుడు చెప్పిన మాటలు అక్షరాలా సత్యం. అందుకనే చలం సాహిత్యంలో రస సృష్టితోపాటు తాత్వికమైన హేతువాద దృష్టి గోచరిస్తుందని ఆ విమర్శకుడు చలం సాహిత్య స్వరూపాన్ని సమీక్షిస్తూ వివరించినాడు.

చలం రచనా రంగంలో అడుగుపెట్టిన రోజులలోని సమాజం ఈనాటి సమాజం కాదు. ప్రతి మార్పుకు ఉలికిపడేవారు అనేకులు ఆనాడు సమాజంలో ప్రముఖ స్థానంలో ఉండేవారు. వ్యావహారిక భాషకు ఈనాటి గుర్తింపురాని రోజులవి. భారతదేశానికి స్వాతంత్ర్యంవచ్చి సమసమాజ స్థాపనను గూర్చి, స్త్రీలకు సమాన హక్కులను గూర్చి చాలా కొద్దిమంది మాత్రమే ఆలోచించే రోజులవి.

గుడిపాటి వెంకటచలం సమాజపు కట్టుబాట్లను, సంప్రదాయాలను వ్యతిరేకించినాడు. ''ఆచారాలు, వ్యవహారాలు నీచంగా వున్నవి. వానిని సంస్కరించుకొని బాగుపడండి! కుళ్ళును దాచుకొని బాధపడకండి!'' అని ప్రజలను బోధిస్తూ కలం పట్టిన సంఘ శ్రేయోభిలాషి. అతని హృదయంలోని ఆవేదన ఎన్నడూ చల్లారనిది. ఆయన సంఘానికి నీతిని గురించిన భావాలు తప్ప నీతి లేదంటాడు. మనము ఆచారాలకు దాసులమై స్వయంగా ఆలోచించే శక్తిని కోల్పోయినామని, మనుష్యులు కావాలని అనుకుంటే సంప్రదాయాలను త్రోసి వేయవలెనని, స్వతంత్రంగా ఆలోచించడం నేర్చుకోవాలని ఆయన ప్రతి వ్యక్తికి సూచించినాడు. లోకాన్ని దిద్దేభారమంతా తనపైన వేసుకున్నట్లే భావించిన వ్యక్తి అతడు. ఆయన రచనలు సాధారణమైనవి కావు. ఆయన వాక్కులలో తీక్షణ ఎక్కువ. ఈ విషయాన్ని గొర్రెపాటి వెంకటసుబ్బయ్య గారు ప్రస్తావిస్తూ నన్నయచెప్పినట్లు "నిండు మనంబు నవ్య నవనీత సమానము, పల్కు దారుణా ఖండల శస్త్రతుల్యము...... విప్రులందు"-అని జ్ఞాపకంచేస్తూ చలం అసలైన బ్రాహ్మణుడు అన్నారు.

చలం సంఘంలో స్త్రీలు, శిశువులు అనవసరమైన కట్టుబాట్లకులోనై వికాసము చెందకుండ ఉన్నారని బాధపడినాడు. ''గడ్డకట్టిన మీ హృదయాలను తెరవండి'' అంటూ కలం తీసుకొని వ్రాయడం మొదలు పెట్టగానే ఆయన రచన అశ్లీలమని పత్రికలవారు అచ్చువేయనూ లేదు. పాఠకులు మొదట ఏ కొందరో తప్ప విశేషంగా చదవనూ లేదు. ఆ రోజు సంఘమంతా ఆయనను తూలనాడి వెలివేసినదని చెప్పవచ్చును. ఇంతైనా చలం ధైర్యాన్ని కోల్పోక నమ్మినదాన్నే

నిర్మొహమాటంగా వ్రాస్తూపోయినాడు. ఆయనను ఇతరులు వ్యతిరేకిస్తూ చేసిన ప్రచారం కూడ ఆయన రచనలను చదివేటట్లు చేసింది. ఆయన రచనలు విశేషంగా వెలువడినవి. ఆయన వ్యాసాలను, కథలను, లేఖలను పత్రికలవారు తరువాత పోటీపడి తమ పత్రికలలో వేసుకోవడానికి ముందుకు వచ్చినారు. మొదట ఆయనను దూషించినవారే తరువాత భూషించినారు. ఆయన భాష, భావములోని క్రొత్తపోకడలు చదువరులను ఆకట్టుకొంటవి. ఆయన ఒక గొప్ప గద్యకవి.

చలం ఉద్యోగం చేస్తున్న రోజుల్లో రఘుపతి వెంకటరత్నం నాయుడుగారు, వీరేశలింగంగారు బ్రహ్మ సమాజాన్ని నడుపుతూ ఉండేవారు. ఆ ఉభయుల ప్రభావం చలం పైన ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. యువకులు ఎందరో శిష్యులుగా పనిచేస్తూ ఉండిరి వెంకటచలం తన కుటుంబంతో బ్రహ్మసమాజంలో చేరినాడు. అతని భార్య రంగనాయకమ్మ మాలతీబాయి అని పేరు మార్చుకొని ఇంటికింటికిపోయి స్త్రీలకందరికిని బ్రహ్మసమాజ విధులను చక్కగా తెలుపుతూ ఉండేది. నాయుడుగారు సమాజ మందిరములో ఇంగ్లీషులో బోధనచేస్తూ ఉండేవారు. చలం తెలుగులో బోధిస్తూ ఉన్నప్పుడు జనం విశేషంగా వచ్చేవారు. ఆయన చిత్తశుద్ధి ప్రజలను అధికంగా ఆకట్టుకునేది.

'లోకాన్ని సంస్కరించేది ఆచరణ కనుక నిన్ను నీవు మార్చుకో; లోకం సంగతి లోకకర్త చూచుకుంటాడు' అన్న సూక్తిని దృష్టిలో పెట్టుకొని చలం ఆత్మవిమర్శ చేసుకోవడం మొదలు పెట్టినాడు. 'మీరు మీ రచనల ద్వారా చెప్పిన విలువలను మీ నిజజీవితంలో ఆచరించినానని చెప్పగలరా?' అన్న ప్రశ్నకు 'నా రచనల్లో చూపిన ఆదర్శాలను నా చేతనైనంత వరకు నా జీవితంలో అనుష్ఠించాలని యత్నించినాను. నా జీవితంలో అనుష్ఠించిన వాటినే నా రచనల్లో వ్రాసినాను' అన్నాడాయన. మరి ఒకప్పుడు ''బాహ్యంగా సాధించగలిగినాను. కాని నాలోపల పరివర్తన ఎంత యత్నించినా నాకు తృప్తి కలుగలేదు'' అంటాడు.

చలం నూనుగుమీసాల నూత్న యౌవ్వనంలోనే రచన ఆరంభించినాడు. వ్రాయాలనే ప్రేరణ నీకు ఎట్లా కలిగిందని అడిగితే - 'వ్రాత అనేది నా రాత ఏమో' అన్నాడాయన. ఆయన మొట్టమొదట వ్రాసింది 'శశిరేఖ' 1921 లో.

ఆయనకు అప్పుడు 27 సంవత్సరాల వయస్సు. ఆ నవల అనేకమైన కత్తిరింపులకు లోనై అచ్చైనట్లు చలంగారు బాధతో చెప్పుకున్నారు.

చలం కలం పట్టడానికి కారణం ఇట్లా చెప్పినాడు - 'మొదట్లో నాకు సారస్వతంతో సంబంధంలేదు. నేను చూస్తున్న అన్యాయంవల్ల, ఘోరంవల్ల నేను మండిపోయాను. ఆ మంట నాలో ఇముడక కథ అయ్యింది. నేను రచయితను కావాలని ఆశలేదు. నేను వ్రాసిందానికి రస ప్రపంచంలో విలువ ఉందని తెలియదు. మొదటి కథ నుంచి నా పాఠకులు బిగ్గరగా ఏడ్పులు ప్రారంభించినారు. ఆ ఏడ్పులే నా ఉత్సాహం. ఆ నెయ్యి నా మంటలో పడి భగ్గుమని ఇంకొక ధ్వని పుట్టించేది.'

తాను యత్నించినది రియాలిటియే కాని రియలిజం కాదని అన్నాడతడు. భాష విషయంలో అతడు వ్రాస్తున్నది వ్యావహారిక భాష అనికూడ అతనికి తెలియదట! చాలా పుస్తకాలు వ్రాసినదాకా తన పుస్తకాలు తెలుగు సాహిత్యమని ఆయన అనుకోలేదట! ప్రతిభావంతులు, లోకజ్ఞులు చెప్పిన మాటలలో అక్షర లక్షలు చేసేవి కొన్ని వుంటవి. కాని చలం ఎన్నో సత్యాలను నైపుణ్యంతో చెప్పగలిగినాడు.

1950వ సంవత్సరంలో చలంగారు తెలుగు దేశాన్ని వదిలి తిరువణ్ణామలై వెళ్ళినారు. అక్కడికి వెళ్ళిన తరువాత, వారి లేఖినిలో పూర్వపు ఉధృతం తగ్గింది; క్రొత్త నేవళాలనూ సంతరించుకొన్నది. తిరువణ్ణామలై నుండియే చలం 'సుధ', 'మార్తా' - 'వెలుగు రవ్వలు', 'యశోదా గీతాలు' మున్నగు గ్రంథాలను వ్రాసిరి. ఈ పుస్తకాలనిండా, వారి కవితాత్మ పరిమళించుతూ వుంటుంది. సామాన్యులు చూడలేని సొగసులను, సొబగులను, ఆయన దర్శించి, ఆ అందచందాలను మనందరకు పంచిపెట్టినారు. తాను నమ్మిన దానిని అమరికలు లేకుండ తన రచనలద్వారా వెల్లడించడం, చెప్పిన దానిని ఆచరించడం - అనే లక్షణాలు గల చాలాతక్కువ మంది రచయితలలో ఒకడై, తెలుగు సాహిత్యచరిత్రలో చిరస్థాయిగా నిలిచిపోయినాడు చలం. ఇంక మన కతడు లేడు - అతని రచనలు తప్ప.

(5-4-1979 న చలం పరలోకగతులైన సందర్భంలో ఆకాశవాణి, హైదరాబాదు నుండి చేసిన ప్రసంగం.)

# తెలుగులో వెలువడిన స్వీయ చరిత్రలు

"దేశమంటే మట్టి కాదోయ్-దేశమంటే మనుషులోయ్" అన్న కవివాణి ఆత్మకథల అవశ్యకతను కూడా నిరూపిస్తున్నది. మహనీయుల జీవిత చరిత్రలు అవి వారు వ్రాసినా, మరొక సమకాలికులు వ్రాసినా దేశ చరిత్రకు ప్రధానమైన ఆధార సామగ్రి

అదేమి చిత్రమోకాని మన పూర్వులు తమ చరిత్రలు గాని, తమ సమ కాలికులైన ఉదార చరితుల జీవిత చరిత్రలుగాని వ్రాసిపెట్టలేదు. కావున ఆనాటి చరిత్రకు ఆధార సామగ్రి చాలా తక్కువగా ఉన్నది. ఆధునిక కాలంలో కూడా దేశ పరిస్థితులను తెలిపే చరిత్రలు కాని, స్వీయ చరిత్రలుగాని తక్కువ. తెలుగు భాషలో వెలువడిన ఆత్మ కథల సంఖ్య ఏమంత పెద్దది కాదు. భారత దేశంలో గత శతాబ్దం తుది సగం, యీ శతాబ్దం మొదటి సగం ఉజ్వలమైన చరిత్రకు ఆలవాలమైన యుగం. తెలుగుదేశంలో అవతరించిన వైతాళికులైన మహనీయుల సంఖ్య తగినంతగా ఉన్నప్పటికి వారిలో చాల తక్కువమంది తమ స్వీయ చరిత్రలను వ్రాసినారు. తెలుగులో వెలువడిన జీవిత చరిత్రలు సుమారు ఇరువై అయిదు కన్న ఎక్కువగా లేవు.

తెలుగు దేశానికి ఆధునిక యుగంలో వెలుగు చూపిన మహనీయుడు కందుకూరి వీరేశలింగం పంతులు. సాహిత్య, సాంఘిక, సాంస్కృతిక రంగాలలో తొలి వైతాళికుడు ఆయన డాక్టర్ కట్టమంచి రామలింగారెడ్డి గారన్నట్లు - "గడచిన కొన్ని నూర్ల సంవత్సరాలలో తెలుగు సీమలో యింత గొప్ప వ్యక్తి జన్మించలేదని నిస్సందేహంగా చెప్పవచ్చును." తమ జీవితాన్ని పూర్తిగా సాంఘిక, సాహిత్య రంగాలకు అంకితం చేసిన పంతులుగారి ప్రవృత్తి యుద్ధరంగంలో అనేక విజయాలు సాధించిన వీరవరేణ్యుని ప్రవృత్తి. అందు చేతనే ఆయన సమాధిమీద చెక్కదగిన చిహ్నం "కత్తి" అని రామలింగారెడ్డి గారు చెప్పినారు. తెలుగులో స్వీయ చరిత్రలు వ్రాసిన వారిలో వీరేశలింగంగారే మొదటివారు. అనేక వాఙ్మయ ప్రక్రియలకు మార్గదర్శకులైన వీరేశలింగంగారే

స్వీయ చరిత్ర రచనకు కూడా మార్గదర్శకులైనారు. వీరేశలింగం గారి జీవిత చరిత్రలో గడచిన శతాబ్దంలోని సగ భాగంతోపాటు యీ శతాబ్దంలోని తొలి భాగపు దేశ సాహిత్య, సామాజిక పరిస్థితులు చిత్రితమైనవి. వాస్తవానికి తెలుగులో వచ్చిన ఆత్మకథలలో యించుమించుగా అన్నీ 19 వ శతాబ్దం రెండవ సగం, 20 వ శతాబ్దం మొదటి సగానికి సంబంధించిన పరిస్థితులను తెలిపేవే. వీరేశలింగం గారు తమ విద్యార్థి దశ, ఉపాధ్యాయ వృత్తి, సంఘ సంస్కరణ ఉద్యమం, గ్రంథ రచనా వ్యాసంగం, విశ్రాంతి దశ, చరమ దశలకు సంబంధించిన వివరాలను తెలిపినారు. వారు సాహిత్య రంగంలోను, సామాజిక రంగంలోను నాయకత్వం వహించి నడిపిన యుద్ధాలను గూర్చిన వివరాలు స్వయంగా వారే తెలుపడం తెలుగువారి అదృష్టం. వీరేశలింగం గారు రాజకీయ రంగాన్ని గురించి ఎక్కువగా పట్టించుకోలేదు. అయ్యదేవర కాళేశ్వర రావుగారు తమ స్వీయ చరిత్రలో యీ వాస్తవాన్ని ప్రస్తావించినారు. వీరేశలింగం గారిని తమ గురువుగా భావించుకున్న చిలకమర్తి లక్ష్మీనరసింహం గారు కూడా తమ ఆత్మకథను వ్రాసినారు. అందులో ఆనాటి దేశ పరిస్థితులను, ఉద్యమాలను, మార్గదర్శకులైన మహనీయులను పేర్కొని, తమ గ్రంథ రచనా వ్యాసంగాన్ని, తాము జీవితంలో ఎదుర్కొన్న చిక్కులను, పడిన కష్టాలను వివరించినారు. చిలకమర్తి లక్ష్మీనరసింహం గారు యించుమించుగా వీరేశలింగం గారు వ్రాసినన్ని గ్రంథాలు వ్రాసినారు. సాహిత్య, సాంఘిక రంగాలలో వీరేశలింగం గారిని అనుసరించినారు. శారీరకమైన అశక్తత వలన కార్యరంగంలో వీరేశలింగం గారివలె విక్రమించలేదు. ప్రకాశం పంతులుగారు యీ ఉభయులచేత ప్రభావితుడైన దేశ నాయకుడు. విద్యార్థి దశలో రాజమహేంద్ర వరంలో ఆయన వీరేశలింగంగారి ఉద్యమాలలో పాల్గొని, చిలకమర్తి నాటకాలలో వేషాలు వేసినారు. ఈ ఉభయులవలె గాక క్రమంగా రాజకీయాలలో ప్రవేశించి దేశానికి ప్రకాశం పంతులు గారు నాయకత్వం వహించినారు. ప్రకాశం పంతులుగారు నాటకాలలో వేషం వేసే రోజులలో ఆయన వేషభాషలను వర్ణిస్తూ చిలకమర్తి నరసింహంగారు-

"ఈగ వ్రాలిననైన వేగజారెడునట్లు
మవ్వంపు కురులను దువ్వినాడు"—అని ప్రారంభించి ఒక సీస పద్యంలో రమ్యంగా ఆనాటి ప్రకాశం ఫొటోగ్రాపు తీసినారు. నాటకాలు, మున్సి

పల్ రాజకీయాలు, దేశ రాజకీయాలు, న్యాయవాదవృత్తి మొదలైన అన్ని రంగాలలో ప్రకాశంగారు అగ్రగణ్యులుగా నేతృత్వం వహించినారు. ఆయన తన స్వీయచరిత్రను మొదటి భాగం "నా జీవితయాత్ర" అనే పేరుతో వ్రాసి పెట్టినారు. ఇందులో 1872-1922 మధ్యకాలపు పరిస్థితులను గురించి మాత్రమే ఆయన వివరించినారు. వివేకానంద, దాదాభాయినౌరోజీ, లజపతిరాయిల ప్రభావం తన రాజకీయ జీవితంలో ఉన్నదని ఆయన తెలిపినారు. పౌరుషానికి, పట్టుదలకు, ధైర్యసాహసాలకు, త్యాగానికి పర్యాయపదమైన ప్రకాశం మితవాది కాదు; ఎప్పుడూ అతివాదే. గోపాలకృష్ణగోఖలే రాజకీయాలు ఆయనకు నచ్చలేదు. 1922 నుంచి ఆయన అవసానంవరకు జరిగిన అతి ముఖ్యమైన సంఘటనలను గూర్చి ఆయన స్వయంగా వ్రాయకపోవడం ఒక గొప్పలోటు. అయితే తెన్నేటి విశ్వనాథంగారు ఆయనకు మిక్కిలి సన్నిహితులు కావడంవల్ల యీ గ్రంథాన్ని పూర్తిచేసి కొంతవరకు లోటును తీర్చినారు. ప్రకాశంగారి "జీవితయాత్ర" మనోహరమైన శైలిలో,వ్యావహారిక భావలో నడచినది. ఆనాటి దేశరాజకీయాలు స్వాతంత్రోద్యమం, పార్లమెంటరీ రంగం, వివిధ ఉద్యమాలు - నాయకులు, న్యాయవాదులు-వారి స్వభావాలు-చిత్తవృత్తి అన్ని ఇందులో ప్రతిబింబిస్తున్నవి. దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులుగారు తమ స్వీయచరిత్రను వ్రాసినారు. ఆయన 1866 లో జన్మించినందున ప్రకాశంగారికన్న పెద్దవాడు, వీరేశలింగంగారికన్న చిన్నవాడు, కాశీనాథుని నాగేశ్వరరావు గారికి సమకాలికుడు. 1877 లో మదరాసులో జరిగిన మూడవ జాతీయ కాంగ్రెస్ మహాసభలో పాల్గొని, తరువాత గాంధీగారి ప్రభావానికి లోనై స్వాతంత్ర్య పోరాటంలో పలుమార్లు జైలుకువెళ్ళి, శాసన సభలను అలంకరించి, ఖద్దరు ఉద్యమాన్ని, హరిజన ఉద్యమాన్ని, ఆంధ్రరాష్ట్ర ఉద్యమాన్ని తెలుగుదేశంలో నిర్వహించి, ఆనాడు ఆంధ్రదేశానికి వెంకటప్పయ్యగారు నాయకత్వం వహించిరి. ఆయన ఆనాటి భారతదేశ నాయకులలో కూడ ప్రథమశ్రేణిలో ఉండిరి. చిత్తరంజన్‌దాసుగారు భారత జాతీయ కాంగ్రెస్ అధ్యక్ష పదవికి రాజీనామా చేసినప్పుడు వెంకటప్పయ్యగారు ఆస్థానానికి ఎన్నిక అయినాడంటే నాటి రాజకీయరంగములో ఆయన ప్రాధాన్యం స్పష్టంగా తెలుస్తుంది. గాంధీగారు వెంకటప్పయ్యగారిపట్ల అత్యంత గౌరవ భావాన్ని కలిగియుండిరి. వెంకటప్పయ్యగారి స్వీయచరిత్ర రెండు సంపుటాలలో ప్రకటితమైనవి. ఇందులో ఆనాటి రాజకీయ, సాంఘిక రంగాలలో ప్రాధాన్యం

వహించిన వ్యక్తులు, దేశ పరిస్థితులు, ఉద్యమాలు, చెన్నపట్టణం, రాజమండ్రి మొదలైన పట్టణాలు వాని గూర్చిన వివరాలు వర్ణితమైనవి సుమారు యాభై సంవత్సరాల చరిత్ర యిందులో మనకు తెలుస్తున్నది.

వెంకటప్పయ్య, ప్రకాశం పంతులుగార్ల స్వీయచరిత్రల వరుసలోనే ఎన్న దగినది అయ్యదేవర కాళేశ్వరరావుగారి "నవ్యాంధ్రము". కాళేశ్వరరావుగారు ఈ యిరువురు నాయకుల ప్రభావానికి లోనైనవారు. పూర్తిగా గాంధీగారి యుగానికి చెందినవారు. సాంస్కృతిక రంగాలలో కూడా పనిచేసినవారు. కొమర్రాజు లక్ష్మణరావుగారిచే ప్రభావితులై "విజ్ఞాన చంద్రిక గ్రంథమండలి" నిర్వహణలో పాల్గొని, "అమెరికా సంయుక్తరాష్ట్రాలు", "తురుష్క ప్రజాస్వామికం" మొదలైన ఉత్తమ చరిత్ర గ్రంథాలు రచించి వన్నెకెక్కిన గ్రంథకర్తలు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని, మున్సిపలు రాజకీయాలలో అడుగుపెట్టి, చైర్‌మెన్ పదవిని నిర్వహించి శాసన సభలో ప్రవేశించి, తుదిదశలో స్పీకర్ పదవినికూడా నిర్వహించినారు. "వందేమాతరం", "హోమ్‌రూల్", "ఉప్పు సత్యాగ్రహం" మొదలైన అనేక ఉద్యమాలలో పాల్గొన్నారు. అయితే కాళేశ్వరరావు గారి గ్రంథం 1930 వరకు మాత్రమే వచ్చి ఆగిపోయినది. ప్రకాశంగారి జీవిత యాత్ర వలె యిదికూడా అసమగ్రం. కాళేశ్వరరావు గారి గ్రంథంలో ఆనాటి రాజకీయ, సాహిత్య రంగాలను గూర్చి, నాటకాలను గూర్చి, పండితులను గూర్చి, సమకాలిక ప్రముఖులను గూర్చి తెలుసుకోదగిన వివరాలు ఎన్నో ఉన్నవి. ఈ వరుసలో పేర్కొనదగినదే గొట్టిపాటి బ్రహ్మయ్య గారి "జీవన నౌక". ఆధునిక ఆంధ్రదేశ చరిత్రకు తగినంత సామాగ్రి యిందులో లభిస్తున్నది. స్వాతంత్రోద్యమం, యితర ఉద్యమాలు, సమకాలికులైన నాయకులతో పాటు సుమారొక 70, 80 సంవత్సరాలలో క్రమక్రమంగా మారిన సాంఘిక వ్యవస్థ యీ గ్రంథంలో మనకు కనిపిస్తున్నది. కాళేశ్వరరావు గారివలె బ్రహ్మయ్యగారు స్వాతంత్ర్యయోధులు. రాజకీయాలను ఎక్కువగా పట్టించుకోక సాహిత్య, సాంస్కృతిక రంగాలకే అంకితమైన మరికొందరి ఆత్మకథలు మనముందున్నవి. ఇందులో కోలవెన్ను రామకోటేశ్వరరావు గారి "జీవితానుభవాలు" అనే చిన్న పుస్తకం పేర్కొనదగినది. పత్రికా రచయితగా ఆయన అనుభవాలు, త్రివేణి సంపాదకత్వం, ఆనాటి సాంఘిక, రాజకీయ

సాహిత్య రంగాలకు సంబంధించిన వ్యక్తులు, ఉద్యమాల ప్రస్తావన యిందులో ఉన్నది. విశ్వనాథ సత్యనారాయణ గారు కూడా తమ చివరి దశలో ఒక ఆత్మకథను వ్రాసినారు. ఇది అసంపూర్ణమైన చిన్న గ్రంథం. బాల్యదశ, విద్యాభ్యాసం, చెళ్ళపిళ్ళవారి శిష్యరికం, అప్పటి పరిస్థితులు యిందులో విశ్వనాథవారు పేర్కొన్నారు.

ఆదిభట్ల నారాయణదాసుగారు "నా యెఱుక" అనే పేరుతో తన తొలి ముప్పది సంవత్సరాల జీవిత చరిత్రను వ్రాసినారు. బాల్యదశ, ఆనాటి పరీక్షలు, పడవ ప్రయాణం, వేశ్యలు. బరంపురం, రాజమండ్రి, మదరాసు, మైసూరు పట్టణాలు యిందులో ప్రస్తావితమైనవి శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి గారు తమ "అనుభవాలు - జ్ఞాపకాలు" అనే పేరుతో అరువది ఏండ్ల ఆంధ్ర దేశాన్ని, సంస్కృతిని, సంగీత సాహిత్యాలను, కవులను, పండితులను, గాయకులను, అప్పటి వాదోపవాదాలను శక్తివంతమైన, వ్యావహారిక భాషలో పరిచయం చేసినారు. తెలుగు పల్లెటూళ్ళ జీవితం, ఆచారాలు, సంస్కృతి, శ్రోత్రియ బ్రాహ్మణ గృహాలు యిందులో మనం చూడవచ్చును. దువ్వూరి వెంకటరమణ శాస్త్రి గారు తమ స్వీయచరిత్రను సంపూర్ణంగా వ్రాసి, సమకాలికమైన పండిత ప్రపంచంతో పాటు ఆనాటి దేశపరిస్థితులను వివరించినారు.

సంజీవదేవు గారు "తెగిన జ్ఞాపకాలు" అనే గ్రంథాన్ని సులభమైన వచన శైలిలో వ్రాసి, నాటి దేశపరిస్థితులను వెల్లడిచేసినారు. బహు భాషలతో పరిచయం కలిగి, సమస్త భారతదేశంలో పర్యటనం చేసి, సంగీతాన్ని, సాహిత్యాన్ని కళను అభిమాన విషయాలుగా తీసికొని, దేశీయ, విదేశీయ ప్రముఖులతో పరిచయం కలిగించుకొన్న సంజీవదేవుగారు తమ జ్ఞాపకాలను మనముందుంచినారు. ఈ గ్రంథాలన్నీ ఆధునిక ఆంధ్ర దేశానికి ప్రతిబింబాలుగా ఉండి చరిత్ర రచనకు కావలసిన సామగ్రిని లభింపజేస్తున్నవి.

అప్పుడు ఆంధ్రప్రదేశ్‌లో తెలంగాణము లేదు. నిజాం పరిపాలనలో హైదరాబాదు రాష్ట్రంలో కర్ణాటక, మహారాష్ట్రంతో కలసిన ఒక సమష్టి కుటుంబంగా తెలంగాణ ఉండినది. ఆనాటి తెలంగాణ పరిస్థితులు తెలుసుకోవడానికి ఉపయోగించే ఆత్మకథలు మూడు ముఖ్యమైనవి మొదటిది- కె. వి. రంగారెడ్డి

గారి స్వీయచరిత్ర; రెండవది మందముల నరసింగరావుగారి యాభై సంవత్స రాల హైదరాబాదు; మూడవది రావి నారాయణరెడ్డిగారి వీర తెలంగాణ మొదటి రెండు గ్రంథాలు ఆనాటి పరిస్థితులు ఆంధ్రోద్యమ - రాజకీయోద్యమాలు, హైదరాబాదు విమోచనం, ఆంధ్రప్రదేశ్ ఏర్పాటు మొదలైన ముఖ్య ఘట్టాలను వివరిస్తూ వారి జీవిత వివరాలను, అనుభవాలను కూడా పేర్కొంటున్నవి. మూడవదైన రావినారాయణరెడ్డిగారి గ్రంథంలో తమను గురించి ఏమీ చెప్పకోక తమ అనుభవాలను జ్ఞాపకాలనే ముఖ్యంగా వివరించినారు. తెలంగాణలో ఆంధ్రోద్యమ వ్యాప్తి, స్టేటుకాంగ్రెస్ ఉద్యమవ్యాప్తి, ఆనాటి రాజకీయ పరిస్థితులతోపాటు కమ్యూనిస్టు ఉద్యమం, తెలంగాణా పోరాటాలను గూర్చి వివరిస్తూ విశాలాంధ్ర ఆవశ్యకతను నిరూపించినారు. ఈ మూడు గ్రంథాలు రాజకీయ రంగానికి ప్రాధాన్యం యిస్తున్నవి; సాంస్కృతిక రంగానికి ప్రాధాన్యం తక్కువ యిసున్నవి.

(15-5-1982 ఆకాశవాణి హైదరాబాదు నుండి చేసిన ప్రసంగం)

# తెలుగు వైతాళికులు—సురవరం ప్రతాపరెడ్డి

అది ఇప్పటికి అర్ధశతాబ్దము అనగా యాభై సంవత్సరాల క్రిందటి సంగతి. ఆనాటి సంగతులు తెలిసినవారు యీ సభలో ఎందరో ఉండరు. ఆనాటి హైదరాబాదు నగరం నేటి రాష్ట్రంతో, నగరంతో పోలిస్తే ఎన్నడూ ఊహించ నంత మార్పు వచ్చినది. మధ్యకాలపు రాజరికము, నిరంకుశ పరిపాలన, ప్రజల శ్రేయస్సుకన్న పరిపాలకుల శ్రేయస్సు ప్రాధాన్యం, ప్రజల మాతృభాషలను ఉద్దేశపూర్వకంగా అణచివేత మొదలైన ప్రత్యేకతలు కలిగిన వాతావరణమది. అది "తౌరక్యాంధ్ర సంస్కృతికి" ఆలవాలం. నేటి "తెనుగు మీరిన తీరుకా"దది. నాంపల్లి ఆబిడ్స్‌నుండి మొకరంజాహి మార్కెట్ వెళ్ళే మలుపు మీద కుడిచేతివైపు ఒక చిన్న ఇల్లు ఆ ఇంటిలోనే ప్రెస్సు. ముందటి రెండు గదులలోని చిన్న గదిలో ఒక టేబులు, నాలుగు కుర్చీలు, పుస్తకాలతో నిండిన కొన్ని బీరువాలు. అన్ని బీరువాలమీద "ఈ పుస్తకాలు ఎవరికీ యీయబడవు" అని అతికించిన కాగితాలు. ఆ టేబుల్ ముందు కుర్చీలో అప్పటికే (1939) నెరసిన వెంట్రుకలతో ఏదో పుస్తకము చదువుతూనో లేక పత్రిక ప్రూఫులు చూస్తూనో లేక పత్రిక కొరకు ఏమైనా వ్రాస్తూనో లేక ఎవరైన కవిపండితులతో సంభాషిస్తూనో, సాధారణమైన ధోవతి, షర్టు వేసుకొని కూర్చున్న ఒక వ్యక్తి. అయనే గోలకొండ సంపాదకులు. తెలియనివారు ఎవరైనా వచ్చి పలుకరిస్తే కొట్టవచ్చి నట్లు మాట్లాడే ధోరణి ఆయనది. డా॥ జాన్సన్‌ను గురించి చెప్పినట్లుగా ఆయ నలో బాహ్య స్వరూపంలోనే కాఠిన్యము కనిపిస్తుంది కాని అంతరంగం వెన్న వంటిది. "నిండు మనంబు నవ్యనవనీత సమానము. పల్కుదారుణాఖండల శస్త్ర తుల్యము" అన్నమాట ఎవరైనా యీనాడు వ్రాస్తే యీయనను గూర్చే వ్రాసినాడని చెప్పడానికి తగిన వ్యక్తిత్వం.

ఎవరీవ్యక్తి అనే ప్రశ్న శ్రోతలలో సహజంగా కలుగుతుంది. ఆయనయే సురవరం ప్రతాపరెడ్డి. ఆయన కూర్చుండిన గదికి సంబంధించిన ఇల్లే గోల కొండ పత్రికకు సంబంధించిన కార్యాలయం ఆయన సకుటుంబంగా నివసించే ఇల్లుకూడ ఆ ముద్రణాలయానికి వెనుకభాగమే. ఆ వీథియే ప్రతి సాయంకాలం

నైజాం నవాబు తమ రాజ రాజభవనంనుండి (కింగ్ కోఠి) చార్మినార్ వైపు వెళ్ళుతున్న మార్గం. ఈ మార్గంలో అప్పటి రాష్ట్రంలో ప్రజా భాషలలో ముఖ్యమైన తెలుగుభాష ప్రచారానికి కంకణం కట్టుకొని ఆ భాషావికాసానికి ఆత్మార్పణ చేయడానికి జీవిత ప్రాంగణంలో అడుగుబెట్టు సందర్భంలోనే నిశ్చయించిన ధైర్యశాలి, త్యాగమూర్తి ప్రతాపరెడ్డి నివాసం. మాతృభాషా వికాసం, ప్రజా స్వామ్య స్థాపన, సంఘ సంస్కరణ అన్న మూడు ఆశయాలను త్రికరణ శుద్ధితో అంకితమైన విజ్ఞాని ఆయన.

ఆయన మన తెలుగు వైతాళికులందరివలెనే గడచిన శతాబ్దాంతంలో అనగా 28 మే 1896 వ సంవత్సరంలో అప్పుడు గద్వాల సంస్థానానికి రాజధానికి నుండిన 'బోరవెల్లి' గ్రామంలో తమ మాతామహుల ఇంటిలో జన్మించినారు కాని ఆయన స్వగ్రామం అలంపురం తాలూకాలోని ఇటికాలపాడు. "నీరు లేని ఇటికాలపాడు" అని ఆయన తమ గ్రామాన్ని గురించి చెప్పేవారు. తమ తాలూకాను గురించి-

"అలంపురీనందనారామ విభ్రాజి
మల్గోబ ఫలరాజి మధుర రుచికి"

అని తమ తాలూకాలో పండే మామిడిపండ్ల తీపితో తెలుగు భాషా మాధుర్యాన్ని గర్వంగా పోల్చినారు. ప్రతాపరెడ్డిగారు క్రమక్రమంగా చదువును సాగించి మెట్రిక్యులేషన్ పూర్తిచేసి హైదరాబాదులోని నిజాం కళాశాలలో ఇంటర్మీడియేట్ చదివి, ఆ తరువాత మద్రాసువెళ్ళి బి.ఎ. పూర్తిచేసి, ఆమీద బి.ఎల్. డిగ్రీ తీసుకొని తమ జీవితయాత్రను ఏ విధంగా సాగించవలెనో అన్న ఆలోచనలో పడిరి. మదరాసులోనున్నప్పుడు వెల్లాల సదాశివ శాస్త్రిగారితోనూ, వేదం వెంకటరాయ శాస్త్రిగారితోనూ గాఢమైన పరిచయం ఏర్పడి, ఆ ఉభయుల ప్రభావంలో, శుశ్రూషలో, గురుముఖంలో సంస్కృతాంధ్రాలలో గట్టి పాండిత్యము సంపాదించిరి. తెలుగులో కవిత్వం అల్లడం, వచన రచనలు చేయడం విద్యార్థి దశలోనే ప్రారంభించిరి. తత్ఫలితంగా చిన్నతనంలోనే సాహిత్యంవైపు ఆయన చిత్తవృత్తి అభిముఖమైనది. తరువాత ఆయన జీవితం మొత్తం సాహిత్యానికే అంకితమైనది. విద్యార్థిదశలోనే మానవల్లి రామకృష్ణకవిగారితో పరిచయం కలుగడం, ఆ పరిచయం ఆయనలోని సహజమైన సారస్వతాభిలాషకు దోహదం చేయడం జరిగింది.

బి. ఏ; బి. ఎల్. డిగ్రీలతో, సంస్కృతాంధ్రభాషలలో గాఢమైన పాండిత్యంతో సురవరం ప్రతాపరెడ్డిగారు హైదరాబాదునగరం ప్రవేశించిరి. అప్పుడు ఆయన ముందున్నవి మూడు మార్గాలు. మొదటిది స్వగ్రామంలో వారసత్వంగా వచ్చిన వ్యవసాయవృత్తిని అవలంబించి జీవితయాత్ర సాగించడం. రెండవది న్యాయశాస్త్రములో పొందిన డిగ్రీ ఆధారంగా ఆ వృత్తిని అవలంబించడం. మూడవది అప్పుడు హైదరాబాదులో ప్రముఖులైన రాజాబహద్దూర్ వెంకట్రామారెడ్డికి తనపై ఉన్న ఆదరాభిమానాలను ఉపయోగించుకొని ప్రభుత్వోద్యోగం సంపాదించడం. కాని ఆయనకు యీ మూడింటిపైన చిత్తం లగ్నంకాలేదు. అప్పటి హైదరాబాదు పరిస్థితులు, భారతదేశంలో గాంధీమహాత్ముని నాయకత్వంలో జరుగుతున్న స్వాతంత్ర్యోద్యమము, తెలంగాణా ప్రజల వెనుకబడినతనం, దైన్యం, దరిద్రం, తెలుగు భాషకు పట్టిన అధోగతి, కనీసం ప్రాథమిక విద్యనైనా మాతృభాషద్వారా ఆర్జించలేని అవమానం, నూటికి పదిమాత్రమే లేనివారి మాతృభాషను నూటికి తొంబదికిపైగల ప్రజలమీద రుద్దడం, ప్రాథమిక స్వత్వాలు ఏమాత్రం ప్రజలకు యీయని నిరంకుశ పరిపాలన, ఇవన్నీ ఆయనను కదిలించివేసినవి. అందుచేతనే ఆయన తనముందున్న మూడు మార్గాలలో ప్రయాణం చేయలేదు. దేశసేవ, ప్రజల సర్వతోముఖాభివృద్ధి, సంఘసంస్కరణ, మాతృభాషా వికాసం అను ఉన్నత లక్ష్యాలకు అనుగుణమైన జీవిత పథాన్ని ఆయన నిర్దేశించుకున్నాడు. అదియే పత్రికా నిర్వహణ ఆ పత్రికయే గోలకొండ పత్రిక. రాజాబహద్దూర్ వెంకట్రామారెడ్డిగారు ఈ యువకుని జూచి, ఆయనను ఉత్తేజపరచిన ఉదాత్త లక్ష్యాలను గమనించి, అందుకు కావలసిన సమస్త సౌకర్యాలను కల్పించిరి. ఇంచుమించుగా ఇటువంటి ఆశయాలనే కలిగి, ఇష్టమున్నా లేకపోయినా న్యాయవాద వృత్తిని నిర్వహిస్తూ, రాజాబహద్దూర్ వెంకట్రామారెడ్డిగారికి విశ్వాసపాత్రులైన కొమర్రాజు వెంకటలక్ష్మణరావుగారిని మార్గదర్శకులుగా పెట్టుకొని అప్పటి హైదరాబాదు రాష్ట్రంలోని సమస్త జాతీయోద్యమాలతో సంబంధం పెట్టుకొని ఆంధ్రోద్యమ పితామహులైన మాడపాటి హనుమంతరావుగారు ప్రతాపరెడ్డిగారికి అండగా నిలిచిరి. ఈ ఉభయుల తోడ్పాటుతో ప్రతాపరెడ్డిగారు ముందంజవేసి గోలకొండ పత్రికను 10-5-1926న స్థాపించి, 1947 వరకు నిరంతరాయంగా అర్థ వార పత్రికగా నిర్వహించి, నిద్రాణమైఉన్న నాటి తెలంగాణమును అన్ని రంగాలలో

ప్రబుద్ధకు గావించిరి. కావునసే గోలకొండ పత్రిక తొలి రోజులలో ఒక సంపాద కీయంలో "మేము మా పత్రికా స్థాపన కాలంనుండి రెండు అంశాలు దృష్టి పథంలో ఉంచుకొని దేశీయుల సేవ చేయుచున్నాము. మొదటిది ఆంధ్ర భాషా సేవ; రెండవది జాతి, కుల వివక్షత లేక నిష్పక్షపాతముగా ఆంధ్రులలో సర్వ శాఖలవారి యొక్క సత్వరాభివృద్ధికి పాటుపడుట" అని వ్రాసి పత్రిక ఆశయా లను స్పష్టీకరించిరి. ఈ ఆశయాల కనుగుణంగా గోలకొండ పత్రిక నడిచినది. పత్రికా నిర్వహణలో ఎన్నియో ఇబ్బందులు వచ్చినవి. ముఖ్యంగా ప్రభుత్వం కావలసిన ఇక్కట్టులన్నియూ కల్పించినది. కాని ఆయన యీ ఇక్కట్టులకు జంకలేదు. నిశ్చలంగా, ధైర్య సాహసాలతో, ద్రవ్యార్జన కాంక్షను పూర్తిగా వదలుకొని, త్యాగంతో, తమ జీవిత సర్వస్వాన్ని పత్రికకూ, ఆ పత్రిక ద్వారా తెలంగాణా ప్రజల అభ్యుదయానికి అంకితం గావించిరి.

ఆనాడు హైదరాబాదు రాష్ట్రంలోని ప్రజలలో నూటికి తొంబది పాళ్ళు తెలుగు, మరాఠి, కన్నడము అనే మూడు భాషలు మాట్లాడేవారు. అదొక చిత్రమైన సమష్టి కుటుంబం. ఈ మూడు భాషలు మాట్లాడే ప్రజల ఆశయాలు ఒక్కటే. జాతీయ భావాల ప్రేరణతో, భారతదేశంలో సాగుతున్న ఉద్యమాల ఉత్తేజంతో నాటి హైదరాబాదు రాష్ట్రంలో కూడ జాతీయోద్యమాలు, విమోచ నోద్యమాలు ప్రారంభమై కొనసాగినవి. ఈ ఉద్యమాలన్నింటితోను ప్రతాపరెడ్డి గారు గాఢమైన సంబంధము కలిగివుండి ముఖ్యమైన పాత్ర నిర్వహించినారు. ప్రజల క్షేమాన్ని కాంక్షించే ప్రతి ఉద్యమంతోను ఆయన దగ్గరి సంబంధము పెట్టుకున్నారు. కాని ఆయన సర్వస్వం అర్పించినది గోలకొండ పత్రికకూ, తెలుగు భాషా వికాసానికి అని చెప్పితే అతిశయోక్తి కాదు. ప్రతాపరెడ్డిగారు సంఘ సంస్కరణాభిలాషి. నిష్కళంక జాతీయవాది. సంస్కృతాంధ్రములతో పాటు ఇంగ్లీషు, ఫారసీ, ఉర్దూ భాషలలో ప్రావీణ్యం కలిగిన పండితులు. అనేక విషయాలను గూర్చి సంపూర్ణమైన విజ్ఞానము సంపాదించిన మేధావి. మంచివక్త, విమర్శకుడు, పరిశోధకుడు. ఎంతటి ఉద్గ్రంథమైననూ వేగంగా చదువగలిగి అందులోని సారాంశాన్ని గ్రహించగలిగిన మేటి పాఠకుడు. నిరంతర గ్రంథావ లోకనంలో నిమగ్నుడై యుండే సంస్కృతీపరుడు అన్నిటికన్న మిన్నగా దవ్వునకు భయతరుడుగా కనిపించినప్పటికీ, దాపునకు వచ్చిన తరువాత పరమాప్తుడు కాగలిగిన అమృతమూర్తి. ఇన్ని సుగుణాలు కలిగిన ప్రతాపరెడ్డి

గారు సాహిత్యరంగంలో సాధించిన కృషి ఏమిటి? అందువలన జరిగిన భాషా వికాసం ఏమి? రచయితగా ఆయన ప్రతిభావ్యుత్పత్తులు ఏమి? తెలుగు సారస్వతంలో ఆయన విశిష్టత ఏమి? అను ప్రశ్నలు ఉత్పన్నం అవుతున్నవి. ఈ ప్రశ్నలకు మనం ఇచ్చే సమాధానాలు తెలుగు వైతాళికుడుగా ఆయన స్థానాన్ని నిరూపించగలవు.

ప్రాచీన సంప్రదాయ పద్ధతి, సంస్కృతంతోపాటు ఆధునిక పద్ధతి, వైదుష్యాన్ని జోడించుకొని ప్రతాపరెడ్డిగారు సాహిత్యంలో రంగ ప్రవేశం గావించినారు. ఆయన సాహిత్య జీవనానికి విద్యార్థి దశలోనే పునాదులు పడినవి. విద్యార్థిగా ఆయన కవితలు అల్లినారు. వ్యాసాలు వ్రాసినారు. ప్రతాపరెడ్డిగారు గోలకొండ పత్రిక స్థాపించిననాటి వాఙ్మయ పరిస్థితులు ఒకసారి గమనించవలసి ఉంటుంది. "ఆంధ్ర సాహితీ పునరుద్ధరణ ప్రభావులైన వీరేశలింగంపంతులు గారు అప్పటివరకే తన ముద్రను తెలుగు వాఙ్మయంమీద వేసినారు." వీరేశలింగంగారి మార్గంలో చిలకమర్తి ప్రభృతులు రచనా వ్యాసంగం సాగిస్తుండిరి. ప్రతాపరెడ్డిగారికి చిలకమర్తివారి రచనలు మిక్కిలి అభిమానాస్పదాలు. తెలుగు వాఙ్మయంలో ప్రతాపరెడ్డిగారు వీరేశలింగంగారి మార్గాన్నే అనుసరించిరి. తెలుగు నాటకము, తెలుగు నవల, తెలుగు కథ అప్పటివరకే వికాసం పొందినవి. దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులుగారి ఆంధ్రపత్రిక, ముట్నూరి కృష్ణారావు గారి కృష్ణాపత్రిక తెలుగుదేశాన్ని ప్రభావితంచేసి, తెలుగు ప్రజల అభిరుచులను, అభిప్రాయాలను రూపొందిస్తూండే రోజులవి. నాగేశ్వరరావు పంతులుగారి పత్రికలు ప్రతాపరెడ్డిగారిని పత్రికా రచనవైపు అభిముఖం గావించినవి. నాగేశ్వరరావుగారు స్థాపించి, నడిపిన మొదటి తెలుగు దినపత్రిక మొదటి సంపాదకులైన గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారిపైన ప్రతాపరెడ్డిగారికి అపార గౌరవం. ప్రతాపరెడ్డిగారిపైన హరిసర్వోత్తమరావుగారికి అత్యంత అభిమానము. ఈ సందర్భమున తెలుగుదేశంలో భారత స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొని చెరసాలకు వెళ్ళినవారిలో హరిసర్వోత్తమరావుగారు ప్రప్రథములన్న సత్యాన్ని మనము గమనించవలెను. గిడుగు, గురుజాడల వ్యావహారిక భాషావాదంతోపాటు, గురజాడ రచనలు అప్పటివరకు ప్రకటితమైనవి. లక్ష్మణరావుగారి విజ్ఞానచంద్రికా గ్రంథ మండలి గ్రంథాలు ప్రకటితమైనవి. తెలుగుదేశంలో చరిత్ర పరిశోధన, విజ్ఞాన వాఙ్మయ ప్రకటన కొంత జరిగినది. తిరుపతివెంకటకవుల కావ్యాలు, అవధానాలు

దేశమంతటినీ ఉత్తేజపరచినవి. ఆంగ్ల విద్యావిభూషితులైన యువకులు నూతన పద్ధతులలో కవితలు వ్రాసి భావకవిత్వాన్ని ప్రచారం చేస్తుండిరి. అయితే తెలంగాణా పరిస్థితులు మరొక రీతిగా నుండెను. ఇక్కడ అక్షరాస్యుల సంఖ్య మిక్కిలి తక్కువ. సంస్కృతాంధ్రాలలో పాండిత్యానికి గద్వాల, వనపర్తి మొదలైన ఆస్థానాలలో తప్ప ఆదరణ లేకుండెను. సంస్కృతాంధ్రాలలో పండితులు పల్లెటూళ్ళలో మరుగుపడిన మాణిక్యాలవలె ఉండిరి. వారికి ఇంగ్లీషు భాషతోకాని, ఆధునిక విద్యాజ్ఞానంతోగాని సంబంధం లేకుండెను. ప్రభుత్వ ప్రోత్సాహం ఉర్దూకు సంపూర్ణంగా లభించడమేగాక ప్రజల మాతృభాషలైన తెలుగు, మరాఠి, కన్నడాలు అణచివేయబడినవి. తెలుగువారు కలుసుకొన్నప్పుడు ఉర్దూ భాషలోనే మాట్లాడేవారు. దీనినే తౌరక్యాంధ్రం అని ప్రతాపరెడ్డిగారు వర్ణించినారు. ప్రాథమిక స్వత్వాలు ఏమాత్రంలేని పరిస్థితిలో గ్రంథాలయాలు నడుపుకొనుట, సభలు సమావేశాలు జరుపుట అత్యంత కష్టసాధ్యంగా ఉండెను. ఈ పరిస్థితినే "వాగ్బంధన శాసనశృంగార తాండవవిశేష"మని ప్రతాపరెడ్డిగారు వర్ణించిరి. ఇటువంటి వాతావరణంలో కలము నడిపించినారు ప్రతాపరెడ్డిగారు.

ప్రతాపరెడ్డిగారు సుమారు 40 గ్రంథాలు వ్రాసినట్లు మనకు తెలుస్తున్నది. ఇందులో ఒకటి రెండు అముద్రితాలు. ఒకటి రెండు అసమగ్రాలు. ఒకసారి ప్రతాపరెడ్డిగారు రచనల పట్టికను పరిశీలిస్తే ఆధునిక వాఙ్మయ ప్రక్రియలన్నింటినీ ఆయన చేపట్టినట్టు తెలుస్తున్నది. ఆనాటి తెలుగు సాహిత్యంలోని నూతన ధోరణులన్నింటిని ఆయన పరిశీలించి తన సారస్వత యాత్రను సాగించినారు. ప్రతాపరెడ్డిగారు ఒక నవలను రచించినట్లు కూడ మనకు తెలుస్తున్నది. అది ఆనాటి హైదరాబాదులోని జనానా స్త్రీల జీవితాన్ని చిత్రించేదిగా ఉన్నట్లు తెలుస్తున్నది. అయితే యీ నవల ప్రకటితము కాలేదు. ఆనాటి నవలా రచయితలు కొందరు అనుసరించిన గ్రాంథికశైలినే ప్రతాపరెడ్డిగారు అనుసరించినట్లు తెలుస్తున్నది. "ఆరెపేరు" లనే మరొక నవలనుగూడ ప్రతాపరెడ్డిగారు వ్రాసినట్లు తెలుస్తున్నది. ప్రతాపరెడ్డిగారు రెండు నాటకాలనుగూడ వ్రాసినారు. ఒకటి ఉచ్ఛల విషాదం. రెండవది భక్త తుకారాం. ఈ రెండు నాటకాలుగూడ ప్రకటితాలే. ప్రతాపరెడ్డిగారు మద్రాసులో ఉన్నప్పుడు రాజమన్నార్‌గారితో మంచి స్నేహం ఏర్పడినది. రాజమన్నార్‌గారు ఆ రోజులలో నడిపిన "కళ" అనే పత్రికలో భక్త తుకారాం ప్రకటితమైనది. ఈ రెండు నాటకాలు ప్రదర్శనకొరకే

వ్రాయబడినవి భక్త తుకారాం నాటకం మద్రాసు, గుంటూరు, బెజవాడ, సికింద్రాబాదు మొదలగు పట్టణాలలో ప్రదర్శింపబడినది. ఉచ్చ్రల విషాదం దేశభక్తిని ప్రబోధించే నాటకం. భక్త తుకారాంలో స్వదేశాభిమానంతోపాటు కులరహిత సమాజస్థాపన అనే రెండు ఆదర్శాలను ప్రతాపరెడ్డిగారు ప్రబోధించినారు. ఆ రోజులలో ప్రచారంలో ఉండిన ధర్మవరం, కోలాచలం, చిలకమర్తి, పానుగంటి ప్రభృతుల నాటకాలలోవలెనే తమ నాటకాలలోకూడ ప్రతాపరెడ్డిగారు పద్యాలను, పాటలను ఉపయోగించి, సంభాషణలను గంభీరమైన శైలిలో నడిపినారు. కవిత్వం అల్లవలెననే అభిలాష వారికి విద్యార్థి దశలోనే కలిగినది. విద్యార్థిగా పద్యరచనలను వారు కృష్ణాపత్రికలో ప్రకటించినారు. చంపకీభ్రమరవిలాసం అన్నది వారి తొలికావ్యమని తెలుస్తున్నది. తరువాత వారు ప్రేమార్పణం, హంవీర సంభవము, ధర్మాసనం, మద్యపానం మొదలైన కావ్యాలను వ్రాసినారు. అప్పుడప్పుడు పత్రికలో వివిధ సందర్భాలలో అనేక విషయాలమీద పద్యాలు వ్రాసి వారు ప్రకటించినారు. కాని క్రమక్రమంగా వారు పద్యరచనా వ్యాసంగాన్ని విడిచిపెట్టిరి. దేశాభిమానం, భాషాభిమానం వారి పద్యాలలో ప్రతిబింబిస్తున్నవి. పతాపరెడ్డిగారి పద్యశైలి ప్రాచీన ఫక్కికి చెందినది. సీసాలు, గీతాలు, వృత్తాలు, కందాలు మొదలైన అనేక ఛందస్సులను వీరు ఉపయోగించిరి. ప్రతాపరెడ్డిగారు కొన్ని మంచి గేయాలను కూడా వ్రాసిరి. ఆ గేయాలు కూడ వారి దేశభక్తికి ప్రతిబింబాలు. అప్పుడు నైజాం నవాబు ప్రవేశపెట్టిన కొన్ని సంస్కరణలను తీవ్రంగా విమర్శిస్తూ వారు గోలకొండలో వ్రాసిన సంపాదకీయాలు ఉత్తేజకరాలై, నాటి తెలంగాణా పాఠకుల హృదయాలను కదలిస్తూ ఉండేవి. ఒక పర్యాయం ఆంధ్ర ప్రాంతానికి చెందిన ఎవరో ఒక ప్రముఖుడు తెలంగాణాలో కవులు లేరని ఉద్ఘాటించగా, ప్రతాపరెడ్డిగారు ఆనాటి తెలంగాణా కవుల రచనలను సేకరించి గోలకొండ కవుల సంచిక ప్రకటించిరి. కొంతకాలం తరువాత ప్రతాపరెడ్డిగారు ఎందువలననో పద్యరచనకు తమ పత్రికలో అంత ప్రాధాన్యము ఇవ్వలేదు. పద్యాలను, కవితలను గోలకొండ పత్రికలో ప్రకటించరాదన్న నియమాన్ని పాటించిన రోజులు నాకు జ్ఞాపకమున్నవి. వచన రచనలకే ప్రతాపరెడ్డిగారు ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చిరి. భాషావికాసానికి వచన రచన ఎక్కువ అభివృద్ధి పొందవలెనని వారు విశ్వసించిరి కాబోలు. ప్రతాపరెడ్డిగారు వ్రాసిన కవితలకన్న, నాటకాలకన్న, నవలలకన్న, కథానికలు ఎక్కువ వ్యాప్తిపొందినవి. వాస్తవానికి ఆధునిక కథానికా రచయితలలో ప్రతాపరెడ్డిగారికి

ప్రముఖస్థానం ఉంది. ఆయన వ్రాసిన కథలు "ప్రతాపరెడ్డి కథలు" అనే పేరుతో ప్రకటితమైనవి. గ్రామీణ జీవితాన్ని, తెలంగాణాభాషను, పలుకుబడిని ప్రతాపరెడ్డి గారి రచనలో స్పష్టంగా పోల్చుకోవచ్చును. నిరీక్షణ అనే వారి కథ తెలుగు కథానికా సాహిత్యంలో ఉత్తమ శ్రేణికి చెందినదని పలువురు విమర్శకులు అభిప్రాయపడినారు. మొగలాయి కథలు అనే పేరుతో ప్రతాపరెడ్డిగారు మరికొన్ని కథలను వ్రాసినారు. ఈ కథలు అధిక్షేప ప్రధానములైన కథలు. గోలకొండ పత్రికలో ప్రకటితమైనవి కథలతోపాటు జీవితాలను, జీవిత చరిత్రలను కూడ ప్రతాపరెడ్డి గారు వ్రాసినారు. హైందవ ధర్మవీరులు అనే పుస్తకంలో 16 మంది దేశభక్తుల, వీరుల చరిత్రలను ప్రతాపరెడ్డిగారు గ్రంథస్థము గావించినారు. ఈ గ్రంథానికి పీఠిక వ్రాసిన మల్లంపల్లి సోమశేఖరశర్మగారు ఇందులోని శైలిని, కథాకథన పద్ధతిని అత్యంతముగా ప్రశంసించిరి. రాజాబహద్దూర్ వెంకట్రామారెడ్డి జీవిత చరిత్రను వారొక గ్రంథంగా వ్రాసినారు.

ప్రతాపరెడ్డిగారికి శాశ్వతంగా కీర్తితెచ్చిపెట్టే గ్రంథాలు వారి పరిశోధన గ్రంథాలు. హిందువుల పండుగలు అనే గ్రంథాన్ని వారు చాల పుస్తకాలు చదివి క్రొత్త విషయాలను సేకరించి ప్రామాణికమైన పద్ధతిలో, సరళమైన శైలిలో వ్రాసినారు. మన పురాణాలను, స్మృతిగ్రంథాలను వీరు ఎంత బాగుగా పరిశీలించినారో యీ పుస్తకం మనకు తెలియజేస్తున్నది. ఈ పుస్తకానికి పీఠిక వ్రాసిన ఆచార్య రాధాకృష్ణ పండితులు యీ రచనను చాల మెచ్చుకొనిరి. రామాయణ విశేషాలు ప్రతాపరెడ్డిగారి గాఢమైన పాండిత్యానికి నిదర్శనం. ప్రతాపరెడ్డిగారికి మిత్రులైన చిదిరమఠం వీరభద్రశర్మగారు నడిపిన విభూతి అనే పత్రికలో యీ వ్యాసాలు మొట్టమొదటిసారి ప్రకటితమై, తరువాత గ్రంథరూపం పొందినవి. చారిత్రక దృక్పథంతో ప్రతాపరెడ్డిగారు రామాయణాన్ని విమర్శించి, అనేక నూతనాంశాలను వెల్లడి చేసినారు. రామాయణ విశేషాలు వారి పరిశోధన పాటవానికి ఉత్తమ ఉదాహరణ. 'ఆంధ్రుల సాంఘిక చరిత్ర' ప్రతాపరెడ్డిగారి మరొక ఉత్తమ గ్రంథం; ప్రామాణిక గ్రంథం. ఇందులో వారు క్రీ. శ. 1050 నుండి సుమారు తొమ్మిదినూర్ల సంవత్సరాల కాలానికి చెందిన ఆంధ్రుల సాంఘిక చరిత్రను చక్కగా వివరించిరి, ఈ కాలానికి చెందిన ప్రజల జీవన విధానాన్ని, విశేషించి కళలు, మతము, వ్యాపారం, వినోదం, అలంకరణము, ఆచారాలు మొదలైన శీర్షికల క్రింద ప్రతిభావంతంగా వివరించిరి. ఇటువంటి

గ్రంథం తెలుగులో రావడానికి ఇదే మొదటి పర్యాయం. వేటూరి ప్రభాకరశాస్త్రి, వేలూరి శివరామశాస్త్రి, రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ మొదలగు పండితుల మెప్పులను పొందిన గ్రంథం ఇది. కేంద్ర సాహిత్య అకాడమివారి మొట్టమొదటి తెలుగు బహుమతి పొందినది ఈ గ్రంథం. ఇవిగాక ప్రతాపరెడ్డిగారు మరికొన్ని చిన్న పుస్తకాలు వ్రాసినారు. సంఘోద్ధరణ గ్రామజన దర్పణం, నిజాం రాష్ట్ర పరిపాలన, గ్రంథాలయోద్యమం మొదలయినవి యీ శ్రేణికి చెందిన గ్రంథములు. యువజన విజ్ఞానం వీరు వ్రాసిన మరొక గ్రంథం. ప్రజాధికారాలు అని వీరు వ్రాసిన గ్రంథంలో ప్రాథమిక స్వత్వాలనుగూర్చి చక్కగా వివరించినారు. డాక్టరు పట్టాభి సీతారామయ్యగారు యీ గ్రంథాన్ని ప్రశంసించి, ప్రతివారు చదువదగిన గ్రంథమని తెలిపిరి. ఇవిగాక వీరు సంపాదించి పీఠికలు వ్రాసినవి ఇంకా ఎన్నో ఉన్నవి. తెలుగు లిపి సంస్కరణనుగూర్చి ప్రతాపరెడ్డిగారు ఒక చిన్న పుస్తకాన్ని వ్రాసిరి. ప్రతాపరెడ్డిగారి రచనలను పరిశీలించినప్పుడు ఇంతకుముందు చెప్పినట్లుగా ఆధునిక వాఙ్మయ ప్రక్రియలన్నింటిని వారు స్పృశించినారని స్పష్టమవుతున్నది. అయితే వారికి శాశ్వతమైన కీర్తిని, తెలుగు భాషలో ఉన్నత స్థానాన్ని సంపాదించి పెట్టిన గ్రంథాలు నిస్సందేహంగా పరిశోధన గ్రంథాలే అని చెప్పవచ్చును. రామాయణ విశేషాలు, సాంఘిక చరిత్ర, హిందువుల పండుగలు అనే మూడు గ్రంథాలు ఉత్తమశ్రేణికి చెందిన గ్రంథాలు. తెలుగుభాష ఉన్నంతకాలం నిలిచి ఉండదగిన గ్రంథాలు. సమకాలిక పండితులు, వారికి సన్నిహితులు ఆదిరాజు వీరభద్రరావు, చిదిరమఠం వీరభద్ర శర్మ, మల్లంపల్లి సోమశేఖరశర్మ, రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగార్ల మీద వారికి ఆదరాభిమానాలు ఉండేవి. బూర్గుల రామకృష్ణారావుగారికి వారికీ మధ్య పరస్పర సుహృద్భావం ఉండేది. ఎన్. కె. రావుగారు వారికి ఆప్తమిత్రులుగా ఉండేవారు. ఇంకా అనేక పండితులతో వారికి స్నేహసంబంధాలు ఉండేవి.

ప్రతాపరెడ్డిగారు సాధించిన వాఙ్మయ ప్రక్రియలలో వ్యక్తిచిత్రణ గూడ ఒకటి. మాడపాటి హనుమంతరావు గారిని గూర్చి వారు వ్రాసిన వ్యక్తిచిత్రణ ఒక కళాఖండమనే చెప్పవలెను. స్వర్గీయ శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారు తమ ప్రబుద్ధాంధ్రలో యీ వ్యక్తిచిత్రణ ప్రకటించి ఉండిరి. తెలుగులో వ్యక్తి చిత్రణలు ఎక్కువగా ప్రకటితము కాలేదు. ప్రకటితమైన వానిలో ఉత్తమమైనవి తక్కువే. ఉత్తమమైన వానిలో ఈ వ్యక్తిచిత్రణ ప్రత్యేకంగా పేర్కొనదగినది.

గోలకొండ పత్రిక ద్వారా ప్రతాపరెడ్డిగారు గావించిన కృషి చారిత్రాత్మక మైనది; అద్వితీయమైనది. గోలకొండ పత్రిక ప్రజలలో చైతన్యం కలిగించడంలో నిర్వహించిన పాత్ర చిరస్మరణీయమైనది. ఎవరికీ జంకక, ప్రభుత్వం ఒత్తిడికి లొంగక, తాము సత్యమని నమ్మినదానిని ప్రజల శ్రేయస్సుకొరకు ప్రకటించి ప్రచారం చేయడంలో గోలకొండ పత్రిక ఎన్నడూ వెనుకాడలేదు. ఆనాటి సమస్త జాతీయోద్యమాలను గోలకొండ పత్రిక బలపరచినది. సంఘ సంస్కరణ ఉద్యమాలకు పెట్టని కోటగా నిలిచినది. గోలకొండ పత్రిక ద్వారా ప్రతాపరెడ్డి గారు యువకులను అనేక మందిని ప్రోత్సహించినారు. ఆ రోజులలో తెలుగులో వ్రాయవలెనని ఉత్సాహం ఉన్న ప్రతివారికి గోలకొండ పత్రిక ఆశ్రయ మిచ్చి నది. పత్రిక స్థాపించిన తొలిరోజులలో వివిధ విషయాల మీద వ్యాసాలు వ్రాసే వారు దొరకకపోయేవారు. అందుచేత ప్రతాపరెడ్డిగారు వివిధ విషయాల మీద వేరువేరు పేర్లతో వ్యాసాలను, కథానికలను వ్రాస్తుండేవారు. వెర్రి వెంగళప్ప, గద్వాల సిద్ధాంతి, చిత్రగుప్త, భావకవి రామమూర్తి, శ్రీశకుమార్, యుగపతి అనే పేర్లతో అనేక విషయాల మీద ప్రతాపరెడ్డిగారు వ్యాసాలు వ్రాస్తుండేవారు. కొన్ని వాదోపవాదాలను కూడ తామే రెండువైపుల చేస్తుండేవారు. గోలకొండ పత్రికతో సంబంధం వదలుకున్న తరువాత ప్రతాపరెడ్డిగారు ప్రజావాణి అనే దినపత్రికను కొంతకాలం నడిపినారు. స్త్రీలకు స్వాతంత్ర్యం అవసరమా? జంగంలు బ్రాహ్మణులా? హిందువులు శాకాహారులా? శ్రీకృష్ణునికి మీసాలు ఉండెనా? మొదలైన విషయాల మీద తామే స్వయంగా వాదోపవాదాలను నిర్వ హించి పత్రికలో ప్రజలకు ఆసక్తిని కలిగించేవారు ప్రతాపరెడ్డిగారు. సుమారు వేయింటికి పైగా వ్యాసాలను, పత్రికా సంపాదకీయాలను వ్రాసినట్లు విజ్ఞుల అంచనా. ప్రతాపరెడ్డిగారి సంపాదకీయాల శైలి విశిష్టమైనది. ఒకమారు ప్రభుత్వం సంపాదకీయాలపైన ఆంక్షలు విధించగా, సంపాదకీయానికి బదులుగా ప్రతిరోజు సంపాదకీయ కాలంలో ప్రపంచ మేధావుల సూక్తులను ప్రతాపరెడ్డి గారు ప్రకటిస్తూండేవారు. సంపాదకీయాలకన్నా ఆ సూక్తులే ప్రభుత్వానికి గర్భ నిర్భేదకంగా ఉండేవి. ప్రతాపరెడ్డిగారు ఊళ్ళో ఉన్నదీ లేనిదీ వారి సంపాద కీయాలు తెలుపుతూ ఉండేవి. అనగా వారి సంపాదకీయాలు అంత విలక్షణంగా ఉండేవి. ఈ వారం సంపాదకీయాలన్న చదివి మీరు హైదరాబాదులో ఉన్నట్లు తెలుసుకున్నానని నేను వ్రాయగా, బూర్గుల రామకృష్ణారావుగారు కూడ అదేమాట అన్నట్లు నాకు ప్రత్యుత్తర మిచ్చిన సంగతి ఈనాటికి నాకు జ్ఞాపకం. గ్రాంథిక

భాషావాదులుగా ప్రారంభించి క్రమక్రమంగా వారు వ్యావహారిక భాషావాదులుగా మారిరి. శక్తివంతమై, సరళమై, ఎటువంటి గహనమైన విషయానైనా అరటి పండు ఒలచి చేతికిచ్చినట్లుగా సుబోధకముగా ఉండే ప్రతాపరెడ్డిగారి విశిష్టశైలి, తెలంగాణా నుడికారానికి అటపట్టై, ఆయన విలక్షణమైన వ్యక్తిత్వానికి సంపూర్ణ ప్రతిబింబంగా ఉండేది.

ప్రతాపరెడ్డిగారి బహుముఖమైన దేశసేవను గూర్చి, భాషాసేవను గూర్చి, గ్రంథ రచనను గూర్చి వివరించినాను. ఇదంతా పరిశీలించినప్పుడు, ఆ రోజులలో తెలంగాణా పరిస్థితులు జ్ఞాపకం చేసుకున్నప్పుడు, చీకటిలో దారి తెలియక ఉన్న జాతికి, ముఖ్యంగా తెలంగాణాకు వెలుగును చూపించి కర్తవ్యపరాయణుల గావించడానికి ప్రతాపరెడ్డిగారు తమ కలాన్ని, తమ జీవితాన్ని అర్పణ చేసినట్లు స్పష్టం కాగలదు. నాటి తెలంగాణాను మేలుకొలిపినవారు ముగ్గురు. కొమర్రాజు లక్ష్మణరావుగారు, మాడపాటి హనుమంతరావుగారు, సురవరం ప్రతాపరెడ్డిగారు. వీరి వెనుక అండగా నిలిచినవారు మునగాల రాజాగారు, రాజాబహద్దూర్ వెంకట్రామారెడ్డిగారు. తెలుగు వైతాళికులలో ప్రతాపరెడ్డిగారికి సమున్నతస్థానమున్నది. ఆంధ్ర జిల్లాలోని వైతాళికులకన్న వీరు ఎక్కువ ప్రతిబంధకాలను ఎదుర్కొనవలసి వచ్చినది. రాజకీయంగా, సాంఘికంగా కూడ వీరు పోరాడవలసి వచ్చినది. ప్రభుత్వ వత్తిడులను తట్టుకోవలసి వచ్చినది. త్యాగము, దేశభక్తి, భాషాభిమానము, స్వతంత్ర కాంక్ష, ప్రజల శ్రేయస్సు, దేశాభ్యుదయం మొదలైన మహోన్నత ఆశయాలతో ముందడుగువేస్తూ తమ జీవితకాలంలోనే యీ ఆశయాల విజయాన్ని చూచి సంతోషించిన ఉదారచరితుడు ప్రతాపరెడ్డి. తన త్యాగానికి ఆయన ప్రతిఫలం ఆశించలేదు. భారత స్వాతంత్ర్య ప్రాప్తి, హైదరాబాదు విమోచన తరువాత అప్పటి రాజకీయ రంగానికి నాయకత్వం వహించినవారు ప్రతాపరెడ్డిగారి కృషిని ఎంతవరకు గుర్తించినారో భావి చరిత్రకారుడు వివరించవలసి ఉంటుంది. ఎవరు గుర్తించినా, గుర్తించకపోయినా తాను కర్తవ్యాన్ని నెరవేర్చి, దేశానికి జాతికి దారిచూపి ఆంధ్రభాషాభివృద్ధికి అహర్నిశలు పాటుపడిన పండితుడు, నాయకుడు, వక్త, దేశభక్తుడు, విజ్ఞాని, పరిశోధకుడు, పాత్రికేయుడు, వైతాళికుడు స్వర్గీయ సురవరం ప్రతాపరెడ్డిగారు.

(4-10-1980 నాడు కరీంనగరులో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి పక్షాన తెలుగు వైతాళికుల ఉపన్యాసాల వరుసలో చేసిన ప్రసంగం.)

# గురుదేవుడు రవీంద్రుడు

నేటి అగస్టు 15 సకల భారతదేశమునకు పండుగ. ఈనాడు మనదేశము నూటయేబది సంవత్సరాల ఆంగ్ల పరిపాలన నుండి విముక్తి నొందెను. ఈ శుభ సందర్భమున మనము సంస్మరించవలసిన మహనీయులలో గురుదేవుడు రవీంద్రుడు ముఖ్యుడు. భారత జాతీయ గీతమును రచించిన మహాకవి ఆయన. అందుచేత స్వాతంత్ర్యోత్సవ సందర్భమున ఆయనను స్మరించుటలో విశిష్టత కలదు. ఆయన పరమపదించినది ఆగస్టు మొదటివారము. ఇందుచేత కూడా ఆగస్టు నెలలో ఆయన స్మరణకు ప్రత్యేకత గలదు.

రవీంద్రుడు సాహితీ ప్రపంచమున ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన గొప్ప రచయిత. అంతమాత్రమే కాదు, ఆయన మన దేశ సమస్యల యందు ప్రత్యేక శ్రద్ధను తీసికొనిన త్యాగమూర్తి ఇల్లు గాలిపోవునపుడు వీణను చేతబట్టుకొను ప్రబుద్ధుడు రవీంద్రుడు కాడు. మనదేశ నాయకు లనేకులకు పూజ్యుడు రవీంద్రుడు. జాతిపిలయైన గాంధీమహాత్ముడు ఆయనను గురుదేవుడని సంబోధించెడివాడు. మహాత్ముని పూర్ణపురుషునిగా గురుదేవుడు సంభావించెడివాడు.

మన దేశ రాజకీయ సమస్యలనుగూర్చి రవీంద్రుడు సర్వదా ఆలోచించెడివాడు. 1919 సంవత్సరమునకు ముందు ఇంగ్లీషువారు ఆయనకు సర్ బిరుదము నిచ్చియుండిరి. ఆనాడు మన దేశములో గొప్పవారికి చాలమందికి యిటువంటి బిరుదులు ఇంగ్లీషు ప్రభుత్వము యిచ్చియుండెను. 1919 సంవత్సరములో అమృతసర్ పట్టణమున బ్రిటిషు ప్రభుత్వము జనసమూహముపైన తుపాకులను గాల్చినపుడు అందుకు నిరసనగా రవీంద్రుడు తన సర్ బిరుదమును త్యజించెను. ఆనాడు మనదేశమున సర్ బిరుదాంకితులైన గొప్పవారు మరికొందరు ఉండిరి. కాని ఇట్టి త్యాగమును, ధైర్యమును, సాహసమును ప్రదర్శించినాడు రవీంద్రుడే. ఆనాడు రవీంద్రుడు ఇండియా వైస్రాయికి వ్రాసిన లేఖ ప్రపంచములోని లేఖా సాహిత్యములో మహోజ్వలమైనది. జపాను దేశము యొక్క సామ్రాజ్యతత్వమును నిరసించుచు జపాను కవీంద్రునికి రవీంద్రుడు వ్రాసిన యుత్తరము మరొక

మహోజ్జ్వలమైన లేఖ. ఇటులే 1940 వ సంవత్సరమున కాబోలు, భారత జాతీయ నాయకులను బ్రిటిషు ప్రభుత్వము చెరసాలలో నుంచినపుడు మిస్ రాత్ బోన్ అను పాశ్చాత్యయువతి భారత నాయకులను దూషించుచు ఒక ప్రకటన చేసి యుండెను. ఆ ప్రకటనకు రవీంద్రుడిచ్చిన సమాధానము ఆయనకు మన స్వాతంత్ర్యోద్యమము నందుగల గాఢమైన సానుభూతి, మరియు జాతీయ నాయకులందుగల అపార గౌరవమును వెల్లడి చేయుచున్నవి.

రవీంద్రుడు మరియు గాంధీ మహాత్ముడు పరస్పరము పూజ్య భావము కలిగి యుండిరి. వారికి ఒకసారి మాత్రమే అభిప్రాయ భేదము కలిగెనది. విదేశ వస్తు బహిష్కరణము చేయవలెనని గాంధీ మహాత్ముడు ప్రబోధించి స్వదేశీ ఉద్యమ ప్రచారము గావించినపుడు రవీంద్రుడు యీ ఉద్యమము యొక్క ఉపయోగమును, యోగ్యతను సందేహించుచు గాంధీ మహాత్మునికి ఒక ఉత్తరము వ్రాసెను. దానిని ఉత్తర మనుటకన్న సాహిత్య ఖండమని చెప్పుట సమంజసము. దీనికి సమాధానముగా గాంధీ మహాత్ముడు వ్రాసిన ప్రత్యుత్తరము భావ గాంభీర్యమునందును, భాషా సౌందర్యమునందును రవీంద్రుని రచనకు యే మాత్రము తీసిపోని రమణీయమైన ఖండ కావ్యమని చెప్పవచ్చును. రవీంద్రుడు రాజకీయ నాయకుడుగా, గాంధి ఒక మహాకవిగా యీ ఉత్తర ప్రత్యుత్తరాలలో ప్రత్యక్షమగుచున్నారు. ఇదియే వారి ప్రణయ కలహములలో మొదటిది; మరియు చివరిది. తరువాత వారికి అభిప్రాయ భేదాలెన్నడును కలుగ లేదు. గాంధీ మహాత్ముని ఇష్టమునకు వ్యతిరేకముగా సుభాస్ చంద్రబోసు కాంగ్రెస్ అధ్యక్ష పదవికి పోటీచేసినపుడు కొందరు సభాస్‌చంద్ర బోసు పక్షము వహించవలసినదని రవీంద్రుని కోరిరి. కాని ఆయన అందుకు సమ్మతించలేదు. మహాత్మునికి వ్యతిరేకముగా ఆయన ముందుకు రాలేదు.

జవాహర్‌లాల్ నెహ్రూ యందు రవీంద్రుడు, ప్రేమ, అభిమానము, వాత్సల్యము కలిగియుండెను. జవహర్‌లాల్ నెహ్రూకు మొదటి నుండియు రవీంద్రుని యందు భక్తి. రవీంద్రుని ఉన్నతాదర్శములచేత జవాహర్‌లాల్ ప్రభావితుడైన నిదర్శనాలు కలవు. భారత జాతీయ కాంగ్రెస్ యొక్కయు, మరియు భారతదేశ స్వాతంత్ర్యము యొక్కయు విదేశాంగ విధానము రూపొందజేసిన రాజకీయవేత్త శ్రీ జవాహర్. శ్రీ జవాహర్ విదేశాంగ విధానము

మీద రవీంద్రుని ఉన్నతాదర్శాల ప్రభావము కనపడుచున్నది. రవీంద్రుడు జాతి విచక్షణా విధానమునకు వ్యతిరేకి. సామ్రాజ్య తత్వమునకు ప్రతికూలుడు. మానవత్వము నందు విశ్వాసము కలిగిన మహనీయుడు. యుద్ధాలను, ఆయుధాలను ప్రతిఘటించిన శాంతి ప్రియుడు. జగత్కల్యాణమునకై పరితపించిన ఋషీశ్వరుడు. రవీంద్రుడు ప్రపంచమునకు ప్రేమ సందేశము నిచ్చిన మహానుభావుడు. ఒక జాతి మరొక జాతి మీద అధికారము వహించు జాతీయాహంకారమును, ఒక మానవుడు మరొక మానవుని బానిసగా జూచు మనస్తత్వమును రవీంద్రుడు సర్వదా వ్యతిరేకించి యుండెను. ఈనాడు జవహర్లాల్ దివ్యవాణి వలె, ఆనాడు రవీంద్రుని దివ్యావాణి సకల ప్రపంచమునకు శాంతి సందేశము నిచ్చునదిగా నుండెను. తన యీ అభిప్రాయాలను రవీంద్రుడు ఉపన్యాసము లందును, రచనల యందును పలుమారు ప్రకటించియుండెను. స్వతంత్ర భారత దేశము యొక్క ఆదర్శములు కూడ యిట్లే ఉండవలెనని ఆయన కలలు గను చుండెను. రవీంద్రుని ఆదర్శాలు, స్వప్నాలు యీనాడు జవాహర్‌లాల్ నెహ్రూ విదేశాంగ విధానములో ప్రతిబింబితమగుచున్నవి. ఇది రవీంద్రుని విశిష్టత. కావుననే రవీంద్రుడు సకల భారత నాయకులకు గురుదేవుడైనాడు.

ఆధునిక కాలములో భారతదేశము యొక్క ఆత్మకు చిహ్నములని చెప్పదగినవారు ముగ్గురు. ఒకరు గాంధీమహాత్ముడు, రెండవవారు రవీంద్రుడు, మూడవవారు జవాహర్‌లాల్ నెహ్రూ. గాంధీమహాత్ముడు సత్యమునకు ప్రతినిధి. రవీంద్రుడు సౌందర్యమునకు ప్రతినిధి. జవహర్‌లాల్ శివమునకు అనగా మంగళమునకు, శాంతికి ప్రతినిధి. సత్యము, సౌందర్యము, శివము భారతదేశ సంస్కృతికి మూలకందములు, భారతదేశము యొక్క ఆత్మకు చిహ్నములు. వీనికి ప్రతినిధులైన యీ ముగ్గురు మహనీయుల వ్యక్తిత్వాల సమన్వయమే భారతదేశము యొక్క ఆత్మ.

రవీంద్రుడు పరమపదించినప్పుడు, ఆయనకు శ్రద్ధాంజలి సమర్పించుచు రవీంద్రుని రచనలకు అమూల్యమైన వ్యాఖ్యానము వ్రాసి, పాశ్చాత్య ప్రపంచమునకు పరిచయముచేసిన డాక్టర్ రాధాకృష్ణన్ "రవీంద్రుడు వ్యాస, వాల్మీకుల

తరగతికి చెందిన వాడని'' చెప్పిరి. నిజమే! వ్యాస, వాల్మీకులవలె రవీంద్రుడు మహర్షియైన కవీంద్రుడు. జాతీయ గీతమును పఠించు ప్రతి సందర్భమున రవీంద్రుని సుందర గంభీర ఆకారము మన కనులయెదుట సాక్షాత్కరించి శాంతి సందేశము నిచ్చు చుండును.

శూరుల జన్మము, సురల జన్మము, యేరుల జన్మము తెలుసుకొనుట కష్టమని భారత కవి సూక్తి అదేవిధముగా ఋషీశ్వరుల జన్మమే కాక మృత్యువుగూడ సాధారణులకు తెలుసుకొనుట కష్టమైన కార్యము. రవీంద్రుడు తన మరణమునకు కొన్ని దినములు ముందు మృత్యువును గూర్చిన ఒక రచన గావించెను. బహుశా అదియే ఆయన తుది రచన. తన యవసానమునకు కొద్దిరోజులు ముందు మృత్యువును గూర్చి రచన గావించి రవీంద్రుడు త్వరలో తనకు స్వర్గలోకమునుండి రానున్న ఆహ్వానమును ఊహించుకొనెనేమో! మహాత్ముల యూహలు సత్యసామీప్యములుకదా!

# చిలకమర్తి

ఆంధ్ర వచన వాఙ్మయ చరిత్రలో చిలకమర్తి లక్ష్మీనరసింహ కవి గారిది సమున్నత స్థానము. తెలుగు ప్రబంధ కవులలో ముక్కుతిమ్మన యెట్టివాడో నవ్యాంధ్ర వచన రచయితలలో చిలమర్తివారు అట్టివారు. ఆధునిక వచనమునకు జనకుడైన వీరేశలింగము పంతులుగారికి ప్రియశిష్యులు చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు. ఉభయులుకూడ గోదావరీ తీరవాసులే

ఆధునిక అవసరాలకు అనుగుణముగా ఆంధ్ర వచన రచన దిద్దితీర్చిన యుగకర్త గద్యతిక్కన వీరేశలింగము పంతులుగారు. వీరేశలింగముగారి ఒరవడిని అనుసరించి, తెలుగు వచన రచనను మెరుగుపెట్టి వచనవాఙ్మయ వీథులన్నింటియందును స్వైరవిహారము గావించినారు. చిలకమర్తి కవికోకిలము వచనశైలి వీరేశలింగముగారి శైలికన్న లలితమైనదని చెప్పవచ్చును. ఆంగ్ల భాషలోని గద్యవాఙ్మయ విశేషములను తెలుగున ప్రవేశపెట్టిన వారిలో చిలకమర్తి వారికి ప్రత్యేక స్థానమున్నది.

వ్యాసము, ప్రహసనము, చిన్నకథ, నవల, అనువాదము, స్వీయచరిత్ర, జీవితచరిత్ర, పత్రికారచన అనునవి ఆధునిక వచన వాఙ్మయ విశేషములు. ఈ యన్నిటికిని మార్గదర్శకులు వీరేశలింగముగారే. ఆయన జూపించిన మార్గమున పురోగమించి, రాచబాటను వేసినవారు చిలకమర్తి లక్ష్మీనరసింహము పంతులుగారు. వీరేశలింగముగారివలె చిలకమర్తివారు సంఘ సంస్కర్తలు. ఈ సంఘ సంస్కరణాభిలాష వీరి రచనలలో ప్రతిబింబించు చుండును. తమ రచనలలో చిలకమర్తివారు వీరేశలింగము గారివలె హాస్యమును బహుళముగా ఉపయోగించినారు. కందుకూరివారి హాస్యము కన్న చిలకమర్తి వారి హాస్యము సున్నితమైనది. కొన్ని సందర్భాలలో వీరేశలింగముగారి హాస్యము కొంత పేలవముగా నుండును. అటువంటి దోషము లక్ష్మీనరసింహము గారి రచనలో కనుపించదు.

వీరేశలింగ యుగమున వచన వాఙ్మయాభివృద్ధికి కృషి చేసినవారిలో ప్రముఖులైన పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారు చిలకమర్తివారి

సమకాలికులు ఆధునిక వచన వాఙ్మయమునకు పానుగంటి, చిలకమర్తి కవీశ్వరులు సూర్యచంద్రులవంటివారు. పానుగంటివారి శైలి సూర్యునివలె తీక్షణమైనది. చిలకమర్తివారి శైలి చంద్రునివలె చల్లనిది. పానుగంటివారి వచనమును పఠించునప్పుడు ఆరితేరినయోధుడు అవలీలగాజేయు కత్తిసాము జ్ఞప్తికి వచ్చును. చిలకమర్తివారి రచనలు చదివినప్పుడు వెన్నెలలో విహరించినట్లుండును; పన్నీరు చిలికినట్లుండును. పానుగంటివారి హాస్యము కొంత కరకుగానుండి అప్పుడప్పుడు మనస్సుకు నొప్పి కలించుచుండును. సభ్యతయొక్క హద్దులుదాటిన నిదర్శనాలు కూడ పానుగంటివారి రచనలలో కనుపించుచున్నవి. చిలకమర్తివారి రచనలలో ఇటువంటి గుణము కనుపించదు. మనస్సుకు నొప్పి కలిగించని మృదువైన హాస్యము చిలకమర్తివారి సొమ్ము. పూర్వవాఙ్మయమున కవిత్రయమని ప్రసిద్ధిగాంచిన నన్నయ, తిక్కన, శంభుదాసుల కెటువంటిస్థానము కలదో ఆధునిక వచన వాఙ్మయమున కందుకూరి, చిలకమర్తి, పానుగంటి కవులకు అటువంటి స్థానములే కలవని నిస్సంశయముగా చెప్పవచ్చును. పానుగంటి వారు సాధించినది వ్యాసము మరియు విమర్శ. చిలకమర్తివారు దిద్దితీర్చినది నవల మరియు జీవిత చరిత్ర.

నవలా రచనకు చిలకమర్తివారు ఉపక్రమించుటకు పూర్వము కనిపించు తెలుగు నవల రాజశేఖరచరిత్ర యొక్కటే. స్వకపోలకల్పితములగు చిత్ర వచన కావ్యములను అనేకము రచించి, చిలకమర్తివారు తెలుగుదేశమున వచనమునకు బహుళ ప్రచారము కలుగజేసినారు. వీరి నవలలు మూడు తరగతులకు జెందినవి. మొదటి తరగతి నవలలు చారిత్రక నవలలు. ఈ నవలలలో అహల్యాబాయి, హేమలత మొదలైనవి పేర్కొనదగినవి. రెండవతరగతికి చెందిన నవలలు సాంఘిక నవలలు. వీనిలో రామచంద్రవిజయము, గణపతి పేర్కొనదగినవి. గణపతి హాస్యరసమునకు ఆలవాలమైన నవల. మూడవ తరగతికి చెందిన సౌందర్యతిలక, కర్పూర మంజరి చిలకమర్తివారి రచనలలో పెద్ద నవలలు. ఇవి అద్భుత కథా సంవిధానమునకు ఆటపట్టులు. సుధాశరచ్చంద్రము రమేశచంద్రదత్తు సాంఘిక నవలకు అనువాదము. ఈ నవలలు ఆధునిక యుగమున ఆంధ్ర పాఠక ప్రపంచమునకు సారస్వతాభిరుచిని, గ్రంథ పఠనాసక్తిని కలిగించి, వాఙ్మయప్రచారమునకు మిక్కిలిగా తోడ్పడినవి. చిలక

మూర్తిగారి అడుగుజాడలలో నవలా రచన గావించినవారు ఆంధ్రప్రదేశములో తరువాత మరికొందరు బయలుదేరిరి.

చిలకమర్తి వచన రచనలలో ప్రహసనములు ప్రత్యేకముగా ఒక సంపుటము. ఈ ప్రహసనములలో సంఘ సంస్కరణాభిలాష అడుగడుగున కనిపించు చుండును. కడచిన శతాబ్దాంతమున ఆంధ్రదేశములో వ్యాపించియుండిన సాంఘిక దురాచారములు యీ ప్రహసనములందు ప్రతిబింబించు చున్నవి. హాస్యమును మిక్కిలి సున్నితముగా యీ ప్రహసనాలలో లక్ష్మీనరసింహముగారు పోషించినారు. స్వేచ్ఛగా వ్యవహారిక భాషను ఉపయోగించినారు. లక్ష్మీనరసింహంగారు వ్రాసిన చిన్న కథలుకూడ చాలకలవు. ఈ కథలు అనేక తరగతులకు చెందినవి. ఆంధ్రదేశమున వాడుకలోనున్న అనేక కథలను వీరు సంపుటీకరించియున్నారు. కొన్ని కథలకు వినోదమే ముఖ్యోద్దేశము. వీరి కథలలో కొన్ని పెద్దవి, మరి కొన్ని చిన్నవికూడ కలవు. కాని యీనాటి కథానికలవంటివి చిలకమర్తివారి కథలు కావు. సమకాలిక సమాజము మరియు దైనందిన సంఘటనలు చిత్రించు నేటి చిన్న కథల వంటివి చిలకమర్తివారి కథలుకావు. కథా కథనమే ప్రధానోద్దేశముగా కలిగినవి చిలకమర్తివారి కథలు. చమత్కారమంజరి, రాజస్థాన కథావళి, వినోదములు మొదలైనవి వీరి కథలలో చెప్పదగినవి.

చిలకమర్తి వారి వచన రచనలలో జీవిత చరిత్రలుకూడ ముఖ్యమైనవి. గౌతమబుద్ధుడు, గురుగోవిందుడు, నానక్ మొదలైన మహాత్ముల చరిత్రలను మనోహరముగా వీరు వ్రాసియున్నారు. గడచిన శతాబ్దమున మన దేశమున ఉదయించి, వివిధ రంగాలలో అనేక ఉద్యమాలకు నాయకత్వము వహించి, దేశాభివృద్ధికి కృషిజేసిన రాజరామమోహనరాయ్, ఈశ్వరచంద్ర విద్యాసాగర్, దేవేంద్రనాథ టాగోరు మొదలైన మహానుభావుల జీవితాలను చిలకమర్తివారు రమణీయమైన శైలిలో చిత్రించినారు. నవభారత నిర్మాతలను గూర్చి వివరముగా తెలుసుకొనగ కుతూహలపడు ఆంధ్రపాఠకులకు యీ జీవిత చరిత్రలు అత్యంత ఉపయుక్తములు. ఈ రచనలలో చిలకమర్తివారి అభిరుచులు, అభిప్రాయాలు, గాఢ దేశాభిమానము అడుగడుగున మనకు వెల్లడి యగుచుండును.

పత్రికారచనలో ఆ కాలమున చిలకమర్తివారు అందెవేసిన చేయి. స్వీయముగా మనోరమ, దేశమాత అను పత్రికలకు సంపాదకత్వము వహించిరి. రాజమహేంద్రవరములోని పత్రికలతో వారికి గాఢమైన సంబంధము వీరేశ లింగముగారు కూడ పత్రికా రచయితలే. కాని చిలకమర్తివారు వీరేశలింగము పంతులుగారివలె పత్రికద్వారా తీవ్ర వాదోపవాదములందు పాల్గొని రచ్చకెక్కి రణరంగము గావించలేదు. బహుశా వీరేశలింగముగారిలోని తీవ్రత చిలకమర్తి వారిలో లేకపోవుటకు కారణము వారి శారీరక దౌర్బల్యమేమో! చిలకమర్తివారి వచన రచనలలో స్వీయచరిత్రము మిక్కిలి ముఖ్యమైనది. తెలుగు భాషలో స్వీయచరిత్రలు వ్రాసికొనిన పెద్దలు, విశేషించి, కవి పండితులు మిక్కిలి తక్కువ. అట్టివారిలో తిరిగి మొట్టమొదటివారు వీరేశలింగముగారే. చిలకమర్తి వారు తమ స్వీయచరిత్రను మిక్కిలి చక్కని శైలిలో వ్రాసి ఆంధ్రదేశమునకు, ఆంధ్ర భాషకు గొప్ప ఉపకారము గావించినారు. ఇటీవలి ఆంధ్రదేశ చరిత్రను తెలుసుకొనుటకు భావి చరిత్రకారునికి ముఖ్యమైన ఆధారముగా చిలకమర్తివారి స్వీయ చరిత్ర ప్రకాశించుచున్నది. ఇందులో వారు సమకాలిక సమాజము, అందలి సంఘటనలు, వానితో సంబంధించిన వ్యక్తులు, వారి శీలము చక్కగా చిత్రించినారు. వీరేశలింగముగారి స్వీయచరిత్ర, చిలకమర్తి స్వీయచరిత్ర మరియు చిలకమర్తివారికి అత్యంత ప్రేమాస్పదులైన టంగుటూరి ప్రకాశం పంతులుగారి స్వీయచరిత్ర అను మూడు గ్రంథాలు ఒకచోట సంపుటీకరించి నచో అది గడచిన శతాబ్దముయొక్క రెండవ అర్ధభాగము మరియు యీ శతాబ్దముయొక్క మొదటిభాగమునకు సంబంధించిన ఆంధ్రదేశ చరిత్ర కాగలదని చెప్పిన అతిశయోక్తి కాజాలదు.

చిలకమర్తివారి శైలికి ప్రత్యేకమైన విన్నాణము మరియు సొగసు కలవు. వారు ఉపయోగించు శబ్దజాలము మిక్కిలి సరళమైనది. ఈ చక్కదనమునకు మారుపేరని చెప్పదగిన చిలకమర్తివారి వచనశైలి ఆంధ్ర విద్యార్థులకు అవశ్య పఠనీయమైనది. ఆంధ్రవచనమునకు సారళ్యము సమకూర్చిన వారిలో వీరేశ లింగముగారి తరువాత యెన్నదగినవారు చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు

# మా ఊరు - ఓరుగల్లు

మా ఊరినిగూర్చి మాట్లాడినపుడు ఇప్పటికి సుమారు ఎనిమిదినూర్ల సంవత్సరాల క్రిందట జరిగిన ఒక చిన్న సంఘటన తటుక్కున తలపునకు వస్తుంది. మా ఊరిలోని వాడ వాడన వేడుకతో విహరించి, మిట్ట మధాహ్నమున వీథి గడియారము రెండెనిమిదులను అనగా ఇప్పటి పన్నెండు గంటలను కొట్టగానే ఇద్దరు రసిక హృదయులు పూటకూటి ఇంటికెళ్ళి ఒక్క రూక వ్యయముతోనే షడ్రసోపేతమైన భోజనము చేసిన ఉదంతము ఎన్నటికీ మరువ రానిది. ఇన్ని నూర్ల సంవత్సరాలు గడచినప్పటికిని ఈ ఉదంతము మన స్మృతిలో ఇంత స్పష్టముగా మెదలడానికి కారణము కప్పురభోగి వంటకము, కమ్మని గోధుమపిండి వంట, గుప్పెడు పంచదార, క్రొత్తగాకాచిన ఆవునెయ్యి, అరటిపండ్లు, పెసరపప్పు లప్పలతోడ క్రొంబెరుగు నాలుగైదు సంజుళ్ళతో లక్ష్మణ వజ్ఝల పూటకూటి ఇంటిలో ఆనాటి మిట్టమధ్యాహ్నమున ఇద్దరు స్నేహితులకు దొరికిన షడ్రసోపేతమైన భోజనము నేటికిని శ్రీనాథకవి సార్వ భౌముని క్రీడాభిరామములో మన జిహ్వకు విందు జేయుచుండడమే! తెలుగు సాహిత్యముతో పరిచయమున్న వారందరును నాడు మా ఊరు ఓరుగల్లు వడ్డించిన వంటకాల రుచి చూచినవారే!

ఓరుగల్లు, ఏకశిలానగరము, వరంగలు అను నామాంతరములతో మా ఊరు అద్వితీయమైన ఖ్యాతిని సంపాదించినది. మా ఊరిలోని కూలిపోయిన కోటగోడలను, రాజప్రాసాదాలను, అంతఃపుర భవనాలను నేటికిని చెన్ను చెడని సుందర శిల్పశోభితమైన శిథిల మందిరాలను, మండపాలను, దేవాలయా లను జీర్ణావస్థలో చూచినపుడు

"కాటోలు నియ్యది కాకతీయులొకప్డు
కరకు నెత్తుట కత్తికడుగుచోటు
కాటోలు నీ ద్వార కల్యాణవేదిక
అలికి ముగులు పెట్టె తెలుగుపడుచు

"కాబోలు నీ జీర్ణ కమనీయసౌధాన
సుకుమార శిల్పము లు సొంపులొలికె
కాబోలు నీ వీథికాపురం బొనరించె
పైడి మేడలలోన భాగ్యలక్ష్మి"

అని హృదయము ద్రవించిపోవును.

మూడున్నూర సంవత్సరాలపాటు కీర్తి చంద్రికలను వెదజల్లిన కాకతీయ మహాసామ్రాజ్యానికి ఓరుగలు రాజధానిగా విలసిల్లినది. ఏకశిలాదేవికి అనగా నేడు జనసామాన్యానికి సుపరిచితమైన ఎల్లమ్మదేవతకు అంకితముగా నిర్మింప బడిన ఏకశిలా నగరములో ఈనాటికిని ఎల్లమ్మగుడులు చాలా ఉన్నవి. ఎల్లమ్మ బజారు అను వాడ కూడా ఈనాడు మా ఊరిలో సుప్రసిద్ధమై యున్నది. ఓరుగల్లు నగరాన్ని స్మరించగానే కాకతీయ మహాసామ్రాజ్యాన్ని అత్యంత వైభవంగా పరిపాలించిన ప్రోలరాజు, రుద్రదేవుడు, గణపతిదేవుడు, రుద్రమదేవి, ప్రతాపరుద్రుడు మనకు వెంటనే జ్ఞప్తికి వత్తురు. కాకతీయ ప్రభువులలో నూటికి నూరుపాళ్ళు తెలుగుదనము ఉట్టిపడినది తెలుగువారికి తాను తెలుగువాడనను సత్యమును గుర్తింపజేసిన గౌరవము ఓరుగంటి పట్టణానికే దక్కినదని స్వర్గీయ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు వివరించినారు. కాకతీయ ప్రభువులు తమ రాజధానియైన ఓరుగల్లును ఆంధ్రనగరమని ప్రశంసించారు. విద్యానాథ మహాకవి తన ప్రతాపరుద్రీయములో మా ఊరును ఆంధ్రనగరమని అల్లారుముద్దుగా అభివర్ణించినాడు. అమృతఫలమైన భాగవతమును ఆంధ్రుల కందజేసిన పోతన మా ఊరికి దరిదాపులవాడు. బహుశా భాగవతములోని కొంత భాగమును పోతన ఓరుగంటిలోనే వ్రాసినాడేమో! నెల్లూరి నెరజాణ తిక్కన మా ఊరిలోనే మొట్ట మొదటిసారిగా గణపతిదేవుని ఆస్థానములో భారత కావ్యమును పఠించి ఆవిష్కరింపజేసినాడని స్థానికచరిత్ర తెల్పుతున్నది. జాను తెనుగులో శైవ ప్రబంధములను వెలయించిన పాల్కురికి సోమనాథుని కార్యరంగము కూడా మా ఊరి పరిసరాలే. నాడు మా ఊరి మందారమకరంద మాధుర్యమున దేలి కవితా గానము జేసిన వారు మరెందరో ఉన్నారు. ఏ ప్రాంతానికి వెళ్ళినా ఏదో ఒక వంకబెట్టి అక్కడి ఆచార వ్యవహారాలను, అక్కడి వంటకాలను వెక్కిరించిన కవి సార్వభౌముడు శ్రీనాథుడు మా ఊరిని పలు భంగుల ప్రస్తుతించినట్లు సాహిత్య

రూపకమైన సాక్ష్యమున్నది. మా ఊరిలోని జాయప సేనాని వంటి వారలు నృత్యరత్నాకరము వంటి శాస్త్రములను రచించినారు.

మా ఊరు పుట్టుపూర్వోత్తరాల చరిత్రను వెదకడానికి దాదాపుగా వెయ్యి సంవత్సరాలు వెనుకకు వెళ్ళవలసియుండును. ఓరుగల్లుకోట నిర్మాణాన్ని మొదట ప్రారంభించినది గణపతిదేవ చక్రవర్తి. గణపతిదేవుడు ప్రారంభించిన నిర్మాణమును రుద్రమదేవి పూర్తిచేసినది.

లోపలి రాతికోటను పెద్దకోటయని, బయటి మట్టి ప్రాకారమును భూమి కోటని పిలుచుచుండిరి. భూమికోటగా పేరుపొందిన మట్టి ప్రాకారము సామాన్యమైనదికాదని చరిత్రకారుల అభిప్రాయము. అల్లాఉద్దీన్ ఆజ్ఞతో క్రీ. శ. 1296 సంవత్సరములో మలిక్ కాఫర్ సేనాని నాయకత్వాన దాడిచేసిన సైన్యం మట్టి కోటను పడగొట్టడానికి ప్రయత్నించినది కాని మలిక్ కాఫర్ సైన్యాల ప్రయత్నాలు యిసుమంత కూడా ఫలించలేదు. ఉక్కు బల్లెములతో పొడిచినప్పటికిని మట్టికోట నుండి ఒక్క బెడ్డకూడా రాలలేదని. దానిపై పెద్ద పెద్ద గుండ్లను వేయించితే అవి పిల్లలాడుకొను గోళీలవలె వెనుకకు ఎగిరిపడినవని అమీర్ ఖుస్రూ వ్రాసినాడు ఆంధ్రుల రణతంత్రానికి ఆటపట్టుగా మా ఊరు రాణించినది. మా ఊరిలో ఆనాడు తొమ్మిది లక్షల సైన్యము ఉండినదట! మిల్ట్రి కంటోన్మెంట్ల వంటి మొహరివాడలు ఉండెడివట! ఓరుగల్లున రాజవీర లాంఛనముగా పలు శస్త్రాలు నిలుపునాడు తెలుగుజోదులు ప్రదర్శించిన శౌర్య ప్రతాపాలను, తేజమును కవులు మనముగా కీర్తించినారు అగ్నికి సంబంధించిన అస్త్రాలను మొట్టమొదట వరంగలు కోటమీదనే ప్రయోగించినారని, అటుతర్వాతనే ఫిరంగులు, తుపాకులు రూపొందినవని సైనిక శాస్త్రజ్ఞుల అభిప్రాయము. ఢిల్లీ పాదుషాలకు మొదటినుండి మా ఊరిమీదనే యీర్ష్య. అనేక పర్యాయాలు కాకతీయవీరులకు ఢిల్లీ పాదుషాల కిరకుసైన్యాలకు మధ్య మా ఊరిలో యుద్ధాలు జరిగినవి. లోకమంతకు కాకపెట్టిన కాకతీయుల కదన పాండితికి మా ఊరు రంగస్థలమైనది.

కదనరంగమే కాక మా ఊరు కళాక్షేత్రము గూడా. సంగీతము, సాహిత్యము, చిత్ర లేఖనము, శిల్పము మొదలైన కళలు మా ఊరిలో కాకతీయ ప్రభువుల ఆధ్వర్యాన వేయి ముఖాలుగా విస్తరించినవి. కాకతీయ ప్రభువుల పోషణతో

ప్రోత్సాహముతో తెలుగుభాష తెలుగు సాహిత్యము తెలుగుకళలు అద్వితీయముగా అభివృద్ధిచెందినవి నాడు తెలుగుభాష దాదాపుగా అధికార భాషగా అమలులోనికి వచ్చినది. కాకతీయ ప్రభువులు తెలుగులో శాసనాలను వ్రాయించినారు. వరంగల్లు కోటలోని కట్టడాలు, వేయిస్తంభాల దేవాలయము, పద్మాక్షి దేవాలయము మొదలైన ఆలయాలు యీ రోజు శిథిలమైనప్పటికిని నాడు శిల్పము, సంగీతము, చిత్రలేఖనము నృత్యమువంటి కళలు సాధించిన అత్యున్నత స్థాయికి సాక్షీభూతంగా, సజీవ నిదర్శనాలుగా నిలిచి ఉన్నవి.

మా ఊరు ఆంధ్రదేశ చరిత్రలో అనేక విధాలుగా ప్రశస్తి గాంచినది. ఆ కాలములో మన దేశానికి వచ్చిన విదేశీయాత్రికుడు మార్కోపోలో ఓరుగంటి రాజ్య వైభవాన్ని వేనోళ్ళ కీర్తించినాడు. ఒకానొక తురక సేనాని ఆనాటి ఓరుగంటి స్వరూపమును కన్నులకు గట్టినట్టుగా వర్ణించినాడు. ఆనాడు మా ఊరిలో ఏ దిక్కు జూచినప్పటికిని రెండుమైళ్ళ పొడవున నీటినాళాలు తోటలు కనిపించెడివట. ఈ తోటలలో మామిడి, అరటి, పనసపండ్ల చెట్లు, చంపకము, మొగలిపువ్వుల చెట్లు అసంఖ్యాకముగా ఉండెడివి. నగరము వాడలుగా తీర్చిదిద్దబడి యుండెను. అక్కలవాడ, మేదరివాడ, మొహరివాడ ఇందులో ముఖ్యమైనవి. దేవాలయాలు, రాజభవనాలు, పూటకూటి ఇండ్లు ఈ వాడలలో గోచరించెడివి. జైనము, శైవము, తరువాత వైష్ణవము మా ఊరిలో వ్యాప్తిచెందిన ముఖ్య మతాలు.

ఇండ్లను, ముంగిళ్ళను ఓరుగంటిలో చిత్రవిచిత్రముగా, సుందరముగా అలంకరించెడివారు. అప్పుడు మా ఊరిలోని ముంగిళ్ళముందు పడుచులు తీర్చిదిద్దిన ముగ్గులను చూచి,

> "చందనంబున కలయంపి చల్లినారు
> ముగ్గులిడినారు కాశ్మీరమున, ముదమున
> వ్రాసినా రిందురజమున రంగవల్లి
> కంజముల తోరణంబుల గట్టినారు"

అని శ్రీనాథుడు వ్రాసినాడు. అప్పుడు మా ఊరిలో పదిహేను నూర్లమంది చిత్రకారులుండిరని ఏకామ్రనాథుడు వ్రాసినాడు. ఉత్తమమైన ఉన్ని కంబ

శాలకు, విశిష్టమైన దంతపుపనికి మా ఓరుగల్లు వినుతికెక్కి యుండెను. ఇప్పటి కిని మా ఊరు కంబళాల, జంఖానాల నేతలో ప్రసిద్ధికెక్కి యున్నది. మా ఊరి కోటబయటి మైలసంతలోను వాడవాడలయందును చందనము, కస్తూరి, సంపెంగ నూనె మొదలైన సుగంధ ద్రవ్యాలను పుష్కలముగా అమ్మెడివారట. కోలా టము, బతుకమ్మ, జాజరి ఆటలు నాడును నేడును మా ఊరిలో ప్రసిద్ధమైన క్రీడలు. సంస్కృతమును వేద వేదాంగములను బోధించుటకు కళాశాలలు ప్రజల ఆరోగ్యావసరాలకు ఆరోగ్యశాలలు ప్రసూతి గృహాలు మా ఊరిలో కొల్లలుగా ఉండెడివి. అప్పుడు మా ఊరిలోని ధనికులు పల్లకీలలో తిరిగెడివారు. ఆనాడు మా ఊరి స్త్రీలకు తాటంకములు, ముత్యాలకమ్మలు, కాంచీపుర కంకణములు, త్రిసరములు, కడియములు మొదలైనవి ప్రీతికరమైన ఆభరణాలు. చిత్రలేఖన విద్యలో నిపుణులైన ఆనాటి తెలుగు పడుచులు ప్రత్యేకముగా చిత్రశాలలను తమ ఇండ్లలో ఏర్పాటుజేసుకొన్నారని స్థానిక చరిత్ర తెల్పుతున్నది.

నాటి మా ఊరి సమాజము ఆర్థికముగా, సాంస్కృతికముగా ఇంత సుసంపన్నమై శోభిల్లడానికి కారణము ఆనాడు కాకతీయ ప్రభువులు వ్యవ సాయము, వర్తక వాణిజ్యాల అభివృద్ధిపట్ల శ్రద్ధ వహించడమే. మా ఊరి చుట్టు ప్రక్కల కాకతీయ ప్రభువులు వ్యవసాయమును అభివృద్ధిచేసినారు. తత్ఫలిత ముగా మా ఊరు ధాన్యాగారముగా రూపొందినది. దూరదూర ప్రాంతాలతో, దేశాలతో మా ఊరు ఆనాడు వర్తకం జరిపినది. నాటి మా ఊరి గాథ ఒక రమణీయమైన స్వప్నమువంటిది. సమయసైకతరాసుల క్రింద మా ఊరి చరిత్ర మరుగుపడిపోయినది. తిరిగి ఈనాడు మా ఊరిలో మరొక నూతన చరిత్ర రూపు ధరించుచున్నది. భవిష్యత్తు మరొక సుందర స్వప్నమువలె కన్నులకు కట్టు చున్నది.

ఈ రోజు మా ఊరి వైశాల్యము ఇంత ఉన్నదని చెప్పడానికి వీలులేదు. ఎందుకంటే, మా ఊరు రోజురోజుకు శరవేగంగా విస్తరించుతున్నది. హైదరా బాదు నుండి తూర్పుకు ఎనుబది మైళ్ళు వెళ్ళగానే ఖాజీపేట రైల్వేకూడలి కనిపించుతున్నది. ఇటు యీ చివరన ఖాజీపేటనుండి అటు వరంగల్లుకోట ఆవలి వరకు పది పన్నెండు మైళ్ళ పొడవున మా ఊరు వ్యాపించియున్నది. మా ఊరు మధ్యన పెద్ద పెద్ద గుట్టల నడుమ ఒక పెద్ద చెరువు ఉన్నది. ఈ చెరువు గట్టు

మీద గుట్ట ప్రక్కన కాకతీయులనాడు కట్టించిన భద్రకాళి ఆలయము చాలా మంది భక్తులను ఆకర్షించుచున్నది.

విద్యా వైజ్ఞానిక రంగంలో మా ఊరు సాధించుతున్న ప్రగతి ఆశ్చర్యము కలిగించగలదు. మా ఊరిలోని గాంధీ స్మారక వైద్యశాల చాలా పెద్దది. ఈ వైద్యశాలకు దగ్గరిలోనే మా ఊరి ప్రజలు ఒక పెద్ద వైద్యకళాశాలను స్థాపించుకున్నారు. ఇది కాకతీయ వైద్యకళాశాల. ఆర్ట్సు అండ్ సైన్సు కళాశాల, పాలిటెక్నిక్ ఇనిస్టిట్యూట్, సాయంకళాశాల, విద్యాబోధన ట్రైనింగు కళాశాల, ఆయుర్వేద కళాశాల, రెండు మూడు సంస్కృత కళాశాలలు మా ఊరిలోని విద్యాసంస్థలలో ముఖ్యమైనవి. మా ఊరిలో కేంద్ర ప్రభుత్వము స్థాపించిన ఇంజనీరింగ్ కళాశాల దేశంలోని ముఖ్యమైన ఇంజనీరింగ్ కళాశాలలలో పేర్కొనదగినది. ఇంకను మరికొన్ని క్రొత్త విద్యాసంస్థలు, కళాశాలలు రానిదే మా ఊరి విద్యావసరాలు పూర్తికావు. ఇటీవల మా ఊరిలో మహిళా కళాశాల కూడా ప్రారంభమైనది. కొద్ది రోజులలోనే వరంగల్లులో కాకతీయ విశ్వవిద్యాలయము స్థాపితముకాగలదు.

మా ఊరి చుట్టుప్రక్కల రామప్ప, లక్నవరము, పాఖాల, ధర్మసాగరము తటాకముల వంటి పెద్ద పెద్ద జలాశయములుండుట వలనను ఇప్పుడిప్పుడు క్రొత్త క్రొత్త నీటివసరులు తదితర సౌకర్యాలు యేర్పడుతున్నందువలనను వడ్లు, వేరుసెనగ, ఉల్లిగడ్డ, వెల్లిగడ్డ, మిరపకాయలు, ధనియాలవంటి వ్యావసాయిక సరుకులు పుష్కలంగా ఉత్పత్తియౌతున్నవి ఈ సరుకులన్నీ వరంగల్లులోని ప్రముఖమైన వ్యావసాయిక మార్కెట్టుకు ప్రతిరోజు వస్తుంటవి. తెలంగాణములోని ప్రాథమిక వ్యావసాయిక మార్కెట్టు లన్నింటిలోను మా ఊరి మార్కెట్టు చాలా పెద్దది. వ్యావసాయిక సరుకులు విరివిగా రావడమువలన మా ఊరు వెనకటినుండి గూడా వర్తక వాణిజ్యాల కేంద్రంగా ప్రాముఖ్యము వహించుతున్నది. మా ఊరిలో అధునాతనమైన ఒక మంచి బట్టలమిల్లు ఉన్నది. ఇది ముప్పది సంవత్సరాల క్రిందట అప్పటి రాజకుమారుని పేరుతో స్థాపితమైనది. మన రాష్ట్రంలో ముఖ్యమైనదిగా పరిగణించబడుతున్న ఈ బట్టల మిల్లు వేలమంది కార్మికులకు తదితరులకు ఉద్యోగాన్ని కల్పిస్తున్నది. పూర్వకాలంలో ప్రసిద్ధిజెందిన చేతిపనులు కొన్ని ఈనాటికిని మా ఊరిలో నిల్చియున్నవి.

వరంగల్లులో తయారుచేసే జమ్‌ఖానాలు, తివాచీలు ప్రపంచ ప్రఖ్యాతి పొందినవి. ఈ నేత వృత్తిని అవలంబించేవారు ఇప్పటికిని మా ఊరిలో ఉన్నారు. భారత దేశంలోని వివిధ ప్రాంతాలవారు మా ఊరి తివాచీలను, జంఖానాలను మక్కువతో తెప్పించుకొంటారు. మా ఊరిలోని ఖాజీపేట, వరంగల్లు రైల్వేస్టేషన్‌లు వర్తక వాణిజ్యాల అభివృద్ధికి, పట్టణ సర్వతోముఖ ప్రగతికి ఎక్కువగా దోహద మిస్తున్నవి. దాదాపు ముప్పది సంవత్సరాల క్రిందటనే మా ఊరిలో అధునాతన పద్ధతిలో మంచినీరు, విద్యుచ్ఛక్తి సౌకర్యాలు కల్పించబడినవి. మా ఊరి పారిశ్రామిక వాటికలో చిన్నతరహా పరిశ్రమలు, జైలు ఆవరణములో కుటీర పరిశ్రమలు పెంపొందుతున్నవి. వరంగల్లులోని బియ్యం మిల్లులనుండి, కలప మిల్లులనుండి బయటి ప్రాంతాలకు బియ్యమూ కలపా సరఫరా చేయబడుతున్నవి. వరంగల్లు అవసరాలకొరకని పట్టణ పరిసరాలలోని మామునూరు విమానాశ్రయం సమీపంలో ఒక పెద్ద పాలసరఫరా కేంద్రం స్థాపించబడుతున్నది.

తెలంగాణా ప్రాంతములో హైద్రాబాదునగరం తర్వాత స్థానాన్ని ఆక్రమిస్తున్న మా ఊరు జనసంఖ్య నాలుగు లక్షలను దాటుతున్నది. వెనకటినుండి నేటివరకు అన్ని ఉద్యమాలకు మా ఊరు అగ్రగామిగా నిల్చింది. జాతీయోద్యమంలో, ఆంధ్రోద్యమంలో, స్వాతంత్ర్యోద్యమంలో, గ్రంథాలయోద్యమంలో మా ఊరు గణనీయమైన పాత్రను నిర్వహించినది. జాతిపిత గాంధీజీ, నవభారత నిర్మాత నెహ్రూ మా ఊరిని తమ పర్యటనచే చరిత్రాత్మకము చేసినారు.

గడచిపోయిన ఆనాటి చరిత్రలోనే కాదు, జరుగుతున్న ఈనాటి చరిత్రలోను మా ఊరు వరంగల్లు గణనీయమైనది.

(1964)

# మౌలానా అబుల్ కలాం ఆజాద్

మౌలానా సాహెబ్ పరలోకగతులైనారను వార్త సమస్త భారతదేశమును శోక సముద్రముతో ముంచినది. కనులు మూసికొనినంతనే రాజఠీవి ఉట్టిపడు ఆ విగ్రహము, పాదుషాలను స్మరింపజేయు ఆ గంభీరమూర్తి మన మనోదర్పణములందు ప్రతిబింబించుచున్నది. ఈ రాజఠీవి, యీ గాంభీర్యము ఆయన బాహ్య స్వరూపముననే కాక అంతరంగిక స్వరూపమునకు విలక్షణమైన ప్రత్యేకత యని చెప్పవచ్చును. శక్తివంతమైన ఆయన లేఖినీ విన్యాసమునందు, వచోవిలాసమునందు యీ రెండు గుణములు విశిష్టముగా కనుపించుచుండును. దూషణ భూషణములకు రాగద్వేషములకు అతీతముగా కర్తవ్య నిర్వహణము గావించిన ఉదారచరితుడు మౌలానా సాహెబ్.

చండశాసనుడైన మౌలానా దయార్ద్రహృదయుడు. ఒక్కొక్కసారి ఆయన మాటలు దారుణాఖండల శస్త్రతుల్యములైనప్పటికిని హృదయము మాత్రము నవ్యనవనీత సమానము. ఇస్లాం మత సంస్కృతులను గూర్చి మౌలానా సాహెబ్‌ది తుదిమాట. సకల ప్రపంచములోని అరబ్బీ, పార్సీ విద్వాంసులయందు ఆయనది అగ్రస్థానము. పదునాలుగు సంవత్సరాల చిరుత ప్రాయముననే భారతదేశములో లభించగల అరబ్బీ వాఙ్మయమున పారంగతుడైన మౌలానా ఈజిప్టు వెళ్ళి Al Azhar విశ్వవిద్యాలయమున విద్యాభ్యాసమును రెండు సంవత్సరాలలో ముగించిన పశాగ్రబుద్ధి తరువాత కొన్ని అయిరోపా భాషలను కూడా నేర్చుకొని విశ్వసంస్కృతిని సంపూర్ణముగా ఆకళించుకొనినారు.

ఉర్దూ వాఙ్మయమున రచయితగా మౌలానా సాహెబ్‌కు మహోన్నత స్థానము కలదు. ఖురాన్‌కు ఆయన వ్రాసిన భాష్యము, తజ్కిరా అను గ్రంథరూపమున ఆయన ప్రకటించిన రచనలు సర్వదా నిలిచియుండగలవు. మౌలానా శైలి, ఆయన వ్యక్తిత్వమువలె ప్రత్యేకమైనది. కలకత్తానుండి 'అల్ హిలాల్' వారపత్రికను ప్రకటించి, ఖిలాఫత్ ఉద్యమానికి, భారత జాతీయోద్యమానికి, హిందూ ముస్లిం ఐక్యతకు పట్టుకొమ్మగా నిలిచిన మౌలానా, తరువాత భారత

జాతీయ కాంగ్రెసుకు ముమ్మారు మూర్ధాభిషిక్తులై దేశ స్వాతంత్ర్యోద్యమానికి నాయకత్వము వహించినారు. జాన్‌గంథర్ మౌలానా సాహెబ్‌ను భారత జాతీయ కాంగ్రెస్ మేధానిధిగా ప్రకటించినారు. మౌలానా సంపాదకీయాలు, తెలుగువారికి ముట్నూరి కృష్ణారావుగారి సంపాదకీయాలను జ్ఞప్తికి తెచ్చుచుండును. క్రిప్సు రాయబార తరుణమున ఇంగ్లండు మంత్రివర్గ ప్రతినిధులతో సంప్రదింపుల సందర్భమున మౌలానా ప్రదర్శించిన రాజనీతి కౌశల్యము నిరుపమానమైనది. అత్యంత కఠినమైన అగ్ని పరీక్షలలో అమోఘ విజయాలను సాధించిన నిష్కళంక జాతీయవాది మౌలానా సాహెబ్.

మౌలానాలోని రాజఠీవి, గాంభీర్యములు మోతీలాల్‌ను జ్ఞప్తి చేయుచుండును. త్యాగము, ఔదార్యము చిత్తరంజనదాస్‌ను తలపింపజేయును. పారమార్థిక చింతనము లోకమాన్యుని స్మరింపజేయును. మేరు సమాన ధైర్యము, పట్టుదలతో కూడిన సాహసము సర్దార్ పటేల్‌ను స్మృతికి తెచ్చుచున్నవి. కేసరి యను బిరుదము, లజపతిరాయ్ యందువలె, మౌలానాయందు కూడ సంపూర్ణముగా సార్థకము. జవహర్లాల్ యందువలె మౌలానాలో సాహిత్య విజ్ఞానముల సరస సమన్వయము గోచరించుచుండును. ఈ మహనీయు లందరివలె, మౌలానా గూడ జాతిపిత గాంధీమహాత్మునిచే ప్రభావితులైన శేముషీ సింధువు, త్యాగమూర్తి.

ఆజన్మాంతము మౌలానా వ్యక్తిత్వమునందువలె, అవసాన సమయమున గూడ ఒక విలక్షణమైన ప్రత్యేకత గోచరించుచున్నది. గీతా శ్లోకములను పఠించుచు పరమపదించిన లోకమాన్యునివలె, వైద్యుల పరిచర్యలను, ఔషధాలను నిషేధించి, "నన్ను అల్లాకు వదిలివేయుమ"ని చెప్పుచు, పరమేశ్వర ధ్యానమున లగ్నమైన హృదయముతో మౌలానా సాహెబ్ పరలోకగతుడైనారు. దైన్యములేని జీవితము గడిపిన మౌలానా ఆయాసములేని మరణమునే పొందినారని చెప్పవచ్చును. "బలమునీవ నాకు, భక్తుండ నీయెడ; ఆలుబిడ్డలేని యట్టివాడ; కావు నన్ను అధిక, కారుణ్యమున; ఇమ్ము నుజ్జ కమలదళ మనోజ్ఞనయన" యని యోగీశ్వరుడైన శ్రీకృష్ణమూర్తిని స్మరించి కనులు మూసికొనిన భీష్ముని నిర్యాణమును మౌలానా అవసానము జ్ఞప్తికి తెచ్చుచున్నది.

(1966)

# కవయిత్రి తోరూదత్

"ముదితల్ నేర్వగరాని విద్య కలదే ముద్దార నేర్పించినన్" అని చెప్పిన చిలకమర్తి కవి మాటలు అక్షరాల సత్యమైనవి. ఏరంగములోనైనను సరియైన, సమానమైన అవకాశాలు లభించినచో పురుషులకు స్త్రీలు ఏమాత్రము తీసిపోరని ఋజువు చేయుటకు ఎన్ని నిదర్శనాలైనను చూపించవచ్చును. గత శతాబ్దమున వంగరాష్ట్రమున జన్మించి, కీర్తిగాంచి తోరూదత్ అను యువ కవయిత్రి జీవితము ఇటువంటి నిదర్శనాలలో పేర్కొనదగినది.

తోరూదత్ 1856 సంవత్సరమున కలకత్తాలోని అగ్రవర్ణానికి చెందిన ఒక ఉన్నత కుటుంబమున జన్మించినది. చిన్నప్పటి నుండి సిరిసంపదలతో తులదూగినది. అయితే యీ ఐశ్వర్యము ఆమె జీవితమును ఆనందప్రదము గావించినదని చెప్పుటకు వీలులేదు. శైశవదశలోనే ఆమె సుకుమార హృదయానికి తీవ్ర అఘాతములు కొన్ని తగిలినవి. ఆమెకు పది సంవత్సరాల నిండీ నిండని వయసులో ఆమె అన్న తన పదునాలుగవ యేట చనిపోవుట జరిగినది. ఆమెకు ఇంకను మైనారటీ యైనను దాటని పదునెనిమిది సంవత్సరాల వయసులో ఆమె అక్క ఇరువదేండ్ల ప్రాయమున మరణించుట జరిగినది. ఈ రెండు మృతులు ఆమె లేతయెదమీద సమ్మెట పోటులైనవి.

ఆమె తండ్రి ఉదార భావాలు కలిగిన సజ్జనుడు, మంచి విద్వాంసుడు. ఆయన తన కూతురును అల్లారుముద్దుగా పెంచి, ఆమె విద్యాభ్యాసానికి సకల సౌకర్యాలు కలుగజేసి, విదుషీమణిగా పెంచి పెద్ద జేసినాడు. తండ్రిగారి సుందర మైన ఆరామములో ఆమె తన శైశవము నంతయును ఆటపాటలతో వెళ్ళబుచ్చినది. విద్యాబుద్ధులు నేర్చి, సాహితీ వ్యాసంగమున నిమగ్నమైన యౌవనదశలో ఆమె తన చిన్నప్పటి అనుభవాలను, బాల్య స్నేహితులను, ప్రకృతి దృశ్యాలను తలంచుకొని ఉత్తేజితమై, వానిని తన కవితా సౌధమున సుందరముగా చిత్రించి అక్షరములను గావించినది.

ఆధునిక వాతావరణములో పుట్టి పెరిగి, పాశ్చాత్య సంస్కృతి పరిపూర్ణముగా ఆకళింపుకొన్నప్పటికిని, తోరూదత్ రచనలను పరిశీలించినప్పుడు వానిలో ప్రతి పదమున భారత జాతీయత యొక్క ముద్ర స్పష్టముగా కనిపించుచుండును ధృవుడు, ప్రహ్లాదుడు, లక్ష్మణుడు, సీతమ్మ, సావిత్రి మొదలైన పౌరాణిక వ్యక్తులను, వారి శీలమును అత్యంత అభిమానముతో ఆమె తన రచనల యందు చిత్రించినది. సాధారణముగా హిందూ కుటుంబాలలో చిన్నప్పుడు పసిపిల్లలకు ఇంటిలోని స్త్రీలు పౌరాణిక కథలను వీనులవిందుగా చెప్పుట జరుగును. బహుశా, చిన్ననాటి యీ మధుర స్మృతులే తరువాత తోరూదత్ కవితా దర్పణమున ప్రతిఫలించినవేమో!

పదమూడు సంవత్సరాల బాలికగా నున్నప్పుడు, తండ్రి ఆమెను ఇంగ్లీషు ఫ్రెంచి భాషలను చదివించుట కొరకు ఐరోపాఖండమునకు తీసికొని వెళ్ళెను. ఆమె ఉన్నత విద్యాభ్యాసమంతయును పాశ్చాత్య దేశాలలోనే జరిగినది. ఇంగ్లీషు, ఫ్రెంచి భాషలను ఆమె కూలంకషముగా పఠించినది. అందులోను ఇంగ్లీషుకన్న యెక్కువ వైదుష్యము ఆమె ఫ్రెంచి భాషలోనే సంపాదించినది. రచనా ప్రావీణ్యమున గూడ ఇంగ్లీషుకన్న యెక్కువ ప్రతిభ ఫ్రెంచి లో ఆమె ప్రకటించినదని సుప్రసిద్ధ విమర్శకుల అభిప్రాయము నాలుగు సంవత్సరాలు విదేశాలలో విద్యాభ్యాసము గావించిన తరువాత ఆమె స్వదేశానికి మరియు స్వరాష్ట్రానికి వచ్చినది. పాపము; తరువాత ఆమె జీవించినది నాలుగేండ్లు మాత్రమే. ఇరువది మూడు సంవత్సరాలు నిండీనిండని వయసులో ఆమె చిన్నప్పుడు తనను విడిచి వెళ్ళిన సోదరీ సోదరులను కలుసుకొనుట కొరకు పరలోకమున కేగినది. భగవంతుని సృష్టిలోని విచిత్రమేమోకాని, ఆ ముగ్గురు సోదరీసోదరులు, నిండు జవ్వనము గూడ దాటని వయసులో తమ కుటుంబమును, వృద్ధ జనకుని దుఃఖ సముద్రములో ముంచివేసినారు.

ఆమె తన జీవితపు చివరలోని నాలుగు సంవత్సరాలు కలకత్తా నగరములోని సుందరవనాంతరము నందలి సౌధములో గడపినది. ఆమెది బక్కపలుచని సుకుమారమైన విగ్రహము. వయసుకు మించిన పాండిత్య భారముతో, నిరంతర సాహితీ వ్యాసంగము యొక్క బరువుతో, లేదిగవంటి ఆ నాజూకు శరీరము కృంగిపోయినదేమో! స్వదేశములో కొంత సంస్కృతము గూడ ఆమె అభ్యసించినది; సంస్కృత వాఙ్మయము నందలి ఉత్తమ కావ్యామృతమును తగినంత ఆమె తన కడుపార గ్రోలినది.

మాతృభాషయైన వంగభాషలో ఆమె యేమియును వ్రాసినట్లు కనపడదు; అందులో ఆమె నేర్పుకూడ యెక్కువ కాదేమో! ఇంచుమించుగా ఆమె రచన లన్నియును ఇంగ్లీషు, ఫ్రెంచి భాషలలోనే జరిగినవి. ఆంగ్ల, ఫ్రెంచి భాషల యందలి ప్రాచీనుల రచనల కన్న ఆధునికుల రచనలే ఆమె యెక్కువగా అభిమానించినదని ఆమె రచనలు చాటుచున్నవి.

రచనలను చాల గావించినప్పటికీ, జీవిత కాలమున పుస్తకరూపకముగా ఆమె ప్రకటించినది ఒక్కటి మాత్రమే. అదియే Sheaf gleaned in French Fields అను గ్రంథము. ఛందో వ్యాకరణాది దోషాలు కొన్ని ఉన్నప్పటికిని, భావనాశక్తి మరియు సహజ ప్రతిభ ఇందులో ప్రముఖముగా కనుపించుచున్నవి. ఆమె మరణించిన తరువాత యీ గ్రంథమును ఆమె వృద్ధ జనకుడు పునర్ముద్రణము చేయించెను. ఈ రచన ఫ్రెంచి సమాజమును చిత్రించుటకు ఉద్దేశించినది కాని ఇందులో స్పష్టముగా కనుపించునది భారతీయ మన స్తత్వమేనని ఆంగ్ల సారస్వత విమర్శకుల అభిప్రాయము. ఈ రచనలోని వాతావరణము మరియు పాత్ర పోషణయందు ఫ్రెంచితత్వముకన్న భారతీయత యెక్కువగా కనుపడుటయే ఇందుకు కారణము.

Mlle. D' Averes అనునది ఆమె మరొక రచన ఇద్దరు సోదరులు ఒక సుందరాంగికై పోరాడి పరస్పరము హత్యగావించుగొనుట యీ రచనకు ఇతివృత్తము. సాహితీదృష్టితో యీ రచన విలువ కలది. ఆమె రచనలలో శాశ్వతమైన విలువగలవి ఆమె ఆంగ్ల ఖండకావ్యాలు. ఈ ఖండకావ్యాలలో కొన్ని ఆమె జీవితకాలము నందే కలకత్తా రెవ్యూ మరియు బెంగాల్ మ్యాగజీన్‌లలో ప్రకటితమై ఆమె మరణానంతరము పుస్తకరూపముగా ముద్రితమైనవి. ఇందులో ప్రహ్లాదుడు, సావిత్రి మొదలైన పౌరాణిక కథలు గలవు. ఈ రచనలు భావ గాంభీర్యానికి, భాషాసారళ్యానికి ఆటపట్టులు. కొన్ని సందర్భాలలో భాష యొక్క దౌర్బల్యము, విశేషించి భావోద్వేగముతో పరుగెత్తలేని శబ్దజాలము ఆమె రచన లలో కనుపించుచుండును భావము, భాష యీ రెండింటి దృష్ట్యా కూడా అత్యు దాత్తములైన కొన్ని రచనలుకూడ యీమె ఖండకావ్యాలలో కలవు. Our Casurina tree అనునది ఎంతటి గొప్ప కవికైనను కీర్తిని సంపాదించి పెట్ట గలిగిన మనోహర ఖండకావ్యము. భావి చరిత్రకారుడు ఆంగ్ల వాఙ్మయ చరిత్రను రచించునప్పుడు అందులో తోరూదత్ కొక పుటను యీయక తప్ప దని, సుప్రసిద్ధ కవయిత్రియైన సరోజినీదేవి యొక్క ఆంగ్ల రచనలను ప్రపంచా నికి పరిచయము గావించిన ఆంగ్లేయ సాహిత్య విమర్శకుడు యీమె పుస్తకానికి వ్రాసిన ఉపోద్ఘాతములో ఉద్ఘాటించి యున్నాడు.

# జార్జి బెర్నార్డ్ షా

ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన ఆంగ్ల రచయిత బెర్నార్డ్ షా కొంత కాలము నుంచి అస్వస్థతతో నుండి త్వరలోనే సంపూర్ణముగా ఆరోగ్యము పొందగలడని ఆశించుచుండగా అకస్మాత్తుగా ఆయన మరణవార్త తెలిసినది. గండము గడచి బయటబడినచో తాను అమరుడను కాగలనని బెర్నార్డ్ షా కొన్ని దినాలకు ముందే తెలిపియుండెను. ఈ మాటల వలన ఆయనగూడ తన అవసానమును శంకించినట్లే స్పష్టము కాగలదు.

షా ఐర్లండు దేశీయుడు. కాని ఆయన మరణము ఐర్లండు దేశమునే కాక సమస్త ప్రపంచమును గూడ దుఃఖ సముద్రములో ముంచినది.

ప్రపంచ మహా రచయితలలో బెర్నార్డ్‌షాకు సమున్నత స్థానము కలదు. నాటక రచయితగా ఆయన జగత్ప్రసిద్ధి గాంచి, షేక్స్పియర్‌తో సమానమైన రచయితగా మెప్పొందినాడు. షా అనేక నాటకములను రచించెను. తన నాటకము లన్నింటిలో జోన్ ఆఫ్ ఆర్క్ ఉత్కృష్టమైనదని ఆయన అభిప్రాయమై యుండెను. ఆయన యీ అభిప్రాయమును తెలుపుతు జోన్ ఆఫ్ ఆర్క్ తాను వ్రాయలేదనియు, జోన్ ఆఫ్ ఆర్క్‌యే దానిని వ్రాసినదనియు తెలిపిరి. షా రచనలలో వ్యంగ్యము, అధిక్షేపము సమృద్ధిగా కనబడుచుండును. ఎనిమిదవ ఎడ్వర్డు, తాను కోరిన స్త్రీని వివాహము చేసికొనుటకై స్వాతంత్రము లేకపోయినందున రాజ్యపరి త్యాగము చేసినప్పుడు ఆ సంఘటనకు కారణభూతు లైన బాల్డ్విన్ ప్రధాని మొదలైన వారి శీలమును అమున ఒక నాటకములో చక్కగా చిత్రించి యుండెను.

షా నాటక రచయితయే కాదు, అనేక యితర విషయాలను గూర్చికూడ ఆయన విలువగల గ్రంథములను వ్రాసి యున్నారు. అర్థశాస్త్ర రాజకీయ శాస్త్రములు షాకు అభిమానాస్పదమైన విషయములు. ఈ విషయములను

గూర్చి ఆయన గ్రంథములను గూడ రచించినాడు. షా గొప్ప విజ్ఞాని, మేధావి, ఫిలాసిఫర్.

మన తెనుగు కవీశ్వరులలో ఒకడు ఎంత బాగుగా రచించినప్పటిని సమకాలీనులెన్నటికిని మెచ్చరని తన విచారమును ఆక్రోశమును ప్రకటించెను. ప్రపంచములో, అందు ముఖ్యముగా ప్రాచ్య ఖండమున సమకాలికుల మెప్పు పొందుట మిక్కిలి కష్టమైనపని. అయితే, యీనాడు పరిస్థితులు కొంచెము మారినవి. ప్రతిభకు ప్రణమిల్లుట మనవారు మెల్లమెల్లగా నేర్చుకొనుచున్నారు. సమకాలికుల ఆదరము పొందిన రచయితలు కూడ కనబడుచున్నారు. అయితే, బెర్నార్డ్‌షావలె సమస్త ప్రపంచములోని సమకాలికుల గౌరవాదరములు పొందిన రచయిత మరొక్కరు కానిపించరని చెప్పవచ్చును. తన జీవిత కాలములోనే ఆయన పూర్వకవులతో సమానమైన గౌరవాదరములు పొందగలిగెను.

షా మంచి వక్త, సంభాషణాచతురుడు, ఛలోక్తి నిపుణుడు. ఏ విషయము గూర్చియైనను ప్రశ్నించినప్పుడు వెంటనే యే మాత్రము తడుముకొనక చమత్కారముగా సమాధానము చెప్పుటలో షా అద్వితీయమైన నేర్పు గలిగియుండెను. ఈయన ఛలోక్తి ప్రపంచ ప్రఖ్యాతి పొందినది. ఈ విధముగా తన ఛలోక్తుల చేత సమస్త జగత్తును ఆకర్షించిన ఆధునిక రచయిత మరొక్కరు లేరని చెప్పిన అతిశయోక్తి కాజాలదు. షా ఛలోక్తులన్నియు కలిపి ఒక పుస్తకము ప్రకటించినచో అది యొక మంచి రచనగా ఉండగలదు. షా చలోక్తులలో సమాధానములలో ఆయన ప్రత్యేక వ్యక్తిత్వము ప్రతిబింబితమగుచుండును. షా సుందరాకారుడు కాడు. ఒకసారి అయిరోపాలో సౌందర్యమునకు ప్రసిద్ధిచెందిన యొక విలాసిని షాను వివాహ మాడగోరి "నన్ను నీవు పెండ్లాడినచో మన సంతానమునకు నా సౌందర్యము నీ మేధా సంపద లభించగల"దని వ్రాసినప్పుడు షా వెంటనే ఆమెకు "......మన సంతానమునకు నా సౌందర్యము నీ మేధస్సు లభించినచో చాల పశ్చాత్తాపపడవలసి యుండు"నని వ్రాసిన సమాధానము సుప్రసిద్ధమైనది.

షా శాకాహారి, సామ్యవాది. సామ్యవాదమును గూర్చి ఆయన యొక గ్రంథమునుగూడ రచించెను. పుస్తక సమీక్ష సాహిత్య విమర్శలలో ఆయన

ప్రత్యేకమైన నేర్పు గలిగి యుండెను. 1925 సంవత్సరములో ఆయన సాహిత్యమునకు నోబెల్ బహుమానము పొందియుండెను. మరణించు వరకు ఆయన వయస్సు 94 సంవత్సరాలు.

షా తీవ్రమైన రాజకీయ అభిప్రాయములు కలిగియుండెను. నిర్భయముగా విమర్శించుటలో షాను మొదలు చెప్పి తరువాత ఇతరులను చెప్పవలెను. యుద్ధమును గూర్చి అభిప్రాయము తెలుపుమని కోరగా "ఈ విషయమై నా అభిప్రాయముతో పనిమేమి? ఏది యేట్లున్నను నేను విధిగా పన్ను చెల్లించు చున్నాను కదా?" అని ఆయన తెలిపియుండెను. గాంధీ మహాత్ముని మరణము వల్ల సంతాపమును తెల్పుచు "ప్రపంచములో మిక్కిలి మంచివాడుగా నుండుటకూడ యెంత ఉపద్రవ కరమైనదో ఇందువలన వెల్లడి యగుచున్న"దని షా చేసిన వ్యాఖ్యానము ఆయన ప్రత్యేకతకు నిదర్శనము. ప్రపంచ రాజకీయ వేత్త లందరిలో నెహ్రూ, స్టాలిన్‌లమీద షాకు విశేష గౌరవాదరము లుండెను. ఆనాటి అంతర్జాతీయ రాజకీయసంఘర్షణలో ప్రపంచముయొక్క ఆశలన్నియును వారిద్దరిమీదనే ఆధారపడి యున్నవని ఆయన తెలిపియుండెను.

94 సంవత్సరాల వృద్ధ దశయందు షా అస్తమించెను. ఆరమగ్గిన పండు రాలిపోయినది. జీర్ణమైన శరీరమునుండి ఆత్మ యెగిరిపోయినది.

(1952)